# సుజాత

## ఆంధ్ర సారస్వత పరిషత్తు
## సప్తమ మహాసభా (అలంపురం) సంచిక.

సంపాదకుడు

## గడియారం రామకృష్ణశర్మ


సంపుటము 3. విజయ వైశాఖము విడి ప్రతి.

సంచికలు ౬-౧౨. మే 1953 2 రూ.




## విషయానుక్రమణిక

సంస్కృత సాహిత్యగోష్ఠి.



వర్తమానరచనాగోష్ఠి.



చారిత్రక సమావేశము.



కవిసమ్మేళనము.



కథకసమ్మేళనము.



వయోజన విద్యాశాఖ.



జానపద సాహిత్యగోష్ఠి.



పట్టప్రదాన సభ.



బాలవాఙ్మయశాఖ.



వైజ్ఞానిక సమావేశము.





| | | |
|---|---|---|
| సంపుటము 3. | శా॥ శ॥ ౧౮౭౫. | 1953 జనవరి- |
| సంచికలు ౬-౧౨ | విజయ, వైశాఖము. | జూలై |


# స్వవిషయము

ఈ ప్రత్యేక సంచికతో సుజాతకు మూడవ యేడు ముగియుచున్నది. అప్పుడప్పుడు ఆర్థిక దైన్యముచే బాలారిష్టముల నెదుర్కొనవలసి వచ్చినను ఋణములతో ఇంతవరకు నెట్టుకొని వచ్చితిమి. అప్పులభారముతో క్రుంగుచు మొండి ధైర్యము వహించి ఇంకొక అడుగు ముందుకు వేయుటకు జంకుచున్నాము. జనవరి నెలనుండి జులై వరకు గల ఆరుసంచికలకీ ఒకేసంచికను అందించుచున్నందుకు పాఠకులు క్షమింప గోరుచున్నాము.

ఈనాడు తెలుగునేల నాలుగుమూలలందును విజ్ఞానదాయక వాఙ్మయముపై నిరాదరణ భావము ప్రబలియున్నది. ఇది దేశ దౌర్భాగ్యములలో నొకటి.

ఇకరచయితల సహకారముగూడ అంతంతమాత్రమే. ఆయావిషయములలోఅధికారము, అనుభవముగల విద్వాంసులతో రచన చేయించుటకు భగీరథుడు దిగిరావ

లసియున్నది. యువకులు విశేషముగ కవితాలహరులలో, కథాసాగరములో మునిగి తేలుచున్నారు. మరికొందరు "పత్రికలిట్లుండవలయు, అట్లుండవలయునని" పురమాయింపులుమాత్రమే ప్రసాదించు పెద్దలున్నారు. ఈకవితలతో, సలహాలతో ఉక్కిరి బిక్కిరి యగుచు వివిధ విషయములపై ఉత్తమ వ్యాసములను సంపాదించుటకై నూటొక్క నోములు నోచవలసి యున్నది.

దైవానుగ్రహమువలన ఈపరిస్థితులన్నియు చక్కబడి విజ్ఞానప్రదములైన పత్రికలకు, సాహిత్యమునకును మంచికాలము రాగలదని ఆశించుచున్నాము.

ఈసంచికనుగురించి కొన్నిమాటలు. పోయిన సంక్రాంతి పర్వదినములలో అలంపురమున జరిగిన సారస్వత సభలయందొసగబడిన ఉపన్యాసములనుకూర్చి ఒక మహాసభా సంచికను ప్రకటించునట్లు ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్ష కార్యదర్శి మహాశయులు ఆదేశించి వలయునేర్పాట్లు చేసిరి. అందుపాల్గొన్న మహాశయులందరును తమ ప్రసంగములను, ఛాయాచిత్రములను అనుగ్రహించిరి. కొందరు పండితులు మాతో సహాయ నిరాకరణముచేయుట మాదురదృష్టము. మానియమము ననుసరించి పరిషత్ కార్యకర్తలయు, ఆయాశాఖా సమావేశముల అధ్యక్ష ప్రారంభకులయు చిత్రములను అందినంతవఱకు ప్రకటించితిమి.

సంచికకు వలసిన ధనమును పై మహాసభలను జరిపించిన ఆహ్వాన సంఘము వారే భరించినారు. కోరిన వెంటనే హైదరాబాదు ప్రభుత్వ అర్థశాఖవారును, పౌర సంబంధ సమాచార శాఖవారును, త్రిలిఙ్గ, కిన్నెర, పత్రికాధిపతులును అవసరమైన ఫోటోలను, బ్లాకులను సహాయము చేసిరి. ఇట్లన్నివిధముల సహకరించి సంచికను సర్వాంగ సుందరముగ వెలయించిన ఈమహాశయులందఱికిని కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నాము.

దైవమనుకూలించినచో సుజాత ఇకమీద త్రైమాసిక సంచికగా తమకు సేవచేయగలదని ఇంతవరకు ఆదరాభిమానములతో విరాళములొసగి తోడ్పడిన దాతలకును, పాఠకులకును నివేదించుకొనుచున్నాము.





మహాసభా ముఖద్వారము

# స్వాగత కవిత





౧. శ్రీ చాళుక్యనృపాదిపాలితము రాశీభూతవిద్యాకళా
ప్రాచుర్యం బల దక్షిణాపథపవిత్రక్షేత్రరాజంబు నా
ప్రాచీనాంధ్రవిభూతిచిహ్నమగు నాలంపూరునం దాంధ్రవా
ణీచాంపేయసుమార్చనల్ జరుగుచుండెన్ నేత్రపర్వంబుగన్ ॥

౨. జగదాచార్యుఁడు తత్త్వవేత్త బహుభాషావేది వేదాగమ
స్థగితానంతమహార్థదీపకుఁడు రాధాకృష్ణమాన్యుండు మా
విగతప్రాభవరాజధానికి సముద్వేలాంధ్రంసారస్వతా
పగ పారింపగ నేగుదెరచెనఁట మా భాగ్యంబు సామాన్యమే॥

3. ఇది స్వశ్రేయస మాంధ్రజాతికి మహోత్కృష్టస్థితిన్ బాసి దీ
నదశన్ బొంది పరస్పరానవసరాంతస్తాపముల్ బెంచి యా
పదలన్ గుందు తెలుంగువారలొక తేవన్ గూడి యున్నాళ్ళ క
భ్యుదయాలోచన చేయబూని రిట లెండో! సోదరీ సోదరుల్॥

౪. స్వాగతమయ్య! విశ్వవిలసన్నవకీర్తిపరీమళాఢ్య క
ల్పాగములార! మంత్రివరులార! ప్రజాహితకార్యయజ్ఞదీ
క్షాగతయజ్వలార! కవితాంబుధులార! చరిత్రశోధనో
ద్యోగివతంసులార! మహిమోన్నతభౌతికశాస్త్రలోచన
శ్రీగళులార! వాఙ్మయవశీకరణైకతపఃప్రభావల
బ్ధాగమ తత్త్వశేష ఫణులార! మృదూజ్జ్వల బంధసాహితీ
సాగరమందర ప్రతిమ సారతర ప్రతిభాభిరాములా
రా! గుణరత్నమేరుకుధరప్రతిమానుల కెల్లవారికిన్
స్వాగత మీయలంపురవిశాలమహానటనాట్యశాలలో
సాగు సరస్వతీప్రథితసప్తమవర్ష మహామహంబునన్॥

## సుజాత - విజయ, వైశాఖము.

౫. పరభాషాదృతి మేరమీరి జనతావ్యక్తిత్వముజంపు దు
ర్భరదుష్కాలమునన్ తెలుంగులకు త్రోవంజూపగాం జాలు శ్రీ
పరిషత్తున్ సృజియించి సాంస్కృతికజీవంబిచ్చు ధన్వంతరుల్
పరిషన్నేతలు వారికందఱకు దీవ్యత్ స్వాగతప్రాంజలుల్॥

౬. ఈ సారస్వతయజ్ఞ నిర్వహణ సాహిత్యాత్మలౌ తాతయున్
వ్యాసుండున్ శివరామకృష్ణులును శేషానంత వాచస్పతుల్
శ్రీ సీతాపతి విశ్వనాథకవిరాట్ శ్రీ శ్రీ సమేతుల్ సము
ల్లాసంబొప్పగ వచ్చి రియ్యవివె ఫుల్లస్వాగతాంభోజముల్



దారిద్ర్యం వ్యక్తికి సంబంధించిందికాదు. సంఘానికి సంబంధించింది. సమస్త అజ్ఞానమూ రోగాలూ దారిద్ర్యం మూలంగానే కలుగుతై. ప్రభుత్వం దారిద్ర్యసమస్యను పరిష్కరించుకొనే బాధ్యత వ్యక్తులకు వదిలి రోగాలనూ జ్ఞానాన్ని కట్టుబాటులో ఉంచటానికి చేసే ప్రయత్నాలు హాస్యాస్పదంగా ఉంటాయి.

కొడవటిగంటి.



# పంచరత్నోపహారము



శిరోమణి

## శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

శ్లో॥ నిష్ణాత స్తత్త్వశాస్త్రే; నిరుపమధిషణః కోమలే కావ్యమార్గే;
నిస్తంద్రీభూతమేధానికషణ నిపుణః ప్రాజ్యరాజ్యాధిపత్యే;
సత్కీర్తిం ప్రాప్యధన్యశ్చతురుదధిలసత్కాంచికాఽఽఢ్యే ప్రపంచే;
శ్రీరాధాకృష్ణ విద్వన్మణిరధిసభ మధ్యాస్యహర్షంతనోతు. ౧

తే॥ గీ॥ తల్లియగు తెల్గుభాషఁ దత్పరతఁ గొలువఁ
జేరియున్నట్టి వేవేల భారతీయు,
లందఱకు వందనంబుల నందఁజేసి
సలుపుచుంటి సుమాంజలిస్వాగతంబు. ౨

మ॥ కవులున్, గర్షకులున్, గథావిదులు, విజ్ఞానాఢ్యులున్, మంత్రిపుం
గవులున్, రాజ్యకళాధురంధరులు, సంఖ్యావద్గణంబున్, మహీ
ధవులున్ గోపికలట్లు చేరి రిదె రాధాకృష్ణవిద్వాంస నీ
సువచోవేణునినాదమున్ వినఁగ నిచ్చో శ్రోత్రపేయంబుగాన్. ౩

మ॥ ఇది యాంధ్రావని కెల్ల నుత్సవదినం; బీనాఁడు సాహిత్య సం
పద నిండారిన పండిత ప్రవరులన్ భక్తిన్ బ్రపూజించి య
భ్యుదయంబున్ గనుఁడయ్య! ; ఆంధ్రకవితాజ్యోతుల్ దిగంతంబులన్
వెదఁజల్లన్ బనిఁబూనిరం; డివియె యర్పింతున్ బ్రసూనాంజలుల్. ౪

మ॥ ప్రయతప్రజ్ఞుఁడు, తత్త్వపారగుఁడు, విశ్వఖ్యాతుఁ, డుదచ్చుభ్ర భో
దయుఁ, డాంధ్రావనిముద్దుబిడ్డఁడగు రాధాకృష్ణవిద్వాంసుఁ డీ
జయవిద్యావని మేఘగర్జనమునన్ సారస్వతాంకూరసం
చయముల్ ప్రోదియొనర్పఁగాత తనవాచావర్ష ధారావళిన్. ౫



# అలంపుర విశిష్టత

-: 0 :-

## శ్రీ చల్లా వెంకటరామి రెడ్డి

(ఆహ్వాన సంఘాధ్యక్షుడు)

పావనకృష్ణాతుంగభద్రాప్రవంతులు దక్షిణోత్తర సీమలుగానున్న మా రాయచూరుమండలము చరిత్రకందనిప్రాచీనయుగము నుండియు సంస్కృతీకేంద్రమై ప్రసిద్ధికెక్కియున్నది. దక్షిణాపథచరిత్రను సమగ్రముచేయు అమూల్యచారిత్రక సాధనసామగ్రికి అలంపూరుసీమ నిలయము. శాతవాహనుల క్రీ ప్రాంతము కాణయాచిగ నుండెనను టకు ఈ పరిసరములలోని శాతవకోట నిదర్శనముగ నున్నది. సుప్రసిద్ధ ఎల్లొరాగుహాలయములకంటె రెండు శతాబ్దములకు పూర్వమే ఇచ్చట బాదామి చాళుక్యసార్వభౌములు నవబ్రహ్మాలయములను నిర్మించినారు. అజంతాశిల్పసంప్రదాయముచే ప్రభావితమైన ఈ పవిత్రక్షేత్రమున నాడు ఆంధ్ర శిల్పలక్ష్మి లాస్యముచేసినది. తరువాత రాష్ట్రకూట ప్రభూతవర్గ, ధారావర్ష మహారాజులును, కల్యాణీచాళుక్యచక్రవర్తులు, వారి మహారాణులు, ప్రధానులు సామంత మండలేశ్వరులగు చోళ రాజులును, కాకతీయప్రతాపరుద్రదేవ విద్యానగర కృష్ణదేవరాయాది రాజాధిరాజ పరమేశ్వరులంద ఱును మా బ్రహ్మేశ్వరస్వామికృపకు పాత్రులైనారు.

ఈ ప్రాంతము చరిత్రప్రసిద్ధితోబాటు వైదిక వైదికేతరమతపరిణామములకును, సంస్కృతాంధ్ర వాఙ్మయసృష్టికిని పేరుపొందినది. ఉత్తరభారతమున బౌద్ధము మూడు పూవు లారు కాయలుగ నున్ననాడు మా సీమలో గూడ అది కాలూనె ననుటకు మా తక్కసిల, ఉండవెల్లి గ్రామములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఇచటికి 20 మైళ్ళ దూరమున నున్న పూడురు 11 శతాబ్దమున మూలద్రవిడసంఘారామ మనుపేర జైనపీఠమై కాంచనసేనభట్టారకునిచే ప్రకాశించినది. వైదికమతశాఖల ప్రతీకలగు దేవతామూర్తులన్నియు నిట నుండు టొక ప్రత్యేక విషయము. ఈ క్షేత్రమున లేనిదేవతామూర్తులు తక్కినభారతవర్షమున నెందును ఉండవనుట అతిశయోక్తికాదు.

అలంపురము ప్రాచీనకాలమున బ్రహ్మపురియని వ్యవహరింపబడిన విద్యాపీఠము, ఇందలి స్థానాపతులగు బ్రహ్మరాసి, ధరణీంద్రరాసి, వితరణేంద్రరాసి, సోమేశ్వరరాసి, ఈశానరాసి, విద్యారాసి, కేశవరాసి, సామరాసి భట్టారకులకును, త్రిలోచన మునినాథ, భువనశక్తి, లోకాభరణ, ఏకాంత దేశి కాది పండితులకును దక్షిణాపథపరిపాలకులందఱును ఆయాకాలములలో భూఖండములను దానముచేసి శిలాశాసనములను వెలయించినారు.

విద్యానిలయములై విద్వజ్జనాలంకృతములై యుండిన గద్వాల, ఆత్మకూరు, వనపర్తి, కొల్లాపుర సంస్థానములు మా పొరుగున నేయున్నవి. ఆనాడీసంస్థానములలో సంస్కృతాంధ్రవాఙ్మయ మపారముగ సృష్టింపబడినదన్న చాలును. యావదాంధ్రమున ఆబాలగోపాలము పఠించుచున్న రంగనాథ

# స్వాగతోపన్యాసము

రామాయణము మా రాయచూరు గోనబుద్ధారెడ్డిచే వెలసినది. 18 శతాబ్దమున అలంపూరుసీమను పరిపాలించిన బిజ్జుల తిమ్మభూపాలుడు ప్రౌఢమైన ఆంధ్ర అనర్ఘరాఘవకావ్యమును వెలయించినాడు. పిఠాపురమునందలి ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి తాళపత్ర గ్రంథ భాండాగారమున అజ్ఞాతవాసము చేయుచున్న "అలంకారశిరోభూషణ" మును వ్రాసిన ఆయలూరి కందాళార్యుడు మా బోరవెల్లి ఆస్థాన పండితుడు. సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ వెల్లాల సదాశివశాస్త్రిగారి విద్యాగురువులును, వైదిక లౌకిక భాషా వేత్తయునగు మల్లారి శాస్త్రి పండితుడు అలంపూరు నలంకరించినరత్నము. ఇరువదవ శతాబ్దారంభమున నిటనుండి ఆలయ జీర్ణోద్ధారమునుచేసిన ప్రౌఢ సరస్వతీ కుమారస్వామి శాస్త్రి పాదులు సంస్థాన పండితులవాద రణములలో ముక్కాకలు తీరిన మహాయోధులు - ఇట్లే చెప్పుచు పోయిన అనేకవిషయము లున్నవి. ఇదంతయు మా గొప్పలు చెప్పుకొనుటకుగాదు. ఆంధ్రసంస్కృతికి కేంద్రమైన ఈ ప్రదేశమును దిఙ్మాత్రముగ పరిచయము చేయుటయే మా ఉద్దేశము. ఇట్టి మహాస్థలమున నేడీ మహోత్సవము జరుగుచుండుట సముచితమును శోభావహమునై యున్నవి. ఇట్టి పురాతన ప్రదేశము లెన్నో మొన్నటివఱకు దిక్కు మొక్కు లేక పడియున్నవి. ఆర్కియాలజీ ఈ విషయమున నిర్లక్ష్యము చేయుటచే నష్టావశిష్టములుగూడ కాల ప్రవాహమున కలసిపోవుచుండెను. కాని మన రాష్ట్ర భాగ్యోదయము వలన ఇచటి అర్కియాలజీకి యోగ్యపండితులు జాతీయాభిమానులు డైరెక్టరుగా దయచేయుటచే మారుమూలపడియున్న మా అలంపూరు శిథిలములు తమవంటి పెద్దల నాకర్షించుచున్నవి. వారికీ మాతోపాటు ఆంధ్రులందఱు ఋణపడియున్నారు. మన ప్రభుత్వము వారితో రాష్ట్రమునకు యోగ్యసేవలు చేయించుకొనుగాక.

ఈ నాలుగు దినము లిక్కడ జరుగు తెలుగుతల్లి సప్తమ వార్షిక మహోత్సవమునకు మా విన్నపమును మన్నించి, నేల నాలుగు చెరగుల నుండి దయచేసిన తమయందఱికి ప్రేమనివాళులిచ్చి ఆహ్వానసంఘపక్షమున హృదయపూర్వక స్వాగతముపలుకుచున్నాను. సారస్వతసేవ చేయని చేయలేని నావంటివానికి తమ అందఱిసేవచేయు ఈ మహాభాగ్యమును కలుగజేసిన మిత్రులకు కృతజ్ఞతలు తెలుపక ఉండలేను. అనేక కార్యభారములను వదలి ప్రయాణాయాసమును సహించి మాతృపూజామహోత్సమును వైభవోపేతముగ నెరవేర్చుటకు దయచేసిన తమ దేశభాషాభిమానముల నెంత పొగడినను చాలదు. క్షామకాలమగుటచేత మా ఆదరాతిథ్యమునందు అనివార్యముగ కలుగులోపములను సహృదయులగు తాము తప్పక క్షమించెదరని నమ్ముచున్నాను. మా యొసగు ఆతిథ్యము అల్పమైనను మా హృదయములం దణగియున్న ప్రేమాంతఃకరణములను స్వీకరింపవలయునని ప్రార్థించుచున్నాను.

ప్రపంచవిజ్ఞానసమితి అధ్యక్షులు, భారత ఉపాధ్యక్షులు ప్రఖ్యాత ఆంధ్రనాయకమణి శ్రీ ఆచార్య రాధాకృష్ణపండితుడు ఈ వార్షికోత్సవ మహాసభను తమ అమృతహస్తములతో ప్రారంభించుటకు అంగీకరించుట ఆంధ్రజాతిమహాభాగ్యము. దివ్యమహిమోపేతమైన భారతీయతత్వామృతమును విశ్వమానవులకు పంచియిచ్చుచున్న మహాపురుషుని చల్లని నీడలో ఆంధ్రులు తలయెత్తుట కిది నాందివాచకము. చిరకాలమునుండి అనేక ఆఘాతములను సహించి ఇప్పుడిప్పుడే కోలుకొనుచున్న తెలంగాణమునకు ఉస్మానియా విశ్వవిద్యాలయమును కేంద్రప్రభుత్వము స్వాధీనము చేసుకొనునిర్ణయము ప్రజలలో అసంతృప్తి కలుగజేసినది. కృష్ణాపెన్నారు ప్రాజెక్టు వలన ఆంధ్రుల సస్యశ్యామలములైన లక్షలయకరముల పంటపొలములు కృష్ణా జలప్రళయమున కలసిపోనున్నవి. మన సంకట పరిస్థితి భారత ప్రభుత్వాధినేతలకు తెలియవలసిన ఈ క్లిష్టసమయములో భారత ఉపాధ్యక్షులు ఈ మహోత్సవమును ప్రారంభించుటకు దయచేయుట ఆంధ్రజాతికి కల్యాణదాయకము.

అధ్యక్ష పీఠము నలంకరించి మహాసభను సుగమముగ యశోవంతముగ నడుపుటకు ఆంధ్ర

సారస్వత పరిషదధ్యక్షులు, నిస్వార్థ భాషాసేవకులు, కార్యదక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు వూనుట ఆనందింప దగినవిషయము.

ఈ పర్వదినమున మనకు తమఅమూల్యసందేశముల నొసగుటకై పూజ్యులు శ్రీ ఆంధ్రపితామహులు, శ్రీ ఆంధ్ర ఆస్థాన కవి శేఖరులు, శ్రీగీర్వాణ కర్నాటక మహారాష్ట్ర హిందీ పరిషదధ్యక్షులును శ్రమవహించుట అపూర్వసంఘటనము.

ఈ సందర్భములో తెలుగుభాషా సమితి వారి సాంస్కృతిక ప్రదర్శనమును, చిత్రకళా, పురావస్తు పశువైద్య, పారిశ్రామిక, వ్యవసాయ పరిశ్రమలను ప్రారంభించుటకై మేము కోరిన వెంటనే ఆమోదించి,గురుతర పరిపాలనా భారమును సైతము లెక్కింపక మననాయకులు,దేశసేవాధురంధరులు, రాష్ట్రాధినేతలు,శ్రీ ముఖ్యమంత్రివర్యులును,శ్రీ ఆర్థిక,విద్యా, అటవీ, కార్మిక, వ్యవసాయ మంత్రి పుంగవులును విచ్చేయుట మా భాగ్యవిశేషము.

వివిధశాఖాసమావేశములకు అధ్యక్షులుగ, ప్రారంభకులుగ, ఉపన్యాసకులుగ, వ్యవహర్తలుగ సుప్రసిద్ధ విద్వాంసులు, కళాకోవిదులు, సాహిత్య స్రష్టలు, సారస్వతవ్రతులు దయచేయుట మా పుణ్యము.

కృత్రిమ రాజకీయ పరిస్థితులచే చెల్లాచెదరైయున్న ముక్కోటి తెలుంగుల ప్రతినిధులగు యావదాంధ్ర ప్రముఖులతో కలకలలాడు ఆంధ్ర భారతీ సమారాధనము అలంపూరులో జరుగుచుండుట మా తాలూకా సౌభాగ్యము.

ఇంకొక ముఖ్యవిషయమును విన్నవించి సెలవు తీసికొనెదను. స్వపరిపాలనమును సాధించి ప్రత్యేక రాష్ట్రమును సంపాదించుకొనబోవుచున్న ఆంధ్రులపై విశేష బాధ్యతలు పడనున్నవి. ఇంత వఱకు హక్కులకు పోరాడుటతప్ప బాధ్యతలను గుర్తింపని ఆవేశపూరిత ఆంధ్రజాతికి ఇది విషమ పరీక్షాకాలము స్వరాజ్యము సురాజ్యమగుటకు దేశీయు లందఱును విద్యావంతులు కావలసియున్నది. దేశక్షేమమునకు భాషాక్షేమము పునాది అను ముఖ్యవిషయమును ఇంకనైన గుర్తింపనిచో మనకు ఉజ్వలభవిష్యత్తు లేదు. విజ్ఞానఖనులైన మీరందఱును నిస్వార్థబుద్ధితో భాషాసేవకు పడుముకట్టి ఆంధ్రజాతి గౌరవమును నిలబెట్టవలయునని విన్నవించుకొనుచున్నాను. ఈనాడు ఈ పరిషత్తుకూడా మహాబాధ్యతలను వహింపవలసిన తరుణము వచ్చినది. ఇతర స్వతంత్ర దేశములలో అనధికార విద్యాసంస్థలు,పరిషత్తులును దేశమునందల విద్యాస్థాయిని, వ్యాప్తిని, హెచ్చించుటకు ప్రభుత్వమునకు తోడ్పడుచు తత్సంబంధ కార్యకలాపములను ఆధికారికముగ నిర్వహించుచున్నవి. ప్రభుత్వముల వలన ధనవ్యయము తప్ప సరిగా విద్యావాప్తి జరుగకుండుట ప్రత్యక్ష సత్యము. సమర్థవంతముగ 10 సంవత్సరములనుండి నిరక్షరాస్యతా నిర్మూలనము, సంస్కృతి ప్రచారమును సాగించుచున్న ఆంధ్ర సారస్వత పరిషత్తునకు ప్రభుత్వము విద్యాప్రచారము, పుస్తక నిర్ణయాధికారము నప్పగించినచో దేశావసరములైన విద్యలన్నియు సక్రమముగ వృద్ధి చెందగలవు. ఈ పరిషత్తు అఖిలాంధ్ర సారస్వత పరిషత్తు అగుగాక. స్వతంత్ర మహాంధ్రరాష్ట్ర ప్రభుత్వమునకీ పరిషత్తు ఉపాంగమై సకల విద్యాభివృద్ధికార్యక్రమములను అధికారయుతముగ నిర్వహించుగాక అని ఆశించుచు, పూజ్యులగు తామందఱికి మఱొకసారి స్వాగతము పలుకుచున్నాను.

[స్వాగతోపన్యాసమునుంచి]

# విశ్వశ్రేయః కావ్యమ్



## ఆచార్య శ్రీ రాధాకృష్ణ పండితులు

(సభా ప్రారంభకులు)



"మనసంస్కృతికి సంబంధించినంతవరకు మనము పురాతనపద్ధతినే అనుసరించు చున్నాము. మన గతమునుచూచి మనము గర్వపడుచున్నాము. కాని ప్రపంచము నిత్యపురోగామి అను విషయము మనము జ్ఞాపకముంచుకొనవలసి యున్నది. రెప్ప పాటుకాలముకూడ ఏదియు నిలకడగా నిల వదు, నిరంతరమగు ఈ కాలప్రవాహము లో మనము వెనుకఁబడక యుండవలెనన్న, దానితోబాటు పురోగమించవలెను. ఈ యాత్రలో ఇతరుల అనుభవములను మనము గమనించుచు, వానిని జీర్ణించు కొనుచు ఉత్తమసాహిత్యమును సృష్టించ వలెను.

ఉత్తమ సాహిత్యమును సృష్టించు టంత సులభమైనదికాదు. గొప్పసాహితీ కళాకారులగుటయు తేలికపని కాదు. వ్రాసినదే వ్రాయుట, అనుకరించుట, తెలివితేటలను ప్రదర్శించుట ఉత్తమ సాహిత్యమని కొందఱు భ్రమింపవచ్చును. ఉత్తమసాహిత్యము ఉత్తమ చిత్తసంస్కా రమును కోరును. మహితాత్ముఁడు కాని వాఁడు మహాకవి కాలేడు. నిరంతరధ్యాన, సమాధులవలననే ఆత్మకు మాహాత్మ్యము సిద్ధించును. మహాకవులయినవారు పరిశీ లనధ్యానముద్రలలో పారగులై యుందురు. మన కుత్తమ సాహిత్యము కావలయునన్న ఉత్తమపురుషులను సృష్టిం పవలసి యున్నది. నిజమగు గొప్పదనము లేని హృదయము గొప్ప కవిత్వమును వెల యింపఁజాలదు.

ప్రతిదిన మొకమహాకవి పుట్టడు. ప్రతి మాసమున నొకమహానవల సృష్టిగాదు. కాలము ననుసరించి కవి పుట్టును. అవసర మునుబట్టి కావ్య ముద్భవించును.

గతకాలమున మహారాజులు కళను, సాహిత్యమును పోషించిరి. ప్రస్తుతము ప్రజాపతినిధులే పరిపాలకులుగనున్న ప్రజాస్వామికములో ప్రజలు ప్రభుత్వములు కళా సాహిత్యములను పోషించవలసి యున్నది.

కవులకు రచయితలకు స్వేచ్ఛ యుండవలెను, సాహితీరంగములోకూడ ప్రజాస్వామికము పరివ్యక్తము కావలెను. ప్రజల అవసరములను, ఆశయములను పరిశీలించి రచయితలు అవగాహన చేసికొనవలెను. తమరచనలద్వారా ప్రజలను విద్యావంతులను విజ్ఞానవంతులను జేయవలెను. సాహిత్యమునకు ప్రపంచశ్రేయస్సే పరమాదర్శముగానుండవలెను.

మానవాత్మాభివృద్ధికి ఆకలి, పేదరికములు అభ్యంతరములు. ఈరెండుదౌర్భాగ్యములను మన మెదురొ్కని విజయమును బడయమేని, ఆత్మవికాసమును, అభిజ్ఞ సంస్కృతినిర్మాణములను సాధింపలేము.

ఢిల్లీలో జాతీయ సాహితీపరిషత్తును నిర్మించుచున్నారు. దానిలో ఆంధ్రకవులు, రచయితలు, ప్రధానపాత్ర నిర్వహించగలరని ఆశించుచున్నాము. ఆంధ్రసాహిత్యరంగములో హైదరాబాదుఆంధ్రులు, ఇతరప్రాంతముల ఆంధ్రులును కలసి కృషి చేయవలెను.''

(ప్రారంభోపన్యాసమునుండి)

ఆస్తికునకును అత్యంత నాస్తికునకు స్వస్తి
చెప్పెద. మాలండు బ్రాహ్మణుండు నాకునంతవ్వులు.
అణువును నగమునొకటి.

వేలూరి.

# ప్రాంతీయ సంస్కృతుల ప్రభావం

## శ్రీ దేవులపల్లి రామానుజరావు

(సభాధ్యక్షులు)



ఈనాడు ఆంధ్రసారస్వత పరిషత్తు సప్తమ వార్షికోత్సవమును జరుపుకొనుటకు మనమందఱ మిక్కడ సమావేశమైనాము. చరిత్రాత్మకమగు నీ ప్రదేశమున జరుగు ఈ వార్షికోత్సవము సర్వ విధముల చరిత్రాత్మకమైనది. ఆంధ్రదేశ చరిత్రకు ఆటపట్టై, శిల్పకళాలక్ష్మికి నృత్యరంగమై, సరస్వతీ దేవి నివాస స్థానమై యొప్పిన యీ ప్రదేశమునకు యీనాటి సమావేశము మరల నొకమారు పూర్వ వైభవమునకు అనుగుణమై కాంతివంతమగు భవిష్యత్తును సూచించుచున్నది. ఆచార్య రాధాకృష్ణుల ఆశీర్వాదము ఈ సమావేశమునకు అబ్బుట గొప్ప భాగ్యవిశేషము. ఈ నాటి వేదికపైన సకలాంధ్ర దేశమునుండి వచ్చిన పండితులు, కవులు విజ్ఞానులు దేశనాయకులు ఆసీనులై సత్వరభవిష్యత్తులో ఆంధ్ర జాతికి, ఆంధ్రదేశమునకు కలుగనున్న అభ్యుదయమునకు నాందీ ప్రస్తావనలు పలుకుటలోని సందర్భ శుద్ధి, ఔచిత్యము ప్రత్యేకముగా గమనించదగి యున్నవి.

ఈనాటి పండుగ ప్రాద్దున జరుగు ఈ సమావేశానికి అధ్యక్షత వహించు అవకాశము నాకు కలిగించిన, ఆంధ్రసారస్వతపరిషత్తు కార్యకర్తలకు, శాఖలకు, సభ్యులకు కృతజ్ఞతావందనము లర్పించుట నా ప్రథమకర్తవ్యము. అధ్యక్షపదవి ఈ నాడు ఒక గురుతరమైన బాధ్యత. ఈ బాధ్యతా నిర్వహణలో నేను నిమిత్తమాత్రుడను మాత్రమే.

ఆంధ్రదేశమున అనేకసారస్వతసంస్థలు కలవు. ఈ సంస్థలలో ఆంధ్రసారస్వత పరిషత్తునకు ఒక ప్రత్యేక విశిష్టత కలదని, పరిషత్తు ఆదర్శములను మరియును కార్యకలాపాలను ఒకమారు స్థూలముగానైనను పరిశీలించినచో స్పష్టము కాగలదు. హైద్రాబాదురాష్ట్రమున సుమారొకదశాబ్దమునకు ముందు అవతరించి కృషిజేయుచున్న పరిషత్తు ఆదర్శములు రెండు. ఒకటి ఆంధ్రసారస్వత సంస్కృతుల అభివృద్ధి; రెండు అక్షరాస్యతావ్యాప్తి. ఈ రెండు ఆదర్శములు పరస్పర పోషకములనుట స్పష్టము.

ప్రజల భాషలకు అణుమాత్రము స్థానములేని పోలీసు చర్యకు పూర్వకాలమున యీ రెండు ఉద్దేశములతో పనిజేయు సంస్థ తెలంగాణ ప్రజలకు అత్యావశ్యక మైయుండెను - అంతేకాదు; స్వతంత్రభారతమున, విముక్త హైదరాబాదులో ఇట్టి కృషియొక్క ప్రాధాన్యత ఇనుమడించుచున్నది. నూటికి యేడు కన్న యెక్కువగా అక్షరాస్యులు లేని మన దేశమున, అయిదారు గ్రామాలకైన ఒక పాఠశాల నికరముగా లేని మనప్రాంతమున, సారస్వత పరిషత్తు యొక్క నిర్మాణ కార్యక్రమము దేశ కల్యాణమునకు అత్యవసర మై యున్నది.

భారతీయ సంస్కృతి అనేక నదులు కలిసిన ఒక సుందరపవిత్ర సంగమమువంటిది. ఈసంస్కృతి సంగమముయొక్క మహత్వమునకు, సౌందర్యమునకు, ప్రాంతీయ భాషలు మరియుసంస్కృతులు అనునదులు ప్రధాన ప్రాతిపదికలై యున్నవి. ప్రాంతీయసారస్వత సంస్కృతులు లేకపోయినచో భారతీయ సంస్కృతి శిరోజములులేని కొప్పువంటిది కాగలదు. మన భారత రాజ్యాంగము పదమూడు ప్రాంతీయ భాషలను పేర్కొని, వానిఅభివృద్ధిని స్పష్టీకరించినది. ఇట్టి భాషలలో ఆంధ్రభాష ముఖ్యమైనది. జన సంఖ్యయందును, వైశాల్యమునందును, సంస్కృతీ సంపదయందును భారత దేశములో ఆంధ్ర ప్రాంతము ఒక ప్రధాన స్థానము నాక్రమించుచున్నది. భారతీయ సంస్కృతి మహత్వమునకు మొదటి నుండియు ఆంధ్ర ప్రాంతము విశేషముగా తోడ్పడిన నిదర్శనాలు భారతీయ సంస్కృతి చరిత్రయందును, సంస్కృత వాఙ్మయ చరిత్రయందును కొల్లలుగా కనుపించుచున్నవి. భారతదేశమున, ఒక సహస్రాబ్దముకన్న యెక్కువ వయసు కలిగి, రస సంపన్నము మరియు విజ్ఞానాత్మకమగు వాఙ్మయము గలిగిన ప్రాంతీయ భాషలలో తెలుగు భాషకు ప్రత్యేకస్థానము కలదు. ఈ ప్రాంతీయ భాషలలోని వాఙ్మయము, విజ్ఞానము, సకల భారత సంస్కృతికి మూల ప్రాతిపదికలుగా నున్నవి. ఈ ప్రాతిపదికలు లేని భారతీయ సంస్కృతి పునాదులులేని భవనము వంటిది. అందుచేత భారత దేశము యొక్క సర్వతో ముఖాభివృద్ధికి యీ ప్రాంతీయ సారస్వత సంస్కృతుల అభివృద్ధి ప్రాథమిక అవసరమైయున్నది. భారత రాజ్యాంగమున యీ అవసరము స్పష్టము గావించబడినది. ఆంధ్ర సారస్వత పరిషత్తు యీ ఉద్దేశముతో కృషి జేయుచున్నది.

మన రాజ్యాంగము వయోజనులైన స్త్రీ పురుషులందరికిని ఓటింగు హక్కునిచ్చిన ప్రజాస్వామికము. ప్రజలకొఱకు ప్రజలచేత నిర్వహింపబడు ప్రజాస్వామికములో పరిపాలన ప్రజల భాషలలో జరుగవలసిన ఆవశ్యకత గలదు-అప్పుడే పరిపాలన సంపూర్ణ ప్రజాస్వామికము కాగలదు-ప్రజలభాషలో జరుగు పరిపాలన, ప్రభుత్వమునకు ప్రజలకు మధ్య సన్నిహితసంబంధము కలుగజేయుటకు తోడ్పడును. భాషకన్న దృఢతరమైన బంధము మరొకటి కానుపించదు- అందుచేత ప్రజలకు ప్రభుత్వమునకు మధ్య ఇట్టి దృఢతర సంబంధము కావలెనన్నచో, వారి భాషలలో రాష్ట్రీయ పరిపాలన జరుగుట అత్యవసరము. ఇది యీనాడు మనకు క్రొత్తగా కనుపించుచున్న ఆవశ్యకతగాదు. కొన్ని శతాబ్దాల క్రింద మన దేశమును పాలించిన శ్రీ కృష్ణదేవరాయలు, తెలుగదేల యని ప్రశ్నించినవారికి సమాధానముగా దేశము తెలుగు, ప్రజలు తెలుగు మాట్లాడువారు, నేను తెలుగు విభుడను. అందుచేత తెలుగు కావలెనని చేసిన ఉద్ఘాటన సుప్రసిద్ధము- ఈ ఉద్ఘాటన యీనాటి మన ప్రభుత్వాలకు మార్గదర్శకము మరియు ఆదర్శప్రాయమని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఆంధ్ర సారస్వత పరిషత్తు యొక్క ముఖ్యాదర్శమైన ఆంధ్ర సారస్వత సంస్కృతుల అభివృద్ధికి కృష్ణదేవరాయలు జేసిన ఉద్ఘాటన సర్వవిధముల ఒరవడి.

ఈనాడు మన దేశమున కొందరు విద్యాధికులకును, దేశనాయకులకును, ప్రాంతీయ సారస్వత సంస్కృతుల అభివృద్ధిని గూర్చి అపోహాలం కలుగుట మిక్కిలి శోచనీయము. భారతీయ సంస్కృతికి, యీ ప్రాంతీయ భాషా సంస్కృతుల అభివృద్ధి గొడ్డలి పెట్టని, ఇట్టివారు అక్కడక్కడ ఉద్ఘాటన గావించుట ఆశ్చర్యకరము - ఇది కేవలము దురభి

# ప్రాంతీయ సంస్కృతుల ప్రభావము

ప్రాయము-ప్రాంతీయ భాషా సంస్కృతులు భారతీయ సంస్కృతికి యెన్నడుగూడ భంగకారులు కాకపోవుటయే గాక, పరిపోషకములుగా నున్నవని, మనదేశచరిత్ర వేయినోళ్ళ ఉద్ఘోషించుచున్నది. సంస్కృతభాష అభివృద్ధికి, సంస్కృతభాషలోని విజ్ఞాన వాఙ్మయ అభివృద్ధికిని సకల ప్రాంతముల వారును సమష్టిగా కృషిచేసిన సత్యము చరిత్రప్రసిద్ధమైనది. మన ప్రాంతీయ భాషలకు సంస్కృత భాషకుగల సన్నిహిత సంబంధము జగత్ప్రసిద్ధమైనది. జనని సమస్తభాషలకు సంస్కృత భాషయని ఉద్ఘాటనచేయు ప్రాంతీయ భాషలు భారతజాతీయతకు ప్రతిబంధకములని వాదించుట విచిత్రమైన వితండము; భారతీయ సంస్కృతి స్వరూపమును దేశ చరిత్రను చక్కగా గ్రహించక పోవుటచే కలిగిన అజ్ఞాన జనితమైన దురభిప్రాయము.

నిజానికి భారత జాతీయత సజీవముగా చైతన్య వంతముగా వికసించవలెనన్నచో ప్రాంతీయ భాషా సంస్కృతుల అభివృద్ధి మిక్కిలి అవసరము. వృక్షముయొక్క పెంపునకు శాఖలు, ఆకులు, పూవులు, పండ్లు మరియు వ్రేళ్లు మిక్కిలి అవసరమైనవి. వీని వలన చెట్టుయొక్క పెంపునకు, పుష్టికి భంగము కలుగుచున్నదని వాదించుట యెంతటి హాస్యాస్పదమో, ప్రాంతీయ సంస్కృతులవలన, భారత జాతీయతకు భంగము కలుగు ప్రమాదమును పేర్కొనుట గూడ అంతే హాస్యాస్పదము. వ్రేళ్లు, శాఖలు, ఆకులు, పూవులు, పండ్లు మొదలైనవి వృక్షముయొక్క బలమునకు, సౌందర్యమునకు యెంతటి అవసరములో, ప్రాంతీయ సారస్వత సంస్కృతులు గూడ భారతీయ సంస్కృతికి అంతే అవసరములని యీ సందర్భమున నా విధేయ విజ్ఞప్తి. మన దేశమునకు మొదటి నుండియు దక్షిణాపథమే వైజ్ఞానిక నాయకత్వము వహించినది. భక్తి జ్ఞాన కర్మయోగములను ప్రవచించిన మతాచార్యులకు దక్షిణాపథమే జన్మస్థానము-సకల భారతమునకు దక్షిణాపథము వివిధ విజ్ఞాన రంగములందు మార్గదర్శకమైనది. అట్టి దక్షిణాపథము భారత జాతీయతకు ప్రతిబంధకము యెన్నడు గూడ కాజాలదు. ప్రాంతీయ భాషా సంస్కృతుల అభివృద్ధి మందగించినప్పుడు, వానితో పాటు, భారతీయ సంస్కృతి అభివృద్ధి గూడ మందగించక తప్పదు. ఈనాడు ఎంతో అభివృద్ధి పొందిన అనేక పాశ్చాత్యదేశాలలో ప్రాంతీయ భాషలు (అవి మన ప్రాంతీయ భాషలతో పోల్చినప్పుడు, తక్కువ సంఖ్యగల జనుల మాతృభాషలై యున్నప్పటికిని) ఆ యా దేశాల సమగ్ర సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

భారతీయ సంస్కృతి ఒక రత్నహారమువంటిది-అందలి రత్నములు ప్రాంతీయ భాషా సంస్కృతులు ఆ హారమునుగూర్చు సూత్రము సంస్కృత వాఙ్మయము. సంస్కృతము సకలభారత ప్రజల నాగరికతా సంస్కృతులకు మూలకందమై, వారిలో భరతఖండము తమ మాతృదేశము, తాము భారతీయులమను జాతీయతాభావమును వ్యాపింపజేసి, వారిని ఏకముఖముగా నడిపించు మూలసూత్రమై యున్నది. అందుచేత మన విద్యావిధానమున సంస్కృతమున కొక ముఖ్యస్థానము లభింపజేయుట అత్యవసరము. హైదరాబాదు ప్రభుత్వ విద్యాశాఖ యీ ఆవశ్యకతను గుర్తించి, హైస్కూలు తరగతులలో సంస్కృత భాషకు స్థానము గల్పించి ప్రశంసనీయమైన నిర్ణయము గావించినది.

ఈ సందర్భమున మరొక ముఖ్యమైన సంగతి మనవి జేయవలసి యున్నది. ప్రాంతీయభాషల అభివృద్ధి జాతీయభాషయగు హిందీ అభివృద్ధికి ఆటంకమను అపోహ కొందరిలో వ్యాపించి యున్నది. కేవలము అపోహయే కాదు; కొందరు ఇట్టి ప్రచారము గూడ గావించుచున్నారు. ఇది సరియైన అభిప్రాయము కాదు. హిందీకి ప్రాంతీయ భాషలకు మధ్య యేవిధమైన విరోధము లేదు. అఖిలభారత స్థాయిలో హిందీ వ్యవహార భాషగా మన రాజ్యాంగము నిర్ణయించినది. అనగా రాష్ట్ర ప్రభుత్వాలు మరియు కేంద్ర ప్రభుత్వము మధ్య పరస్పర పత్ర వ్యవహారములకు హిందీభాష ఉద్దేశించబడినది. రాష్ట్రాల పరిపాలన ప్రాంతీయ భాషలలో జరుగుట వలన హిందీ స్థానమునకు యెట్టి ప్రతిబంధకము కలుగజాలదు. కాని ఒకటి రెండు ముఖ్యమైన సంగతులు

# ప్రాంతీయ సంస్కృతుల ప్రభావము

మనము గమనించవలసియున్నది. హిందీని సకల భారత స్థాయిలో వ్యవహారభాషగా రూపొందించు బాధ్యత భిన్నప్రాంతాలలో నివసించు పౌరులందరి మీద కలదు. భారత రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ గారు హిందీభాష మన దేశములోని ప్రాంతీయభాషల సహకారముతో అభివృద్ధి గాంచవలసియున్నదని పలుమారు తెలిపియున్నారు. కాని, ఆ ఆవశ్యకతను ఉత్తర భారతమందలి హిందీవాదులు కొందరు గ్రహించలేదని, యీనాడు హిందీభాషలోని పరిణామాలు కొన్ని ఋజువు చేయుచున్నవి. వీరు సిద్ధముజేయుచున్న పదజాలము మిక్కిలి వింతగా నుండి, వ్యవహార యోగ్యముగా లేక పోవుట మన యందరి అనుభవసిద్ధము. భాష క్రమ పరిణామము పొందవలెను. అది యొక్క వృక్షము వలె పెంపుగాంచవలెను. కాని టంకసాలలోని నాణెములవలె సిద్ధము కాకూడదు. ఈ యథార్థమును హిందీ మాతృభాషగా కలిగిన సోదరులు గ్రహించి మన ప్రాంతీయ భాషలలోని శబ్దజాలమును దృష్టియందుంచుకొని, వివిధ ప్రాంతాల ప్రజల వ్యవహార పరిభాషను గమనించి, అందరి ఆమోద సహకారములతో, హిందీ భాషాభివృద్ధికి పూనుకొనవలసి యున్నదని నేను మనవి జేయుచున్నాను.

రాష్ట్రాల పరిపాలన ప్రజల భాషలలో జరుగవలసిన ఆవశ్యకతను మనము గ్రహించినప్పుడు, విద్యాబోధన గూడ మాతృభాషలద్వారానే జరుగవలసియున్నదను నిర్వివాదమగు సత్యమును మనము అంగీకరించవలసి యున్నది. హైస్కూలు తరగతుల వరకు విద్యాభోధన మాతృభాషల ద్వారా జరుగవలెనను సిద్ధాంతము ఆమోదించబడి, ఆచరణలోనికి తీసికొని రాబడినది. కాని విశ్వవిద్యాలయములోని భోధనా భాషను గూర్చి ఇంకను వాగ్వివాదములు కొందరు జరుపుచున్నారు. భారత ప్రభుత్వము నియమించిన యూనివర్సిటీ కమిషన్ తన నివేదికలో విశ్వవిద్యాయాల విద్యాభోధన ప్రాంతీయ భాషలలో జరుపుటకు ఆమోదించి యున్నది. నేడు విశ్వవిద్యాలయమున విద్యాభ్యాసము గావించు యువకులు రేపటి పౌరులు-అనగా మన జాతీయ జీవనమున రేపు వారు పరిపాలకులుగను, దేశనాయకులుగను, విజ్ఞానులుగను మరియు ఇతర బాధ్యతలు గల వ్యక్తులుగను తమ తమ కర్తవ్యములను నెరవేర్చవలసియున్నారు. ప్రాంతీయ భాషా సంస్కృతుల అభివృద్ధి బాధ్యతను వీరు వహించబోవుచున్నారు. పరిపాలకులుగా ప్రజల భాషలలో వీరు వ్యవహార నిర్వహణ గావించవలసియుండును దేశనాయకులుగా దేశసౌభాగ్యమునకు, ప్రజల అభ్యుదయమునకు వీరు పాటుపడవలసి యుండును. విజ్ఞానులుగా వీరు విద్యార్థులకు, ప్రజలకు అవసరమైన గ్రంథములను వారి భాషలలో రచించి, పత్రికలను నిర్వహించి, ప్రజలను విజ్ఞానవంతులనుగా జేయవలసియున్నారు. అందుకొరకువారు తమ భాషలలో సుశిక్షితులై యుండుట అవసరము. అంతేగాదు, విద్యాభ్యాసమునకు మాతృభాషకన్న ఉత్తమమైన భోధనాభాష మరియొకటి యుండజాలదను నది సకల విద్యావేత్తలు అంగీకరించిన సత్యము. అందుచేత ఈనాడు రాష్ట్రాలలోని విశ్వవిద్యాలయాలు ప్రాంతీయ భాషలద్వారా విద్యాబోధన జరుపుట అవసరమైయున్నది. గడచిన కొన్ని సంవత్సరాలనుండి ఆంధ్ర సారస్వత పరిషత్తు ఇందు కొరకై జేయుచున్న కృషి హైద్రాబాదు ప్రజలందరికి బాగుగా తెలిసియే యున్నది. మన విశ్వవిద్యాలయమున ప్రజల మాతృభాషలకు స్థానము కల్పించుటకు పరిషత్తు కృషిజేసి కొంతవరకు విజయము గూడ సంపాదించియున్నది.

ప్రజాస్వామికములో అధికార వికేంద్రీకరణ ముఖ్యమైనది-మన రాజ్యాంగము యీ అధికార వికేంద్రీకరణకు ఆమోదించి, గ్రామ పంచాయతులు, పురపాలకసంఘాలు, జిల్లా బోర్డులు మరియు రాష్ట్రీయ శాసనసభల ద్వారా అధికారాలను ప్రజాపరము కావించినది. ఇట్టి పరిస్థితులలో విద్యారంగమున ప్రభుత్వాల జోక్యము అభిలషణీయము కాజాలదని నేను మనవి చేయవలసిన అవసరము లేదు. కొన్ని నెలల క్రింద జరిగిన అఖిలభారత విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయుల సమావేశమున

# ప్రాంతీయ సంస్కృతుల ప్రభావము

విశ్వవిద్యాలయ వ్యవహారాలలో ప్రభుత్వముయొక్క జోక్యము మఱియు అధికారము సమంజసము కాదని యేకగ్రీవముగా తీర్మానము జరిగినది. ఈ తీర్మానము మిక్కిలి ఉచితమైనది. విద్యారంగమున సైనిక సమీకరణపద్ధతులుమాత్రము కోరదగినవి కావు. విద్యావిధానములపైన ప్రభుత్వ ప్రాబల్యము అనేకఅనర్థకములకు దారితీసి, నిరంకుశ విధానాలకు మార్గదర్శకము కాగలదు. ఉన్నత విద్యావిధానము ప్రభుత్వమునకు అడుగులకు మడుగులొత్తునదిగా నుండినచో, వ్యక్తి స్వాతంత్ర్యమునకు విఘాతముగలిగి, విద్యాలయాలు పరిపాలకుల రాజకీయ ప్రయోజనాల సాధనకు ఉపకరణములుగ పరిణమించి, దేశాభివృద్ధికి ప్రతిబంధకము కాగల ప్రమాదము వాటిల్లక తప్పదు. అందుచేతనే హైద్రాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయము మీాద కేంద్రప్రభుత్వ అధికారమునకు ప్రజలు తీవ్రమైన ఆక్షేపణ తెలుపుచున్నారు. ఈ ఆక్షేపణను విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుల సమావేశము ఏకగ్రీవముగా చేసిన నిర్ణయము బలపరచుచున్నది. కావున కేంద్ర ప్రభుత్వము ఉస్మానియా విశ్వవిద్యాలయమును గూర్చి చేసిన నిర్ణయమును మార్చుకొనుట అవసరము.

ఉన్నతవిద్యకు ప్రభుత్వ సహకారము అవసరమే. దాని కేవిధమైన ఆక్షేపణలేదు. కాని సహకారము వేరు అధికారమువేరు అని గ్రహించవలసి యున్నది. ఆర్థిక సహకారము అధికారముగా పరిణమించుట ప్రమాదకరము. ఇంగ్లండు మొదలైన దేశాలలో విశ్వవిద్యాలయాలను ప్రజలు భక్తి గౌరవాలతో ఆరాధించుచుందురు. ఇందుకు ముఖ్యకారణము, అక్కడి విశ్వవిద్యాలయాలు ప్రభుత్వవిధానాలకు, రాజకీయఆశయాలకు చరణాశ్రితులైన సేవకులు గాక పోవుటయే. రాజకీయ పక్షాలు మఱియు పరిపాలకుల స్వార్థ ప్రయోజనాలనుండి విశ్వవిద్యాలయాలు విముక్తిగాంచుట దేశసౌభాగ్యమునకు అత్యవసరము. ఆంధ్ర సారస్వత పరిషత్తు యీ దృక్పథముతో కృషిజేయుచున్నది.

విద్యారంగమునందువలె సారస్వత రంగమునగూడ ప్రభుత్వవిధానాల ప్రాబల్యము, రాజకీయ ప్రయోజనాల అధికారము కోరదగినదికాదు. రచయితలు స్వేచ్ఛగా ఆలోచించి, స్వతంత్రముగా రచనలు సాగించుట అవసరము. దేశకల్యాణమునకు కారణభూతులైన వారిలో రచయితలకు ప్రముఖస్థానము కలదు. కావుననే వారు యెన్నుకొబడని శాసన శాసనకర్తలని ఒకరు చెప్పియున్నారు. ఇది అతిశయోక్తికాదు కేవలము సత్యోక్తి. ప్రపంచమునందలి మహోద్యమము లెన్నింటికో రచయితలు దోహదము గావించియున్నారు. కత్తిచే సాధించుటకు వీలుగాని మహాత్కార్యములను కలముతో అవలీలగా సాధించగలిగిన నిదర్శనాలు మనము ఎన్నియో చూపించవచ్చును. కలములో నిబిడీకృతమైనశక్తి అమోఘమైనది; అద్వితీయమైనది. రచయితలు తమతమ పవిత్ర కర్తవ్యములను సక్రమముగా నిర్వహించవలెనన్నచో వారు సంకుచిత భావాలకు అంజలించువారు కాగూడదు. సకల ప్రపంచము తనకుటుంబమని భావించి లోకకల్యాణమునకు పాటుపడవలసిన రచయితలు ముఠాలకు, వర్గాలకు యెంత దూరముగా నుండిన నంత మంచిది. వారి భావవాహినులకు ఆనకట్టలు కట్టు ప్రయత్నాలు, కాంక్షణీయములు కాజాలవు. ముఠాలకు వర్గాలకు, వ్యక్తి ప్రయోజనాలకు ఆహుతియైన రచయిత, ఆర్థికముగా లాభము పొందిన పొందవచ్చును గాని, అట్టి రచయిత దేశమునకు, జాతికి, సారస్వతమునకు, లోకమునకు ద్రోహియగుట అనివార్యము. అందుచేత రచయితలు, వాఙ్మయ సంస్థలు మిక్కిలి జాగరూకత వహించి, తమను ఇతరులు వినియోగించుకొనకుండునట్లుగా, తమ పవిత్ర కర్తవ్యమును నెరవేర్చవలసియున్నది.

కాలము మారినది, పరిస్థితులు మారినవి. ఈ మార్పు యొక్క ప్రభావము వాఙ్మయ రంగమున స్పష్టమగుచున్నది. ఈ మారిన పరిస్థితులలో ప్రజల అవసరాలను, అభిప్రాయాలను దృష్టిలో నుంచుకొని వాఙ్మయ నిర్మాణము జరుగవలసి యున్నది. ఈ సత్యమును నలుబది సంవత్సరాలకు ముందే గ్రహించిన శ్రీ కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు గారు మన భాషలో విజ్ఞాన వాఙ్మయ నిర్మాణము

నను పూనుకొని దేశ చరిత్రలను, విజ్ఞాన శాస్త్రములను ప్రకటించిరి. కాని లక్ష్మణరావుగారు ఆరంభించిన ఉద్యమము వారి తరువాత, ఎక్కువగా వ్యాప్తి పొందలేదు. ఆనాడు వారు తమ పీఠికలలో మన భాషయందు యే యే లోటులు కలవని భావించిరో, యీనాడు గూడ ఆ లోటులే కనుపించుచున్నవి. అనగా యీ లోటును తీర్చుటకై సరియైన కృషి సక్రమముగా జరుగలేదన్నమాట. ఆంధ్రసారస్వత పరిషత్తు కార్యక్రమములో గ్రంథ ప్రకటనగూడ ముఖ్యమైనది. ఈ గ్రంథ ప్రకటనా కార్యమున పరిషత్తు లక్ష్మణరావుగారి దృక్పథముతో కృషి చేయుచున్నది. పరిషత్తు ప్రకటించిన గ్రంథములే ఇందుకు ఉదాహరణములు. కాని అనేక కారణములవలన యీ వాఙ్మయ ప్రకటన సరిగా జరుగుటలేదు. అన్నిటికన్న ముఖ్యమైనది ఆర్థిక ప్రతిబంధకము. ప్రభుత్వము నుండి గాని లేక ప్రజలనుండిగాని తగినంత ఆదరణ లభించినచో పరిషత్తు యీ మార్గమున యెక్కువ కృషిగావించుటకు సిద్ధముగా నున్నది.

పరిషత్తు ఆదర్శాలలో అక్షరాస్యతావ్యాప్తి గూడ ముఖ్యమైనది. ప్రజాస్వామిక పరిపాలనలో వ్యక్తి స్వాతంత్ర్యమునకు ప్రధాన స్థానము గలదు. దారిద్ర్య, నిరుద్యోగ, అనారోగ్య, అజ్ఞానపిశాచములను పారద్రోలుట ప్రజాస్వామిక పరిపాలన వలన కాంక్షించదగిన పరమ ప్రయోజనము. తమ బాధ్యతలను, హక్కులను ప్రజలు సక్రమముగా గ్రహించుటకు వారికి విజ్ఞానచక్షువు ముఖ్యసాధనము. "చదువని వాడజ్ఞుండగు, చదివిన సదసద్వివేక చతురత గలుగున్" ఈ విద్యావ్యాప్తికి నిరక్షరాస్యతా నిర్మూలనమునకు పరిషత్తు కృషిచేయుచు, ప్రభుత్వ ఉద్దేశములను నెరవేర్చుచున్నది. మనరాజ్యాంగము నిర్బంధ విద్యాబోధన ఆవశ్యకతను గ్రహించి, ఆ భారమును స్వీకరించినది. ముఖ్యముగా నేడు వయోజనులలో నిరక్షరాస్యతా నిర్మూలనము విజ్ఞాన వ్యాప్తి జరుగవలసి యున్నది. ఈ వయోజన విద్యాప్రచారము పరిషత్తువంటి సంస్థల సహకారము ప్రభుత్వమునకు అత్యవసరము. అఖిలభారత వయోజన విద్యామహాసభ, నిరక్షరాస్యతా నిర్మూలన దేశములోని విద్యాసంస్థలద్వారా జరిపించవలెనని తీర్మానించినది. ప్రభుత్వము యీ సందర్భమున తగినంత శ్రద్ధవహించుకొనుట అవసరము. వయోజనులలో నిరక్షరాస్యతా నిర్మూలనకై ప్రభుత్వము ప్రత్యేక శాఖలను నెలకొల్పుటవలన కలిగిన అనుభవము సంతృప్తికరముగా లేదని, విద్యావేత్తల అభిప్రాయమైయున్నది. అందువలన, పరిషత్తువంటి సంస్థల ద్వారా ప్రభుత్వము యిట్టి కృషికి ప్రోత్సాహము గావించుట ముఖ్యము.

ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆశయములను కార్యక్రమములను దిఙ్మాత్రముగా సూచించినాను. దేశమును విజ్ఞానవంతము చేయుటకు, ఆంధ్ర సంస్కృతి దీపములను ఇంటింట వెలిగించుటకు ఇంతకు పూర్వమువలెనే ఇకముందు గూడ పరిషత్తు కృషిచేయుచుండగలదు. పెద్దల సలహాలు, ఆశీర్వాదము, కార్యకర్తల కృషి, ప్రజల ఆదరణ పరిషత్తునకు పెట్టని కోటలు.

# సందేశములు





స్వతంత్ర భారతమునకు ఉపాధ్యక్షులును, దిగంత విశ్రాంత కీర్తి గలవారును నగు శ్రీ డాక్టరు రాధాకృష్ణగారిచే ప్రారంభోత్సవము జరుపబడినదియు, కవి సార్వభౌములగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, ఆంధ్రాస్థాన కవివర్యుల యాగమమున నలంకృత మైనదియునగు నేటి మన పరిషత్తు వార్షిక మహాసభ చారిత్రిక గౌరవమున కర్హమైనది. ఇట్టి మహా సభలో పాల్గొనగలిగిన నన్ను నేను ధన్యునిగా దలంచుచున్నాను.

ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలంగాణమునకు చేసిన సేవ అపారమని ఘంటా పథమున జెప్పవచ్చును. నేటికాలమున తెలంగాణమున చెప్పదగిన ఉద్యమమేదైన నున్నచో అది ఆంధ్ర సారస్వత పరిషదుద్యమమేయని చెప్పుటకు ఎట్టి సందియమును ఉండదు.

ఈ యుద్యమము ఇతోధికాభివృద్ధి నొంది విశాలాంధ్రమునకు శోభ చేకూర్చునట్లు దైవమనుగ్రహించు గాక !

—మాడపాటి - హనుమంత రావు.

\+ + + +

శ్రీ రామకృష్ణ, చిరివాడ.

ఆశీ :

నేను ఈ సభలకు రాఁజాలనందుల కెంతయో చింతించుచున్నాను. ఈ సభలకు వచ్చి పెద్దలందఱయు ఆకాంక్షను శతగుణము జేసి నాయదిగా భావించుకొని సభాకాంక్షితము సఫలము కావలయునని కోరుచున్నాను. పరమేశ్వరుఁడు మీలో నుండి యీ సభలను నడపుచున్నాడు. ‘ ముందులకు నడువుఁడు ! ముందులకు నడువుఁడు ’ అని మీకు వినఁబడుట లేదా ?

వేలూరి శివరామ శాస్త్రి.

## సుజాత - విజయ, వైశాఖము.



మహాశయా,

నమస్కారములు. తమరు ఆదరముతో పంపిన ఆంధ్ర సారస్వత పరిషద్వార్షికోత్సవాహ్వానము అందినది. కృతజ్ఞుడను.

నా మనస్సు అలంపురానికి వెళ్లాలనీ, ఆ సభలను సందర్శించాలనీ ఉరకలు తీస్తున్నది; ఉబలాటపడు తున్నది. కాని రావడానికి తగిన ఆరోగ్యస్థితిలో లేను. మీరందరూ కలిసి అంతవైభవంగా నిర్వహిస్తున్న సభలను సందర్శించే భాగ్యానికి నోచుకోలేదు నేను.

మీరు నిర్వహించిన, నిర్వహిస్తూవున్న కార్యకలాపాన్నిబట్టి, కృషిఫలితాన్నిబట్టి చూస్తే విశాలాంధ్రదేశంలో ఆంధ్రసారస్వత పరిషత్తుకు దీటువచ్చే మరోసంస్థ లేదని నానమ్మకం. దీక్షాకంకణం కట్టి మీరు సాగిస్తున్న కృషికి ఫలితంగా తెలంగానా సారస్వత సుక్షేత్రంలో తప్పక మీరు రాజనాలు పండిస్తారు.

తెలుగు దేశానికి ఏకైక సారస్వత సంస్థ ఇంతవరకు రూపొందలేదు. దానిని గురించి మీ రాలోచించాలని నా కోరిక. సంపూర్ణాంధ్రనిఘంటు విప్పటివరకూ మనకు రాలేదు. అట్టి దింత త్వరలో రాదని నాకు తెలుసును. కాని ముందు మాండలిక పదాలు, పారిభాషిక పదాలు సేకరించుటకైనా తగిన కృషి చేయాలి. ఈ విషయంలో పరిషత్తు పూనుకొని కొంత కృషి చేయాలని కోరుతున్నాను.

సభలు జేగీయమానంగా జరుగ గలవని ఆశిస్తున్నాను. ఇక శలవు.

చిత్తగింపుడు.

విధేయుడు,

మల్లంపల్లి సోమశేఖర శర్మ.

\+ + + +

రాజభవన్, నాగపూరు.

తేది 3-౧-౫3.

మీ సమావేశమునకు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారిని ప్రారంభకులుగా తెచ్చుకోగలిగినందుకు మిమ్ముల అభినందించుచు ఈ సభలు ఆ మహనీయుని స్థాయికి తగిన రీతిగా జరుగ గలవని నమ్ముచున్నాను. సమావేశముతో పాటు మీరు

## సందేశములు

సాంస్కృతిక ప్రదర్శనమును, పురాతత్త్వవస్తు ప్రదర్శనమును, గృహపరిశ్రమల ప్రదర్శనమును, మరియు వ్యవసాయ ప్రదర్శనమును ఏర్పాటు చేసియున్నారు. మీ సభలలో భాష, సంస్కృతము, చరిత్రకు సంబంధించిన సమావేశములు కలవు. అంతే గాక కవి సమ్మేళనము, కథక సమ్మేళనము, బాలవాఙ్మయ శాఖ, వయోజన విద్యాశాఖలకు గూడ మీ కార్యక్రమమున తగిన స్థానము కల్పించినారు. నిజముగా మీ పరిషత్తు సర్వతోముఖమైనది. మీ అధ్యక్షుడు శ్రీ రామానుజరావు, కార్యదర్శి శ్రీ హనుమంతరావు గార్ల వివేకయుత నిర్వహణలో మీ సమావేశమును దిగ్విజయముగా జరిపి, ఈ సంవత్సరము తమ సంస్థను చక్కగా వ్యాప్తిచేయగలరని విశ్వసించుచున్నాను.

బి. పట్టాభి సీతారామయ్య,
గవర్నర్, మధ్య ప్రదేశ్.

\+ \+ \+ \+

ప్రియ మహాశయా :

తాము దయతో బంపిన ఆహ్వానమునకు అత్యంత కృతజ్ఞుడను. ౧౨. వ తేదీనాడు లక్నో లో నుండవలసి వచ్చుట సభలో పాల్గొన జాలనందుకు విచారించుచున్నాను. సభ జయప్రదముగా జరుగవలెనని కోరుచు, నా శుభాభినందనలు పంపు చున్నాను.

ఇట్లు,
యస్. వి. కృష్ణమూర్తిరావు.
వైస్. చేర్మన్. కౌన్సిలాఫ్‌స్టేట్సు. ఢిల్లీ.

\+ \+ \+ \+

ప్రియమహాశయా !

తలవనితలంపుగా గలిగిన కొన్ని అనివార్యమైన మరియు ముఖ్యమైనపనులచే, నేను ఇంతకుముందు నిర్ణయించుకొన్న కార్యక్రమము ప్రకారము ౧౧. వ జనవరినాడు ఆలంపురము వచ్చి తమ సభ లో పాల్గొన జాలనని తెలుపుటకు విచారించుచున్నాను. యీ తొందరపనులే కలుగకపోయినయెడల నేను అక్కడికి వచ్చి మీ అందఱితో కలిసిమెలసి ఆనందకరమైన యీసమావేశములో పాల్గొని ఎంతో సంతోషించే వాడిని. అనివార్యపరిస్థితులవలన సభలలో పాల్గొనజాలనందుకు నన్ను మీరు దయతో క్షమింతురని విశ్వసించు చున్నాను.

తమ సభలు జయప్రదముగా జరుగగలవని ఆశించు చున్నాను.

భవదీయుడు.

హైదరాబాదు. ఫూల్చంద్ గాంధి,
విద్యామంత్రి.

## సుజాత - విజయ, వైశాఖము.

అయ్యా,

ఆదరముతో పంపిన మీ ఆహ్వానమునకు కృతజ్ఞుడను.

ఆంధ్రసారస్వతపరిషత్ కార్యక్రమము జయప్రదముగా కొనసాగవలెనని హైదరాబాదు కర్ణాటకసాహిత్యమందిర సభ్యులతరపున శుభాకాంక్షలు పంపుచున్నాను. మన దేశమునకు ఉపాధ్యక్షులగు డాక్టర్. యస్. రాధాకృష్ణ వంటి ప్రతిభావంతులు ప్రారంభోత్సవము జరుపుచుండుటచే పరిషత్తు యొక్క కీర్తి ప్రతిష్ఠలు ద్విగుణీకృతములైనవి. దేశమందలి సర్వశక్తులు సాముదాయక అభ్యుదయమునకు కృషి చేయుటలో కేంద్రీకరింపబడిన యీ సమయమందు ఇట్టి పరిషత్సభలు వేర్వేరు భాషలు మాట్లాడు ప్రజల మధ్య సాంస్కృతిక చైతన్యమును, జాతీయైక్యతా భావమును ఉద్దీపింపజేయుటకు ఆవశ్యకముగ తోడ్పడునను టలో సందేహము లేదు. కన్నడము, తెలుగు ఒకే భాషాకుటుంబమునకు చెందినవగుటచే యీ రెండు భాషలకు ఎంతో సంబంధమున్నది. విజ్ఞానరంగమున ఇట్టి సుహృద్భావము పరస్పర బాంధవ్యమును దృఢతరము చేయుటయే గాక అభ్యుదయమునకు చక్కని మార్గమేర్పరచును. పండితుడును తెలంగాణా సుపరిచితుడునైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి అధ్యక్షత్వము క్రింద జరుగబోవు చర్చలు ప్రతి సాంస్కృతికాభిమానిని ప్రోత్సాహపరచి సృజనశక్తిని పోషించునని నిశ్చయముగా చెప్పగలను.

మీ విశ్వాసపాత్రుడు

హైదరాబాదు

నరసింగరావుమాన్వీ

అధ్యక్షుడు కన్నడసాహిత్యపరిషత్

ఆత్మను తృప్తిపరచడమే సాహిత్య ప్రయోజనము అనడం అబద్ధం. ఆత్మను ఉజ్జీవింపజేయడమే సాహిత్యం కనీసము చేయతగినది.

గోర్కీ.

# కార్యదర్శి నివేదిక



## శ్రీ పులిజాల హనుమంతరావు



1948 సర్వధారి సంవత్సరము హైదరాబాదు ప్రజలకు నూతన శకాన్ని ప్రసాదించింది. వందలాది సంవత్సరములు విదేశపరిపాలనలో అనుభవించిన యాతనలు అంతమొందినవి. చీకటు లొక్కసారి తొలగిపోయినవి. వెలుగు రేకలు వ్యాపించినవి. ఎదుగుబొదుగులు లేక నిస్పందులలో నిదురపోయిన ప్రాంతీయభాషా సంస్కృతులను పెంపొందింప జేసుకొనుటకు మంచి అవకాశము లభించినది తెలంగాణాలో నలుమూలల మాతృభాషాభిమానము వెల్లువలె పొంగిపోయినది.

ఆంధ్రసారస్వత పరిషత్తును దక్కించుకొని బయటపడుటయే చాలునను గద్దుగోజులను పోలీసుచర్య తొలగించినది. ఆనాటినుండి యీనాటివరకు పరిషత్తు చేసిన కృషిని సూక్ష్మముగ నివేదించుకొనుట నా కర్తవ్యము.

పరిషత్తు ఆదర్శోద్దేశ్యములు:- ఆంధ్రసంస్కృతి మరియు సారస్వతముయొక్క సర్వతోముఖవికాసానికి కృషిసల్పుట.

ప్రజలలో నిరక్షరాస్యతను నిర్మూలించి, మాతృభాషద్వారా విద్యావ్యాప్తిని గావించుట.

తెలుగుభాషలో పరీక్షలను జరుపుట.

వివిధకళలకు, శాస్త్రములకు సంబంధించిన గ్రంథములను ప్రచురించుట.

సభలు, సమావేశాలు, కవిసమ్మేళనాలు జరిపి, విద్యావంతులయిన ప్రజలలో సారస్వతాభినివేశమును పెంపొందించుట.

ఫిబ్రవరి 1949 తూప్రానులో జరిగిన సభలు పరిషత్తునకు ఒక నూతన గమనాన్ని, నవోత్తేజమును కలిగించినవి. ప్రజలు వేలాది సంఖ్యలో సభయందు పాల్గొనినారు. పరిషత్తు కార్యక్రమము ఒక మహోద్యమముగా, రూపొందుటకు అనువయిన బీజావాపన ఆ సభలో జరిగినది.

పరిషత్తు కార్యరంగము విస్తృతమయినది. తెలంగాణమంతట పల్లె పల్లెలో పరిషత్తు శాఖలు స్థాపించబడినవి. తెలుగు పుస్తకములు చదువు అభిరుచి పెంపొందింప జేయబడినది. వయోజన ఓటింగుపద్ధతి నెలకొల్పబడుచున్నదని తెలియగనే పల్లెప్రజలలో విద్యాసక్తి పెంపొందించుటకు పరీక్షలను ప్రతియేట రెండుసార్లు నిర్వహించు కార్యక్రమము ఆరంభింపబడినది. పరీక్షా కేంద్రములకు పర్యవేక్షకులను కేంద్ర

కార్యాలయమునుండి పంపు ఆచారమును మొదటి సారి ఆంధ్రసారస్వత పరిషత్తు విద్యాసంస్థలలో ఆదర్శముగా ప్రవేశపెట్టినది. కేంద్ర కార్యాలయము నుండి పర్యవేక్షకులను పంపడము వ్యయప్రయాసలతో కూడుకొన్న కార్యమైనప్పటికి, కేంద్రము నుండే కావలసిన ప్రయాణ వ్యయమును భరిస్తు, పరీక్షలను నిర్వహించినామని చెప్పుకొనుటకు గర్విస్తున్నాము. మా పరీక్షల నిర్వహణమును పరికించిన బాధ్యతకల విద్యాశాఖాధికారులు ప్రభుత్వ పరీక్షల నిర్వహణమునకు ఎంతమాత్రము తీసిపోవని ప్రశంసించుటయే యిందుకు నిదర్శనము. పరిషత్తు నిర్వహించిన పరీక్షలు (1) అక్షరాస్యత (2) ప్రాథమిక (3) మాధ్యమిక (4) ప్రవేశ (5) విశారద. ఆనాటి నుండి నేటివరకు పై 5పరీక్షలు, 187 కేంద్రాలలో నిర్వహించబడినవి. పరీక్షలలో పాల్గొన్న విద్యార్థుల సంఖ్య-ప్రాథమికలో 7312, మాధ్యమికలో 8031 ప్రవేశలో 5730, 1950 నుండి విశారద పరీక్షలో 309. ఈ విధంగా మొత్తము 21073 విద్యార్థులు పరీక్షల నొసగియుండిరి. 1951 నుండి నిర్వహింపబడిన అక్షరాస్యతాపరీక్షలో 1580 మంది అక్షరాస్యులు పాల్గొని పరీక్ష నొసగినారు.

పరిషత్తునకు తెలంగాణమునందే కాక, బొంబాయి, షోలాపూరు, గుల్బర్గా, బీదరు, గానుచూరు వంటి ఆంధ్రేతర ప్రాంతములందును, మద్రాసాంధ్రములోని బాపట్ల, పామర్రువంటి కేంద్రములందును పరిషత్తు శాఖలు, పరీక్షా కేంద్రములు కలవని చెప్పుటకు సంతసింతుము. పరిషత్తు తన కార్యక్షేత్రమును తెలంగాణ సీమావధులను అధిగమించి వ్యాపింపచేయుటకు ఉత్తర సర్కారు, బొంబాయి, షోలాపూరాంధ్రులు తీర్మానముల ద్వారా పరిషత్తును కోరియున్నారు.

పరీక్షలస్థాయి:- పై పరీక్షలు ప్రభుత్వమువారి ప్రాథమిక మాధ్యమిక, ఉన్నత పాఠశాలల చదువుతో సమానస్థాయిని కలిగివున్నవని చెప్పుటకు నిర్ణయించిన పాఠ్యప్రణాళికయే నిదర్శనము. పరిషత్తు ప్రవేశపరీక్షకు నిర్ణయింపబడిన పుస్తకము ఉస్మానియా విశ్వవిద్యాలయములోని యింటర్మీడియటు పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడిన దన్నచో పరీక్షల స్థాయి బోధపడగలదు. తెలంగాణమున ప్రభుత్వము వారి ప్రాథమిక పాఠశాలలుగూడ లేని మారుమూలల గ్రామాలవరకు పరిషత్తు ప్రచారము వ్యాపించి గ్రామీణ బాలబాలికలకు విద్యాజ్ఞానము మున్నగు సంప్రదాయము నేర్పరచినది. ఇలాంటి భాషోద్యమమును సాగించుటకు తలపెట్టిన పరిషత్తుకు తగిన ఆర్థిక సహాయము ప్రభుత్వమునుండి లభించక పోయినది.

ప్రజలిచ్చిన సహకారము ద్వారానే పరీక్షా కార్యక్రమము కొనసాగింపవలసి వచ్చుటచే పరిషత్తు ఎన్నో బాధలకు గురికావలసి వచ్చినది. ఈ సందర్భములో పరీక్షా కేంద్రములలో ప్రభుత్వ విద్యాశాఖవారు గూడ తోడుపడినందుకు పరిషత్తు పక్షమున కృతజ్ఞులము.

పరీక్షలు - ప్రభుత్వమువారి ఆమోదము:- ప్రభుత్వము వారిచే పరీక్షల నామోదింపజేసి దేశీయులకు ప్రోత్సాహమును, ప్రాథమిక విద్యాబోధనకు సౌకర్యమును కలిగించుటకు పరిషత్తు భగీరథ ప్రయత్నము చేయవలసి వచ్చినది. చాలా ఆలస్యముగా ప్రభుత్వము పరిషత్తు పరీక్షలలో ప్రవేశను ఆమోదించింది. కాని ఎన్నో షరతులమధ్య నిరికించుటచే ఆ ఆమోదమువలన మేల్కన్న కీడులే యెక్కువ కలిగినవని చెప్పుటకు విచారపడుదుము. ప్రభుత్వమువారు పరిషత్తు విశారద పరీక్షను ఆమోదించు సూచనలు కలవు. నెమ్మాని శేషమ్మగారు (బాపట్ల) తన భర్త జ్ఞాపకార్థము విశారద పరీక్షలో ప్రథమములుగా నెగ్గినవారికిచ్చు నిధి ౧౧౧౬ ఏర్పాటు చేసినారు. పరిషత్తువారు నెమ్మాని శేషమ్మగారికి కృతజ్ఞతలు తెలియజేయుచు బాపట్లశాఖా కార్యకర్తలను ప్రశంసించుచున్నారు.

ప్రచురణలు:- పరిషత్తు కార్యక్రమాలలో గ్రంథ ప్రచురణము ముఖ్యమయినది. ప్రచురణశాఖ ఉత్తమ గ్రంథాలను ప్రచురించింది. 1949 నుండి పరిషత్తు 13 ఉత్తమ గ్రంథములు దాదాపు 2000 పుటలుగల 44000 ప్రతులు ప్రచురించినది. వీనిలో కొన్ని

# కార్యదర్శి నివేదిక

గ్రంథములు **2, 3, 4,** మారులుగూడ ముద్రించబడినవి. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారిచే రచింపబడిన ఆంధ్రుల సాంఘికచరిత్ర యావదాంధ్రదేశ పండితుల ప్రశంసలందినది. ఈ సందర్భమున పరిషత్తు పరీక్షల పాఠ్య పుస్తకముల ప్రచురణ నిమిత్తం మంచిరియాల ఆహ్వానసంఘ పక్షాన సంఘాధ్యక్షులు శ్రీ రా జా మురళీమనోహరరావుగారిచే ౧౫౦౦ విరాళీ రూపమున బొందిన సంతోషకరమగు విషయమును సభాసదులకు తెలియజేయుట మా కర్తవ్యము.

వయోజన విద్యాప్రచారము:- పరిషత్తు ముఖ్య లక్ష్యాలలో వయోజన విద్యావ్యాప్తి మరియొక ప్రధానమైన ఉద్దేశ్యము. ఈ లక్ష్యసిద్ధికై పల్లె పల్లెలలో పరిషత్తు అక్షరాస్యతా ప్రచారము జరిపి, వయోజన విద్యావ్యాప్తిని సాగించు కార్యకర్తలను పరిషత్తు అధ్వర్యమున హైదరాబాదులో ఒకశిక్షణ కేంద్రము నిర్వహింపబడినది. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివంటి విద్యావేత్తలు యీ కేంద్రానికి ఆహ్వానింపబడినారు. హైదరాబాదు హైకోర్టు మాజీ ప్రధానన్యాయమూర్తి శ్రీ ఆర్. యస్. నాయక్ శిక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. మొత్తము **110** మంది కార్యకర్తలు వయోజన విద్యాబోధనలో శిక్షణను పొందినారు. వీరికందరికీ యోగ్యతాపత్రము లివ్వబడినవి. ఇప్పుడు పరిషత్తు తెలంగాణాలో **64** వయోజన పాఠశాలలు నడుపుచున్నది. సింగరేణి బొగ్గు గనుల కార్మికులకొరకై, కొత్తగూడెము, ఇల్లెందు, శాస్త్రి, బెల్లంపల్లి మున్నగు ప్రాంతములలో **16** వయోజన పాఠశాలలు నిర్వహింపబడుచున్నవి. (ఇవి ప్రభుత్వము వారి సహాయమున పరిషత్తు పర్యవేక్షించుచున్నది.) గ్రామాలలో **98** వయోజన పాఠశాలలు మరల తెరువబడినవి. **3393** మంది వయోజనులు యీ పాఠశాలల్లో అక్షరాస్యులైనారు. అంతేగాక వీరిలో **1580** మంది పరిషత్తు పరీక్షలకు కూర్చొనగా **631** మంది ఉత్తీర్ణులైనారు, యువక కార్యకర్తలకు వయోజన విద్యాశిక్షణ గరపటానికై, ప్రతిజిల్లాలోను శిక్షణ కేంద్రాలను నడుపవలెనని ఒక సమగ్రమైన పథకమును పరిషత్తు సిద్ధము చేసినది. అయితే ప్రభుత్వమువారి ఆర్థిక సహాయము లేనిదే యిట్టి పథకము, అమలు జరుగుట దుస్సాధ్యము. ఈ కార్యకలాపాలలో ఒకభాగంగా **1951** ఫిబ్రవరి **17** వ తేదీనుండి **21** వ తేదీవరకు పరిషత్తు తెలంగాణమంతట వయోజన విద్యావారము జరిపినది పరిషత్తు పంచవర్ష ప్రణాళిక సందర్భమున వయోజన విద్యావ్యాప్తికి కృషిచేయ తన ఆమోదమును తెలిపియున్నది. తెలంగాణమున నిర్మాణాత్మకముగా పరిషత్తు వయోజన విద్యావ్యాప్తికై జరిపిన కృషి సామాన్యమైనది కాదని చెప్పుటకు సాహసింతుము. **1950** లో జబల్పూరునందు జరిగిన (అడల్టు ఎడ్యుకేషను సెమినార్) వయోజన విద్యా ప్రచార గోష్ఠిలో పరిషత్తు పాల్గొని యావద్భారతమున జరుగు వయోజన విద్యా ప్రచారపద్ధతిని ఆకళింపు చేసుకొనగలిగినది.

తీర్మానములు: పరిషత్ప్రతినిధివర్గం:- తూప్రాను సభలో పరిషత్తు, హైదరాబాదు రాష్ట్రము లోని విద్యావిధానమునుగూర్చి, ఉస్మానియా విశ్వవిద్యాలయములో ప్రాంతీయ భాషలకు అర్హస్థానము కల్పింపబడవలెననియు, పరిషత్తు పరీక్షలు ప్రభుత్వముచే ఆమోదింప చేయువలెననియు, ప్రాచ్యవిద్యాపట్టములు పొందిన పండితులకు విశ్వవిద్యాలయ పట్టభద్రులతో సమాన వేతనముల నీయవలయునని, హైస్కూలు తరగతులలో కూడా మాతృభాషలద్వారా విద్యాబోధన జరుగవలెననియు తీర్మానములు చేయబడినవి. పరిషత్తుయొక్క కార్యవిధానమును రూపొందించుటకు పరిషత్తుపక్షమున ఆచార్య శ్రీ తణికెళ్ళ వీరభద్రుడు, శ్రీ యం. హనుమంతరావు, శ్రీ యన్. నరోత్తమరెడ్డి, శ్రీ దేవుపల్లి రామానుజరావుగార్లతో కూడిన ఒక రాయబారవర్గము, ఆచార్య శ్రీ తణికెళ్ళ వీరభద్రుని అధ్వర్యమున అప్పటి విద్యాశాఖామాత్యులగు రాజా ధోండేరాజబహద్దూరుగారిని కలుసుకొని సంప్రదింపులు జరిపినారు. ప్రతినిధవర్గమువారు ప్రాంతీయ భాషల ప్రాధాన్యమును గురించి జరిపిన చర్చలకు మంత్రిగారు సంతృప్తి చెంది హైస్కూలు తరగతులవరకు ప్రాంతీయభాషలయిన తెలుగు, మరాఠీ,

కన్నడములలోను విద్యాబోధన జరుగవలెనని ఉత్తరువులు జారీచేసినారు. తరువాత ఇదే ప్రతినిధివర్గము వారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుని సందర్శించి విశ్వవిద్యాలయ బోధనములోగూడా ఏదేని ఒక ప్రాంతీయ భాషగాని లేక ప్రాచీన భాషలలో నొకదానినిగాని నిర్బంధ పఠనీయభాషగా చేయడానికి సమాలోచనలు సలిపిరి. అందుకు ఉపాధ్యక్షు లంగీకరించిరి. కాని ఒక ప్రశ్నపత్రము నకు మాత్రమే అవకాశ మీయబడినది. పరిషత్తు యీవిధముగా ఒక ఆదర్శమును సాధించటంలో విజయమును పొందినది.

హైదరాబాదుకు భారత ప్రధానమంత్రి రాక సందర్భంలో ప్రాంతీయ భాషలను నిర్బంధ పఠనీయములుగా జేయడమేగాక, కాలేజీ విద్యయావత్తు ప్రాంతీయభాషలలోనే జరుపటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ప్రకటించి ఉండిరి. అయితే ఏకారణముల చేతనో కాని వారీ వాగ్దానములను చెల్లించుకోలేక పోవడము విచారకరవిషయము. అంతట పరిషత్తు ప్రతినిధివర్గము తిరిగి శ్రీ మాడపాటి హనుమంతరావుగారి నాయకత్వాన విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుని వద్దకు పోయి, వారిని వాగ్దానమును చెల్లించవలసినదిగా కోరడమైనది. అందుకువారు ఆశాభంగమును కలిగించని సమాధానమిచ్చిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్వహణములో తీవ్రమయిన సంస్కరణలు రావడము అవసరమని పరిషత్తు వాంఛిస్తున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయమును కేంద్రప్రభుత్వము స్వాధీనముచేసికొని, దానిని హిందీ విశ్వవిద్యాలయముగా మార్చడాన్ని పరిషత్తు పూర్తిగా వ్యతిరేకిస్తున్నది. పరిషత్తు ఈవిషయమునప్రజాభిప్రాయమునుఢిల్లీప్రభుత్వమునకు తెలియజేయుటకై హైదరాబాదులో ఏర్పడిన పౌర సంఘమునకు సహకరించుచున్నది. అక్టోబరు 52 లో ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులవద్దకు పరిషత్తు రాయబార వర్గమువారు వెళ్ళి, మద్రాసు ఆంధ్రా యూనివర్శిటీలలో బోధింపబడుమేరకైన మాతృభాషలకు ఉస్మానియా విశ్వవిద్యాలయములో అవకాశమును కలిగించవలెనని కోరుటయేకాక, బి. యస్. సి. కోర్సునుండి ప్రాంతీయ భాషలను తొలగించు ప్రయత్నములను చేయవలదని కోరిరి. ఉపాధ్యక్షులు ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయాలలోవలె ఇంటర్మీడియటు వరకు మాతృభాషలలో బోధన ఏర్పాటుచేయుట కంగీకరించినారు.

ప్రజాసభలో ప్రభుత్వ వ్యవహారాలు:- రాష్ట్రపరిపాలనలో ప్రాంతీయభాషల కేమాత్రము స్థానము లేదు. జనాభాలో నూటికి తొంబదిమంది ప్రజలు తమ కష్టనిష్ఠూరాలను మాతృభాషలోనే పాలక వర్గమువారికి నివేదించుకొను భాగ్యము కలుగలేదు. ఈ యాటంకమును తొలగించడానికి పరిషత్తు ఆందోళన జరుపుచున్నది. క్రిందికోర్టులలోను, ప్రభుత్వ జిల్లా కార్యాలయాలలోను ప్రాంతీయభాషలే ఉపయోగింపబడవలెనని పరిషత్తు కోరుచున్నది.

రాష్ట్రపతికి విజ్ఞాపన:- 1951 ఆగస్టు 30 వ తేదీన రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాదుగారు హైదరాబాదుకు, విచ్చేసిన సందర్భంలో పరిషత్తు ప్రతినిధివర్గం ఆయనను కలుసుకొని, పరిషత్తు కార్యకలాపాలను వివరించునట్టి విజ్ఞాపనపత్రమును సమర్పించి ప్రభుత్వసహాయము కోరుటేకాక, ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిపాలన విధానము గురించి తన అసమ్మతి తెలియజేసినది.

వైజ్ఞానిక కార్యకలాపాలు:- కీర్తిశేషులయిన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి ఆస్థానకవి బిరుద ప్రదాన మహోత్సవసందర్భమున పరిషత్తు రజతకమలముతో సత్కరించి తన భక్తిని వెల్లడించినది. అదే సమయమున అఖిలాంధ్ర పరిషత్తును స్థాపించవలెనను నిర్ణయమునకు వచ్చియుండిరి. ఆ ఉద్దేశ్యముతోనే పరిషత్తు యీనాటివరకు కృషిసల్పుచున్నది.

1950 నవంబరులో మహారాష్ట్ర కర్నాటక సాహితీసంస్థల సహకారముతో పరిషత్తు హైదరాబాదునగరములో సంస్కృతీసంగమోత్సవములను జరిపినది. రాష్ట్రములోని మూడు ప్రాంతీయభాషల సమ్మేళనము గంగాయమునాసరస్వతీనదుల త్రివేణీ సంగమాన్ని స్ఫురింప చేసినది. అఖిలభారత సంస్కృతీ మహాసభ 1951 మార్చి నెలలో ఢిల్లీలో

జరిగినది. పరిషత్తు కార్యదర్శి ఆసభలో పాల్గొన్నారు. పరిషత్తు అధ్యక్షు కార్యదర్శులు, అఖిలభారత సంస్కృతిసంగమోత్సవసభకు వ్యవస్థాపకసభ్యులుగా ఎన్నుకోబడిరి. ఈ యేడుకూడ ఆ సంస్కృతీ ఉత్సవాలు హైదరాబాదులో జరుపబడినవి. వాటిలో పరిషత్తుకూడ ముఖ్యభాగస్వామిగా పాల్గొన్నది.

హైద్రాబాదు కళాశాలల ఆంధ్రాభ్యుదయోత్సవములు జరుగుటకు పరిషత్తు యథాశక్తి ప్రోత్సాహము నొసగినది. ఉస్మానియావిశ్వవిద్యాలయములో ఆంధ్రాభ్యుదయోత్సవములు తొలిసారిగా జరుగుటలో పరిషత్తు భాగస్వామి అని చెప్పిన అతిశయోక్తి కాజాలదు.

ఆంధ్ర రాయలసీమ నాయకులు హైద్రాబాదు విచ్చేసినప్పుడు వారికి యిక్కడివారితో పరిచయము కలుగుటకు, ఆయ పరిచయగోష్ఠులను పరిషత్తు ఏర్పాటుచేసినది సాహిత్యసాంస్కృతిక సంస్థలద్వారాఆంధ్రుల సమైక్యతకు పరిషత్తు కృషిచేస్తూ వచ్చినది.

పండితసభలు-కవిసన్మానములు:- పరిషత్తురాష్ట్రములో అనేక సారస్వత సభలు జరిపి ఉత్తమకవి పండితుల నాహ్వానించి, సన్మానమొనర్చినది. అందు ముఖ్యముగా శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీముని మాణిక్యం నరసింహారావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతం, శ్రీ నేలటూరి వేంకటరమణయ్య, శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రి, శ్రీ తిల్లావఝ్ఝల శివశంకరస్వామి, శ్రీ డా॥ లంకా సుందరం మొదలగు ప్రముఖుల నాహ్వానించి వారిద్వారా సాహిత్య, చారిత్రక, వైజ్ఞానికోపన్యాసములను ఇప్పించనైనది. లక్ష్మణరాయపరిశోధకమండలికార్యకలాపాలను పరిషత్తు పునరుజ్జీవింపజేసినది. తెలంగాణ రచయితల సంఘస్థాపనకు దోహదము కావించినది. ఇంతేగాక పరిషత్తు తెలంగాణములో నూతన గ్రంథాలయములను స్థాపించుటకును, శిథిలమైపోయిన గ్రంథనిలయములను పునరుద్ధరించుటకును కృషి సల్పినది. పల్లెటూళ్ళలోని ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల స్థాపనకు పల్లెప్రజానీకానికి ప్రభుత్వంవారి విద్యాశాఖద్వారా సహాయమొనర్చగలిగినది.

లలితకళలు:- పరిషత్తు వార్షికోత్సవముల సందర్భమున లలితకళల ప్రదర్శనములు, ఉపన్యాసములు యేర్పాటుచేసి, నృత్యగాన కళాసాహిత్యములను గురించి హైద్రాబాదాంధ్రులకు చక్కని పరిచయమును గలుగజేయుటకై కృషిసల్పినది. 1952 అక్టోబరు నెలలో శ్రీ నటరాజ రామకృష్ణగారిని ఆహ్వానించి పరిషత్తు ఆధ్వర్యాన హైద్రాబాదునగరమందు పలుచోట్ల నాట్యకళాప్రదర్శనములు తత్సంబంధమైన ఉపన్యాసములు జరిపించడమైనది.

పరిషత్తునకు గల 198 శాఖలలో అనేకశాఖలు పరిషత్తు కేంద్రసంస్థవలెనే ప్రతిసంవత్సరమును, వార్షికోత్సవములు జరుపుచు ఆయా ప్రాంత ప్రజానీకమునకు ఉత్సాహమును, కార్యకర్తల సేవాసక్తిని పెంపొందించుటకు కృషి సల్పినవి. అందు ముఖ్యముగా, ఓరుగల్లు, నిజామాబాదు, బాపట్ల, ఆలూరు, బొంబాయి, ఇభరామపట్నం మున్నగునవి పేర్కొనదగినవి.

బొంబాయి శాఖను గురించి ప్రత్యేకముగా చెప్పుకొని పరిషత్తు గర్వించును. కామాటిపురం (బొంబాయి) శాఖాకార్యకర్తలు తోడివారలతో మాతృభాషాసక్తి కలుగజేయుటకు సారస్వతోత్సవాలు, సభలు జరుపుచున్నారు.

పుస్తకములను ప్రచురించు కార్యక్రమాన్నిగూడా కొన్నిశాఖలు నిర్వహించుచున్నవి. అందు భువనగిరి శాఖవారు "తోడు, నీడ", గానుగు పాడు శాఖ వైపున 'తెలుగు పలుకు' అను పొత్తములు ప్రచురించిరి. అలంపురంశాఖ 'షోడశ మహారాజులు' అను పుస్తకమును ప్రచురించినది.

పరిషత్తుశాఖాకార్యకర్తలు కేంద్రపరిషత్తునకు గావించిన ఈలాటి సహాయ సహకారము లెన్నో గలవు. పరిషత్తుశాఖాకార్యకర్తలతోడ్పాటు వలన ఈనాడు పరిషత్తున కింత విస్తృత స్వరూపమేర్పడినదన్న సందేహమేమియు లేదు.

పరిషత్తు 1950 నుండి 51 వరకు దాదాపు 1½ సంవత్సరములు ప్రతిఒకటి రెండుజిల్లాల కొకరి చొప్పున ప్రచారకుల నేర్పాటుచేసి వారి జీతభత్యముల భారమును వహించుచు, తెలంగాణమందంతట పల్లెపల్లెన విరివిగా సారస్వత ప్రచారము గావించినది. ఎందఱో యువక కార్యకర్తలు ఎట్టి ప్రతిఫలమున కాశించకయే భాషాసేవజేసి పరిషత్తు కార్యనిర్వహణమున కెంతో సహాయపడిరి. కాని పరిషత్తు ఈనాటివఱకు అదేవిధముగా ప్రచారకుల వ్యయభారమును వహించి అంత విరివిగా ప్రచార కార్యక్రమమును సాగించలేకపోవుచున్నది. దీనికి ముఖ్యకారణము ఆర్థికలోపమే. అయినా, పరిషత్తు ప్రస్తుత ఆర్థిక ఇబ్బందితోగూడ ఒకరిద్దరు ప్రచారకులను ఈ కార్యక్రమమునకై నియోగించియే యున్నది. ఆర్థిక సహాయ సహకారములు లభించుచో, ఎంతైనా ప్రచారమును సాగించవలెనని ఆశించుచున్నది. ఇందుకై ప్రభుత్వముయొక్క సహకార మెంతైనా అవసరము.

పరిషత్తు ఆదాయ వ్యయముల పట్టికవల్ల పరిషత్తునకు లభించిన విరాళములు తెలియగలవు. పరిషత్తునకు ఆర్థికసహాయము, సభ్యత్వమువల్ల లభించవలసి యున్నది. ఈ సందర్భమున మహబూబునగరం జిల్లావాసులు ఎక్కువగా పోషకుల సంఖ్యను పెంచినారని చెప్పవలసియున్నది.

పరిషత్తునకు సొంతభవనము లేదు. భవనము కట్టించుకొనుటకు స్థలమును కోరగా, హైదరాబాద ప్రభుత్వమువారు 1815 చదరపు గజముల స్థలము నగరమధ్యమున ఇచ్చినారు. రెండు లక్షల రూపాయలనిధి పోగుజేసి భవనమును నిర్మించవలసి యున్నది. భవన నిర్మాణమునకు నిధుల విషయమున స్వల్ప ప్రయత్నమే జరిగినది. శ్రీ వై. సత్యనారాయణ గారు రు. 500 లు ఈనిధికి ఇచ్చినారు. పరిషత్తు అభిమానులు, కార్యకర్తలు ఈవిషయమున ఎక్కువ కృషి సాగించవలసియున్నది.

పరిషత్తు కార్యనిర్వహణకు తోడ్పడిన కార్యనిర్వాహక సభ్యులకు, ఉపసంఘ సభ్యులకు, శాఖాగ్రంథాలయ కార్యకర్తలకు, మరియు ధనసహాయము నొసర్చిన ప్రభుత్వమువారికి, యితరదాతలకు, పత్రికా ప్రచారమునకై సహకరించిన పత్రికాధిపతులకు ముఖ్యముగా గోలకొండ పత్రికాధిపతులకు, ఆయా శాఖల కార్యకర్తలకు, ప్రచారకులకు, మే మెంతో కృతజ్ఞులము. వీరితోడ్పాటు సదా పరిషత్తు కార్యనిర్వహణకు లభించుచుండగలదని ఆశించుచున్నాము.

ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయ బహుమానము బడసిన శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి సన్మానసందర్భమున, 26. భాషాసంస్థలు కలిసి శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి సన్మానసభ ఏర్పాటు చేసినారు. పరిషత్తు కార్యాలయమే ఆసన్మానసంఘమునకు కార్యాలయముగా పనిచేసినది.

శ్రీ కాశీ కృష్ణమాచార్యులు, శ్రీ రాళ్ళబండి అనంతకృష్ణశర్మగారల సాహిత్యోపన్యాసములను పరిషత్తు ఏర్పాటు చేసినది.

జనసామాన్యమును అలక్ష్యము చేయుటయే మన కాంఘికపాపము. మన పతనమునకు ఇది గొప్ప సారణము.

వివేకానందస్వామి.




ప్రదర్శనములకై ఆహ్వానించుచున్న శ్రీ యం. రామప్ప




ప్రదర్శనములను ప్రారంభించుచున్న శ్రీ బూర్గుల రామకృష్ణారావు (ముఖ్యమంత్రి)

# అలంపురం ప్రదర్శనాలు



## శ్రీ. యం. రామప్ప



ఆంధ్రసారస్వత పరిషత్తు వార్షికోత్సవములను పల్లెపట్టులలో జరుపుకొనుఆచారము కొన్ని సంవత్సరాలనుండి పాటింపబడుచున్నది. గ్రామ ప్రజలకు సారస్వత వైజ్ఞానిక విషయాల యందు అభిరుచిని గలిగించి, వారిలో నూతనోత్సాహము గలుగ జేయుటయే ఇందుకు ముఖ్యకారణము. ఈ దృష్టితోనే, యీ వార్షికోత్సవాల సందర్భమున ఈసారిగూడ ప్రదర్శనాల ఏర్పాటు జరిగింది. ప్రజలకు వినోదరూపముగా విజ్ఞానము నిచ్చుట ఈ ప్రదర్శనాల ముఖ్యోద్దేశము. ఈసారి జరుగు ప్రదర్శనాలలో తెలుగుభాషా సమితి ప్రదర్శనము క్రొత్తది. ఇది మొదటిసారి అఖిల భారత సాంస్కృతిక ఉత్సవాల సందర్భమున క్రొత్త ఢిల్లీలో ఏర్పాటు చేయబడి, రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ మొదలైన పెద్దల మన్ననలందినది. కళా ప్రదర్శనమున హైదరాబాదులోని చిత్రకారుల నైపుణ్యము ప్రదర్శితమగుచున్నది. ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆదర్శాలలో కళలను ప్రోత్సహించుట కూడ చేరి యున్నది. ప్రతి సంవత్సరము చిత్రకళా ప్రదర్శనము పరిషత్తు, ఉదారులైనకళాప్రియులచే, బహుమతుల నిప్పించుచు చిత్రకారులను యథాశక్తి ఆదరించుచున్నది. పురాతత్వవస్తుశాఖాప్రదర్శనము మన రాష్ట్రము యొక్క చారిత్రకసంపదను, శిల్పనైపుణ్యమును ప్రకటించుచున్నది. వ్యవసాయప్రదర్శనము రైతులకు మార్గదర్శకముగా నున్నది. పశువైద్య ప్రదర్శనము పల్లెటూరి ప్రజలకు అవసరమైన విజ్ఞానము నిచ్చుచున్నది. కుటీర పరిశ్రమల ప్రదర్శనము మన దేశములోని శిల్పుల పనితనము నిరూపించుచు, దేశ సంపదను అభివృద్ధి చేయుటకు దారి జూపుచున్నది.

ఈనాటి వార్షికోత్సవము సందర్భమున నేను తెలుగుభాషాసమితి ప్రదర్శనము

(ప్రక్క పుటలో)

# సాంస్కృతిక ప్రదర్శనము



## శ్రీ బూర్గుల రామకృష్ణారావు

(ముఖ్యమంత్రి)

నేనిపుడు ప్రత్యేకముగా ఉపన్యసింపదలచలేదు. కాలాతీతం వల్ల అన్నిప్రదర్శనలను నాసోదరమంత్రులు అనుగ్రహంవల్ల వారికిబదులుగా నేనే ప్రారంభిస్తున్నాను.

పూజ్యులు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు గారు ప్రారంభించిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వరచనాకృషి పూర్తికాకుండానే ఆ కృషిని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు సాగించినకూడా పూర్తి చేయ లేకపోయినారు. వారుస్వర్గస్థులయిన పిమ్మట ఆభారాన్ని వహించి అచంచల దీక్షతో తెలుగు విజ్ఞానసర్వస్వమును మనకు అచిర కాలంలో అందించడానికిపాటు పడుతున్న తెలుగు భాషాసమితి వారు నాకు ప్రశంసాపాత్రులు. వారు ఏర్పాటుచేసిన యీసాంస్కృతిక ప్రదర్శనం వైజ్ఞానికంగా చాల విలువైనది. నాకీసదవకాశం కల్పించిన మిత్రులకు కృతజ్ఞుడనై యీప్రదర్శనాన్ని ఇతరప్రదర్శనలను ప్రారంభిస్తున్నాను.

(29 పుట తరువాయి)

ప్రారంభించుటకు ముఖ్యమంత్రి శ్రీబూర్గుల రామకృష్ణా రావుగారిని, చిత్రకళాదిప్రదర్శనముల ప్రారంభించుటకు ఆర్థికమంత్రి శ్రీ మేల్కోటేగారిని, అటవీశాఖా మంత్రి శ్రీకొండా వేంకటరంగారెడ్డిగారిని, కార్మికమంత్రి శ్రీ వి. బి. రాజుగారిని, ఆహారమంత్రి శ్రీ డాక్టర్ చెన్నారెడ్డిగారిని పరిషత్తుపక్షాన ఆహ్వానించుచు, దీనిని ప్రారంభించినట్లు ప్రకటించి, ప్రదర్శనశాలలకు దయచేయవలసినదని ప్రార్థించుచున్నాను.

# సాహిత్య సమీక్ష

మహాకవి

## శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రి



“దేవీంవాచ మజన యంతదేవా
స్తాంవిశ్వరూపాః పశవోవదంతి ।
సానోమంద్రేషమూర్జం దుహానా
ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు ॥”

—: ప్రస్తావన :—

పూజ్యులైనసభాసదులకు సభాధ్యక్షులకు నమోవాకములు.

ఈ మహాజనసమావేశము నుజూచుచున్నపుడు మ్మన కెన్నో మధురస్మృతులు తలంపునకు వచ్చుట సహజము. పూర్వ మప్పుడప్పుడు మన మహర్షులు విప్లవానంతరీధర్మవ్యవస్థ చేయుటకై, యే నైమిశారణ్యమునందో, యే ద్వాదశవర్ష సత్రయాగదీక్ష గాంనో యొకచోట సమావిష్టులై, ధర్మచర్చ చేయుచుండువని పురాణములందుఁ జదువుచున్నాము. ఆ మధురసన్నివేశమే యిపుడు జ్ఞప్తి వచ్చుచున్నది. ఈ యలంపుర క్షేత్రము మొన్నటిదాక ఇంచుమించు నైమిశారణ్యము వంటిదే. ఈ సభాసదులు వశిష్ఠ విశ్వామిత్రులకు శుక శౌనకాదులకు సాటి వచ్చువా రనుకొనుటలో సంభావన గలదు. ఈ నాఁడొక కట్టులేక పలుపోకలఁ బోవుచున్న యాంధ్రసాహిత్యమునకు రూపురేకలు దిద్దుకొనుటకై యీ సమావేశము చాతురాహ్నిక సారస్వత యజ్ఞముగా జరుగుచున్నదని సంభావించుట సుసంగతమే కాఁగలదు. ఈ మహాసభను ప్రారంభించుచు మీ యెదుట నిలుచున్న నాలో నిట్టి భావతరంగములు పొడమి, మీలోఁ బొంగి ప్రవహించుచున్నవని నేను తొంగిచూచుచున్నాను. నిజముగా నిది యాంధ్ర జాతికే గర్వకారణము.

కాని నిన్నటిదాఁక శిథిల జీర్ణావస్థలోనున్న యీ యలంపురి యీ నాఁడు చాళుక్య నగరముగా నలంకృతమై, కన్నులపండువు చేయుచుండుట మిక్కిలి విస్మయావహము. ఈ పడిపోయిన ప్రాకారగోపుర మండప ద్వారాదులు తమంతకు దాము లేచి నిలఁబడి యుండవుగదా! భూమిలోఁ బూడిపోయిన యపూర్వములైన యీ శిలాశాసనములు, ఈ శిలావిగ్రహములు, ఈ కళాఖండములు తమకుఁ దాముగావచ్చు యీ ప్రదర్శనశాలలోఁ

గూర్చుండియుండవుగదా! మోకాటిలోతు మిట్ట పల్లములైన యీ త్రోవలన్నియు రాచబాటలెట్లైనవి? ఈ సభాభవనములు ఈ యాహార విహార వసతి శాలలన్నియు సర్వోపస్కారములతో విచిత్రాలంకరణములతో నెట్లెందగించినవి? ఒకవేళ నుదాగుల హృదయము కొంత, ధనవంతుల చేయికొంత, నాయకుల పలుకుబడి కొంత, యధికారుల యాదరము కొంత యిందు సాయపడియుండవచ్చును. కాని యంతమాత్రము చాలదు. ఇచ్చటనున్న - ఈ ప్రాంతములందున్న - అభిమాన పూర్ణములైన యెన్ని హృదయములో యెన్ని కాళ్లుచేతులో - కడకెన్ని బండ్లు నెద్దులు పరికరములో - యెన్ని నేయుంబవళ్లో స్వార్థరహితమైన త్యాగసేవా దీక్షలతోఁ బనిచేసియుండవలెను. కాని, యీ ప్రజా హృదయములో నీ నూతనోత్సాహశక్తి యెట్లువచ్చినది? అందునను, కొన్ని శతాబ్దముల తరిబడిగా సునీతి వలె ధ్రువునివలెఁ బెంపకమునందిన యీ తెలంగాణపుఁ బ్రజాహృదయములలో నీ జవసత్త్వములెట్లు పుట్టివచ్చినవి? ఇంతేగాదు, నాలుగు దిక్కుల నుండి సముద్రములవంటి యీ సంచిత [illegible]కాంధులు - ఈ రాష్ట్రప్రభుత్వము - కడసుఁ గేంద్ర ప్రభుత్వము కూడ నీ సారస్వత పరిషన్మహోత్సవములను దయనించు హృదయములతో నుద్ధరించి యాశీర్వదించుట కెమి తాదరముతో నెట్లు దిగివచ్చినవి? ఇది యేదో అద్భుతసంఘటన! దైవ విలాసము!! సూటిగాఁ జెప్పవలసి వచ్చినచో నీ యన్నింటికిఁ బ్రాతినిధ్యము వహించి, సగ్రాంతరముల సర్వశక్తులు వినియోగించి. కొన్ని యేండ్లుగా నిరంతరకృషి చేసిన హైదరాబాదాంధ్ర సారస్వత పరిషత్తు యొక్క చిరతపః పరిపాకమే యిది యనవలెను.

ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలంగాణముననే గాక యావదాంధ్రమునఁ జేయుచున్న సారస్వతసేవ యపారము. మానవ జీవితరంగములన్నిటిలో విద్యుత్ప్రసారమున శుద్ధజ్యోతులతో సాహిత్య దీప మింటింట వెలిగించి, విజ్ఞాన వికాసములతో మానవ జీవితము సుభిక్షముఁ జేయుచుఁ, బరిషత్తు తనపేరు చరితార్థముఁ జేసికొనుచున్నది. అది సంకల్పించిన యీ నాలుగు దినముల కార్యక్రమము తిలకించినచో దాని యంతరంగ మెంత విశాలాశయపరిపూర్ణమో, దాని కార్యరంగ మెంత విపుల కర్తవ్యతా విస్తీర్ణమో గోచరింపగలదు. దాదాపు పదేండ్లనుండి యీ సారస్వతసేవ నిర్వహింపుచు, ఈ నాఁడీ యలంపుర క్షేత్రమున సప్తమవార్షికోత్సవము జరుపుకొనుచుండుట పరమామోదావహము. ఈ మహోత్సవములో సాహిత్యశాఖా సమావేశమును బ్రారంభించు నవకాశము నావంతున వచ్చినందులకు నాభాగ్యమును - ఇచ్చినందులకు పరిషత్కార్యకర్తలను అభినందించుచున్నాను.

## —: అలంపుర క్షేత్రము :—

ఈ యలంపురము దక్షిణకైలాసమగు శ్రీశైల క్షేత్రమునకు పశ్చిమదిగ్ద్వారమందురు. దీనికి దక్షిణ కాశియను ప్రసిద్ధి పేరునకుమాత్రము వచ్చినది కాదు. కాశీ క్షేత్రమునకు దీనికిఁ బోలికలెన్నియో నిండుగాఁ గలవు. ఉభయ క్షేత్రములఁ బ్రధాన దేవతలొక్కరేయగుటను, పేరులు మాత్రము వారు విశాలాక్షీ విశ్వేశ్వరులు - వీరు జోగుళాంబా బాల బ్రహ్మేశ్వరులు. అది పావనమైన గంగా తీరము. ఇదియే "గంగా సంగ మిచ్చగించునె, మదిఁ గావేరి దేవేరిగా నంగీకారము జేయునే, యమునతో నానందముఁ బొందునే గంగతుంగ తరంగ హస్తముల నారిత్నాక చంద్రుండు నీ యంగం బంటి సుఖించునే నిను గుణాభద్రా! తుంగభద్రా నదీ!" అని మన రామకృష్ణకవి ప్రశంసించిన తుంగా తీరము. సరి 'వరుణ - అసి' నదుల మధ్యభాగము ఇది వేదవతీ నాదవతీ నదుల నడిమి నేల. దాని సమీపమున గంగా యమునలు సంగమించుచున్నవి ఇచ్చట కృష్ణా తుంగ భద్రలు కలియుచున్నవి. ఇఁక డుంఠిగణేశ కాల భైరవాది పరివార ప్రమథ గణములు, అయ్యవది నాలుగు ఘట్టములు, తీర్థములు, కోటిలింగములు, మున్నగా సర్వోపస్కారములు నందు నిందు సమముగాఁ గలవు. కాని ఆ విశాలాక్షీ కంటె నీ జోగుళాంబ సాక్షాదాదిమ శక్తి, ఉగ్రరూపిణి, భక్తులకుఁ బ్రత్యక్షదైవము. ఆ విశ్వే

శ్వరుఁడు దేహాంతర భోగమోక్షప్రదుఁడు. ఈ బాలబ్రహ్మేశ్వరుఁడు ఇచ్చటనే భోగ మోక్ష విభూతులను సృష్టించియిచ్చు సాక్షాద్బ్రహ్మ. మఱియు నిచ్చట విశేషమేమనఁగా: కాశియందు లేని రేణుకా పరశురామ ప్రభూత ప్రభావముచే నీ యలంపురము దివ్యతపోభూమియై, భాస్కర క్షేత్రప్రతీతిగన్నది. ఇంతేగాదు, కాశియందేగాక, భూలోకమునందే దేవాలయ విగ్రహములు - పూజా పురస్కారములు లేని సృష్టికర్తలగు నవబ్రహ్మల కిచ్చట గుళ్లు గోపురములు పూజా పురశ్చర్యలు వెలసినవి. మఱియొక యద్భుత విశేషమేమనఁగా: ప్రళయ శక్తులైన జోగుళాంబా రేణుకా పరశురాము మూర్తులతోఁ బాటు సృష్టిస్థితి కర్తలైన బాలబ్రహ్మేశ్వర నవబ్రహ్మ లొక్కచోట వెలయుటతో నీ క్షేత్రము దుష్టశక్తుల ప్రళయానంతరము శిష్ట పుష్ట ప్రపంచసృష్టి స్థితులకు ఏకస్థానమైనదా యన్నట్లు ఆధ్యాత్మిక వైశిష్ట్యములు గలిగించును.

దీని పౌరాణిక ప్రతిష్ఠయుఁ జారిత్రిక ప్రసిద్ధియు క్షేత్రమాహాత్మ్యము నా యా గ్రంథములయందే గాక యిచ్చట వెలసిన యనేక శిలాశాసనములయందుఁ గూడఁ జదువఁగలము___శిథిలప్రాయములైన యిచ్చటి ప్రాకార గోపుర దేవాలయ మండప శిలావిగ్రహ జీర్ణఖండములయందు సాక్షాత్తుగా జూడఁగలము. ___అప్పటి పెద్దలనుండి కర్ణోపదేశముగనున్న యిప్పటి వృద్ధులవలన సవిశేషముగ వినఁగలము. ఇప్పటికిని, ఈ క్షేత్రమునందును పరిసరములందును లభించు అశోకాదుల - శాతవాహనుల - బాదామీ చాళుక్యుల - తైలపుల - బిజ్జల సోమదేవాదుల - కాకతీయుల - విజయనగరసార్వభౌముల - బహమనీ ప్రభుత్వముల పరిపాలనోపభోగ చిహ్నములును, బౌద్ధ - జైన - వీరశైవ - వైదిక - మహమ్మదీయ మతముల వివిధవిహార విక్రాంతి చిహ్నములును, వీరవ్రణకిణాంకములవలె - భూషణస్థానములఁ బొలిచిన మచ్చలవలె వెలిగిపోనివై దీని ప్రాచీనతను దెలుపుచున్నవి. ఇంతేగాదు ఒకనాఁడు ఒకదానితో నొకటి తీవ్రముగాఁ బ్రతిఘటించిన యివన్నియు నీనాఁడు ఈ గుడిలో మసీదువలె నొకదాని యొద్ద నొకటి యొద్దికతోఁ గూర్చుండి సామరస్యసందేశము నిచ్చుచున్నవో - కాలప్రభావ మిట్టిదని బోధించుచున్నవో యన్నట్లున్నవి.

## —: వీర క్షేత్రము :—

మన మిట్లు యొకటి రెండడుగులు ముందునకేగి యిటునటు చూచినచో, ఈ కృష్ణాతుంగభద్రా తీరభూము లిరువైపు నొకప్పుడు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రము. పవిత్ర భారతి ధర్మరక్షణమునకై నడుముగట్టి, శస్త్రములెత్తి యీ సరిహద్దుల మోహరించి, మహావీరయోధాగ్రయోధు లెందఱో తారసిల్లి యుద్ధ వీరవిహారముచేసిరి. భారతయుద్ధమును మించిన యీ మహాసంగ్రామరంగములలోఁ ద్యాగమూర్తు లెందఱో మాతృదేశ ధర్మరక్షణమునకై యాత్మబలిదానమిచ్చి, శిరఃపద్మములు త్రుంచి మాతృభూమికి వీరపూజగావించిరి. వారి కవోష్ణ రక్తధారాప్లావితమై యీ నేలయంతయుఁ గాశ్మీర కర్దమ కేదారమువలె రక్తరాగరంజితమైనది. ఆ వీరయోధులు రుధిరవసంతము లాడుటతో రక్తారుణఖడ్గములు కడుగుటతో ఆనాఁడీ కృష్ణవేణమ్మయు నీ తుంగభద్రమ్మయు గుండెలు ప్రీలెనా యన్నట్లు రక్తస్రోతస్సులనే ప్రవహింపఁజేసినవి. దీర్ఘమైన కాలమా యన్నింటిని దేర్చినదికాని, ఆ వీరయోధు లిప్పటికిని గండశిలలై, మొగములు గంటువాఱఁ గూర్చున్నారా యన్నట్లు ఎదుటఁగనఁబడుచుందురు. నిశ్శబ్దమైన యర్ధరాత్రమునఁ జెవియొగ్గినచో నా వీరహుంకారము లిప్పటికిని వినఁబడుచున్నట్లుండును. ఆ మహామహులచేతనామూర్తు లిప్పటికిని మనచుట్టు వాతావరణమునఁ దిరుగుచున్నవా యనిపించును. ఆ నెత్తురుచాఱలు మాసిపోయినను, ఆ భూములలోఁ బండినపంట తినుచున్నాము గనుక, ఆ నీరు త్రాగుచున్నాము గనుక, ఆ గాలి పీల్చుచున్నాము గనుక మనలో నీయుద్రేకోత్సాహము లిప్పటికినిట్లు పొంగి పారాడుచున్నవి. ఈ నాఁడీ సారస్వత పరిషత్సమావేశములో నిట్లు కూర్చుండఁ గల్గుటకూడ వారు మన కిచ్చిపోయిన ప్రాణార్పణ

భిక్షాఫలముగాక మరేమున్నది? ఆ ధన్యజీవులకు జోహారులు !!

—:విద్యాక్షేత్రము:—

ఈ ప్రసంగముతో నిది వీరక్షేత్రమే కాని విద్యాక్షేత్రము కాదనుకోరాదు. అలంపురము ప్రాచీన విద్యా గురుకులములలో నొకటి. ఇచ్చటను ఈ ప్రాంతములయందును వెలసిన విద్యాకేంద్రములు విశ్రుతులైన విద్వత్కవులు - వెలువడిన గ్రంధరాజములు సంఖ్యాతీతములు. ప్రాచీన పండితులట్లుండఁగా, మొనమొన్నదాఁక మన కన్నుల యెదుటఁ బాగాడిన పండిత దిగ్దంతి, అష్టభాషా కవీశ్వరుఁడు, ఈ క్షేత్రము నుద్ధరించిన పుణ్యపురుషుఁడు, పరమాన స్వామి ప్రౌఢసరస్వతి - అదుగో ఆ బాల బ్రహ్మేశ్వరుని యెదురుగా శాశ్వత సమాధిలో యోగనిష్ఠుఁడై యున్నాఁడు. సర్వథా వారికిఁ గుడిచేయనఁ దగిన చతుస్తంత్రవేత్త, ఘంటాశతశ్లోక సంధాత, శ్రీ శ్రీనివాసాచార్య బాలసరస్వతి యీ సమీపమున నాత్మకూరు సంస్థానమున లబ్ధప్రతిష్ఠులు. తత్తుల్యులు శ్రీ వెల్లాల సదాశివశాస్త్రి, అలుకూరు మల్లికార్జునశాస్త్రి, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి ప్రభృతులు నుద్దండకవి పండితులు. వారివారి విద్యా వీర విహారముల నీ ప్రాంతములందలి పెద్దలందఱెఱుఁగుదురు. తరతరములుగాఁ దమ యాస్థానములు శారదా మండపములు చేసి, విద్వత్కవి బృందములఁ బోషించి బహూకరించి, శరదుత్సవములలో, వసంతోత్సవములలో శాస్త్రపరీక్షలతో సాహిత్య చర్చలతోఁ గావ్యగానములతో భారతీ కల్యాణోత్సవములు జరుపుచు. భాషోద్ధరణ దీక్షా బద్ధకంకణములైన గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, జటప్రోలు మున్నగు సంస్థానముల సారస్వత సేవా సౌరభ్యము తెలుఁగునేల నాల్గుచెరగుల నెల్ల పరిమళించుచున్నవో రసికలోకమెఱుఁగనిది కాదు. కార్య విస్తారముతోఁ గాకున్నను హృదయ వైశాల్యముతో నింతటి దొడ్డవారై, సారస్వతారాధనము సంతత వ్రతముగా ననుష్ఠించు నుదారులు జమీందారులు మొఖాసాదారులు రెడ్డిరాజులు భూస్వాములు మున్నగా సంపన్న గృహస్థులెందఱో యీ ప్రాంతముల వెలసినారు. వీరి యాదరాభిమానములతో, స్వయముద్భవమైన సాహిత్యాభిరుచితో భాషాసేవకు నడుముకట్టిన విద్యాసంస్థలు - పరిషత్తులు, సంఘములు, గ్రంథాలయములు, గ్రంథమాలలు పత్రికలు మొదలుగా సారస్వతోద్యమ శాఖలెన్నియో తెలంగాణమున నిండుగ మల్లెతోఁట విచ్చినట్లు పరిమళించుచున్నవి. ఈ వైభవమునంతయు నాకళించుకొని యనుభూతి పొంది సమగ్ర సారస్వతారాధనమునకై యవతరించినదే యీ యాంధ్ర సారస్వత పరిషత్తు.

ఇది యీనాఁడీ క్షేత్రమున సారస్వతోత్సవములు జరుపుట కేవలము యాదృచ్ఛికమనలేము - విశాలాశయగర్భితము. లౌకికాలౌకిక మహత్త్వ సంపన్నమైన యీ క్షేత్రము దీని పరిసర ప్రభావముల పలుకుబడియు సారస్వతోద్యమమున నూతన చైతన్యము నిండింపఁగలవనియు, నిచ్చటి నవబ్రహ్మలతోడి బాలబ్రహ్మేశ్వరుఁడు నవ్యసాహిత్య నిర్మాణమున సృష్టికౌశలము ప్రసాదింపఁగలఁడను శుభాకాంక్షయు నిందును దోహదమిచ్చిన దనవలెను. ఇంతకంటె ముఖ్యమైన యింకొక భావమునుగూడ నిందు సంభావింపవచ్చును. ఈ పవిత్రక్షేత్ర మటు నిటు పూర్వపశ్చిమోత్తరాంధ్రములతో రాయలసీమతోడి తెలంగాణముతో విస్తరిల్లిన విశాలాంధ్రమునకుఁ గూడలియై కుండలిస్థానమై నడిబొడ్డునఁ దరి యున్నది. ఈచోట నీ సారస్వతపరిషత్సభావేదిక నమర్చినచో సువిశాలాంధ్ర భారతీదేవి తన యధిదేవతా ప్రత్యధిదేవతలతో సంగప్రత్యంగముగా వరణ పరివార దేవతాబృందముతో నిండు నిండుకొలువై యాంధ్ర మహాసాహిత్యమునకు రూపురేకలు తీర్చికొని, యందచందములు దిద్దికొని జీవకళలతో నాత్మవర్చస్సును సముజ్జ్వలము చేయు సమారంభము సమగ్రముగా జరుగఁగలదనియే దాని యాకాంక్ష. ఇది యెంత విశాలమో యంత యౌచితీమహితము. ఈ మహా కార్యనిర్వహణమునకు వలయు సంగబల మర్థబల మాత్మబలముకూడ నాంధ్ర సారస్వత పరిషత్తునకే గలదన్నచో - ఆ యదృష్టముకూడ

డాని వంతునకే వచ్చినదన్నచో మీ రందఱు హర్షామోదములు ప్రకటింతురనియే నా విశ్వాసము:

## —:అనుకూలకాలము:—

దీనితోఁబాటు సమయముకూడ నిందు కనుకూలమై చల్లని గాలి వీచుచున్నది. ఇది సప్తమ వైవస్వత మన్వంతరముగదా - సరిగా నిప్పుడిది సప్తమ వార్షికోత్సవము. ప్రభవాదివత్సరములలోఁ బ్రమాద విక్రమవ్యయాదులవంటివి కొన్ని పోఁగా, 'సర్వజిత్తు' వచ్చుటతో భారతజాతి సర్వము జయించి స్వాతంత్ర్యముచేతఁ బట్టినది. ఆంధ్రజాతి కీనడుమ 'విరోధి' 'వికృతి' 'ఖర' వ్యవస్థలు తప్పకున్నను, నిన్నఁటి, యుగాదితో 'నందన' యారంభమై, రేపటి యుగాదికి రాష్ట్రావతరణముతో నాంధ్రజాతి యుజ్జ్వల భవిష్యత్తున కేమరు నడుచుచున్నది. ఎదురుగనే 'విజయ' 'జయ' ములు సుస్వాగత మిచ్చుచున్నవి. ఇకఁ గొన్ని గడియలలో రెండుమూఁడడుగులలో మనమొక మహా సంక్రాంతిని - కొన్ని శతాబ్దులుగా లేని నూతన సంక్రాంతిని - అందుకొనుచున్నాము. ఆ మహా భోగమున కీనాఁడు భోగిపండుగ. ఈ రేయి చివరి యంచులలో నదిగో యుషస్సు నూతన చైతన్య విలసితమై విచ్చుచున్నది. ఉత్తరాయణ బాలార్కుని నవ్య జవసత్త్వ ప్రభా పాటలములైన యరుణకిరణరేఖలు ప్రాచీముఖ మండలమునఁ దొలిసారిగా నిఁక జూడఁగలము. ఒకటి రెండు సంక్రాంతులలోఁ గారాకులతోఁ బాటు కర్మములన్నియు దుల్లపోయి, నవ వసంత లక్ష్మి యావదాంధ్రముఁ జిగిరించి పుష్పించి పరిమళించి ఫలింపఁగలదు. ఆ మహాభ్యుదయమును సమగ్రముగాఁ దీర్చుకొని సవ్యముగా ననుభవించుట కిప్పుడాంధ్రజాతియంతయు సంబుద్ధము సన్నద్ధము సుసంస్కృతము కావలెను. అందుకు వలయు శ్రద్ధా మేధా ప్రజ్ఞాపాటవములతో మన సంస్కృతిశీల సామగ్రినంతయు హృదయము నిండునట్లుగా మెదడు పండునట్లుగా మన సాహిత్యము మనకు సృష్టించి యీయవలెను. ఈ యాభ్యుదయిక కార్యారంభమున నీ మహా సంకల్పమున దేశ కాలము లిట్లు కీర్తించి, పరిషదనుమోదముతో నిఁక స్వస్తివాచనమున కుపక్రమింతును. అదిగో జోగుళాంబా పరిష్వంగ మంగళ సుఖితుఁడైన బాల బ్రహ్మేశ్వరుఁడు మనల నాశీర్వదించుచున్నాఁడు. తుంగభద్రా స్రవంతీ తరంగహస్తోపలాలిత మలయ మారుతార్ఘ్యకులనంపి మనలఁ బరామర్శించుచున్నది. ఈ మంగళారంభములో మహా సంరంభములో మన మాలిన్యములు తుంగలోఁ ద్రొక్కి, మన శ్రేయములు భద్రిలోఁ దేర్చుకొని మన యాంధ్రసాహితీ సమారాధనమున నిఁక విందులు చేసికొందము:

## -: సాహితీ సింహావలోకనము :-

ఈ మహోత్సవమునఁ బ్రథమతః మనసాహిత్య వైభవమును సంస్మరించుట సముచితోపక్రమమే కాఁగలదు. కాని, దాని సర్వాంగ సౌందర్యము సాకల్యముగ దర్శించుట కిప్పుడు కాలము చాలదు. ఆంధ్రసాహిత్యమున కెప్పుడు పురుడు పోసిరో సూటిగఁ జెప్పునాకరము లిప్పటికి దొరకలేదు. "మహిమన్, వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు తన్మహనీయ స్థితి మూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహామహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ బహుళాంధ్రోక్తి మయప్రపంచమునఁ దత్తాప్రిగల్భ్య మూహించెదన్"— అను నిట్టి ప్రశంసలవలన నన్నయభట్టారకుని భారతావతరణముతో నాంధ్రసాహిత్యము మొదలయ్యెనని యూహింపవచ్చును. మహాభారతము కంటె ముందెంతో సాహిత్యములేనిచో భారతమువంటి యుద్గ్రంథము పుట్టిరాదు. అదంతయు నూహా చిత్రము. దానికై పరిశోధన జరుగుచున్నది. అంతవరకు భారతమే మనసాహిత్యమునకుఁ బ్రథమ జ్యోతిగా నంగీకరింతము. ఆ దినములలో, చాళుక్య, కాకతీయ, విజయనగర సామ్రాజ్యములు, రెడ్డి రాజుల - వెలమదొరల రాచకొలువులు, చంద్రగిరి - మధుర - తంజాపురి మొదలుగ సామంత

రాజ్యము లాంధ్రసాహిత్యోత్సవాలకుఁ జలువ పందిళ్లు పెట్టి పచ్చతోరణాలు కట్టినవి. శైవ వైష్ణవ దేవాలయమండపములు, జైనబౌద్ధ విహారములు, గురుకులములు, గృహస్థభవనాంగణములు, కుటీరము లెన్నో సాహిత్య స్నాతకుల సమ్మర్దముతో నుక్కిరి బిక్కిరైనవి. తెలుఁగు మాగాణము నాలుగంచుల సాహితీకల్ప లతలు పందిళ్లు ప్రాఁకి పరిమళించినవి. వానినుండియే యితిహాస పురాణ ప్రబంధములు మొదలుగాఁ బద్యసాహిత్యము - యక్షగానము జంగముసుద్దులు వీధి నాటకములు మొదలుగా గేయసాహిత్యము రసగుళుచ్ఛములుగా నవతరించినవి. ఆ యన్నింటిలో నాంధ్రుల ప్రాభవ వైభవములు త్యాగభోగములు పౌరుష పరాక్రమములు మున్నుగా జాతీయ గుణసంపద యంతయు వెల్లివిరిసినది. ఈ వైభవమంతయు జూచియా నాఁడు తెలుఁగుగడ్డయే యుప్పొంగిపోయినది. ఈ సుదీర్ఘ కాలగతిలోఁ బ్రాతసామ్రాజ్యములు పడిపోవుచుండఁగాఁ గ్రొత్తవి తలయెత్తుచునేయుండినవి. మత యుద్ధముల సందడిలో శాంతిసూక్తులు వినబడుచునే యుండినవి. ఒక వైపు భోగలాలసత యింకొకవైపున నాధ్యాత్మిక చింతన, నాచలికముతోఁ బాటు [illegible]ము, నీచవర్తనము వెంట నీతిబోధనము, - ఇదంతెయు నొకదాని వెంటనొకటియో, యొకదానితోఁగూడ మఱొక్కటియో సినిమాచిత్రమునందు వలె సాహిత్యమున ముద్రితములైనవి. ఇన్నిదశా పరిణామములందును నాంధ్రజాతి మాత్రము తన నిజాయతిని సంస్కృతి సంప్రదాయముల మరువ లేదు. సరిగదా - యిదంతయు మహోజ్వలమైన సాహిత్యోద్యమముగా నున్నత శిఖరములందు కొనుటకై పోటీపడుచున్నట్లుగా ముందుకు సాగిపోయినది. ఒకవైపు కృతి సమర్పణములు - కనకాభిషేకములు - గండపెండేరములు - గజోత్సవములు నడుచుచుండఁగా, నింకొకవైపు "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి" యనియు, "గాడిద నీవునుఁ గవివిగావు గదా యనుమానమయ్యెడిన్" యనియు, "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే గదా" యనియు నీసడింపులు వినఁబడుచునేయుండినవి. కమ్మనినుడి కారములతో జాను తెనుఁగుఁ బూలతోఁటలు విచ్చుచుండఁగా, నభేద్య సంస్కృత పదసమాసఘటిత కవిత్వ దుర్గములు కట్టఁబడుచునేయుండినవి. ఏమైనను, కాలగతిలోని యీ నిమ్నోన్నతములలో నంతటను ఆంధ్రజనావళి మోద మందుటకే సాహిత్యము నడిచినది. అంతట నవిచ్ఛిన్నముగా నాంధ్ర జాతీయ సంస్కృతి సంప్రదాయములే ప్రవహించినవి.

-:చీఁకటి రాత్రులు - ప్రభాతము:-

విజయనగర సామ్రాజ్య పతనముతోఁ గృష్ణపక్షము ప్రారంభమై, నాయకరాజుల యాస్థానములలోఁ జిరుఁగువెన్నెలలు కాయుచుఁ, బందొమ్మిదవ శతాబ్దము ప్రొద్దువ్రాలు నప్పటికమవస గడియలు వచ్చినట్లైనవి. అవి చీఁకటి రాత్రులు. ఆ యింట నాయింట సాహిత్య దీపము వెలుఁగక పోలేదు. కాని యది పరిమితము. అప్పుడాంధ్ర జగత్తు నిద్రాముద్రితమో స్వప్న సంకులితమో యాయి నట్లున్నది. ఆ స్థితిని నాగ్య కారణములతోఁ జర్చించుటకంటెఁ గాల పరిణతి యనుట స్వాభావిక మగును. ఆ కాల పరిణామము చేతనే యిరువదవ శతాబ్దారంభమున వేకువై ప్రొద్దు పొడిచినది. ఈ ప్రొద్దుపొడుపులో నొక క్రొత్తదన మొక విలక్షణత కనఁబడినది. అది పాశ్చాత్య సాహిత్య ప్రభావము. ఆ సంకుల స్వప్నమునుండి కన్నుదెరచిన జాతికి తొలుపటి యెండ పొలపు లాప్యాయనము లగుటలో వింతయుండదు గదా ఆ ప్రభాతము నుండియే మన జీవిత విధానములో సాహితీ నిర్మాణములో నధ్యయ నాధ్యాపనములలో నెన్నో మార్పులు వచ్చినవి. దీనితోఁ బ్రాచ్య పాశ్చాత్య సంస్కృతులకుఁ దీవ్ర సంఘర్షణ యేర్పడినది. ఇందుఁ బాశ్చాత్య సాహిత్య సంస్కృతులు ప్రభుత్వబలము చేతనే 'పై చేయి' యగుటకాదు వానిలోని కొన్నిసొగసులు వెలుఁగులు కూడ మనల నాకర్షించినవి. అప్పటికే మనలోఁ జేరుకొన్న కొన్ని దురభ్యాసములు కూడఁ దత్రాప

బల్యమునకుఁ గారణము కాకపోలేదు. తత్ఫలితముగా మన సంఘమునందన్ని జీవితరంగములందు వలెనే సాహిత్యమునఁగూడ నెన్నో మార్పులు వచ్చినవి. ఈ దిద్దుబాటులోఁ గొందరు పెద్దలు మతకర్తలై సంఘ సంస్కర్తలై సాహిత్య స్రష్టలై ముందుకువచ్చినారు. వారి సంస్కార ప్రచారములతో మేల్కొన్న చైతన్యమంతయు సాహిత్యమునఁ బ్రతిబింబించినది. ధీరులు కొందరు తాము నమ్మిన సత్యప్రచారమునకై కొన్ని సాహిత్యోద్యమములే నడిపినారు. కాల్పనికోద్యమము జాతీయోద్యమము మానవోద్యమము ప్రాణాయుణోద్యమము మొదలైనవన్నియుఁ దత్ఫలితములే. ఇంతలో స్వాతంత్ర్యోద్యమము వచ్చుటతో రాజకీయ చైతన్యము విజాతీయ సాహిత్యోద్యమములు మఱియుఁ బ్రబలినవి. ఆంధ్రసాహిత్య కుటుంబ మిట్లు కొమ్మలతో రెమ్మలతో విరివిగా పెరిగి చూచుటకెంతో వింత గొలుపుచున్నది.

## —:నేటి సాహిత్యము:---

ఇప్పటి మన రచయితలలో షడ్దర్శనీ పారంగతు లున్నారు. రసాలంకారధ్వని వేత్తలున్నారు. భాషాచరిత్రల పుట్టుక పూర్వోత్తరములాకళించిన వారున్నారు, భారతసౌభాగ్యము గౌరీశంకర శిఖరముల కెత్తఁగల దేశనాయకులు - అతిరథ మహారథులున్నారు. ప్రాక్తనాధునాతన సాహితీ పద్ధతులను, ప్రాచీప్రతీచీ విజ్ఞాన రహస్యముల నవలోడించి కవితాసృష్టి చేయు మహామహులున్నారు. వీరందఱి నిరంతర పరిశ్రమతో రకరకములైన రచనలు వివిధ సాహితీ ప్రతిరూపములు రమ్యాకృతులతో విలసిల్లినవి. ఒకవైపు భారత భాగవత రామాయణాదులు క్రొత్త విన్యాసములతో వచ్చుచుండఁగా, మఱొకవైపు చారిత్రక జాతీయ వీరగాథలు మహాకావ్యములుగా నవతరించినవి. కావ్యవిస్తరము కాలాతీతమో కాలాసహనమో యన్నట్లు ఖండకావ్యములు, భావగీతములు, ముక్తకములు, దశకములు, శతకములు మొదలగు వివిధ పరిణామములతో మఱికొన్ని రచనలు విస్తరిల్లినవి. ఈ పద్యసాహిత్యముతో సరిగ్గా నెక్కటకై గద్యరచన ముందడుగు వేసినది. వచనకావ్యములు, నవలలు, నవలికలొకవైపు తీఁగసాగుచుండఁగాఁ గథలు, వ్యాసము, లుపన్యాసములు, విమర్శనములు, వింతలు, వినోదములు కుంపటిమల్లెలై గుబాళించినవి. గద్యసాహిత్యమునకు మఱొక వన్నె వేయుచు నాటక సాహిత్యము రంగమెక్కినది. దృశ్యములు, శ్రావ్యములుగ - నాటకము నాటిక ఏకాంకిక బహురూపకము, రేడియో నాటకము, ఇత్యాది రచనలు గజ్జె కట్టినవి. ప్రత్యేక సంస్థలే గాక రేడియో కేంద్రముల వారుకూడ రచనకుఁ బ్రదర్శనమునకుఁ బోటీ పందెములు పెట్టి వీనిని ముందుకుఁ దీయుచున్నారు. వీనికిఁ దీసిపోక పద-గేయ జానపద సాహిత్యములు బారలుసాచి వచ్చుచున్నవి. ఈ యన్నింటి రూపములు భావములు నడకలు నానాముఖములు నన్నియుఁ గ్రొత్తలే. వాని యన్నింటికి నామకరణములు జరిగి, మన నిత్య జీవితమున మెఱిగి, పూర్వ గేయముల స్థానము నవి యలంకరింపవలసియున్నది. బాలసాహిత్యము స్త్రీల సాహిత్యము కథా సాహిత్యము సినిమా సాహిత్యమువంటి నూతనోద్యమములు శైశవము దాఁటి లలిత పద విన్యాసములతో ముందుకు నడుచుచున్నవి. ఇవన్నియు మన సాహితీరంగమునకుఁ గ్రొత్తవన్నెలు సంతరించుచున్నవి. ప్రత్యేక వ్యక్తులు సమితులు సంస్థలు రేడియో కేంద్రములు పత్రికలు ప్రభుత్వముకూడ శతవిధాల సాహిత్య దోహదము చేయుచున్నవి. సభలు, సన్మానములు, బహూకృతులు, కృతిసమర్పణములు, ఆస్థానకవి ప్రతిష్ఠాపనములు - ఈ మహోత్సవమంతయు నిత్యకల్యాణముగా నెగడుచున్నది. ఇంత సాహితీ ప్రోత్సాహ మింత వికాసము మున్నెన్నఁడు జరుగలేదేమో యనిపించుచున్నది.

## -:నేటిరచనలు-వాని భావసంస్కారము:-

రకరకములైన యీ రచనలన్నియుఁ జదువు నపుడు మిక్కిలి వింతగనుండును. ప్రతియొకటియుఁ

క్రొత్త పోకడలతో వింతనడకలతో విభిన్నలక్ష్యములతో నలంకరింపఁబడి యుండును. ప్రతియొక దానిలో నొక తేజఃకణ, మొకమరందబిందువు వెలయుచునే యుండును. ఈయన్నింటివైపు కనువిచ్చి చూచినచో నవి యాకాశమున నక్షత్రమండలము వలె భూమియందలి యుద్యానవనవాటికవలె వాని యునికినిబట్టి గాని మన యంతస్సునుబట్టిగాని క్రమాంతరమునఁ గనఁబడుచుండును. వాని వన్నెచిన్నెలకు మన మెంత మెచ్చుకొనుచుందుమో యందలి గుణదోషములనుగూడ నంత సహజముగనే తడవికొందుము.

ఈ సాహితీరూపములలోఁ గావ్యవాఙ్మయమే విస్తారము. కావ్య నిర్మాణమున భాషాసామగ్రియు భావసామగ్రియుఁ బ్రధానములు. వీని కూర్పుతీర్పులలో ముఖ్య విన్యాసములెన్నియో కలవు. వానిలో ఛందో వ్యాకరణాదులు రసాలంకార ధ్వనివిశేషాదులు కైశిక్యాది వృత్తులు వైదర్భ్యాది రీతులు మున్నగా నుపస్కార పరికర సామగ్రియంతయు మానవ సృష్టికిఁ దుల్యముగా నింపుఁ జేరఁగలవు. ఈ యన్నింటితో సర్వాలంకారశోభితమై వెలయవలసినది కావ్యవస్తువు. కావ్యమునంతటఁ బరిమళించి ఫలింపవలసినది కావ్యప్రయోజనము. ఇది కవి భావసంస్కారమును బట్టియు నుద్దేశమునుబట్టియు నుండును.

కావ్యప్రయోజనము రసానుభూతియనియు, ఆత్మానందమనియు, విశ్వశ్రేయమనియు వేరువేరుగా సింగడించువారున్నారు. రసానుభూతి లేక యాత్మానంద మెట్లు కలుగునో, దాని ప్రతిఫలనముగా విశ్వశ్రేయ మెట్లు కలుగకపోవునో పెద్దలు వివేకింపవలసిన విషయము. ఈ రసానుభూతియు నాత్మానందము తమవే తమకొఱకే యని కొందఱి భావము. ఇది విచార్యము. రసానుభూతిఁ బొందుటయందుఁ గవికివలెనే పాఠకునకును సమానభాగము కలదు. ఇంతేగాదు, లోఁతులుచూచి నిజ మాలోచించినచో నది పాఠకునియందే మిక్కిలిగా ఫలింపవలసియుండుట సంప్రదాయమునకు ననుభవమునకు దూరముగాదు. రసానుభూతి యెచ్చటినుండియో దిగివచ్చునదికాదు. అది యాత్మనిష్ఠము. మానవుని హృదయమున ముందు మెలఁగినవో, జన్మాంతరమునుండి వచ్చినవో యగు ననుభూతు లప్పటి కణఁగి యుండి, కావ్యోపపాదితములైన సదృశానుభూతులతో విభావాదులతో మఱల నుప్పొంగి భావనాసుభగములై పొరాడఁగా, నా మాధుర్యము నెమరువేయుచుఁ దనిసిపోవుటే రసానుభూతి. అది మఱియు నుజ్జ్వలమై తన్మయత్వమందుటే యాత్మానందము. ఇది భావుకుల కందఱికి నేకాంత మధురమైన సమాన భోగము. దీని సత్కారములలోఁ బొదిగి యందిచ్చువాఁడే కవి. తన యానందమే యతని యుద్దేశమైనచో నది ముందే సిద్ధించెనుగదా! ఇఁక రచన యెందుకు? ఇచ్చటనే కవి విశిష్టుఁడు. ఆయన ధర్మము మిగుల గొప్పది. కనుకనే యాతని వాగ్విభూతిని గూర్చి, "నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం, నవరసరుచిరాం నిర్మితిమాదధతీ భారతీ కవేర్జయతి"- అని పెద్దలు ప్రశంసించియున్నారు. ఇట్టికవి నా రచన నా యానందముకొఱకే యనుకొనునా? అట్లనుకొనుట మానవ హృదయమునునే-భాగవత ధర్మమునే కించపఱచినట్లుగాదా? ఒకవేళఁ దనకొఱకే తానలంకరించుకొనుచున్నాఁడనుకొందము, అప్పుడుగూడఁ దన యలంకారము నద్దమునఁ జూచువరకుఁ దృప్తిపడఁడుగదా? అయినప్పుడు తన రచనా సౌందర్యమునకుమాత్ర మద్దమును గోరఁడా? ఆ యద్దముగా లోకముగాక మఱేమున్నది? ఆ లోకమునకుఁ దన రచనా మాధుర్య మందకపోవుటెట్లు? కోయిలవలెఁ బాడుకొందుమని కొందఱనుకొందురు. కోయిల పాటకు దాని యానందముగాని లోకానందముగాని యుద్దేశముగాదు. అది స్వాభావికము. కవి కోయిలవంటి యొక ప్రాణిమాత్రము గాఁడు. అతని రచనకొక యుద్దేశముకూడ లేకపోలేదు. తన యానందముకొఱకే పాడుకొన్నను వినువారిని వద్దనఁడుగదా? వద్దన్నను లోకమునకు వినఁబడక పోదుగదా? ఎట్లును లోకము వినుచున్నది గనుక, కవి మానవులలో నుత్తముఁడు గనుకఁ గోయిలవలెఁ బ్రియముగనే గాక హితముగఁగూడఁ బాడుట మంచిది.

లేనవలన నపచారము జరుగకుండఁ జూచుట మిక్కిలి మంచిది. ఇట్టివిగాక తక్కిన రచనలన్నియు నేదో యొక మార్గమున విశ్వశ్రేయము నుద్దేశించి నడిచినవే యనవచ్చును.

ఇందునను పెక్కుతెరగతులరచనలు గలవు. వీనిలోఁ గొన్ని మానవుని నైహిక జీవితమును తుచ్ఛ పఱచి, యాముష్మిక సంపత్తి కాయత్తపఱచు భావములను వర్ణించును. అవిఁ మానవుఁడు తన సర్వస్వము దైవపరము చేసిభక్తిప్రపత్తులతో దైవ తత్పరుఁడై నిలిచిపోవుట మంచి, దని చెప్పును. లేక, యిహజీవితమున రోఁతపుట్టించి, సుఖదుఃఖ ములకే కాదు లోకమునకే దూరము చేసి, మానవు లకేదో కేవలత్వము చూపును. ఈ రెంటిని భక్తి జ్ఞానమార్గము లందురు. భారతధర్మమును బట్టియివి యుత్తమ రచనలు. కాని, యిందునఁగూడఁ గొంత పర్యాలోచింప వలసియున్నది. పైభావములు మాన వుని సంస్కృతి శీల ప్రవృత్తులఁ బెంచినంతవఱకు యోగ్యములే - యావశ్యకములే యగును. అట్లు హృదయము పండిన మానవుఁడు ఇహజీవితము సన్న్యసించి లోకమునకు దూరమగుటయో - దైవ పరుఁడై తానొకఁడే మోక్షమునందఁ గోరుటయో లోకములోని సామాన్య ప్రజకుఁదీరని నష్టముకాదా? 'నా ప్రజలతోఁ గూడ నన్ను స్వర్గమునకుఁ దీసికొని పొమ్మని హరిశ్చంద్రునిచేఁ బలికించిన మనసాహిత్య మీ భావములఁ గూర్చియేమనును? 'ఆశ్రమా దాశ్రమ'ముగా లోకారాధన చేయుచు ముందుకుఁ బొమ్మని బోధించు మనయార్ష ధర్మము దీని కొప్పఁదల యూఁపునా? దైవము లేదనుటగాని, జ్ఞానముకా దనుటగాని యందలి యుద్దేశముకాదు. మనసాహిత్య మిట్టి భావాలతో హృదయము పండించి, మానవుఁ డాత్మోన్నతితో లోకకల్యాణము వైపు మరలు నట్లు చేయుట మంచిది కాని, నిష్క్రియత్వ నిస్త బ్ధత్వాదులతో నిలచిపోవునట్లు చేయుట శ్రేయస్సా ధనమనలేము.

ఇఁక మఱికొన్ని రచనలిట్లుండును. అవి యగో చరమైన దైవము ననుభవమునకు రాని యాముష్మి కమును విశ్వసింపవు. మానవున కన్నవస్త్రముల కొఱఁత తీరినమీఁదటనే యన్ని సౌభాగ్యములు. వానిని సాధించుటే ప్రయోజకత్వము. మనసాహిత్య మిట్టి ప్రబోధము చేయుటే యావశ్యకము' - ఇట్టి భావములతో నారచనలు నడుచును. వీనిలోఁ గొంత నిజము లేకపోలేదు. తాఁజేయవలసిన దానిని దైవము పై వేయుట యోగ్యముగాదు. ఐహికము విడిచి యాముష్మికమునే నమ్ముకొనుట యంద గనుసరింప లేనిమార్గమే యగును. అన్నవస్త్రాలు దొరకని జీవి తము దుర్భరమగుటయుఁ జూచుచున్నాము. కవి యిట్టి భావాలతో మానవ సాధారణ జీవితమును సహజముగఁ జిత్రించుచున్నాఁ డనవచ్చును. కాని, యిదే పరమార్థమనుటయు, ఎట్లు నడచినదైన దీని సాధించుకొనుటకే ప్రయత్నింపవలెననుటయు భారత సాహిత్యమునకుఁ బరి 'తముకానిమార్గము. దీనిని గూడ సాహిత్యమన్నచో సాహిత్యములో భౌతిక పదార్థములనే పరిగణించి గనుకోవలెను. సాహి త్యము సంస్కృతిశీలములఁ బెంచి శ్రేయోమార్గము చూపునుగాని, సాక్షాత్తుగా నన్నవస్త్రాదులనమర్చి పెట్టలేదు. అందుకొఱ కెన్నియో వృత్తులున్నవి. ఆ వృత్తులయందుఁగూడ వివేకము మాధుర్యము నిండించుటే సాహిత్యము చేయుచున్నపని. ఆఁకలి తీర్చుకొనుటయందుఁ గూడ నౌచిత్యమెఱుఁగు మాన వత్వమునుగవి పోషించుట మంచిది.

మఱికొన్ని రచనలు మనము చదువుచున్నాము. వాని భావములు సాధారణముగ నిట్లుండును. "సంఘమునందలి కట్టుబాట్లు మూఢ విశ్వాసమును బెంచి మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యముల నరికట్టు చున్నవి. మతములు దేవునికేదో రూపకల్పన చేసి యాడంబరము చూపి స్వార్థము పెంచి సంఘమును బలహీనము చేయుచున్నవి. వర్ణాశ్రమాచారవ్యవస్థ లేనాఁడో యెందుకో కల్పింపఁ బడినవి. ఈనాఁడవి నిరుపయోగములే గాక యభివృద్ధి నిరోధకములు. వేదశాస్త్రములు నియమబంధములు. ఇతిహాస పురా ణము లభూతకల్పనలు. కావ్య ప్రబంధములు రాజుల స్తుతిపాఠములు" - ఇత్యాదిగా నీనాఁటి సంఘ జీవితమునఁ దోఁచిన లోపములను విమర్శించు భావములవి. వీనిలో నపోహములు సత్యాభాస

ములతోఁబాటు యథార్థములుగూడఁ గొన్ని గలవు. ఈ సాంఘికాచారాది వ్యవస్థలు మన కెన్నియో తరములనుండి వచ్చినవి కావున నీ సుదీర్ఘ కాల ప్రయాణములో నానా వ్యక్తులు పరిస్థితులు కారణముగా వీనిలోఁ గొన్ని చెడుగులు చేరి పేరుకొనుట యెంత సహజమో వీని నేర్పరుచుటయందుఁగూడఁ గొన్ని మహోద్దేశములుండుట యంతసత్యము. వానిని గుర్తించుట మన కర్తవ్యము. బాహ్యదృష్టికిఁ గనఁబడనివన్నియు లేవనుకొనుట పొరపాటే గాదు ప్రమాదకరము. నిజమునకు మానవునిలో నతని పరిసర పరిస్థితులలో నతని జీవితవిధానములో మన కంటికిఁ గనఁబడనిభాగమే యెక్కువ. దానిని గుర్తించి, దానివలన మానవత్వము క్రమముగా వికసించుటకును ఆత్మశక్తి సముజ్జ్వలముగాఁ బెంపొందుటకును గొన్ని పద్ధతులు విధించుటే సంఘ నియమముల యుద్దేశమనవచ్చును. ఈనాఁటి విజ్ఞాన శాస్త్రపరిశోధనలు, దేశీయ విదేశీయ వైద్య విద్యావిధానములు, నవియని నిబంధనలు విధినిషేధములుగూడ నిందలి యథార్థమునేగాక యావశ్యకతనుగూడ నిరూపించుచున్నవి. సంఘ నియమములకు వేరులేని యీ విధి నిషేధములన్నిటిని మనమిప్పు డనుసరించుచునే యున్నాము. కనుకనే మానవుఁడు సంఘముతోఁ గలిసి జీవించువాఁడైనపుడాతని కితరులవలనను, ఆతనివలన నితరులకు నెట్టి కీడు కలుగకుండుటకై కొన్ని సాంఘిక నియమములు కావలసియుండును. వ్యక్తి-కుటుంబము-సంఘము-జాతి యను నంతరములు సంఘమునఁ గలవు. అన్నిటికిని స్వాతంత్ర్యము గలదు. కాని పైవాని స్వాతంత్ర్యమున వెనుకటివాని స్వాతంత్ర్యము కుంటుపడుచునే యుండును. ఇది తగదని త్రోసివేయుటెట్లు? ఏవో కొన్ని కట్టుబాట్లు కల్పించుకొనక వానిని సరిదిద్దుకొనుటెట్లు? దేవుఁడున్నాఁడా లేఁడా యను వాదము చిరకాలమునుండి వచ్చుచున్నదే. కాని, పెక్కు సిద్ధాంతములవలనఁ బెద్దల యనుభవమువలన మన యధికారము మించినదాని నిప్పటికి దైవముపై వేయుచుండుటవలన మానవాతీతమైన దైవశక్తి యొకటి కలదని గుర్తించుచున్నాము గనుక, తత్ఫలములు గొన్ని యనుభవించుచున్నాము గనుక నట్టి దైవమునారాధించుటయు, నా విధానము బోధించు మతమేదో యొకటి యావశ్యకమగుటయు నపరిహార్యము లగుచున్నవి. వివిధ దశావస్థాంతరక్రమములలో నున్న మానవులకు-వారివారి జీవితాశయసిద్ధికి-అందటికిఁ గ్రమశిక్షణవ్యవస్థ-వర్ణాశ్రమాచారవిధ గాకున్న నట్టిది మఱొక్కటియైన - నుండక తప్పదు. భారతీయేతర జాతులందుఁగూడ దీనివంటి దేదో యొక వ్యవస్థ యిప్పటికిని లేకపోలేదు. పై విధానసంధానములన్నియు బోధించుటకొక వాఙ్మయము ఒక సాహిత్యము వేదశాస్త్ర పురాణములవంటిది. మనకుండవలెను. అందున్నవి బాగులేదన్నచో నంతకంటె మేలైనవి చూపుటయే సమర్థులు చేయవలసిన పని. ఇంతవఱకు జరుగుచువచ్చినవికూడ నింతే. తెలియనిది తెలిసికోవచ్చును. మంచి దాని ననుసరింపవచ్చును. పేరులు మార్చుకోవచ్చును. గుణములు పెంచి, యనుష్ఠానమునకు ననుభవమునకు యోగ్యముగా నే నూతన నిర్మాణమునైనఁ జేసికోవచ్చును. మన రచనలట్టిమార్గము నన్వేషించుట యుక్తముగాని యీ వ్యవస్థలే వద్దనుట యాభ్యుదయికము కాఁజాలదు.

ప్రేమారాధనము జాతీయత స్వాతంత్ర్యము సమత్వము ఇట్టి భావములతోఁ గొన్ని రచనలు విస్తరిల్లియున్నవి. ఇవన్నియు నుత్తమ భావములే. వీని యంతర్మధువు హృదయమునఁ బక్వమగుట భాగ్యమే యనవచ్చును. కాని కొన్ని రచనలలో వీని స్వరూప స్వభావములే పొడకట్టినట్లు కనఁబడదు. వివేచనా పక్వములుగాని వీని నెట్లనుభవింపఁగలము? మధురమైన యొక యాకృతినో భావమునో చూచునపుడును భావించునపుడును దాని సౌందర్యమునకు మన హృదయము ముగ్ధమై స్నిగ్ధమగును. అది ప్రేమావిర్భావము. భావగోచరమగు నా విషయమొక ప్రకృతిదృశ్యమో యీశ్వర విభూతియో వ్యక్తి రామణీయకమో యేదైనఁ గావచ్చును. దాని సౌందర్యమును దలఁచితలఁచి తనిసి తన్మయత్వమందుటే యచ్చమైన ప్రేమారాధనము. దానిపై భోగాభిలాష తొంగిచూచినచో నది సవ్యాజమై యారా

ధనాపూజ్యతను బోఁగొట్టుకొనును. ఆ భోగాభిలాషయు ధర్మేతరమైనచో దానికిఁ బ్రేమపదవాచ్యతయే జారిపోవును. కవి హృదయమున నీ సత్యము గోచరింపనిచోఁ బాఠక హృదయమున నంధకారమే రాజ్యముచేయును. ఇట్లే జాతీయపదమునుగూర్చి కూడ మనము విచారింపవలెను. సంస్కృతసాహిత్యమున జాతిపదమొకటి యింతవరకు వాడుకలో నున్నది. అది కులవర్ణ వర్గభేదములఁ దెలుపును. ఇటీవల 'నేషన్' అను నాంగ్లేయపదమునకుఁ బర్యాయముగా జాతిపదమొకటి వచ్చినది. ఉచ్చారణలో నొకటిగా వినఁబడినను ఈ రెంటి హృదయములు ప్రయోజనములు వేరు. మొదటిది వ్యవహార దశయందు మానవజాతిలో భేదపరిగణన మంగీకరించుచుఁ గ్రమముగా భావపరిపాక పరమార్గములందు మానవజాత్యభేదమునే గాక ప్రాణిజాత్యభేదమునుగూడ సాధింపవలెననుచున్నది. రెండవది యొక దేశప్రజలలోనే భేదములైన నెట్టి వ్యవహారమునందైనఁ దుడిచివేయవలెననుచున్నది. చివరకు రెంటిలక్ష్య మొకటేయైనను, అనుష్ఠానమున వీనిస్రోతలు భిన్నములు. మొదటిదాని మార్గములో నొప్పులనుకొన్న వట్లుండుఁగాక-తప్పనుకొన్న భేదభావములైన రెండవది తొలఁగించుకొన్నదాయని చూడవలెను. భారతజాతి యన్నపుడు భారతేతరజాతులు భిన్నములే గదా? భారతజాతిలో నాంధ్ర కర్ణాటక ద్రావిడాది జాతివ్యవహారభేదమెట్లు తొలఁగును? ఈ యవాంతరజాతులలోఁ బ్రతియొకదాని యందును ప్రాంతీయభేదములు, కార్మిక కర్షకాది భేదములు, 'ఇజము'లపేరి భేదములు, రాజకీయ పక్షభేదములు మున్నుగాఁ బెక్కులు శాఖోపశాఖలై నిత్యజీవిత వ్యవహారమున నెదురుపడుచున్నవిగదా? ఇవి లేవనుటెట్లు? ఉండరాదనుటెట్లు? ఉండకుండఁజేయుటెట్లు?

సమత్వమను భావముగూడ నించుమించు దీని వంటిదే యనవచ్చును. సమత్వమనఁగా సమానస్థితి. ఇదియు దొడ్డభావమే, కాని వస్తుగతమై యున్నంత వరకు భౌతికజీవితమున నీ సమానస్థితి యసాధ్యమే యనవచ్చును. ప్రకృతియందే సహజముగా నెంతో యసమానతయున్నది. మానవులలో వారి జీవిత విధానములలో-అవయవములలో వానిప్రయోజనములలో వాని నుపయోగించుకొనుటయందుఁ గూడ నెంతో యసమానస్థితిగలదు. ఈ యన్నింటిలో నంతరంగ బహిరంగభేదములు కుడియెడమ యలవాట్లు విధగా గుర్తించుటేగాదు—అనుద్దిష్టముగానే యలవాటైపోయినది. నానాంతరగతమైన యీ విభిన్నతచేతనే ప్రకృతియు మానవజీవితము కూడ సుందరము మధురము భోగ్యము నగుచున్నది. ఈ విధముగా విశ్వరూపముదాల్చిన ప్రకృతి సహజమైన యసమానస్థితిని దొలఁగించుటెట్లు ?

కొందఱు సంఘము కల్పించిన యసమానత్వమును దొలఁగింపవలె నందురు. మంచిదే. సంఘమొక శరీరమైనపు డాశరీరము తనకొన్ని యవయవములను హీనపఱచుననుట వట్టి యారోపణమే యగును. అట్లు గాకున్న, నసమానత్వమును గల్పించు సంఘమొకటియు ననుభవించు సంఘమొకటియు నున్నదనవలెను. ఇది నిజమైనచో నీయసమానస్థితి సంఘకల్పితముగాక, శీతోష్ణ సుఖదుఃఖ దివారాత్రాదిక ద్వంద్వములవంటిదై. యొకదాని నొకటి తఱుముచుఁ గాలమువెంటఁ జక్రమువలె నడుచుచున్నదనవలెను. బలవంతులు గొందఱీస్థితినిగల్పింతురన్నచో వస్తులలోపమేయగును, ఆవ్యస్తులవలె వారికార్యములపలెనే ఈ తొలఁగింపవలెనను వారియూహలుప్రయత్నములుగూడఁ దరంగములవలె నెప్పటికప్పుడు పుట్టుచుఁగిట్టుచుఁ దీరమువైపు నడుచుచు నేయుండును. దీనికంత మేమున్నది? ప్రతియొక వ్యక్తియుఁ దానితరులతో సమానుఁడుగా నధికుఁడుగా నుండవలెననియే కోరును. కాని యందఱట్లు కాలేకపోవుచున్నారు. సృష్టించిన యీశ్వరుఁడు గూడనట్లు చేయలేక పోవుచున్నాఁడు. వస్తుగతమై యున్నంత వరకీయసమానత తొలఁగింపరానిదే యనిపించును. ప్రకృతియ మొక్కటిదక్కఁ దక్కినదేదియు నీయసమానత్వముఁ దొలగించి సమత్వము సాధింపలే దనవచ్చును. కావుననే వస్తుగతములైన యసమాన భిన్నస్థితులనుగాక భావగతములైన అట్టి దృష్టులను జక్కఁబఱచి సామరస్యము సంపాదించుటకే సాహి

త్వము పనిచేయవలసియున్నది. అందుకుదగిన సంస్కారము శిక్షణము ప్రవర్తనము మన కలవడవలసియున్నది. మనరచయిత లీయనుభూతిపొంది నానాత్వమున నేకత్వమును, అసమానతనుండి సమభావమును సాధించులక్ష్యముతో రచనలుచేయుట శుభోదర్కము కాఁగలదు.

స్వాతంత్ర్యమునుగూర్చి కూడనిట్టి భావభేదమే కనఁబడుచున్నది. స్వాతంత్ర్య మనఁగా స్వేచ్ఛాప్రవృత్తి యనుకోరాదు. అది బహిఃప్రవృత్తమైన యాత్మప్రకాశము. ఆత్మయనఁగా సత్యధర్మ స్వరూపమైన లోపలివెలుఁగు. దానినే యిచ్చట 'స్వ' శబ్దము చెప్పుచున్నది. తంత్రమనఁగా నుభయార్థ సాధకమైన యితికర్తవ్యత. ఆ సత్యధర్మ ప్రమాణముతో నితికర్తవ్యతా జ్ఞానముతో నుభయార్థ సాధకముగా ముందుకునడుచు నాత్మీయ స్వచ్ఛంద ప్రవృత్తియే స్వాతంత్ర్యము. అదియేచోటనైననేపరిస్థితియందైన నప్రతిహతముగా నడువఁగలదు. ఇదిగుర్తింపలేక నేను స్వతంత్రుఁడ ననుట వట్టియహంకారము. ఈయహంకారముతో సంఘమున నాయిష్టము వచ్చినట్లు నడిచెదననుట ప్రమాదభరితము. ప్రతియొక వ్యక్తియు నిట్టి స్వాతంత్ర్యమునే నడుపఁ బూనినచో సంక్షోభము పుట్టకమానదు. ఈ యుగము నందఱికంటెఁ గవి మిక్కిలిగా గుర్తింపవలెను. ఉద్రిక్త పరిస్థితులలో నుద్వేజక భావములలో నంతట నచంచలముగా నిలువఁగల స్థితప్రజ్ఞతయు, నర్థ్యముగా సమన్వయించి చెప్పఁగల ప్రతిభా ప్రశాంతులు నాతని కమరి యుండవలెను.

మఱికొన్ని రచనలలో భావోద్రేకము ప్రధానముగాఁ గనఁబడును. వర్ణించు విషయమేదైనను, ఆ విషయమున కప్పటి పరిస్థితినిగూర్చి యసంతృప్తియు, నదియెంతో యుజ్జ్వలము కావలెనను నాకాంక్షయు, దానిని సాధించుటకై సాహసత్యాగములు, నవి పండినచో భావాంబరవిహారము, పండకపోయినచోఁ బాతాళమునఁ బడిపోవుట-ఇట్టి యావేగోద్వేగములు బుగ్గలుపుట్టి పొంగిపొరలునట్లుగా నా రచనలు నడుచుచుండును. అవి మానవహృదయములోని భావావేశమును సహజముగా వర్ణించుచున్నవి. అంతేగాక, ఆ హృదయములందుఁ గావ్యప్రయోజనమువిత్తుట కనువుగా వానిని సంస్కరించుచున్నవనవచ్చును. అయినను, ఆ భావావేశముతో పొంగుచుండుటగాని, యుత్పథ దుష్పథప్రవృత్తులకు దారితీయుటగాని వాంఛనీయముకాదు. మోటారు నడుపుటకై యింజనులో నావిరి పొంగించితి మనుకొందము. ముందుకు నడువక అవియట్లే పొంగుచున్నచో పెట్రోలును గాల్చివేయును. లక్ష్యశుద్ధిలేక నడుపు నేర్పులేక ముందుకుఁబోయినచోఁ గారులోనివారికి నితరులకుఁగూడఁ బ్రమాదముచేకూరును. ఆవేశము పొందుటమానవులకేగాదు ప్రాణులన్నింటికి సహజమే. దానిని హద్దులలోనిలిపి, సవ్యముగా నడిపి తత్ఫలమందుటయందే మానవుని విశిష్టతకలదు. అది కవియందు మిక్కిలి సముజ్జ్వలము కావలెను.

నేఁటి రచనలలో నిట్టి విలక్షణవిన్యాసములు పెక్కుచదువఁగలము. ఇవన్నియుఁ దమతమ దృక్పథమువెంట విశ్వశ్రేయము నుద్దేశించినవే యగును. వీనిలో గుణములవెంట దోషములు నుండకపోవు. అయినను వీనిభావములు మానవజీవితమున నెంతవరకు సంభావ్యములో యెట్లు సాధ్యములో, సాహిత్యమున నవియెట్లు ప్రతిఫలింపవలెనో పరిశీలించుకొనుట సాహితీస్రష్టల ప్రథమకర్తవ్యము. ఈ యుగసంధిలోఁ బ్రధానముగా రెండుభావములొకదాని నొకటి యెదురుతాకుచున్నట్లున్నవి నేఁటివరకు ననుశ్రుతముగావచ్చిన ప్రాచీనసాహిత్య సంప్రదాయము తన పూర్వప్రతిష్ఠతోఁ బట్టుసడలక బిగువు చూపుచున్నది. నూతనసాహిత్య మిప్పటి సర్వస్వమును గ్రొత్తమూసలోఁ గరఁగిపోవలె ననుచున్నది. ఎప్పటికైన నీరెండు నొకదానితో నొకటికలిసి యొకదానినొకటి యనుసరింపక తీరదైనను, సనాతనమైన యాత్మచైతన్యము నిత్యనూతనమై సంస్కృతమైన ప్రకృతి సౌందర్యములో వికసించి పరిమళించుట యత్యంత సహజమై యనుభవసిద్ధమైనను, ఈ సంధానముజరుగు నంతవరకుఁ, బెండ్లికై తరలివచ్చిన వధూవరుల యెదుర్కోలులో నెవరు ముందు ముందుకునడువవలెనను పట్టింపులు మాత్రము నిలిచియున్నట్లున్నవి. ఈ వాగర్థముల

సంధానము పార్వతీ పరమేశ్వరుల దాంపత్యమను కొన్నచో నీయంతరమునఁ గాముదహనానంతర తపశ్చర్యలు ఫలించి, బ్రహ్మాదుల రాయబారములతోఁ బార్వతీకల్యాణము జరుగవలెను. తరువాతఁ గుమార సంభవముతో నవ్యసాహిత్యసృష్టి యారంభమగును. దీనికై మనము సన్నద్ధులము కావలసి యున్నది.

-: నేఁటిరచనలు - భాషాసంస్కారము-

భాషాసామగ్రినిగూర్చియు పెక్కు భిన్నాభిప్రాయములుగలవు. తత్సమ దేశ్యాదికచర్చ, ఆర్యద్రావిడ కుటుంబకలహము, ఛందోవ్యాకరణాది నియమమీమాంస, కావ్యములరూపులోఁ గొలతలో జ్ఞాపునకొకవింత, ఇవి మొదలుగా ననేకరీతుల వాదోపవాదములు ప్రబలినవి, కొన్ని పరిషత్తులు పత్రికలు ప్రత్యేకవ్యక్తులుకూడ సత్యాన్వేషణము చేయుచున్నారు. తమతమ సిద్ధాంతములకై వారువారు పోరాడుచున్నట్లున్నను, అది సత్యసిద్ధాంతములకై సమష్టివ్యవసాయముగ రూపొందుచున్నది. ఈ మహాప్రయత్నమున నొకసమన్వయదృష్టి ఇంకను బ్రస్ఫుటముకాలేదు. భాష మనభావములను దెలుపుటకు మన వ్యవహారమునడుపుటకు సాధనమే యైనను దానినుండి ప్రకృతిసౌందర్యము నీశ్వరమహత్త్వమును మానవునియుదాత్తతను జూచి చదివి భావించి యానందించుచున్నాము. ఆ లౌకికాలౌకికానందములన్నియు మనకన్నులయెదుట నక్షరరూపములై బంతులుతీరి పరిమళించుచున్నవి. మనకే కాదు మన యనంతరమువారికిఁగూడ నీ బువ్వపుబంతులు సాగఁగలవు. వ్యవహారమాత్ర పర్యవసన్నమగు భాషకీ నిలుకడయెట్లు? దేశకాల పరిస్థితులఁబట్టిప్రాంతీయ విజాతీయ సాంకేతికాది పద ప్రయోగములఁజేరిగి భాష విస్తరిల్లుచున్నది, దీనిని జీవద్భాషయనుచున్నాము. ఈ భాష సంప్రదాయాలతో సంస్కారోపస్కారములతోఁ గావ్యరూపమున వెలసి శాశ్వతజీవద్భాషయై మహాసాహిత్యమగుచున్నది. భాష యొకకుటుంబమనుకొన్నచోఁ దొక్కుపలుకుల శిశువు మొదలు దొడ్డపండితుఁడైన యింటిపెద్దవఱకు నీకుటుంబజీవనమున నుందురు. ఇందలి పిన్నపెద్దలైన స్త్రీపురుషులైన అందఱిపలుకుబళ్లు మనమువిందుము. ముచ్చటపడుదుము. వినోదింతుము సంస్కరింతుము. సలహాలిచ్చి పుచ్చుకొందుము శిరమునఁ బెట్టికొందుము. ఇందులో నుండనిదేది? ఉండఁగూడనిదేది? మొగ్గ, పూవు, పింద, కాయ, దోర, పండు వీనిలో దేనిని బాగు లేదనగలము? ఆ యా సందర్భములఁబట్టి యంతస్తును బట్టి యన్నిటిని వాడుకొనుచునే యున్నాము. కాని కుటుంబ క్షేమమును బరిపాకపరిణతి నుద్దేశించి పెత్తనమునకొకవిలువను పండుకొకగుణమును గాదన లేము. అట్లే సాహిత్యమున భాషయుఁ గేవల జీవిత వ్యవహారమునకంటె విశిష్టఫలమున కుద్దేశింపఁబడినపుడు తదనుగుణమైన సంస్కారము పొందియుండవలెనంట యధికోక్తి కాదు. కొందఱు మనభాష చాలచిన్నదనియు నేనాలుగైదు వందలో తప్పఁ దక్కినపదములన్నియు సంస్కృతమునుండి యితర భాషలనుండి యెరవుతెచ్చి కొన్నవేయనియుఁ, గావున నేభాషాపదములనైన స్వేచ్ఛగ వాడుకొనవలెననియుఁ గోరుచున్నారు. నిజమే. ఈ మాటకు వచ్చిన మొదట నన్ని భాషలుకూడ నింతే. మాతృభాష యనిపించుకొన్న సంస్కృతముకూడ మొదటఁ బరిమితమే. ఓంకారమునుండి ప్రపంచము పెరుగుటతో నదియుపెరిగి విశ్వరూపముఁ దాల్చినది. ఏ దౌర్భాగ్యముచేతనో యీనాఁటి ప్రపంచమునకది దూరమగుటతో దానిపెరుగుదల యంతటితో నిలిచినట్లున్నది. కానిచో మనతెలుఁగుకూడ నింకెంత పెరిగియుండునో! ఏమైనను ఆ తల్లికంటెఁ దక్కిన పిల్లలకంటె నీ తెలుఁగుబిడ్డ లలితమధురాకృతియనుట పక్షపాతప్రేరితముకాదు. అలఁతియలఁతి విరుపులతో నజంతోచ్చారణతో నాలుకనంటీయంటక హృదయమును బుడికి పుచ్చుకొను మెలఁకువ తెలుఁగు పలుకుబడికే దక్కినదనవచ్చును. కొన్ని సూక్ష్మభావములను సూటిగ నందించుటలోఁ దెలుఁగు పలుకున కున్న ఒరపు మెరపులు తక్కినవానికి లేవేమోయనిపించును. ఇట్టితెలుఁగునువిడిచి దేని కొఱకో ప్రాకులాడుటెందులకు? ఇప్పటికున్న తెలుఁగు చాలనిచో నేఁటికిని తెలుఁగునాట నూరూర నింటింట నానోటనానోట జీవకళతోఁ

భారాడు తెలుఁగుపదాలను పలుకుబళ్లను నానుళ్లను సామెతలను ఏరికొనితెచ్చి యుచితసంస్కార వినిమయములతో జీవముఁబోసి తెలుఁగునకింత యాత్మవర్చస్సుకలదా యనిపించవలసిన బాధ్యత మనపై యున్నది. అప్రయత్నముసాగినచో మనతెలుఁగునకుఁ బిదపతనముండదనియే చెప్పవచ్చును. సంస్కృతచ్ఛందోవ్యా మోహముతో ప్రబంధాల పలుకుబడి తోదేశిరచన గేయసాహిత్యము కుంటుపడినదని కొందఱందురు. ఇదియొకపక్షపుమాట. చరిత్రను బరిశీలించినపుడు ఇదిసత్యముకాదని తోఁచును. నన్నయ నాఁటినుండియు నొకప్రక్క పురాణప్రబంధ కావ్యములు పెరుగుచుండగా, మరొకవైపు యక్షగానములు, ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, చందమామసుద్దులు, జంగమసుద్దులు, వెన్నెలపదములు, విగాళిపదములు, తుమ్మెదపదములు, గొబ్బిపదములు, అల్లోనేరెళ్లు, బుష్పపుబంతులు, తలుపుతీతలు, మేలుకొలుపులు, ఇంకను దేశిరచనలెన్నో బారలుసాచి నాలుగుమూలల నల్లుకొనిపోయినవి. ఇంతేకాదు. లక్ష్యమువెంట లక్షణము - పుట్టినవెంటనే పారాడుటయు నేర్చుకొని యవిచ్ఛిన్నముగాఁ బ్రజలనిత్య జీవితమునఁ బాలు పంచుకొన్నవి. ఈ నాఁడివియన్నియు లేకపోవుటే గాదు, వానిపేరుత్తుటకే బిడియపడుచున్నాము. దేశిరచనకై యారాటము వెల్లడించుచు, నవ్యానుకరణమేదోచేసి ఇది జాతీయత యనుకొనుచున్నాము, నిజమైన దేశిరచనలుద్ధరించి - అట్టి రచనల నంతకంటె మేలైన దేశిరచనలు మనమెన్నో సృష్టించుకొనవలసి యున్నది, మననిత్యజీవితమున వానికిఁ జోటీయవలసియున్నది,

-: నేఁటిరచనలు - ఛందోవ్యాకరణాదులు :-

భాషాసామగ్రిలో ఛందోవ్యాకరణాదులఁ గూర్చి ఇట్టి వితర్కమే కనఁబడుచున్నది. ఛందమొకగతిని వ్యాకరణమొకనియతిని అలంరాకాదు లంతర్బహిస్సౌ?ర్యమును జేకోర్చుకొనుటలో ననేకు లేక కంఠమువారే. ఐనను కొందరు తన్నియము నిబంధనలకుఁ దలయొగ్గరు. ఏ కొందఱో యేవియుఁ బని లేదన్నను ముందున్నవి బాగులేదనువారు కొందఱుందురు. ముందున్నవి బాగులేకున్నచో నెందుకు బాగులేవో తెలిసికొని అంతకంటె మేలైనవిసృష్టించుకోవచ్చును. గాని ఏ నియమము పనిలేదనువారు తమజీవితము నట్టి నియమరహితముగా నడుపఁగలరేమో నడుపుచున్నారేమో పరిశీలించుకోవలెను. నియమబంధము కృత్రిమమనియు అది భావవేగము నరికట్టి నడకను గుంటుపఱచి సహజత్వమును భంగపరచునని కొందఱి భావము. నియమబంధము కృత్రిమమనుట ఎంతనిజమో సహజమనుటయునంతే ప్రకృతినియమములు - మానవ జాతి నీతినియమములు పడుగుపేకలుగా నేసినవస్త్రమే మానవజీవిత విధానమైనపు డామునుఁగులో నడచు జీవితము, దానిని రూపొందించు సాహిత్యము కృత్రిమము సహజము కాకతప్పదు. కృత్రిమములనుకొన్నవి కూడఁ గొన్ని నియమములు తమప్రభావముతో నచ్చట సహజత్వమునే పొందియుండుట మనము చూడఁగలము. అట్టివి సహజత్వమును పెంచునిగాని త్రుంచలేవు. భావవేగము శయ్యాసరళిత కుంతితము కాగాదనుకొన్న, అట్టివాగర్థబలము అభ్యాసపాటము హెచ్చించుకొన్నఁజాలు. నియమమే యక్కరలేదనుటలో అక్కరలేదనుటగూడ నొక నియమము గాక మరేమగును ? స్వేచ్ఛానియమము సంతరించుకొనుట కొందఱికిష్టముకావచ్చు. అప్పుడుకూడ నియమోద్దేశములు చెడకుండ, నవి తనయొక్కనిని మాత్రమే కాకుండఁ జూచుట మంచిది.

భాషా సామగ్రినిగూర్చియు నలంకారశాస్త్ర సంపత్తినిగూర్చియుఁ నింకెంతయో తెలియవలసి యున్నది. దానికి వలసినయుపపత్తియుఁ దీర్చుకోవలసిన విధానసంధానము లింకను బయటికిరావలసి యున్నవి అవన్నియుఁదీరికగాఁ దీర్చుకోవలసినవైనను స్వాతంత్ర్య భానూదయముతోఁ గ్రొత్తప్రొద్దులు పొడిచినట్లై, మనలో నవ్యసాహిత్యసృష్టిసంకల్పము రేకులువిచ్చుచున్నది. ఇదియశుభసూచకమేయగును. కాని, యిందును దొందరపాటుతగదు. సృష్ట్యారంభమునకు మొదలేదో యదియొప్పుడెచ్చట నెట్లు వికసించునో పరిశీలించుకోవలెను. ఏ సృష్టికైనను

భూతమునుండియే భవిష్యత్తునకు దారియేర్పడును. కేవల భవిష్యత్తునే చూచిన నది వట్టియూకాశము. ప్రళయానంతరము నవ్యసృష్టికై సంకల్పించినబ్రహ్మ తనకేమియుఁదోఁచక, దేనికేదియాధారమో, యేది యెచ్చట నెట్లున్నదో తెలిసికొనుటకై విశ్వగర్భుఁ డగు విష్ణువు నుదరములోనికి నాభీపద్మనాళము నుండిదిగిపోయెనని మురారికవి చెప్పుచున్నాఁడు,

"విరమతి మహాకల్పే నాభీపథైకనికేతనః॥
త్రిభువనపురశ్శిల్పీ యస్యప్రతిక్షణమాత్మభూః॥
కిమధికరణంకీదృక్కస్య క్వవాస్యవస్థితిరిత్యసా॥
వుదరమవిశద్ద్రష్టుంతస్మై జగన్నిధయేనమః॥"

అనర్ఘరాఘవము.

కనుకనే మనముకూడ భూతానుభవము హృదయమునసనిండించుకొని, వర్తమానముచేతఁబట్టి, భవిష్యత్తులక్షించుచు నవ్యసృష్టి కారంభింపవలసి యుండును. నవ్యసృష్టియనఁగా నదిసరి క్రొత్తయేమి యుఁగాదు. ఉన్నదానికి దుమ్ముదులిపి క్రొత్త రంగులువేయుటే. ఈ సంగతినే 'ధాతాయథాపూర్వమకల్పయత్' - అనివేదముచెప్పినది. కనుకనే మన మిప్పుడు ససాకల్యముగ సాహిత్యవివేచనము చేసి, మానవజాతి హృదయములు వికసించునట్లుగా, మెదడులు వివేకవంతములగునట్లుగా నవ్య సాహిత్యము నిర్మించుకోవలెను.

### -:సాహిత్యమనఁగానేమి ?:-

ఈసందర్భమున సాహిత్యమననేమో మనము తెలిసికోవలెను. సాహిత్యనిర్వచనము ననేక విధములుగాఁ జేయుచున్నారు. ఎవ్వరెట్లుచేసినను, దీని బాహ్యరూపమంతయు భాష, లోపలిచైతన్యమంతయు భావము. తక్కినదంతయు నీరెంటినినువుగా సుకుమారముగా సంధించి యందించుటలోఁ గల తీర్పు నేర్పులు. ఈ మూఁడింటికిఁజేరిన సంస్కారోపస్కారములు పెక్కింటితో సహితమైయుండి సాహిత్యమనఁబడుచున్నది. ఈ సాహిత్యమునకే పర్యాయముగా సారస్వతము - వాఙ్మయము - భాష యనుపదములు కొందఱు వాడుచున్నారు. దీనిని గొందఱంగీకరింపరు. వ్యవహారోపయోగియైన పదజాలము భాషయనియు, సృష్టిలోని ప్రతివస్తువును ప్రతిభావమును ప్రతికార్యమును దెలుపు పదజాలము వాఙ్మయమనియు, ఆవస్తుభావకార్యములకుఁ గళాశిల్పముతో నాలంకారిక నైపథ్యముతో నవ్య సౌందర్యమును భావనాసౌభాగ్యమును జేకూర్చు రచనతోడి వాఙ్మయమే సారస్వతమనియు మానవజాతికిఁ బరంపరాగతములైన యాచార వ్యవహారములు సంస్కృతి సంప్రదాయములు గర్భీకరించుకొని పురోగమించు సారస్వతమే సాహిత్యమనియు వీరు వింగడింతురు. ఇంతేకాదు, మానవునకక్కరైన భౌతికాధ్యాత్మిక నైతికాది శాస్త్రసంవాదములు చతుష్షష్టికళలు మున్నగా వాఙ్మయమంతయు సాహిత్యములోనిదేయని హృదయమువిశాలముచేసి, యొవిక్క దానినికూడ సాహిత్యపరముఁతో చేర్చిపిలుచు వారునుకలరు. శాస్త్రవాఙ్మయమునకుఁ బ్రత్యేకస్థానమున్నది గనుక సంస్కృతిసంప్రదాయములతో మానవజీవితానుభవములతో నిత్యనూతనముగాఁ బురోగమించు సారస్వతమే సాహిత్యమనుటలో నెక్కువయుపపత్తి కనఁబడుచున్నది.

సాహిత్యము మానవజీవిత ప్రతిబింబమనుట యనుభవసిద్ధము. అది జీవనదివలె నేనాఁటికానాఁడు నవ్యముగా ముందుకు నడుచుచుండును. దైశిక కాలికములైన వంపు వరదలు దానిలోఁ బడుచుండునుగాని యది తన సంస్కృతి సంప్రదాయాలతో వానినిఁ జేర్చికొని పోవుచుండును. 'ఆంధ్రసాహిత్యము' 'కర్ణాటకసాహిత్యము' ఇత్యాది వ్యవహారభేదము వినుచున్నాముగదా - అది ప్రధానమైన భారత సాహిత్య లక్షణములతోఁబాటుగ నాయాజాతులకుఁ బ్రత్యేకములైన సంస్కృతి సంప్రదాయములిందుఁ గలవనుటను దెలుపుచున్నది. అందువలనఁ గూడ సంస్కృతి సంప్రదాయములు సాహిత్యమునకు వేఱుచేయరాని లక్షణములగుచున్నవి. 'ఒక జాతిసాహిత్య మాజాతియొక్క స్వీయచరిత్ర' యను సూక్తి దీనినే బలపఱచుచున్నది. పై నిర్వచనములు

రుచింపనివారు సాహిత్యమును వేరుగ నర్థముచేసుకొనియుండవలెను. నేడు పెక్కు పేరులతో వివిధ సాహిత్యోద్యమములు ప్రచారమునకు వచ్చినవి. అవి వారివారి యభిరుచిభేదములకుఁ జిహ్నములు. ప్రతియొకదానిలో నొక క్రొత్తదనము- ఒక యుత్సాహము- ఒక భవిష్యదాకాంక్ష కనఁబడును. వానిలో గొన్ని సాహిత్య లక్షణముల గౌరవించినవని చెప్పఁజాలము. ఈ వైవిధ్యము సాహిత్య కుటుంబచరిత్ర కేమియుఁ గ్రొత్తకాదు. వానివాని యంతరములతో నన్నింటితోఁ గలిసియున్నదే కుటుంబము. ఆ కుటుంబగౌరవము పెంచుటే యన్నిటి లక్ష్యము కావలెను. నవ్యసాహిత్యము ప్రాచీనసాహిత్యమునకంటె భిన్నమైనదను భావము కొందఱికిఁ గలదు. బాహ్యరూపములఁబట్టి యీ భేదము కనఁబడుచుండును. ఉక్తివైచిత్రి, భావప్రౌఢిమ, ప్రయోగ విలక్షణత, దృష్టిభేదము, రచనావిన్యాసము ప్రాచీనమునకంటె నవీనమునఁ గ్రొత్తగఁ గనఁబడవచ్చును. కొన్ని రచన లిప్పటి లక్షణములకు లొంగక క్రొత్తపోకడలు పోవచ్చును. ఈ లక్షణములన్నియు నేఁటి ప్రాచీన సాహిత్యము ముందు నవ్యసాహిత్యముగ నున్నపుడు దానికిఁ బుట్టినవే. వానిలో నల్పాయుష్కములు పోఁగా మిగిలిన చిరాయుష్కములైనవానినే యిప్పుడు ప్రాచీనసాహిత్యమనుచున్నాము. ఇట్లే యీనాఁటి నవ్యసాహిత్యముకూడఁ బ్రాయముపండి చిరాయుష్యము నిండి కొన్నాళ్ళకుఁ బ్రాచీనసాహిత్యము కాఁగలదు. కాలభేదమునఁ బద్ధతిభేదము పరిపాకభేదము ప్రాచీనతా నవీనతా వ్యవహారమునకుఁ గారణమైయుండును. ఈ విధముగా ననంతావతారములతో వెలసిన నేఁటి యాంధ్రసాహిత్యములోని సారమంతయుఁ బిండుకొని, సోదరజాతిసాహిత్యములలోని మేలిగుణములు కలిపికొని, భారతసాహిత్యహృదయనాదముతోఁ గంఠము మేళవించి, విశ్వసాహిత్యములో శ్రుతిపెట్టుకొని మన మిపుడొక నూత్నసాహితీసామగీతి సృష్టించి యాలాపము చేయవలసియున్నది. అది సత్యము శివము సుందరమై విశ్వకల్యాణము చేకూర్పవలసియున్నది.

## :సాహిత్యము-మానవ జీవితము:-

సాహిత్యము మానవజీవితముతోఁ బెనవేసికొని మన హృదయములో మేదస్సులో జీవశక్తి నింపించి విజ్ఞానానందములు ప్రసరింపజేయుననియు, యథార్థజ్ఞానము కలిగించి యొక లక్ష్యమును దానికొక మార్గమును సుకుమారముగాఁ జూపునని పెద్దలందురు. కావున మానవజీవిత విధాన మెట్టిదో యందలి యదార్థజ్ఞాన మేదో యిప్పుడు పరిశీలింతము. యథార్థజ్ఞానమనఁగా నున్న దున్నట్లు తెలిసికొనుట. మన జీవితములో ముఖ్యావసరములుగాఁ గనఁబడునవి ఆహారము-ఆచ్ఛాదనము-అవి సంపాదించు విధానములు-ఇవి యొక భాగము. అనేకులొకచోట సంఘముగాఁ గలసియుందురు గాన వారు నిరుపద్రవముగఁ బరస్పర సహకారముతో జీవించుటకు వలయు పద్ధతులు-ప్రవర్తనలు - ఇవి రెండవభాగము. స్త్రీ పురుషజాతులున్నవి గాన నాద్వంద్వముల సంబంధము-సంతానము - సుఖదుఃఖములు - ప్రేమాభిమానములు-ఇవి మూడవ భాగము. మానవునికి బుద్ధీంద్రియాదు లెక్కువ గావున వానికిఁదగిన చదువు సంధ్యలు వివేక విజ్ఞానములు సద్గుణ సదభ్యాసములు-ఇవి నాల్గవ భాగము. ఇంతటి ప్రకృతిభాగ్యము విజ్ఞాన సంపద యుపకరణసామగ్రి యంతయు హస్తగతముఁ జేసికొని యనుభవించు మానవుఁ డిదియంతయు నెట్లు వచ్చినదో యెందుకు వచ్చినదో యాత్మావబోధము చేసికొని యర్థముగా ననుభవించి యానందించుట-యిది దైవదత్తమని తెలిసికొన్నచో నా దైవమునకుఁ గృతజ్ఞుఁడై యారాధించుట, అది కాదనుకొన్నచో నా దైవము స్థానమునఁ దానుండి తత్కర్తవ్యమంతయుఁ దానే నిర్వహించుట, లేక, దైవ ప్రాతినిధ్యము వహించియైన లోక కల్యాణమునకు నడుమునకట్టుట-ఇది యైదవభాగము. మానవ జీవితమున నిత్యము జరుగుచున్న కార్యక్రమమిదే. వీనినే అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయా నందమయములందురు. ఉపనిషత్సాహిత్యమున నీ యైదును బ్రహ్మమయములుగనే చెప్పఁబడినవి. వీనిలో మొదటిమూఁడును ఇంచుమించు సర్వ

ప్రాణి సామాన్యములు. చివరి రెండు మానవున కెక్కువ. ఈ యెక్కువను బట్టియే మానవుఁడు మొదటి మూఁడింటి ననుభవించుటయందుఁగూడ దారతమ్యముండును. ఇందులో నయిదవభాగము మానవజీవితలక్ష్యమనియు, నాలుగవభాగము సాధనసంపత్తి యనియు గుర్తింపవచ్చును. చివరి రెంటినివదలి మొదటి మూఁడుభాగములే చాలు ననుట మానవధర్మముకాదు. అంతమాత్రముతో మానవజీవితము సవ్యముగా శాంతముగా జరుగదు కూడ. లక్ష్యసాధనలులేని కర్మేంద్రియాదుల విజృంభణముతో వారిజీవితము మఱియుఁ గసుమాలమనుట కవకాశమున్నది. అయినను మొదటి మూఁడింటిని విడిచి చివరి రెంటిని సాధించుట కష్టమే. ఒకరిద్దఱు సాధించినవారున్నను అనేకుల కది యసాధ్యము. ప్రథమత్రయము నుపకరణముగనో గౌణముగనో తీసికొని చరమద్వయమును సాధించుటే మానవుఁడు చేయవలసిన పని. కాని, యీ నాఁడది సక్రమ విధానమున నడుచుచున్నట్లు లేదు. ప్రత్యక్ష జీవితమునందలి యొత్తిడికిఁ బరోక్ష లక్ష్యసాధనములందలి శాంతిమార్గము బదులీయలేకున్నది. నిలువలేక యొత్తిగిలి పోవుచున్నట్లున్నది. కడకది యొకఁటున్నదను విశ్వాసమే సన్నగిలుచున్నట్లున్నది ఈ విపరీత పరిస్థితికిఁ గారణము గుర్తించుట కర్తవ్యము.

## -:సాహిత్యము-సంస్కృతి:-

దీని నిట్లు పరిశీలించవచ్చును. మానవ జీవితమునఁ బ్రతి సందర్భమున నొక యుద్దేశము, దానికై యొక కార్యము, దాని కొకఫలము నున్నవి. ఉద్దేశపూర్వకముగాని క్రియకుఁ, గ్రియారూపమును బొందని యుద్దేశమునకుఁగూడ ఫలమున్నది. అట్లే ప్రతి ఫలమున కొక ప్రతిఫలమున్నది. అనఁగా గలిగిన ఫల మంతటితో నిలువక, మఱియొక యుద్దేశమునకో కార్యమునకో దారిచూపుచున్నది. కాఁబట్టి తనకొఱకొక యుద్దేశమునునడుపు మానవుఁడు దాని ఫలప్రతిఫలనము లుదాత్తములుగా శ్రేయోదాయకములుగా నుండునట్లు చూడవలెను. ఆ చూచుట యందాతనికి జన్మానుగతమైన సంస్కారము - వృద్ధానుగతమైన సంప్రదాయము తోడుపడుచుండును. వీని తోడ్పాటుతో ఫలప్రతి ఫలనములఁ బరిశీలించునపుడు, ఫలము తనదేయైనను ప్రతిఫలనము ఇతరులయందుఁగూడఁ బ్రసరించును గావున నా ప్రతిఫలనము తనకు నితరులకుఁ గీడు తొలఁగించునదిగా మేలు కలిగించునదిగా నుండునట్లు చూడవలెను. మేలేదో కీడేదో యనుభవించి తెలిసికొనుటకంటె నూహించి తెలిసికొనుట మానవునిలో విశేషము. ఆ యూహకుఁ దానింతకుముందు పొందిన శిక్షణానుభవములు తోడుచేసికొనుట యుత్తమపద్ధతి. ఈ విధముగా ఉద్దేశక్రియాఫల ప్రతిఫలనము లుదాత్తములుగా శ్రేయోదాయకములుగా నుండునట్లు పరిశీలించుటకు సంస్కార సంప్రదాయములతో శిక్షణానుభవములతో, బక్వమైన విజ్ఞానము మానవజీవితమున కవసరమని స్పష్టమగుచున్నది. దీనినే సంస్కృతి యని పెద్దలందురు. ఈ సంస్కృతిలేని నాఁడు మానవజీవితము సంక్షోభ సంకులము కాఁగలదు. అది విజ్ఞాన క్షామమునకు గుర్తు ఆ విజ్ఞాన క్షామ మన్నవస్త్రముల తఱవుకంటె భయంకరమైనది. దాని దీర్చుటకై ముందుగాఁ బ్రయత్నింపవలెను. అనఁగా మానవులలో సంస్కృతి పుష్కలముగాఁ బెరుఁగునట్లు చేయవలెను? అది యెట్లు చేయవలెను?

## -:సాహిత్యము-శీలము:-

సంస్కృతి మానవజీవితము నడుపునొక భావసంస్కారమేగాని మూర్తమైన వస్తువుగాదు. పంటపొలములందుఁ గర్మాగారములందుఁ బదార్థములు వస్తువులు తయారగునట్లు మానవుని హృదయమునందు మెదడునందు సద్గుణములు సదభ్యాసములు పెరుఁగవలెను. దీనితో సంస్కృతి పెరిఁగి పక్వమగుచుండును. ఇది యుత్తమజీవితపరిశ్రమము. సద్గుణములనఁగా:- సత్యము, అహింస, దయ, క్షమ, అలోభము, ఆర్జవము-మున్నగునవి. ఇవి సర్వమానవసాధారణములు. సదభ్యాసములనఁగా:- పైగుణములు బాల్యమునుండియే యింటను, బయటను, చదువు

లలో, నడువడిలో, నలవాటుకుఁదెచ్చి హృదయమునఁ బెంచుట. ఇవి చాలముఖ్యములు. ఎందుకనఁగాఁ, బై సద్గుణ సదభ్యాసములకంటె ముందుగనే కామక్రోధాది దుర్గుణములు దురభ్యాసములు సహజముగనే తమంతకుఁదామే పుట్టి పెరుఁగు నవకాశ మెక్కువగాఁ గలదు. ఎంతో జాగరూకత వహించినను, ఎప్పటికప్పుడు పుట్టుకొనివచ్చు నీకలుపు మొక్కలను ద్రుంచివేయుటేగాక సద్గుణములను బెంచుటకు వలయు దోహద మెక్కువగాఁ గావలెను. ప్రాయము వచ్చుకొలఁదియు, జీవితమునందలి యభిరుచి యాకర్షణ మెక్కువగు కొలఁదియు బహిరంతరములనుండి సద్గుణ సదభ్యాసముల కనరోధము లెక్కువగుట సహజము. అయన్నింటికి నిలువఁద్రొక్కుకొని యాశయము పండించుటకు వలయు సత్ప్రసారము చేకూర్పఁగల శిక్షణములే యీ దోహదక్రియలు. ఈ యన్నింటితో మెలసిన సత్ప్రవృత్తినే శీలమందురు. ఈశీలముచే సంస్కృతి పెరుఁగుచుండును. పెరిఁగిన సంస్కృతి శీలమును బెంచుచుండును. వీనిలో నేది ముందను ప్రశ్న ముఖ్యమైనదే. బాల్యమునుండియే శీలమునకుఁ బునాదులేర్పడవలసి యున్నది గాన, నా పునాదులు వేయు పెద్దల సంస్కృతియే ముందనుకోవచ్చును. కాని, పెద్దల శిక్షణమునుండియును గొందఱిలో శీలము కనఁబడదు. శిక్షణము లేకున్నను గొందఱిలో శీల ముజ్జ్వలమగుచుండును. కాఁబట్టి వారివారి జన్మ సంస్కారమే శీలమునకుఁ బూర్వరంగ ప్రసాధనము చేయుననుట సోపపత్తికమగును. ఏమైనను, సంస్కృతి లేనిచోట శీలముండదు. శీలమున్నచోట సంస్కృతి యుండకపోదు. సంస్కృతిశీలములు పెరిగిన మానవజీవితమున నన్ని రంగములలో నన్ని సమస్యలలో వాని ప్రభావము పారుపత్తెము చేయుచునేయుండును. జటిలములగు జీవితసమస్యలన్నియు సంస్కృతి శీలముల స్నేహప్రసారముచే సుకుమారముగఁ జిక్కువాయఁగలవు. మానవుఁడు తక్కినలోకముతోఁ దగులములేక తానొక్కఁడుగా నుండఁదలచినగూడ నాసంస్కృతి శీలము లాతనికి బాసటగా నుండఁగలవు. అప్పుడది యాత్మారాధన. ఆ యాత్మారాధకుల కంటె సాధారణప్రజలకు, వారికంటె లోకారాధకులకు నాసంస్కృతిశీలనము లంతర్నాడికా జీవరసములు. ఒకదేశనాయకుఁ డొకతత్త్వబోధకుఁ డొకమహాకవి యిట్టివారందరు లోకమున కొక మార్గముచూపించి సందేశమిచ్చునపుడు తమలోఁ దమప్రవర్తనలోఁ దమపలుకుబడిలో సంస్కృతి శీలములు నిలువెల్లఁ బండించుకొనుట ప్రాణములు పోయుటకన్నమిన్న. వారిలో నీసంస్కారపరిపాకములు కొఱవడినచో నది లోకమంతటఁ బ్రతిఫలింపఁగలదు. అప్పుడే మానవజీవితమున సంక్షోభము పుట్టుకొనిరాఁగలదు, దానితో నైతికధార్మిక మార్గములు గ్రచ్చపాదలై, మానవత్వమే యధోమార్గములఁ బయనించును. ఇది విపత్కరవిప్లవము-భయంకరపరిణామము. దీనినుండి మానవజాతిని దప్పింపవలెనన్న సంస్కృతిశీలముల ప్రబోధానుష్ఠానములకుఁ బ్రాధాన్యమీయవలెను. ప్రచారము చేయవలెను. కేవలప్రచారమేగాదు - ఉత్పత్తివిధానములు, ప్రాపణమార్గములు, వానికివలసినవ్యవస్థలు నియమములు, శాసనములు మొదలుగా నన్నియు నన్నిజీవితావసరములు చేకూర్చుటకంటె మున్నుగాఁ బ్రజలనుండి ప్రభుత్వమునుండి యేర్పడవలెను. ఇంతయు నాకళించుకొన్న మహాకవులీ విధానసంధానమంతయుఁ దమసాహిత్యమున రసమయముచేసి లోకమునకుఁ బంచిపెట్టవలయును. దానిని లోకమందుఁ బ్రభుశాసనమునకంటె మిత్రవాక్యమునకంటె సుకుమారముగాఁ గాంతాసమ్మితముగా సరసముగా సాహిత్యమందిచ్చి, లోకమును కర్తవ్యతాప్రవణముఁ జేయఁగలదనుట యనుభవసిద్ధము. మన భారతీయ సాహిత్యమున నీ విధాన మెంతవిరివిగఁ బుష్కలముగ సాగినదో విజ్ఞలోక మెఱుఁగనిదికాదు.

మన భారతసాహిత్యమున సంస్కృతి శీల మార్గమే గాక రసమార్గమొకటి కలదు. అది సంస్కృతి శీలములతో భావాతీతమైన చిద్రూపమును బ్రత్యక్షముచేయును. దానికివస్తు ప్రపంచమంతయు నిమిత్తకారణము. భావప్రపంచము సమవాయికారణము. రసోపాసన అసమవాయికారణము.

ఈ యనుసంధానములోఁ గవితనహృదయమున నిండిన ప్రేమరసమును భావనామార్గము భావప్రపంచమునే గాక బాహ్యప్రపంచమును గూడ నిండించును. అపరిపూర్ణమగు చెఱకుగడలో మధురసము నిండుటవంటిది. తామరపువ్వులో మకరందసౌరభ్యములు తొనఁకుటవంటిది. అప్పు డాకలామయ రసస్పృష్టిలో బహిరంతరములశృంగారసౌందర్యములే గోచరించును. అంతటఁ బ్రేమ సౌహార్దములే వెల్లివిరియును. ఈశ్వరుని రూపలాలసతనుండి యేర్పడిన సృష్టిలో నీశ్వరుని జూచుటయే దానిఫలము. ఈ చూపులో నొక దివ్యతేజముకలదు, అది యాత్మతేజము. అది యుజ్జ్వలమగు కొలఁది భౌతికావరణములు చీల్చుకొనుచు, అందలి రసవాహిను లప్పళించుకొని మఱియు సముజ్జ్వలమై యీశ్వరుని దివ్యజ్యోతిలో లీనమగును. ఈ చిత్కళోపాసనలో విశ్వమునంతయుఁ బ్రేమమయముగాఁ జూచి రసమయము చేయుటయే యనుష్ఠాన క్రమసిద్ధి. ఇందు భౌతిక జీవనమంతయు మానసికమైన సమస్యలన్నియు సమన్వయపడి సమరసములగును. భోగత్యాగాది గుణములు నియమ శాసనాది నిబంధనలు కరగి కట్టలు తెగిపోవును. కర్మకాండ మీమాంసావేదాంతాదులు కళాగ్న్యుపాసనాసమిదాజ్యహవిస్సులై యోజస్తేజములు గూర్చును. వెలుఁగు నీడలైన పుణ్యపాపములు స్వర్గనరకములు మొదలుగా ద్వంద్వములన్నియు స్వోపాధులను మ్రింగి స్వయంజ్యోతులై ప్రకాశించును. అప్పుడఖండ ప్రేమ పూర్ణమైన యనంత కళావిలసితమైన యీశ్వరుని విశ్వరూపసౌందర్యము హృదయమునిండి కన్నులఁ బ్రత్యక్షమగుచుండును. ఇది భారతసాహిత్యమునఁ గళాతపస్వి చేయు రసస్పృష్టి.

భారతసాహిత్యమున మఱొక మార్గముగలదు అదితత్త్వమార్గము. భావాతీతమైన చిద్రూపముతో నాత్మసాక్షాత్కారముపొందుట దానిలక్ష్యము. అది వస్తుభావ ప్రపంచములను రసమయముచేయదు. కాని, వానిలోని రసవాహినులను చీల్చికొనుచు, ఆయనుభూతిలో నానంద కక్ష్య కెక్కునపుడు 'తత్త్వమసి' యను శ్రుత్యర్థమును గోచరింపఁజేయును. అశ్రవణమననాది సాధనలో వస్తుభాగవతము లైన భేదములన్నియు నశించి, సమస్యలన్నియుఁ జక్కఁబడి నానాత్వమున నేకత్వము భాసించును, ఆయనుభూతి కానందకేవలత్వము పరమావధి.

సాహిత్యమున నీసోపానత్రయమును స్థూలసూక్ష్మకారణశరీరములనియుఁ, కర్మభక్తిజ్ఞానములనియుఁ బోల్చుకొనవచ్చును. ప్రతియొకమార్గము ప్రత్యేకముగాఁ గనఁబడినను జివర కన్నిటిగమ్య మొక్కటే. అన్నిటియందును సంస్కృతి శీలముల సమ్యక్ప్రయోగము బహిరంతరముల వ్యాపించియుండుట మనము గుర్తింతుము. అభిరుచిభేదముతో వారువారు తమ యభీష్టమార్గమున సాహిత్య నిర్మాణము చేయవచ్చును. మన సంస్కృతి శీలపాలన ప్రబోధము లన్నిట నపరిహార్యములై విజ్ఞాననవనీతమును వెలికిఁదీసి పంచిపెట్టు నుత్తమోత్తమ శక్తిగా సాహిత్యము వెలయవలెను.

## -: సాహిత్యము-కళ :-

ఈ సంస్కారమంతయు 'జేత' బట్టికొని సాహిత్యము సృష్టించునపుడు ప్రపంచసృష్టికంటె నెక్కువవిజ్ఞానము పనితనము కావలసియుండును. ఎందుకనఁగా, ప్రపంచసృష్టి భౌతికము. ఏదోయణుమాత్రము తప్పఁ దక్కినదంతయుఁ బంచభూతముల పెట్టుబడియే. సాహిత్యసృష్టి యట్టిదిగాదు. ఇందుఁ గరుడు గట్టిన భౌతిక రూపమేదియు నుండదు. అంతయుఁ దేజోమయమైనవాక్కు. భావనామయమైన చేతన. రసమయమైన జీవితము. ఆనందమయమైన యనుభూతి. భౌతిక జీవితమునందలి రహస్యమంతయు సమస్యలన్నియు దీనికివిషయమే. కాని వాని వికారములు దీనికంటవు. వానిద్వంద్వములు వీని నడ్డగింపవు. వానిశాసనములు దీని నిబంధింపవు. అన్నిటిని సమన్వయించి రసమయముగాఁ జర్వణయోగ్యముగాఁ జేసి పుష్టి తుష్టి కలిగించుటే దీని లక్ష్యము. ఈ సృష్టికిఁ గేవల భాషాభావ సామగ్రి చాలదు. లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణ చాలదు. ప్రకృతిని బరిశీలించి, హృదయములను దొంగిచూచి తెచ్చికొన్న యనుభూతియుఁ జాలదు. ఇవన్నియు

సమన్వయించు నొకమూసలోఁ గరఁగి, కటుత్వము దొలఁగించి, కమ్మని రసాయనముచేయఁగల కళా వైదగ్ధ్యముకావలెను. కళయనఁగా, లోపలి వెలుపలి చూపులకుఁ గనఁబడు లౌకికాలౌకిక ప్రపంచము నెల్ల 'సత్యముశివము - సుందరము' చేయఁగల మహా సృజన శక్తి. ఉత్తమ సాహితీగృహస్థునకు భావన సహధర్మచారిణి. ఆమె తోడ్పాటు లేకున్న నా నైష్ఠికుఁడేమియుఁ జేయఁజాలఁడు. ఆమెపట్టినదెల్ల బంగారము. మెట్టినదెల్ల నందనోద్యానము. ఇది యొకపరుసవేది ఒకదోహదక్రియ. ఆకళామయ సృష్టిలో భౌతిక క్షేత్రమున నన్నినాడులలో నమృత ప్రవంతి యంతర్వాహినియగును. అన్ని పురుషార్థములు క్రీడారంగములు. అన్నిహృదయములలో దివ్యత్వము పండును.

## -:సాహిత్యసమన్వయము:-

ఈ సాహిత్య సమితితో మనము చాలదూరము నడచినట్లైనది. ఈ యుగసంధిలో స్వతంత్ర వసంత వాసరములు మాగాకులు తొడుగుచున్న యీ దినములలో నవ్యసాహిత్య నిర్మాణమునకు సంకల్పము జరుగుచున్న యీ శుభముహూర్తమున నీ సింహావలోకనము - సాహితీస్రష్టల యెదుట నీ పంచాంగ శ్రవణము ముందుమేలు చూపఁగలదనియే నా యాశయము. నేఁటిమన తెలుగు సాహిత్యము 'ఇదిమన కుటుంబముగదా' యనిసాభిమానముగఁ జూచినపుడు కూడఁ గొన్నిలోపములు కనఁబడక పోవు. ప్రథమతః 'ఇదంతయు మనసాహిత్యమను నాత్మీయత ప్రతితెనుగు హృదయమునుండి యింకను బొంగిరాలే దనిపించును. తెలుగుతనమున కొక ప్రత్యేకత విశిష్టలక్షణములున్నవని గాని యుండవలెనని గాని తెలుగువారు గుర్తించినట్లు తోచుట లేదు. ఇప్పటి సాహితీమార్గము లొకదాని నొకటి క్రొత్తచూపు చూచుటలో తక్కువచేయుటే గనఁబడుచున్నది. సాహిత్య మన్నింటికలయికను జెప్పుచుండఁగాఁ గొందరు స+ఆహిత్యముగాఁ జూచుచున్నట్లున్నది. దేశ కాలపరిస్థితులు సామాజికవ్యవస్థ యిందుకుఁ గారణమనుకొన్నను, అంతకంటె ముఖ్యముగ సాహిత్యమనకున్న మార్గమును లక్ష్యమును విద్యావంతులైన సమన్వయింపక పోవుటయో గౌరవింపకపోవుటయో కారణమనిపించును. సాహిత్యకుటుంబమున నీయనేకత యాభ్యుదయికముకాదు గదా! పైపై సంస్కారోపస్కారము లభిరుచి కొలఁది నగ్నతకొలఁది నెన్నిచేసికొన్నను, మనరచనలేకకుటుంబమున వారికలెనే యేక లక్ష్యములో నేకోన్ముఖముగానడచినపుడే కుటుంబస్నేహ సౌహార్దములు సాహిత్యమున నన్నినాడులలోఁ బ్రసరింపగలవు. మొదటఁ దెలుగువాఁడుగాఁ, బిమ్మట భారతీయుడుగాఁ, దర్వాతఁ బ్రపంచమానవుఁడుగాఁ, జివరకుత్తమ మానవుఁడుగా బ్రతుకుటయే యుత్తమ లక్ష్యమైనపుడు ఆ లక్ష్య సాధనమార్గములయందా యాదశలయం దాయాజాతీయ సంప్రదాయ శిక్షణములు పక్వమగుటయేకాదన్ని దశలయందన్ని రంగముల యందపహార్యమైన సంస్కృతి శీలపాలన మవిచ్ఛిన్నముగ ననుష్ఠానమునందుఁ బండవలెను. కాలపుటురవడికిఁ గాలూదుకొనఁగల యంతస్సారము లోపలిచూపునకు లోఁతులు చూపఁగల యాత్మవర్చస్సు మనరచనలలోఁ గుదురుకొనవలెను. మనసాహిత్యమీ సంస్కారము పొంది యాత్మబంధువుగా జీవితము వెంటనడుపఁ గలిగినచో నది యుత్తమ సాహిత్యమగుటయే గాక విశ్వసాహిత్యమున సగర్వస్థానమునందఁ గలదు. భాషా భావ భేదములు, ఛందోవ్యాకరణాది నియమములు, జీవిత సమస్యలు, సామాజికవ్యవస్థ లన్నియు నీ సంస్కారమునఁ గరఁగి, సాహిత్యమునఁ దమతమ యవయవ సన్నివేశములను దామే యలంకరించగలవు. ఈ నవ్య నిర్మాణముచేయఁగల ప్రతిభాశాలి కవి యొక్కఁడు మాత్రమే. ఆయనను గూర్చి "కవిర్మనీషీ ప్రతిభూస్స్వయంభూ ర్యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యస్సమాభ్యః" - అని వేదము చెప్పుచున్నది. అట్టి మహాకవులు మనలో నెందఱో కలరు. వారందఱిప్పుడు నవ్యసాహిత్య నిర్మాణమునకుఁ బరికరబంధముచేయవలసిన సుముహూర్త మాసన్నమైనది.

# సాహిత్య సమీక్ష

## -: పరికరసన్నాహము :-

సాహిత్య నిర్మాణమునకై యిప్పుడు చేయవలసిన సన్నాహ మెంతయో గలదు. తెలుగుమాత్రమే చదువ నేర్చినవారి కందవలసిన విజ్ఞాన భాండాగారము విశేష భాగము మన తెలుఁగున లేదు. ఈ పరిశోధనా యుగములో వివిధ శాస్త్రపరిశోధనలు విరివిగ సాగుచున్న యీరోజులలో సంస్కృతాంగ్లభాషల యందేగాక యితరభాషల యందుఁ గూడ వెల్లివిరిసిన యాశాస్త్రవిజ్ఞాన మంతయు, నితిహాసపురాణాదుల భావసంపదయంతయు మన తెలుఁగున నవతరింప వలసియున్నది. తెలుఁగువారు తమ జాతిగొప్పదనము గుర్తించినపుడే యాత్మోన్నతితో నట్టియుత్తమ రచనలు చేయఁజాలుదురు. కావునఁ గాలనుహోగ్నమున విశీర్ణమై చెల్లాచెదురుగఁ బడియున్న చారిత్రక జాతీయ సంపదనంతయు సేకరించి, తెలుఁగుభాషలో దీపింపఁజేయవలెను. మనభాష పరిమితమైనదను సంకోచము తీరునట్లు భారతాది కావ్యప్రపంచము నందేకాక, తెలుఁగునాటఁ బల్లెలో నిత్యజీవిత వ్యవహారములలోఁ బేదవుల వెంటదొరలి పడుచున్న జానుతెనుఁగులు పలుకుబళ్లు సామెతలు మొదలుగా దెలుఁగుతీలు తీయములన్నియు మహానిఘంటువుగా వెలయ వలసియున్నది. సాంకేతిక శాస్త్ర పరిభాషతో జటిలములైన వ్యాకరణాలంకార లక్షణగ్రంథములు తెలుఁగు పలుకుబడిని దిగుటయేగాక, తెలుఁగు సాహిత్యమునకు స్వతంత్రమైన యలంకారశాస్త్రములు పుట్టవలసియున్నది. రాజకీయముగావచ్చిన పరిణామములు, సామాజిక వ్యవస్థలోని భిన్నగతులు, నిత్యజీవితములోని యొడుదుడుకులు భూతభవిష్యత్సమన్వయముతో నాచరణయోగ్యములు చేయఁగల యాచార వ్యవహారకాండలు నిర్మించుకోవలసియున్నది. కేవల సాహిత్య నిర్మాణముతో మన కర్తవ్యము తీరినట్లు కాదు, భావి పౌరులను మన తెలుఁగు బిడ్డలకే జాతీయ విద్యాశిక్షణముతోఁ బునాదులు వేయవలసియున్నది. ఈ శిక్షణము వీధిబళ్ళలో హైస్కూళ్లలోఁ గాలేజీలలో జరిగినంతమాత్రము చాలదు. అది గృహశిక్షణముగాఁ బ్రారంభమై విశ్వవిద్యాలయములలో ఫలింపవలెను. బళ్లలోఁ దెలుఁగు నేర్చుచున్నామనుట తెలుఁగునకుఁ బ్రధాన స్థానమిచ్చినా మనుట గనుదుడుపు మాత్రమే కాఁగూడదు. అందుకుఁ దగిన పాఠ్యగ్రంథములు, కాలపరిమితులు, శిక్షణవిధానములు, పరీక్షలు ఫలితములు - ఈ యన్నిటియందును విశేషదృష్టి కావలెను. తెలుఁగుచదువు నిత్యవ్యవహార నిర్వహణకు మాత్రమేగాక సాహిత్య సంపత్తికి నాత్మవికాసమునకు నుత్తమజాతీయతా నిర్మాణమునకు నుద్దిష్టమై ముందుకు నడిచినపుడే తెలుఁగు నాడుజ్జ్వలప్రతిభావంతము కాఁగలదు. ఇదంతయుఁ బ్రభుత్వము మాత్రమే చేయఁజాలదు. అక్కరకొలఁది ప్రత్యేక సంస్థలు, గురుకులములు ప్రతిగృహవేదిక గూడ సాహితీస్నాతక కర్మాగారములు కావలెను. ఈ తెనుఁగు చదువుతో సంస్కృత భాషను మరువరాదు. సంస్కృతాంధ్రములు తల్లిబిడ్డలు. ఆకళిపలికలు పోలికలు వానిలో మనము నిలువెల్లఁ జూడఁగలము. తెలుఁగువారి యింటి తీర్పులతో నీ తెలుఁగు పడుచు ప్రత్యంగసౌందర్యము ప్రత్యగ్రసము జ్వలమైనది. ఇది కాదను వారుగూడ నుండకపోరు. ఏమైనను, ఈ నాఁటి తెలుఁగులో సంస్కృతసంపదను జూచియైనను, రాఁబోవు తెలుఁగులో దానియవసరము గుర్తించియైనను దెలుగువెంట సంస్కృతాధ్యయనము తెలుఁగుతల్లి వెంట భారతమాతృ పూజవలె మన కవశ్యకర్తవ్యము కాకపోదు. ఆంధ్రసాహిత్య పోషణాబాధ్యతను గుర్తించిన మనప్రభుత్వమిప్పుడే తనకార్యక్రమము ప్రారంభించినది. ఆ స్థానకవుల నియమించుటేమి, విజ్ఞానసర్వస్వము నిర్మించుటేమి, కావ్యబహూకృతులు పంచుటేమి, కళాక్షేత్రములు పెంచుటేమి - బహుముఖములుగా సాహిత్య కృషిసాగించినది. ఈ యుచితజ్ఞతోదాత్తతలకు మనము కృతజ్ఞుల మగుచున్నాము. ఈ బాధ్యత యంతయుఁ దమదిగాముందుగనే గుర్తించి యింతకు బదింతలుగాఁ గార్యక్రమము నడుపుచున్న ప్రజానాయకులను ప్రజలను ప్రత్యేక సంస్థలను బత్రికాధిపతులను హృదయపూర్వకముగా నభినందింపవలెను.

## —: ఉపసంహారము :—

ఇది ప్రజాస్వామికయుగము. స్వతంత్రభారత వర్షము. ఇప్పుడు మనమేదిచేసినను, ముందువెనుకలు బాగుగఁ బరిశీలించి మఱి చేయవలెను. మన యువకకవులలో నూతనోత్సాహము, ఒక క్రొత్త సృష్టింపవలెనను ఆతురత, ఉన్నవిచాలవని, చక్కఁగ లేవని ఆ వేదనపొంగులువాఱుచుండును. స్వతంత్రత సామ్యము ఇట్టి భావములు వారిని ముందుకుఁ ద్రోయుచుండును. ఆ భావ తీవ్రతతో వారిరచనలు మెఱపుఁదునుకలవలె మెఱసి పోవుచుండును. వానినిఁ జూచి హర్షించుచున్నాము. నవ్యసాహిత్యనిర్మాణమునవారిభాగము బాధ్యత మిక్కిలి గాఁగలదు. దానికిఁ దగినట్లువారి హృదయములు చదువులంకను విశాలములు పక్వములు గావలెను. వారిచూపు దూరము చూడవలెను. వారి విజ్ఞానము విశ్వశ్రేయముతోఁ బండవలెను. మన రచనలకు వారు వారు కట్టువిలువలు, నిచ్చు సన్మానములు చేయు ప్రశంసలు సమయసందర్భములఁ బట్టియు, నాయా వ్యక్తుల యంతరువుఁ బట్టియుఁ గొంచెమెచ్చు తక్కువగానుండుట సహజము. దానితోఁ గొందఱుత్సాహపడినను గొందఱుకించపడుటయు జరుగుచుండును. కాని, యవియే మనరచనలకు నిజమైన యొరపురాళ్లు కావు. అయినను మనకవులట్టియూరటనుగోరుట యస్వాభావికముగాదు. లోకము దీనిని గుర్తింపవలెను. కవులుఁగూడఁ దమరచనలెన్నఁడైనను సాహిత్యమున నగ్రస్థానమున వెలుఁగఁగలవను విశ్వాసముతో విశ్వశ్రేయోదృష్టితోఁ దమ సాహిత్య సేవనిరంతర వసంతముగఁ బుష్పింపఁజేయవలెనని కోరుచున్నాను. జాతిమతకుల వివక్షలేని ప్రాంతీయ భేదములేని సారస్వత బ్రహ్మల కవితా సరస్వతుల సమష్టిరూపమే సాహిత్య కుటుంబమని పెద్దల యాశయము. తెలుఁగుగడ్డ యంతయు నొక్కశరీరముగా నొక్కహృదయముగా నొక్కయుద్యమముగాఁబురోగమించి, యచిరకాలముననే సాహిత్యనందనోద్యానములు వెలయించి వసంతోత్సవములు జరుపుకోఁగల దని యాసించుచున్నాను. తెలుఁగు ప్రజలందఱు "స్వస్థానవేష భాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః" కావలెననియు, 'ఆంధ్రావళి మోదముంబొరయు' ఒకే సాహిత్యసృష్టి జరుగువలెననియు/ "ఉత్తమధార, ధోరణి, రసోజ్జ్వలభావ పదార్థ బంధసంపత్తులు నిల్వనట్ దొరయు మాత్రముగాక, మదిన్ గరంచి స । ద్వృత్తికి మానవున్ నడుపు తీయని తోటలు పూలబాటలై । యుత్తటిఁగావ్యముల్ వొలుచుచుంటయె భావ్యము భవ్యమైతగున్"--అనియు, "కవి కావ్యమ్ములచేఁ బ్రజాభ్యుదయమున్ గల్పించువాఁడౌటఁ ద । త్కవి కావ్యమ్ములఁ బెంచి మన్పుట ప్రజాకర్తవ్యమున్ ద ద్విభు । త్వనిధేయంబగు" నవియు విన్నవించుచున్నాను. భగవానుఁ డనుగ్రహించుఁగాక :--

"స్వస్తి ప్రజాభ్యః"

# వృత్త్యౌచిత్యము



శిరోమణి

## శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

ఆలంకారికులు తచ్ఛాస్త్రప్రమేయమును నీ క్రింది విధమున నిరూపించిరి.

రసప్రధానాశ్శబ్దార్థాః గుణాలంకారవృత్తయః
రీతయశ్చేయతీ శాస్త్రప్రమేయం కావ్యపద్ధతిః
"ప్రతాపరుద్రీయము"

రసప్రధానములగు శబ్దార్థములు, గుణములు అలంకారములు, వృత్తులు, రీతులు - ఇని యీ యాలంకారశాస్త్రము లేక సాహిత్య శాస్త్రము యొక్క ప్రమేయము.

ప్రమేయమనఁ జర్చనీయాంశము. కానీ వ్యాఖ్యాతలు ఇందు శయ్యాపాకములను గూడ నుపలక్షణచే గ్రహింపవలెనని వ్యాఖ్యానించిరి.

వృత్తములనుగూర్చి విద్యానాథుఁడుగానీ వ్యాఖ్యాతలుగాని తెలుపరైరి.

కాని "గుణాలంకారవృత్తయః" అను చోటఁ గల వృత్తి శబ్దమునకు వృత్తము అనునర్థమునుగూడ గ్రహింపవచ్చును. వృత్తి, వృత్తశబ్దములు సమానార్థకములుగా గ్రహింపవచ్చును, చూడుఁడు, గీతి గీత. సూక్తి, సూక్త - ప్రాయశ్చిత్తి, ప్రాయశ్చిత్త స్మృతి, స్మృత - హుతి హుత - ఆదికి క్తిన్, క్త ప్రత్యయాంతములు సమానార్థకములుగానే యున్నవి. కావున వృత్తి శబ్దమునకుఁ గైశిక్యాది వృత్తులనియు, శార్దూలాది వృత్తములనియు మనము అర్థము గ్రహింపవచ్చును, దీనినిఁబట్టి "గుణాలంకారవృత్తయః" అనుగుణములు, అలంకారములు, వృత్తులు, వృత్తములు, అనియు నర్థము గ్రహింపవలెను. వ్యాఖ్యాత లీ విధముగా వాఖ్యానింపలేదు.

ఇప్పుడు కావ్యప్రమేయమున వృత్తములను గూడఁ జేర్చుకొంటిమి. కావ్యప్రకాశ, సాహిత్యదర్పణ కారులు దోషప్రకరణమున 'హతవృత్తము' అను దోషము నొకదానినిఁ జూపిరి. హతవృత్తమన రసానుకూలముగాని వృత్తము, దీని కుదాహరణముగా నీక్రింది శ్లోక ముదహరించిరి.

హా! నృప! హా! బుధ! హా! కవిబంధో!
విప్రసహస్ర సమాశ్రయ! దేవ!
ముగ్ధవిదగ్ధ సభాంధవరత్న!
క్వాసిగతః! క్వవయంచతవైతే?

ఒక రాజు మరణింపగా నాతనిబంధుజాలముదుఃఖించుచున్న ఘట్టము. ఇటఁ గరుణరసము. ఇది దోధకవృత్తము, ఇది హాస్యరసవ్యంజకముగాని కరుణరసవ్యంజకముగాదు. కరుణానుకూలములగు వృత్తములు వియోగినీ, మందాక్రాంతా శిఖరిణీ, పుష్పితాగ్రావసంతతిలకాదులు.

ప్రతాపరుద్రీయమున నీదోష ప్రసంగములేనేలేదు

దీనినిఁబట్టి రసానుకూలములగు గుణరీత్యలంకారములవలెనే రసానుకూలమగు వృత్తమును వాడవలెననియు రసప్రతికూలములగు గుణరీత్యలంకారములచేఁ గావ్యమసుందరమైనట్లు రసప్రతికూలమగు వృత్తిరచనచేఁ గూడఁగావ్యమసుందరమే యగునని తెలుపుచున్నది హతవృత్తము. అనుదోషమును బట్టి ప్రమేయములో 'వృత్తము' గూడ నుండవలెనని సారాంశము.

అయితే కావ్యసామగ్రిలో వృత్తవిచారములేదే? అనవచ్చును. అవును అన్వయ ముఖమునలేదు

సాహిత్యముద్వారా-కావ్య ప్రకాశములలో హాత వృత్తమను దోషము చూపఁబడి యున్నదిగదా! ఈ విధముగా వ్యతిరేకముఖమున వృత్తవిచారము ఆ గ్రంథకర్తలుచేసిరి, అంతకన్న విశేషించి యీ వృత్తవిచారము సువృత్తతిలకమునఁ గానవచ్చును. సంస్కృతమున క్షేమేంద్రుఁడను కవి యీ వృత్తములను గుఱించి చర్చించి 'సువృత్తతిలకము' అను చిన్న గ్రంథమును రచించెను. ఆ గ్రంథముచిన్నదే. కానీ దాని గుణములనుబట్టి యాదియుద్గ్రంథమే యగును. అందిట్లున్నది.

> కావ్యేరసానుసారేణ వర్ణనాను గుణేనచ
> కుర్వీతస్సర్వవృత్తానాంవినియోగంవిభాగవిత్
> సువర్ణార్హప్రబంధేషు యథాస్థాన నివేశినాం
> రత్నానామివవృత్తానాం భవత్యభ్యధికారుచిః
> వృత్తరత్నావళీ కామాదస్థానే వినివేశితా
> కథయత్యజ్ఞతామేవ మేఖలేవ గళేకృతా.

కావ్యమున రసము ననుసరించియు, వర్ణనము ననుసరించియు, వృత్తముల నుపయోగింపవలెను. స్వర్ణమునకు రత్నము పొదుగఁ బడినచో నదిమరింత శోభాయమానముగా నుండునట్లు ప్రబంధములందు స్థానమునుబట్టి యనఁగా నాయా రసఘట్టములను బట్టి యాయా వృత్తములను వాడవలెను. అప్పుడట మిక్కిలి శోభిల్లును. అస్థానమున నుపయోగించిన వృత్తము మెడలో నొడ్డాణము వేసికొన్నట్లుజ్ఞతను జాటును.

దీనినిఁబట్టి రసవ్యక్తికి మిగిలిన గుణరీత్యలంకారములతో పాటు వృత్తమునకును ప్రాధాన్యముగలదని తోచుచున్నది.

ఇంతేకాదు. రసానుకూలమగు నితివృత్తము గూడఁ గావ్యమునకు శోభాహేతువే. కాళిదాసకృత శాకుంతలము కిన్న భవభూతికృత ఉత్తర రామచరితము ఇతి వృత్త విశేషమును బట్టి సుందరతరమని "ఉత్తరేరామచరితే భవభూతిర్విశిష్యతే" అనువాచోయుక్తి యుద్ఘోషించుచున్నది. సంస్కృత సాహిత్యమునఁగూడఁ జెక్కుండ్రు కవులు ఇతివృత్త నిర్వహణమున దృశ్యకావ్యములఁ జూపినంత శ్రద్ధశ్రవ్యకావ్యములందు జూపరైరి. దృశ్యశ్రవ్య కావ్యములందు రెంటను ఇదేవృత్తము సమానముగా శిల్పదృష్టితో నిర్వహింపఁబడవలెననియే విమర్శకుల సిద్ధాంతము.

కావున సంస్కృతకవులుగాని వారిపాదముద్రలలో నడచిన యాంధ్రకవులుగాని యితివృత్త నిర్వహణమున సముచితమగు శ్రద్ధను వహింపరైరి. ప్రభావతి ప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము మొదలగు నొకటి రెండు కావ్యములందు మాత్రమే యితి వృత్త నిర్వహణమునఁ గొంతశిల్పదృష్టి గానవచ్చుచున్నది.

రసానుకూలమగు నితివృత్త నిర్వహణమున మనవారికి శ్రద్ధసన్నగిల్లినట్లే రసానుకూలమగు వృత్త గ్రహణమునఁ గూడ మనవారికి శ్రద్ధసన్నగిల్లినది. సంస్కృతమున మాత్రము కొందఱు యత్నించిరి. ఈవిషయము ముందు నిరూపింతును.

సంగీతశాస్త్రమున రసానుకూలములగు రాగములు పాడవలయునని నియమముగలదు. చూడుఁడు! కరుణ రసమునకు బిళహరి, నీలాంబరి, ముఖారి, నాదనామక్రియ మొదలగు రాగములు, శృంగారమునకు భైరవి. ఆనందభైరవి, తోడి, శంకరాభరణము, మొ రాగములు ; రౌద్రవీరములకు మోహన, అఠాణా మొ। రాగములు ; భక్తికి కురంజి, జంఝూటి, మొ। రాగములును నిర్ణీతములై యున్నవి. ఈ నియమము దప్పించి యొక రసమునకు నియతముగాని రాగమును నాలాపించిన వైగస్యహేతువగును. ఇంతే కాదు. ఏయేరాగము నేయే కాలములలోఁ బాడవలయునో నియమము గలదు.

> శ్రీరాగోరాగిణీ యుక్తశ్శిశిరేగీయతే బుధైః
> వసంతస్సహాయస్తు వసంతర్తే ప్రగీయతే
> భైరవస్సహాయస్తు ఋతౌగ్రీష్మే ప్రగీయతే
> పంచమస్తుతథాజ్ఞేయో రాగిణ్యాసహశారదే
> మేఘరాగోరాగిణీ భిర్యుక్తో వర్షాసుగీయతే
> నాదనారాయణో రాగోరాగిణ్యాసహహైమకే
> శిశిరస్యవసంతర్తౌ సంధాహిందోళరాగకః.

# వృత్తౌచిత్యము

ఆయా ఋతువుల శీతోష్ణాది ధర్మములు గాయకుల కనుకూలములై యాయా రాగాలాపనకు దోహదము సేయును. దానవిశేషించి రసముప్పతిల్లును. ప్రాతః కాలమున భూపాల, దేశాక్షి, దేవగాంధారి, శుభపంతువరాళి మొదలగు రాగములు సముచితములు.

రసమునకు సముచితరాగములవలెను, కాలమునకు సముచితరాగములవలెను, రసమునకనుకూలమగు వృత్తములుకూడ నౌచిత్యమును బెంచును.

మొత్తము మీఁదఁగవులెల్లరును విశేషించి కావ్యశోభాదాయకములగు నితివృత్త, వృత్తముల విషయమున నుచితమగు శ్రద్ధనువహింప లేదనుట నిర్వివాదము.

సంస్కృతమున నీ వృత్త విషయమును గొందఱు దిఙ్మాత్రముగా ననుసరించిరి. కాళిదాస మహాకవి మేఘసందేశమున విప్రలంభ శృంగారానుకూలముగా మందాక్రాంతను కుమార సంభవమున రతి విలాప ఘట్టమున వియోగినీవృత్తమును వాడెను. చూడుఁడు !

మేఘసందేశమున మందాక్రాంతము.

శాపాంతో మే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ
శేషాన్మాసాన్ గమయచతురో లోచనే మీల
యిత్వా
పశ్చాదావాం విరహగుణితం తంతమాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చంద్రికాసు క్షపాసు.

వియోగినీవృత్తము. (కుమార సంభవము.)

శశినాసహయాతి కౌముదీ సహమేఘేన తడిత్ప్రలీయతే
ప్రమదాః పతివర్త్మగా ఇతి ప్రతిపన్నం హి విచేతనైరపి.

మరియు శృంగారమున నాటకములలో నార్యావృత్తమునే విశేషించివాడెను. వర్ణనాబాహుళ్యమునుబట్టి యటనట "అనాఘ్రాతం పుష్పం" "తరంగభ్రూభంగా క్షుభితవిహగ శ్రేణిరచనా" దీర్ఘాక్షం శరదిందుకాంతి వదనంబాహూ నతావంసయోః" అనుచో శిఖరిణీ, శార్దూలమును గూడ వాడెను. భవభూతి కరుణమున శిఖరిణీవృత్తమునధికముగా వాడెను. ("అథేదం రక్షోభిః కనకహరిణచ్ఛద్మవిధినా") బిల్హణకవిచౌరపంచాశికలో కరుణమున వాసంతతిలకా వృత్తమును వాడెను. చూడుఁడు.

అద్యాపితాం యదిపునః కమలాయతాక్షీం
పశ్యామిపీవరపయోధర భారఖిన్నాం
సంపీడ్యబాహుయుగళే నపిబామివక్త్రం
ఉన్మత్తవన్మధుకరః కమలం యథేష్టం.

జగన్నాథుఁడు శృంగారమున వసంత మాలికా వృత్తమును వాడెను.

యవనీనవనీత కోమలాంగీ
శయనీయే యది నీయతే మయా
అవనీతలమేవ సాధుమన్యే
నవనీమాఘవనీ వినోదహేతుః

భక్తిరసమునఁ గరిణీవృత్త ముచితముగా నుండునని వృత్తరత్నాకరమున నీ క్రింది శ్లోకముదహరింపబడినది.

శ్లో. కరుణారస వరణాలయహృదయే! ధరతనయే!
సదయేమమహృదయేవస! శశిశేఖరదయితే!

శ్లో. కమలాసనకమలాపతివినుతే మునివినుతే!
అమరేశ్వరకమలేదిశ! కరిణీసమగమనే!

ఈ విధముగా సంస్కృత కవులు గొంఱు కొలఁదిగా మాత్రమే రసానుకూలమగు వృత్తరచనమున శ్రద్ధవహించిరి.

కాని యాంధ్రమున నీ నియమము నలతిగాఁ గూడ ననుసరించిన వారులేరు. న్యాయముగా విచారింప స్రగ్ధరాశార్దూలములు రౌద్ర 'వీర' భీభత్స, అద్భుతములకును మత్తేభ, చంపకములు శృంగార కరుణా, హాస్య, భయానకాదులుకును, సేటి, ఆటవెలది, కందములు శృంగార శాంతములకును సముచితములు.

# సుజాత - విజయ, వైశాఖము.

శ్రీనాథాదికవులు శృంగారమున శార్దూల విక్రీడితము మొదలగు వృత్తములను వాడిరి సంస్కృతమునను రసవత్ప్రబంధమగు నమరు కావ్యమునను బెక్కు శ్లోకములు స్రగ్ధరాశార్దూల వృత్తములలో రచింపఁబడినవి. అవి రుచ్యముగ లేవా? అని కొందఱడుగవచ్చును. వర్ణనాబాహుళ్యమున్నచోనవి గ్రాహ్యములే. అట్టివి లేనియెడల నా వృత్తము లుచితములుగావు. ఆంధ్రమునఁ బెక్కు వృత్తములు వృథగపదభూయిష్ఠములై యారభటీ వృత్తిలోఁ గానఁబడుచున్నవి. ఆ కవులే దత్తద్రసానుకూలమగు వృత్తములలో వ్రాసియున్న నింత కన్న రుచ్యతరముగానుండును. వారి పద్యములను శ్లోకములను మనము మఱియొక వృత్తములలో వ్రాసియున్నచో నాయారసములు విశేషముగా నాస్వాద్యమానములయియుండును. పెద్ద పెద్ద కవులుగూడ నితివృత్త విషయమున సముచిత శ్రద్ధను వహింపనట్లే వృత్తవిషయమునను వహింపలేదనుట సత్యము. సహృదయుల కా కొఱత గోచరించుచునే యుండును. చూడుఁడు! దాక్షిణాత్యులును, గాన్నటులునగు నాంధ్రేతర గాయకులు త్యాగరాజ కృతులు పాడుచు నాంధ్ర భాషవారికి లేకపోవుటచే సాకల్యమును దప్పులు తప్పులుగాఁ బాడుదురు. అక్షర సౌష్ఠవము వారిపలుకు బడిలోనుండదు. ఒక వంక వారిగానమునకు మెచ్చుచు మఱొక వంక సాహిత్యముగా పసిగాలేదని యుపహసించుట మన మెఱుఁగుదుము. అట్లే శ్రీనాథాదుల ధారాశుద్ధిని వారి రసపాకశయ్యాదులను నొకవంకఁ బ్రశంసించుచు వృత్తౌచిత్యము లేమిని నా కావ్యమును సర్వాంగ సుందరముగా భావింపఁజాలము, కావునఁ గావ్యము సర్వాంగ సుందరముగానుంటకై వృత్తౌచిత్యమును గూడఁ గవులు గమనింపవలయును.

విషయ బాహుళ్యమునుబట్టి లేక వర్ణనాబాహుళ్యమును బట్టి సీసము, శార్దూలము మొదలగు పెద్ద వృత్తములు గావలసివచ్చును. చూడుఁడు.

శ్లో. శూన్యంవాసగృహం విలోక్యశయనాదుత్థాయకించిచ్ఛనై
ర్నిద్రావ్యాజము పాగతస్యసుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం
విశ్రబ్ధంపరిచుంబ్య జాతపులకామాలోక్య గండస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణహసతా బాలా చిరం చుంబితా.

శ్లో. క్షిప్తోహస్తావలగ్నః ప్రసభమభిహతో ప్యాదదానోంశుకాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితస్సంభ్రమేణ
ఆలింగన్ యోవధూతః త్రిపురయువతిభి స్సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధ స్సదహతుదురితం శాంభవో వశ్శరాగ్నిః.

సీ. నీరజాకరములు నిద్రమేల్కొనఁ జేసిన భవ్యరసమ్ముల ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మకమ్ముల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహరబ్రహ్మ మహానుభావమ్ము లొక్కటిగాఁ గరఁగిన గట్టియనఁగ
నతుల వేదత్రయ లతికాచయము పెను పొందఁ బుట్టెడుమూల కందమనఁగ.

గీ. నఖిలజగములకట్టెఱ్ఱయగుచు జనస। మాజకరపుట హృదయసరోజములకు
ముకుళనంబునుజృంభణంబునునొనర్చి। భానుబింబంబు పూర్వాద్రిపైవెలింగ

విషయబాహుళ్యము లేనియెడల నిట్టి దీర్ఘవృత్తములు గూడవు. శ్రీనాథమహాకవి నైషధమున నవవసరముగా దీర్ఘవృత్తములువాడెను చూడుఁడు.

శా. ఆనందంబునుఁ బొందుమిందు నిభవక్త్రా! మందర క్షోణిభృ
న్నానా కందరమందిరాంగణములం బాథోధి మాథాను సం

ధానప్రోత్థిత సింధురాడ్దుహితృపాదన్యాస
సంభావనా
పౌనఃపున్యపవిత్ర కాంచనశిలాపర్యంత భాగం
బులన్

కొంత యత్నించి దీనిని గీతములలో వ్రాయవచ్చును. ఎట్లన.

గీ. మగువ! ఆనందమొందుమిా! మందరాద్రి
క్రమకందర మందిరాంగణములందు
అధికన్యాంఘ్రి పంకజన్యాసపూత
కాంచనగ్రావ పట్టభంగంబులందు.

ఇట్లే.

శా. పంచారించిన నీపయోధరములాస్ఫాలింతునో?
లేకపా
మ్మంచుం గెంజిగురాకుమోవి 'జిసి' ఘాత్క
గ్ఘంబనుష్ఠింతునో?
పంచాస్త్రోపనిషద్రహస్య పరమబ్రహ్మ
స్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునో? యో
కర్ణాటతాటంకినీ.

దీనినిఁగూడ భావముచెడకుండ గీతముగా వ్రాయవచ్చును.

మరియు శ్రీనాథుడు హరవిలాసమునఁ గుమారసంభవ శ్లోకముల ననువదించుపట్ల ననవసరముగాఁ బెద్దపెద్ద వృత్తములను గూర్చి మూలమునలేని విశేషణములు వేసి పాదములను నింపినాఁడు. చూడుఁడు.

అథాజినాషాఢధరప్రగల్భవా
గ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా
వివేశకశ్చిజ్జటిలస్తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా

మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతి ప్రగ
ల్భుండు నీ
రజబంధు ప్రతిమానతేజుఁడు జటారాజచ్ఛటా
తామ్రమూ
ర్ధజుఁడేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రా
మార్థముంబోలెనా
త్రిజగన్మోహనమూర్తి సన్నిధికి నేతెంచెన్
వనాంతంబునన్

ఇందు 'ప్రగల్భవాక్' అను మూలమునకు "ప్రౌఢతర భాషాతి ప్రగల్భుండు" అని, 'జ్వలన్నివ బ్రహ్మమయేనా తేజసా' అనుదానికి 'నీరజబంధు ప్రతిమాన తేజుఁడు' అనియు 'జటిలః' అనుదానికి "జటారాజచ్ఛటా తామ్రమూర్ధజుఁడు" అనియు, శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా అనుదానికి "వటుండు బ్రాహ్మణుఁడు" అనియును అనువాదములు. మూలశ్లోక పదములందుఁ గలసొగసు ఈవివరణమున నావంతేనియు రాలేదు. మూలశ్లోకము వంశస్థ వృత్తము. ఇది చాల చిన్నది. మత్తేభము పెద్దవృత్తము. ఇట్టిదానిని గ్రహించియుఁ గవిమూలచ్ఛేదమునే చేసినాడు. మరొకటి చూడుఁడు.

అపి క్రియార్థం సులభం సమిత్కుశం జలాన్య
పిస్నాన విధిక్షమాణి తే
అపిస్వశక్త్యా తపసిప్రవర్తసే శరీరమాద్యం
ఖలు ధర్మసాధనం.

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమంబౌనె?
యంభోజ పత్త్రదీర్ఘాయతాక్షి;
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు
సులభంబులైయున్నె సుందరాంగి!
సత్త్వంబులన్యోన్య జాతివైరముఁదక్కి
శాంతిఁగైకొనియున్నె ? చంద్రవదన!
అనుదినంబును దేహయాత్రకాయితమౌనె!
నీవారపాకాది ? పూవుఁబోఁడి!

గీ. శక్తికొలఁది తపశ్చర్య సంఘటింతె?
ఫలముపైనాసనాగ్రహ బంధముఁడిగి
తామ్రబింబోష్ఠి! ధర్మసాధనములందు
నాద్యమగు సాధనంబు దేహంబుగాదె?

పైశ్లోకమెంత యున్నది? ఈసీసమెంతయున్నది? ఇంతవృత్తమును గ్రహించుటచేఁ గవిపాదపూరణము

నకైమూలమున లేనివానినిందుఁ జొప్పించి యధిక ప్రసంగముఁజేసినాఁడు. శ్రీనాధుని యీపద్యములు యువతిని ముదుసలికిచ్చి పెండ్లిసేసినట్లున్నవి.

వృత్తరత్నావళీ కామాదస్థానేవినివేశితా
కధయత్యజ్ఞతామేవ మేఖలేవగళేకృతా.

అస్థానమున నుపయుక్తమైన వృత్తము గళమున ధరించిన రవ్వలవొడ్డాణమువలె నజ్ఞతను వెల్లడించును. ఇట్టిచో "రమ్యాణాం వికృతిరపి శ్రియంతనోతి అనియున్నదిగదా"! యని కొందెు ప్రశ్నలువేయు దంటలుగూడ నుందురు.

సంస్కృత కావ్యములలో నూటికిఁ దొంబది తొమ్మిది కావ్యములలోని వృత్తములు చిన్న చిన్నవే. వంశస్థము, ఇంద్రవజ్రా, ఉపేంద్రవజ్రా, వియోగినీ, శాలినీ, మొదలగునవి. ఇవి మన ఉత్పల చంపకాదులతోఁ బోల్చఁగాఁ జాల చిన్నవే. ఆంధ్రమునందలి యతిప్రాసల పద్ధతియందులేదు. కావున వ్యర్థపదములులేకుండ సంస్కృత వృత్తములును సౌజ్ఞముగానుండును. కాన ఆంధ్రవృత్తములు పెద్దవియగుటకుఁదోడు యతిప్రాసల పద్ధతివలన నాంధ్రీకృత పద్యములు వ్యర్థపద భూయిష్ఠములుగా నుండును.

సంస్కృత శ్లోకముల ననువదించునపుడు యతి ప్రాసలు దీసివేసి రచించినచో వ్యర్థపదములులేక సంస్కృతశ్లోకములలోని భావమును సరిగాఁదీసికొని రావచ్చును.

వర్ణనాభాగమున నొక్కొక్కచో సీసము, శార్దూలము మొదలగువానిని వాడినను విశేషించి వాని నుపయోగింపక వెనుక నొడివిన విధమున స్రగ్ధరా, శార్దూల, ఉత్పలములు రౌద్రవీరభీభత్స, అద్భుత రసములందును మత్తేభచంపకములు శృంగారహాస్య కరుణ, భయానకములందును, గీత, ఆటవెలదికంద ములు శృంగారశాంతములందును ఉపదేశికకార్యము లందును (సుమతిశతకము, వేమనశతకము) నుపయోగించుట లెస్స.

మనకవులు పిడుగునకును బియ్యమునకును నొకే మంత్రమును పఠించిరి. ఆంగ్లమునఁగూడ నీవృత్తౌచిత్యముగలదు. శృంగారమున Sonnets అను వృత్తమును, వీరమున Ballod అనువానిని నా కవులు వాడుదురు,

పుస్తకంబులలోనిమాటలు
విస్తరించుచు ననుభవమ్ముల
తత్త్వమెఱుగక శుకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్

గురిజాడ.—

# తెలుగు కన్నడముల చుట్టరికము

★

విద్వాన్

## శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

—: నమోమహద్భ్యః :—

ఆంధ్రసారస్వత పరిషత్సభలయందీ "కన్నడపు గొడవ" యేమని మీరాశ్చర్య పడుదురనుకొం దును. కాని తమరుకొంతయోపిక పట్టినచో నా యీ "కన్నడపు గొడవ" కిచ్చట నవసరమేమి వచ్చినదో యవగతముకాగలదు. తమరు దయచేసి కొంతసావధానముగ--మనవి వినవలెనని ప్రార్థన, మన ప్రక్కనే యున్న మహారాష్ట్రులు--ఆంధ్ర కవులను గుఱించి యింతకుముందే అంతయో యింతయో తెలిసి కొన్నారు. చాలనిదాని కిప్పుడు తెలిసికొను చున్నారు. వారి ప్రసిద్ధ గ్రంథమగు "దాస విశ్రామధామము" నందు మన పోతనా మాత్యుని చరిత్రయున్నది. భద్రాచలరాముని దరి సనమునకు వచ్చినపుడు - శ్రీ సమర్థ రామదాసు - కొన్ని తెలుగు పాటలు వ్రాసినారు. ఆ కృతు లను వారు జాగ్రత్తపరచికొని "యివి మా వారు తెనుగున వ్రాసిన కవితలని గర్వపడుచుందురు. మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపకుడగు సమర్థులు, హంపిని దర్శించెననియు - తల్లికోట యుద్ధము నుండి యాతడెన్నియో గుణపాఠములు నేర్చుకొనె ననియు చాటుటకు మహారాష్ట్ర చరిత్రకారులు జంక లేదు.

నేనొకసారి పండరివెళ్లినపుడు ఒక మరాఠీ విద్వాంసుడు తెనుగు కృతులు బాడించుకొని ఆప్యాయముగ వినెను.

కన్నడి గలకుఁ దిక్కన పలుకులన్న అమితమైన యపేక్ష. సోమయాజి భారతమును నేను చదువు చున్నపుడు - రాత్రియంతయు కట్టుగదలక - కూర్చొని విన్న కన్నడకవు లెందరో నా మిత్రు లున్నారు.

మన పొరుగువారగుతమిళులకు తెనుగు పై గల యభిమానము మనకు క్రొత్త విషయముగాదు. తెనుగు సరిగా రాకున్నను "పోతన భాగవతమును" జదువ తహతహ పడు తమిళులనే నెఱుగుదును. మనము వారిని చూచి "మీ జాతి మాత్యాగయ్య పాటలను పాడుచున్నది" యని యిగిలింతుమే గాని, వారు పాడకవిడచినపుడాకృతులను జెఱుపక నిలుపుకొను యోగ్యతకూడ మనకు లేదన్న చో - మనము నొప్పి పడవలసినపనిలేదని తలంతును. ఇక మన సహన గుణము నొక మాట మనవి సేతును.

ఒక సారి గుంటూరులో కుమారవ్యాసుని భార తమునుండి కొన్ని వృత్తములు జదువ వలసిన గతి నాకు బట్టినది. అప్పుడు సభయందున్నవారు-నేను జెప్పుదానిని వినుటటుండ - నా కన్నడ పద్యముల సరిగ జదువనీయక సరసుల సభను సంత బజారుగ మార్చిరి. నేను గూడ - ఆ స భ లో గన్నడ పద్యములు జదువుటెమోయపరాధము గావించినట్లు భావించి సిగ్గుపడవలసి వచ్చినది. అయినచో ఆంధ్రుడు - ఆంధ్ర భాషను, ఆంధ్ర దేశమును - ప్రేమింపవలదా? "స్వదేశ భాషా ప్రలోభము"

లేని నాడు వాడేమాంధ్రుడు? అని కొందరు అంకెవేతురు. తన దేశము-తన భాష-వీనియందభి మానముండ గూడ దని నావాదముగాదు. నాకును తెనుగుపై నంతయో ఇంతయో యభిమానము లేనిది ఇప్పుడిచ్చటికి వచ్చి తెమనదుమనిలచుటయే తటస్థ పడదుగదా? కాని - నామనవి యేమనగా, మన భాషపైనున్న యభిమానము - ఇతరులను ద్వేషించు దురభిమానముగా మారగూడదని. ఇతరులను తెక్కి రించిననే "పదహారణాల" ఆంధ్రుడనుకొనెదు ఆ "పదహారణాల పై నాకు నమ్మకము లేదు. ఎన్ని భాషలు సాధ్యమైన నన్నియు జదివి ఎన్ని సంస్కృతులు సాధ్యమైన నన్నియఱిగించుకొని తమ భాషను బలుపు గూర్చుకొనవలెనని నమ్మువారిలో నేనొకడను. పైగా కన్నడము-తెలుగు-అరవము- యీ మూడును ఒక తల్లికి గల్గిన సంతానమువంటివి. ఇవి పరస్పరము కీచులాడుకొన్న చోనది తీరులేని సంసారమగుటదప్ప లాభము లేదు. ఈ మూడు భాషలయందును కొంచెమో గొప్పయో పరిశ్రమలే నిది వీనిలో నేదియు సరిగా వచ్చినట్లగ్గముగాదను విశ్వాసము నాకు చాలగలదు. అదియట్లుండె.

తమిళమునకును తెనుగున కెంతటి సంబంధ మున్నది. ఈ రెంటికి పరస్పరాదాన ప్రదానము లెట్లు జరిగినవి? అనునది నా కిపుడు చర్చనీయ మగు విషయముగాదు. మ త్తే కన్నడమునకును తెనుగునకును గల బాంధవ్యమును దెలుపుచుతొల్లి నుండి వచ్చిన వానిమైత్రిని మీరయెదుట మనవి సేయుటయే!

కర్ణాటకమునకాంధ్రులతోడి సంబంధము - కన్నడము తోడి పొత్తు యాంధ్రులకునాటిది నేటిది గాదు! మన శాలివాహనులు గన్నడమేలిరి? హారీతపుత్ర శాతకర్ణిదొక ప్రాకృత శాసనము గలదు.

అది "శికారిపురం తాలూకు" మళవల్లి గ్రామ మున నున్నది. ఆ యూరునందలి యీశ్వరు నకా శాతకర్ణి మహారాజొక భూమిని దానమొసంగెనట. ఆ తాలూకాయందే గల తాళగుందయనెడు గ్రామ మునందు ప్రణవేశ్వరాల యమునదొక శాసనమున్నది. ఆ శాసనము 5వ శతాబ్దమునాటిది? అక్కడి యీశ్వరుడు హారీత పుత్రునికి ముందటనుండియు, నా తంశము వారిచే బూజింపబడెనని దానియందు గలదు.

చిత్ర దుర్గమందాంధ్ర భృత్య రాజుల ప్రతినిధి యొకడుండెనని - అక్కడ దొరకిన నాణెములవలన దెలియుచున్నది. అవి సీసపునాణెములు. ఆంధ్ర భృత్యులనాణెములు గూడ గొన్ని యట కాన్పించి నవి. వాని పై బోధివృక్షము ముద్రింప బడినది. భృత్యరాజుల సామంతుల నాణెముల పై వృషభ మును బోధవృక్షమును గలవు, రాజుల ముద్రికలపై "చుటుకడానంద" అను పేరులుగాన వచ్చు చున్నవి ఇవి యే రాజులనామధేయములో చారిత్ర కులు చెప్పగలెను!

రాయల కాలమునందు - కొండవీడే - గాక కటకమువరకు తెనుగు దేశమేనంటిమి. అట్లే - కన్నడిగలు గూడ నొకనాడు గౌతమీ గంగనుండి కావేరిదాక కన్నడమేనని పలికిన మాట మనము మరువరాదు.

"కావేరి యింద గోదావరి వరెగమిర్దా వసుధా తళితళియ భావిసె కర్ణాటక జనపదవ నావ నొలిదు బణ్ణిసువెను."

ఆంధ్రరాజులు తెనుగు కవితను పోషించినట్లే కన్నడమును గూడ పోషించినవారని కర్ణాటకులు నేటికిని మనకిన్న యెక్కువ గర్వపడుచుందురు!

కాకతి ప్రతాపరుద్రుని యాస్థానమునందు 'రాఘవాంకుడను కన్నడ కవియొకడుండెను, ఇతడు వీరేశ్వరి చరిత్రను రచించినాడు. దీని నా మహాకవి నిందు సభలో జదివి-తన్నుగాదన్న కవుల వాగ్బంధనముగావించి ప్రతాపరుద్రుని చే మరియాద లందెనట-మహాప్రసిద్ధుడై "యల్ప శబ్దముల కన ల్పార్థ రచన గల్పించి" పరవాది భయంకరుడైన" పాలుకురికి సోమనాథుడు మనకు గ్రొత్తగాడుగదా?

ఇతడు సిగ్గుదయ్యకాకతీయుల యాదరము బడ సెనను టెవ్వరెరుగరు! పాలకురికి సోమనా

ఘుఁడు గన్నడమునందు మహాకవిఁగాఁ బరిగణింపఁబడెను. ఇతనిని యుద్దండునిగా స్తుతించిన కర్ణాటక వులెందరోయున్నారు. ఇక చాళుక్యవంశము కన్నడమునకు గావించినసేవదొడ్డది. మన మెఱిగినంత వఱకు కర్ణాటమున ప్రథమ మహాకవిపంపడు. ఇతడు పశ్చిమ చాళుక్యరాజు 'అరికేసరి' యాశ్రయమునందుండెను. గదా యుద్ధమును రచించిన రన్నడుగూడ చాళుక్యులనే యాశ్రయించి బ్రదికినాడు. చాళుక్యవంశమున నున్న పూర్వపశ్చిమభేదము - ఒక కొమ్మయందున్న రెండు పూవులవంటిదేనుట నేను జెప్పవలసినది లేదు.

పశ్చిమ చాళుక్యులేగాక - మనవారగని, మనము మురియుచున్న పూర్వచాళుక్యులుగూడ కన్నడమును నిరాదరించినట్లులేదు, గుణగాంక విజయాదిత్యున (884 - 888) కంకితముగా, 'గుణగాంకీయము'అనెడు ఛందో గ్రంథము కన్నడమునగలదు. మన నన్నయ భట్టారకునకు 'నారాయణభట్టు - సాయమొనర్చిన నారాయణభట్టు కర్ణాటభాషలో' మహాకవిగా పేర్కొనబడినాఁడు అసలు - నన్ని - యనగా సుందరుడనియు - కావుననన్నియ. కర్ణాటకుడనియు నొకవాదమున్నది. దీనికుపబృంహకముగా - నంగిపూడి శాసనమునందు వాడిన "నన్ని నారాయణ భట్టు" అనుపదమును జూపుచున్నారు.

నన్నయ తెనుగువాడైనను - మనకు బాధనష్టములు రెండునులేవు. అతడుచేసిన మహాకృషి యున్నది. అతడు కన్నడిగుడా? తెలుగువాడా? అని తనుకులాడుటకంటెను ఆ భట్టారకుని భారతమును మరి రెండుసార్లు చదువుటమంచి దనుకొందును.

శ్లో. యస్సంస్కృత పైశాచిక కాంధ్ర భాషాసు,
కవిరాజశేఖర యితి ప్రథిత స్సుకవిత్వ విభవేన.

ఈ దురావేశములతోనే - మన వేములవాడ భీముడు - కర్ణాటకవియని కన్నడిగలన్నను మన మంగీకరించుటలేదు. కర్ణాట కవియైన భీముఁడు వేఱొకడని బదులిచ్చుచున్నాము, నాడు జూడ నానాడీపట్టింపు నేడు మనకున్నంతగ వారికిలేదు: రాజులు రాజులు పోట్లాడుకొనుచున్నను - విద్యార్థికులు - కవులు - సామాన్య ప్రజమాత్రము కలిసిమెలసి యేబ్రదుకుచుండిరి. రాజులైనను తమ తమ యధికారముల కొఱకు గత్తులు నూరుకొనిరేగాని - భాషాభేదములకు మాత్రముగాదు. అది యప్రకృతము.

హంపె నేలిన నాలుగు వంశములు - ఆంధ్రమునకు గావించిన - యపారసేవ - యిట్టిదని నేనిపుడు చెప్పబూనుటనగుబాటు. వారుగూడ "కన్నడరాజ్య రమారమణా" కన్నడరాయా అని చెప్పికొనిరేగాని. ఇది మన కెఱువు సొమ్మని దానినెత్తి పారవేయలేదు. నేఁజెప్పదలచినదేమనగా వేఱేదియుంచుకొన్నను - ఆ నాడు వారికి పెద్దబాధగా కన్పించలేదు. కృష్ణరాయల యాస్థానమందరవ కవులెందరో యుండిరి. సూది మా భాష కాదు గనుక మాజాంబూనదాగ్రహారము ఒ సూకందవని రాయలు వారినవలింపలేదు. సరిగదా! వారికి మన్ననలొసగి - వారితో గావ్యములు వ్రాయించెను.

హంపిని బరిపాలించిన సంగమవంశము ఆంధ్రులో - కన్నడిగలో నేటికింకను "ఇది ఇట్టి"దని తెలియదు. వారు హొయిసలులని కర్ణాటకులందురు.

కాకతీయులకు సామంతులుగ నుండిరనియు, సంగమ వంశము కాకతీయులశాఖయేగాని వేఱు గాదనియు తెలుగులవాదము. ఆ సంగమ వంశజులు - తెనుగును కన్నడమునుగూడఁ బోషించిరి, మొదటి హరిహరుని కాలమున "మంగరసు ఖగేంద్రమణి దర్పణము"ను వ్రాసెను. రెండవ హరిహరునియాశ్రయమున మధురకవి "ధర్మనాథ"పురాణమును రచించినాడు. మొదటి బుక్కని కుమారుడగు - కంపరాజ సుతుడైన దేవరాయడు - కన్నడమునందొక మహాకవి. ఇతడు "సొబగిన సోనె" యను గ్రంథమును వ్రాసెను. అమరుకము నీకవి-కన్నడీకరించినాఁడు, తన కావ్యములందాతడు తన్నుగుఱించి - "సంగమేంద్రకులదింగదలిగె నెరె దింగళెనిప కంపసుతను" అనియు "మహీపతికుల రత్నాలయ రాకామృతరుచి" యనియు వాడుకొనెను.

ఈఅనువాదమున ఛందస్సునందొక యొయ్యార మున్నది. ఈ కాలమునకు గొంచెము వెనుకగా - రెడ్డిరాజు శ్రీనాథునిసాయమున అమరుకనువ్యాఖ్యా నించినది మనము మరువరాదు.

రెండవ దేవరాయల కాలము - కన్నడమునకు - తెనుగునకు రాయలయుగమువంటిది. అతడు శైవాభి మానియై - అనేకులకు వీరశైవకవుల కాశ్రయ మిచ్చెను "శివతత్వ చింతామణి"ని వ్రాసిన "లక్కణ్ణ" దండేశుడు మహోద్ధతుడు. శివభక్తి స్వరూపమేయాతడు. మహాకవియేగాక - మగతనము నెఱపినజోదు. సింహాళముపైనెత్తి - ప్రౌఢదేవరా యనికి దానిని సాధించియిచ్చిన దాతడే. అతనికి దక్షిణ సముద్రాధీశ్వరుడని బిరుదుండెనని సమకా లికులాతని పొగిడిరి.

ఈ లక్కణ్ణ దండేశుడు విష్ణువర్ధన గోత్రుడు హెగ్గడెదేవ బమ్మాయమ్మల సుతుడు. ఇతని సోద రుడు మాదణ్ణ దణ్ణాయకుడు. "లక్కణ్ణముళు బాగలు" ప్రాంతమున కధీశ్వరుడుగనుండెనట ఈ దండనాథుని శివతత్వ చింతామణినిగూర్చి పొగడిక గద్దు.

ప్రౌఢదేవరాయనికి భౌతికముగ - నాధ్యాత్మి కముగ గలిగిన గొప్ప తనమంతయు నీతనిమూలము ననేయని యానాటి జనులందరు నమ్మిరి. జక్కణా చార్యుడుకూడ ప్రౌఢదేవరాయనికడ దండనాయ కుడుగనుండినవాడు. అతడు వ్రాసిన వచనములు ప్రసిద్ధములు.

చామరసు ప్రౌఢదేవుని యాశ్రయమందుండిన యొక వీరశైవకవి. ఇతడు కుమారవ్యాసునకు బావ యట. ప్రౌఢదేవరాయలు కుమారవ్యాసుని బిలిచి మీరు వేర్వేరుగా భారతమును వ్రాసికొని రావల యునని యాజ్ఞాపించెనట, అట్లే తెత్తుమని వారిద్వరు సమ్మతించి తమ తమ రచనలు సాగించుచుండిరి.

చామరసు తన భారతమును గొందరు కవులకు జదివి వినిపించినాడు. యుద్ధపర్వము లామహాకవి జదువుచున్నపుడు రక్తము కాలువకట్టి పాఱిదొడగె నట. దానికద్భుతమంది కవులు చామరసును బ్రహ్మాండముగ బొగడిరి. ఈ వృత్తాంతము కుమార వ్యాసునికి దెలిసి చామరసు రచించిన భారతమున్న తన గ్రంథము వ్యాప్తికిరాదను మద్దేశముతో భార్యను బిలిచి నీవెట్లయినను మాయన్న రచించిన భారతమును నాశనము జేయకున్నచో నేనాత్మ హత్య జేసికొందునని బెదరించెనట ! ఆమెయు పతి వ్రతాధర్మము నెరవేర్చినది. చామరసు రచించిన గ్రంథమును రహస్యముగ నగ్నిదేవునకు - నామె ఆహుతియిచ్చినది. చామరసున కావృత్తాంతము దెలిసి చాల బాధపడుచుండెను. అపుడు పరమ శివుడు కలయందగుపడి యూరార్చి

"అన్యదైవకీర్తి నువదుంటే"యని ప్రశ్నించెనట, అందుపై చామరసు విరక్తుడైనాడు. ఇంతలో - కుమారవ్యాసుడు భారతరచన ముగించెను అపుడు ప్రౌఢదేవరాయడాతనికి కనకాభిషేక మేర్పాటు చేసినాడు, చామరసు - అచటికివచ్చి - సభలో నిలువబడి "సత్తవన కధెగుంటె - కనకస్నానతెగె" యని యరచినాడట, అపుడు - రాయలు "ధారుణి యొళుళ్ళకథె యెల్ల సత్తవరకథె" "తోరుబమకిదర కథె"యని ప్రత్యుత్తరమిచ్చినాడు. వెంటనే చామ రసు "ప్రభులింగలీలను" వ్రాసితెచ్చెను. ఆ రాజు సంతోషించెనట. పై వృత్తాంతము యథాప్రకారము మన నన్నయాథర్వణులకథవలెనెయున్నది. కుమార వ్యాసుడొక యుద్ధతుడైనకవి. అతని భారతమున కున్న వ్యాప్తి కన్నడమున మరియే గ్రంథమునకును లేదు. అట్టివాడు గ్రంథపాతమువంటి, దుష్కార్యము జేసియుండునా? చెప్పలేను. ఇంతకును కుమార వ్యాసుడు రచించినది భారతమున 10 పర్వములే. భారతము పూర్తియైన మీదటగదా కనకాషేక ప్రసక్తి కనుక నాకథయసత్యమని దానిముఖమే దెల్పుచున్నది. వీరశైవులకును వైదికమతానుయాయు లకును జరిగిన వాగ్యుద్ధములలో నిట్టితలయు తోక యులేని కథలెన్నియో పుట్టినవి.

కుమారవ్యాసుడు కన్నడ సాహిత్యమునకు హేమ మయ కిరీటము. ఏ దేశీయుడైనను తిక్కనను

జదువుటకెట్లు తెనుగు నభ్యసించి తీరవలయునో- అట్లే కుమారవ్యాసుని కొరకై - కన్నడమును జదివి కొనవలెను. కన్నడిగలు చిత్రవిచిత్రములగు గమకములతో నాభామినీషట్పదుల జదువుచున్నపుడు మనకు పులకాంకురములు జనించును. మన మందరము పోగొట్టుకొన్నను కన్నడిగలలో నింకను "గావ్యపఠన" మొక కళగా బరిగణింపబడుచున్నది. అట్టి వారికి గూడు గూడ బుట్టుచున్నది-

కుమారవ్యాసుని సొంతపేరు నారణప్ప. గదుగు వీరనారాయణోపాసకుడు. "శ్రీమదచింత్యమహిమ గదుగువీరనారాయణ చరణారవింద మరంద మధుపాన పుష్టవచ ష్షట్పదీనికాయ"యని - యతని యాశ్వాసాంతములు.

మన తిక్కన భారతమునకు - కుమారవ్యాసుని రచనమునకును పోలిక లేమాత్రమును లేవు. తిక్కన శాంతుడు అతడుద్ధతుడు. సోమయాజి జ్ఞాని-కుమారవ్యాసుడు భక్తుడు. ఔచిత్యము సోమయాజికి పరమప్రాణము. ఔచితినిగూడ నెట్టెడు రసపోషణము కన్నడకవికి జీవము. సోమయాజి సంసారి - అతడు విరక్తుడు, కేవలము అర్థముపైననే దృష్టి నుంచుకొని శిల్పము గావలసినంత మాత్రమే వాడుకొనుచు రచనమును నడుపువాడు ఉభయ కవిమిత్రుడు.

శైలియందు నాదశుద్ధిని ప్రధానముగ ననుసంధించి కొనుచు అడినప్రతిపదమును - భావమును శిల్పముతో బలుకవలెనను ఆసగలవాడు కుమారవ్యాసుడు. అట్టి కవి మనకు శ్రీనాథుడున్నాడు. అతడు కుమారవ్యాసుని ఖచ్చితముగ ననుసరించెను ఆ విషయమును వేఱుచోట జర్చింతము

మహాప్రసిద్ధులగు వీరేగాక ప్రౌఢదేవుని యాదరమున జీవించిన యితర వీరశైవకవులును గుప్పలు తెప్పలు. జైనయుగముతో నారంభమైన కన్నడక్షేత్రమున వీరశైవులపంట పండుచుండిన దినములవి-మగ్గయమాయిదేవుడా నాడొక శతకకవి, అతని శివభక్తి యపారమైనది. మాయిదేవుని రచనలు భక్త్యుద్రేకమనెడు యమృత సరస్సున వికసించినతామరలు. శివాయన్నంతనే - యతనికొడలు పులకరించును పాల్కురికి సోమనాథుని యుద్రేకము రాజసికము మరి మాయిదేవుని భక్త్యుద్రేకము సాత్త్వికమైనది. శివునియెడుట నాతడుబాలునివలె నేడ్చును. ప్రియురాలివలె శివస్వరూపమునువలచును. అంతటి యుద్రేకమునందును, దనయపథనిమరువని జ్ఞానదృష్టి మాత్రమాతనికి నీడవలె వెన్నంటియే వచ్చుచుండును.

ఇంకను నాకాలమునను్న చిన్నలను పెద్దలను విసరించుచు గూర్చున్నచో నీ వ్యాసముముగియదు. సంగమ సంగియుడగు మల్లికార్జుని యాస్థానమున కల్లరసు యొకడున్నాడు.

విరూపాక్షరాయల కాలమున "తోంటద సిద్ధలింగకవియుండెను, సాళ్వనరసింహరాయల యాదరాభిమానములతో కపిలింగడు బ్రదికెను. ఇక - సాహిత్యసమరాంగణ సార్వభౌముని యాస్థానమలంకరించిన కవి "తిమ్మణ్ణ" ఇతనికి కర్ణాట కవిసార్వభౌమయను బిరుదుండెడిది. కుమారవ్యాసుడు వ్రాయకవిడిచిన శాంతి పర్వమునుండి యారంభించి- భారతమునీతడు ముగించినాడు.

ఇక నచ్యుతరాయల ప్రసాదమంది బ్రతికినవాడు "చాటు విఠలనాథుడు"-సదాశివరాయల కాలమందుండిన నలక రాజపుత్రుడు తిరుమలయ్య-కర్ణాట- "కాలజ్ఞానకర్త" యొమ్మెబసవనికి భూదానము జేసినట్లు శాసనమున్నది - పెనుగొండయందు - సింహాసన మెక్కి రాజ్యమేలిన యార్వీటి శ్రీరంగరాజు (1573-1584) సరసత్వమా శ్రయముగా భట్టకలంకుడు జీవించినాడు, ఇతడానాడు గొప్పవాచకుడు ఈ భట్టకలంకుడు - చంద్రగిరిలో రాజ్యమేలిన వెంకటపతి రాయలయొద్దగూడ నుండె - మరి యాదలండెను. ఈ రీతి విజయనగరాధిపతులేగాక వారి సామంతులుగూడ గన్నడమున కొసగిన పోషణము సామాన్యమైనదిగాను, మరి కర్ణాటభాషావృద్ధియందు ఆంధ్రులకెట్లు భాగము లేకపోయినది? కన్నడమును మేము పోషించితిమని - తెనుగువారమైన మనము గర్వపడకుండుట ఆమాయిక తనమనవలెనా అజ్ఞానమనవలెనా ?

నేను పైనమనవి చేసినట్లుగా గన్నడము నాదరించిన తెనుగురాజులేగాక - కర్ణాట భాషయందు మహాకావ్యములల్లిన యాంధ్రులున్నారు. ఒకవేళ వారు జన్మతః కన్నడిగలైనను నెంతయోకాలమునుండి ఆంధ్రమునే తమ మాతృభూమి యనుకొన్నవారున్నారు. పాల్కురికి సోమనయాంధ్రుడేగదా! అతని జన్మస్థానము రాయలసీమయందలి నేటి హిందూపురము దగ్గరనున్న పాలకురికియే (?) ఆ సోమనాథుడాంధ్రము నందెంతటి పెద్దవెలుగో - కన్నడమునందును నంతటివెలుగు. అతని గ్రంథములు నేడొకటి రెంటికంటె కన్నడమునందెక్కువ దొరకుటలేదు. కాని యాతనిని స్తుతించిన కవులనేకులు - ఈయున్న యొకటిరెంటితో నంతటిపేరు ప్రఖ్యాతులామహోద్ధతునకు వచ్చియుండవు. సోమనాథుని గ్రంథములయందు - కొన్ని లుప్తములై యుండునని నాతలంపు. సోమ - నికి పండితత్రయము - ఆంధ్రులేగదా! కన్నడమునందు వారి రచనములుగొన్ని యున్నవి. ఇంతియేల - కర్ణాటకమున తొలుతటి మహాకావ్యకర్త - కన్నడ సాహిత్యమునకు భిక్షపెట్టిన "పంప" డాంధ్రుడు. పంపని భారతమును చదువనిది కర్ణాట వాఙ్మయ ప్రసక్తియే లేదు. తన పూర్వులనుగూర్చి - పంపడిట్లు చెప్పికొన్నాడు తన వంశము వారు, "ఆమలయాచల హిమగిరి సీమావనితలం దల్లి" ప్రసిద్ధులట వారి నివాసము వేంగిమండలమునందలి "వేంగిపట్టు" ఆ విప్రులయందు - వత్సగోత్రోద్భవుడైన మాధవ సోమయాజియుండెను. ఇతడనేక యజ్ఞములు గావించిన పవిత్రుడు - పండితులకు తలమానికము - ఇతని కుమారుడభిమాన చంద్రుడు - మహాదాని వీనిసుతుడు కొమరయ్య, ఇతడు వేదవేదాంగపారగుడు - ఇతని కొడుకు అభిమానదేవరాయుడు, ఈతడు బ్రాహ్మణ ధర్మమునువిడచి జైనమును స్వీకరించెను. ఈతని కుమారుడే మహాకవి పంపడు. ఈ పంపడు - మహాకవియేగాక ఖడ్గమునుబట్టిన మహాయోధుడుగూడ. తరువాత నెందుకో పంపడు జన్మభూమిని విడచెను. పశ్చిమచాళుక్యరాజు - అరికేసరి - యాదరించుటచే-నాతడు-రట్టరాజ్యమునందు నిలచినాడు మైసూరున నుత్తరమున శివమొగ్గ ప్రాంతమును, ఉత్తరకర్ణాటక జిల్లాలును-ఆనాడు రట్టరాజ్య మనబడుచుండినవి. పంపడు "బనవాసి" నెక్కువగా వర్ణించుటచే-నరికేసరి కడకు రాకముందాతడు - వనవాసియందుండెనో పునని చారిత్రకులూహించుచున్నారు. కన్నడ దేశమున బ్రదికినను-ఆభాషయందే మహాకావ్యము వ్రాసినను జన్మభూమియగు వేగిమండలముపై నాతని కభిమానము పోలేదు పాపము. తన భారతమున సమయము చిక్కినపుడంతయు తెనుగుదేశమును దడవును.

ఇక విజయదండనాథున "కనుపమకవి" యనియు "అలుపింగోజ" అనియు బిరుదులుండెడివి! ఈతడు రచించిన గ్రంథములేవియు నేడు దొరకుటలేదు. ఇతడు-రాష్ట్రకూటరాజగు-నింద్రునికడ దండనాయకుడుగనుండెను. అమిత పరాక్రమవంతుడు ముసలితనమున సన్యాసియై మరణించినాడు. ఇతని శాసనము కడపమండలమునందలి "దానవులపాడు" అను గ్రామమున నున్నది. దానియందు విజయదండనాథుని స్తుతి గలదు.

ఇతడాంధ్రుడో! కర్ణాటకుడో! పేరునుబట్టి కర్ణాటకుడనుటకు వీలులేదు. ఆంధ్రదేశమునందైనను కన్నడమునందైనను - జైనుల పేరులొకరీతిగనే యుండును. "సుకుమార చరితమును వ్రాసిన శాంతినాథుడు కుండకుందాన్వయుడు. ఈ కుండకుందుడు-జైనులలో బ్రసిద్ధుడు. ఈతడు - మన గుత్తిదగ్గర నున్న "కొనకొండ్ల" లో నుండెనని చెప్పుదురు. నరహరితీర్థులు జన్మమునుబట్టి కన్నడిగ. ఈతడొక మాధ్వకవి. కన్నడమున పదకవితలు రచించెను. వీరు గంజాము ప్రాంతములందధికారము నెఱపిరి. వీరి శాసనములు-చికాకోలు" ప్రాంతమున గలవు.

గురుదేవుడాంధ్రుడు మరియొకడున్నాడు. ఇతడు కర్ణాటకమున ననేకస్తోత్రములు రచించెను. ఈ గురుదేవుడు పండితారాధ్యవంశజుడు. వీరశైవాచార ప్రదీపిక" యందు-తనవంశమునిట్లు చెప్పికొన్నాడు:-

"ద్రాక్షారామద కోటిపల్యాఖ్య దేశికమణి భీమపండిత అవన హెండతి గౌరమాంబ- ఇవరమగ

మల్లికార్జున పండిత- ఇతను వెలనాడు చోళన ఆస్థానదల్లి- వాదిగళన్ను జయిసిదను, మగ పండితారాధ్య, మగవీరారాధ్య, తత్ప్రతీక సంభూత గురు బసవ, మక్కళు గంగాధర బసవ, వసవన మక్కళు హిరియార్య, పండితార్య, పండితార్యనమగగురులింగ, మక్కళు గురుదేవ, పండితార్య, బసవారాధ్య, జక్కనాథ''... ఈ గురుదేవుడు- కవియేగాక వ్యాఖ్యాతగూడ.

ఇక మిగిలినవాడు భాస్కరకవి. ఇతడు పదునైదవ శతాబ్ద పూర్వార్థమందున్నవాడు. జైన బ్రాహ్మణుడు. విశ్వామిత్ర గోత్రుడు. బసవాంక సుతుడు. అనంతపురముజిల్లా పెనుగొండ యందుండెను. ఈ విషయమునుతానే ''పెనుగొండ యశాంతీశ్వరన జిననాసదలి, జీవంధరచరితెయ రచిసిదను'' అని చెప్పి కొన్నాడు. ఒకనాడు పెనుగొండ జైనులకు మహా పుణ్యక్షేత్రము- జైనులకు పుణ్యక్షేత్రములు భాగతమునజైడు. అందులో పెనుగొండ యొకటి.

భాస్కరుడు తన సుయోగ్యతల నతిప్రౌఢముగ జెప్పికొనెను.

మరి రాజులమై వారికవుల నాదరించితిమి. మహాకవులమై వారి భాషయందు-(గవితల్లితిమి. వారి కవులకీర్తికి మన క్షేత్రములలో శిలాక్షరములు మొలిచితిమి. వారిని గురించి మనము తెలిసికొనవలసిన నెట్లు :-

కర్ణాటదేశము చాల ప్రాచీనమైనది. పూర్వకాలమునందు- దానికి, పున్నాట రాష్ట్రమని పేరు, రెండవ శతాబ్దిలోని- టోలమీ దానిని''పున్నత'' రాష్ట్రమన్నాడు. మైసూరు రాజ్యము నానాడు- ''మైనాడు రాష్ట్ర''మని పిలుచు చుండిరి, పైని జెప్పిన యీ పున్నాట రాష్ట్రమునకు- మౌర్య చంద్రగుప్తుని కాలమునందు- ''బాహుబలి'' యాధ్వర్యమున కొన్నిజైన కుటుంబములు దరలి వచ్చినవి. వారట్లు వచ్చుట కపుడు తరగిపోయిన దేశము- నాక్రమించిన ద్వాదశవర్ష క్షామము కారణము. మరి కొన్నాళ్లకు చంద్రగుప్తుడును విరక్తుడై- రాజ్యమునుద్యజించి- ''బాహుబలి'' నాశ్రయించెను. జైన గురువైన ''బాహుబలి'' శ్రావణ బెళగొళమున మరణించినాడు. మౌర్య చంద్రగుప్తుడు గూడ- తపమొనర్చికొనుచునటనే సమాధినందెనట.

కర్ణాటమును గాంగరాజులేలిరి. కదంబులు పాలించిరి. రాష్ట్రకూటులు చేపట్టిరి. మౌర్యులు కర్ణాట ప్రభువులై యుండిరి. ఒకానొకనాడాంధ్ర చక్రవర్తుల బావుటా రెపరెపలాడుచు- కన్నడపు కోటలకు వింతకాంతులు దిద్దెననుట మనము మరచిపోరాదు. కర్ణాట దేశమునందు జాల ప్రాచీన శాసనము లెన్నియో దొరకినను. ఈ క్రింది ''తుబ్జ శాసనమును జూడుడు. ఇది ప్రణవేశ్వర దేవస్థాన బహిర్ద్వార మందున్నది. ఈ క్రిందిది దానియందలి యొకశ్లోకము.

జయతి విశ్వవేద సంఘాత నిశ్చితైక మూర్తిస్సనాతనః
స్థాణురింపి రశ్మివ చ్చురితమ్యాతిమ జటాభార మండనః

పైదాని వంటివే- సుమారు పదునైదు శ్లోకము లాశాసనమందుగలవు, ఇవి యేజాతి వృత్తములో తెలియవు. ''కర్ణాట'' అనెడు శబ్దమునుగూడ తొలుత నైదవ శతాబ్దియందుండిన- వరాహమిహిరుడే వాడినట్లున్నది. తరువాత 9 వ శతాబ్దమందుండిన రాజశేఖరుని ''కావ్యమీమాంస'' యందీ శబ్ద ప్రయోగముగలదు. వివిధదేశములందలి పఠన పద్ధతులనాతడు వర్ణించుచు- ''హిండనపరాః కర్ణాటాః'' యన్నాడు. అనగా పదోచ్చారణము నందు తేలబలుకక- శబ్దములను పుట్టచెండ్లవలె- నెగురవేయుచు జదువువారని యర్థము. ఈ యలవాటును వారి గమకములలో- లావణీలను- షట్పదులను- బాడుచున్నప్పుడు- మనము చూడవచ్చును.

కన్నడదేశమువలెనే- నా భాషయుజాల ప్రాచీనమైనది. అత్యంత పురాతనములగు- గ్రీకు నాటకము లందుఁ గన్నడ పదప్రయోగములు గలవని యాభాషావేత్తలందురు. కర్ణాటకమును- బరిపాలించిన- రాజులలో శ్రీపురుష నృపతుంగ, తైలప- త్రిభువనమల్ల విష్ణువర్ధన- వీరభల్లాత

బుక్క- హరిహర కృష్ణరాయ- కంఠీరవనరసరాయ చిక్కరాయలు ముఖ్యులు. ఇకను గొందఱున్నారు వారి విద్వాంసులలో- విద్యారణ్యులు- భారత దేశమునకే తలపూవువంటివారు. విద్యాతీర్థులు- విద్యారణ్యుల కులగురువు.

వ్యాసరాయలు- కృష్ణరాయని కాలమునందును- తరువాతను నున్న- భక్తుడు ఇతని శిష్యుడే కర్ణాటక సంగీతమునకు భిక్షపెట్టిన పురందరదాసు. సంగీతమునందు తొలుత మాయామాళవ గౌళలో- స్వరసాధనముచేయు పద్ధతిని నెలకొల్పినది పురందరదాసే. వారనేక గీతములుకూడ వ్రాసివారు. మన సంగీతము నేర్చుకొనెడు తెనుగు పిల్లలు చాలమంది నేర్చికొనరు లెండు. ప్రతిదినమును

హేమకూట- సింహాసన
మందిరాయ- మానమకుట

మందారా కుసుమాకర-మకరందంవాసి తువా॥ అని చేసెడు- "పిళ్లారి గ్రొక్కులు" పురందరులు నేర్పినవే. హేమకూటము ".ఆంధ్ర కన్నడ రాజ్య లక్ష్ముల- కలతి నీలిపుదండ"యైన- హంపీలోనిదే. శ్రీపాదరాయలు వ్యాసరాయలకు గురువులు. వీరిది "ముళుబాగలు" రాఘవేంద్ర స్వాములవారు- నేటికిని దుంగభద్రాతటమున- బృందావనమునుండి- పిలిచిన "ఓ" యను చున్నారు. కనకదాసు- పురందరుల శిష్యుడు. శైవమునందు సర్వజ్ఞునివలె వైష్ణవమునకు సేవ గావించినవారు. అనంతాచార్య వేదాంతాచార్య సిద్ధరామ, తోంటద సిద్ధలింగ, నేమిచంద్ర శుభచంద్రునివంటి మరి కొందరున్నారు. పై వారిలో చాలా మట్టున కందఱును పదకర్తలు అనాటి ప్రజల సుఖదుఃఖములను- ఆవేదనలను ఆశలను- అభిరుచులను- అసమ్మతులను ప్రజల చాటునకు దూరముగాని భాషలో వెల్లడించిన ప్రజాకవులు పదునేడవ శతాబ్దియందున్నవారిలో సర్వజ్ఞుడొక మహా పురుషుడు అగ్నిపర్వతమునందలి యుడుకు ఆ మలయ మారుతమువంటి- చల్లని హాస్యమానుదులలోనున్నది. వానకారున ప్రవాహములవంటి దూకు డారచలనది "అల్పశబ్దార్థములన నల్పార్థముల" నా కవివలె యందించినవాడు- మరిలేడు. ప్రజాహృదయ మందతడుచొచ్చి చూడని కోనలేదు. మునుకలిడని యభిరుచి పూజ్యము. ఆకుల మీకుల మనక,ఆదేశ మీ దేశమనక అందరికిని శిరోధార్యమగు సందేశము లాతడువెదజల్లినాడు అన్నియాశలను దౌర్బల్యములను సానుభూతితో జూచినాడు. తన్నుగురించి తానే సర్వజ్ఞుడు ప్రజాకవి యిట్లనుకొన్నాడు.

సర్వజ్ఞనెంబవను గర్వదిందాదవనె
సర్వరొళొందొందు నుడిగలితు విద్యయా
పర్వతవె-ఆద! సర్వజ్ఞ

ఆమహాకవి-మనస్విని గురించి-ఇట్లు ప్రసంగాంతరమున నాలుగు వాక్యములు చెప్పినచో చాలదు. అతనినే గురించి కొన్నిఘంటలు ప్రసంగింపవలసినంతటి దొడ్డమనుష్యుడాయన.

కర్ణాటక శిల్పులు చాల ప్రథితులు. బేలూరు- హాళె బీడు, సోమనాథపుర-శృంగేరి-నంది, శ్రావణ బెళగొళ-హంపి-లేపాక్షి యందలి శిల్పములు ఒకసారి చూచిన యెవ్వరికైనను "మలగిక్రమ్మర చూడవలయునని"పించును.

పదమూడవ శతాబ్ది యుత్తరార్థమున శృంగేరిలో గట్టిన విద్యాశంకరులగుడి యపూర్వమైనది. అట్టిది. లోకమునందు తప్ప మరియెచ్చటను లేదట.

కర్ణాట శిల్పియగు జంకణాచార్యులయులి-కన్యాకుమారివరకు రాలను మేల్కొలిపి-పూవులను చల్లినది. అతని శిష్యులు తండోప తండములు-ఆసంప్రదాయము-ఆంధ్రదేశమున పలుతావుల బనిచేసినది. కర్ణాట శిల్పులలో కొంతకాలమువరకు తాముసృష్టించిన శిల్పములక్రింద తమపేరుల ముద్రించు నాచారముండినది. అందరు ఇన్నిదేశములయందు నాపనిచేసియుండిన చరిత్ర కొంతభాగుండెడిదో కాని వారినిష్కామధర్మమాపని చేయనివ్వలేదు. ఇక కర్ణాటక వీరులను గురించి ప్రత్యేకముగ నేమిచెప్పవలెను?. మొన్న మొన్నటివరకు నాల్గుచెఱగుల భారతదేశమునందే మూల వీరులు పుట్టలేదు!. పర్వతపు కొమ్మువలె

ఉన్నతములైన యాదర్శములకై రక్తము చిందనిదెచ్చోట? కనుక కన్నడ వీరులనుగురించి ప్రత్యేకముగ నేమియు జెప్పవలసినదిలేదు. తక్కిన యన్ని తెగలయందు వలెనే ఆ నేలయందును మహావీరులు పుట్టిరి. కత్తులు పాడెడు పాటలువినుచు దుర్ఘషులై బ్రతికి యాత్మతృప్తితో మరణించిరి. ఇదిగో! మనదేశమున నీనాడు వీరజాతి పుట్టుటలేదు. కుత్సితులు ప్రాచ్య పాశ్చాత్య విద్యలకలగా పులగమైనవారు జన్మించుచున్నారు. నాయీ యుద్రేకమునుజూచి మీరేమయ్యా! నీకు యుద్ధమన్న పండుగయున్నట్లున్నదే. నలుగురు సుఖముగా బ్రతికి బట్టకట్టుట నీకిష్టములేదా? యని యడుగుదురేమో ఈనాటి యీయుద్ధములను నేను సర్వథా కోరుటలేదు. నేటియుద్ధములయందు రణము ముందులేదు. రంగములసలే లేవు. ఇది సామాన్యజన మారణ హోమములు. వీనిని నాశరీరమందలి ప్రతిరక్తకణమును నిషేధించును. యదియట్లుండె.

కన్నడ వాఙ్మయమునందు దక్షిణోత్తర మార్గములని శైలియందు కొన్ని భేదములున్నవి. అవి తెలుగు కన్నడముల సంపర్కముచే నేర్పడినవని చెప్పుదురు.

కన్నడముయొక్క ప్రారంభము జైనులతో నయ్యెనని తొలుత నేను మనవిచేసితిని. ఆనాటినుండి వైదికమతాను యాయుల దిరుగుబాటుగూడ మొదలైనది. ఆయావేశముతోనే నన్నయభట్టు భారతాంధ్రీకరణమునకు బూనుకొన్నాడు. నన్నయభట్టారకుడు భారతము నకారంభించినది మొదలు ఆప్రాంతపుప్రాంతమునకె నందరును దానినాదరింప మొదలుపెట్టిరి. ఆనాడా జనులనుద్రేకింపచేసినది యావేశమొకటే, అది వైదికాభిమానము. ఆదృష్టితోనే కాకతీయులకు సామంతులుగ నుండిన యాంధ్రులందరు విద్యారణ్యుల ప్రయత్నమున కలికొలలేక సహాయము గావించిరి. దక్షిణదేశ చరిత్రలో జరిగిన మొదటి జాతీయయుద్ధము కాకతీయ వంశాంకురమును మరల గద్దెపై నిలుపుప్రయత్నము. దానిలో దక్షిణమంతయు నించుమించుగా నొక్కటైన తీరును గమనించినప్పుడు మనకు స్పష్టముగా నాజనులను గదలించిన యావేశమేదియో యర్థముకాగలదు.

నన్నయ భారతమును ఆంధ్రము దమవారుగు భాషయే గనుకను ఆంధ్ర కన్నడము లీనాడు చీలినంతగ ఆనాటికి వేరుపడలేదుగనుక ద్రాక్షారామము వరకు గన్నడకవుల కానాడు విహారరంగముగ నుండె గనుక కన్నడిగలు కడుప్రేమతో జదువుచుండిరి. జైనకవుల తరవాత గన్నడమునను దెనుగుదేశమునను గూడ వీరశైవము విజృంభించి యట్లులు సాచెను. కాకతీయులందు పూర్వులుదప్ప తక్కినవారు వైదికమంతమునకు విరుద్ధముగాని శైవులు, రెడ్డిరాజులందఱును శైవులే. మనశ్రీనాథుడు వైదికుడైనను పాలకురికి సోమనాథునియందు తీరని యభిమానము గలవాడు. అందువలన మధ్యయుగమునందు వైదికావైదిక రూపమున నెంతయో శైవము గన్నడము నుండి దెనుగునకు వచ్చినది. ఈదృష్టితో జూచినపుడు నన్నయకు ముందు అనగా తెనుగువారు. "గాసటబీసటేజగవి గాథలు ద్రవ్వనాడు" కొన్ని జైనకావ్యములాంధ్రముననుండి యుండినవని నాయూహ, అవి మనవారి వైదిక ధర్మోద్ధరణ యజ్ఞమున బలిపశువులుగ నయిపోయియుండును.

కన్నడమునుండి శైవము ఆంధ్రమునకు దిగుమతియగుటలో దానితోబాటు వారిపలుకుబడులు నుడికారములుగూడ గొన్నివచ్చినవి. అట్లే తెనుగునుండియు గొన్ని కన్నడమునకు జేరినవి. బసవపురాణము తెనుగునుండి గన్నడమైనది. ఆంధ్రకర్ణాటముల యందు అనురూపశక్తిని బ్రదర్శింపగల సవ్యసాచులు బుట్టినారు. కన్నడమునుండి గొన్ని పలుకుబడులు ఆనాడు దెనుగునకు జేరెనన్నచో తెనుగు నారము తల్లడిల్లనక్కరలేదు. మనకుముందు కర్ణాటమున బసవడు పుట్టినాడు. అతనికి తెలుగులతో సంబంధ ముండినది. ఆవెలుగు నెదిరింపగలుగు పెద్ద వెలుగు ఆనాడాంధ్రమున లేదు. వీరశైవమునకుపస్కారకముగా నపుడిచ్చట శైవము మొగ్గదొడిగినది. అందుచే శైవము తెనుగునకురావలసి వచ్చినది. దీనిని గురించి కన్నడిగలు గర్వపడినను మనము కలతబడి

వను "అగర్వము" నకు గాని యీ "కలత" కుగాని అర్థములేదు. శైవము ఆంధ్రమునకు వచ్చుటలో కర్ణాటమునందు బసవనివంటి వ్యక్తిని సృష్టించిన దేవుని యపరాధముగాని మనదేమియు లేదు. ఈ కన్నడపు పొత్తునకే మనము పొట్టుపొరలైనచో నిక యొక్కటో యుత్తరాపథమునుండి వచ్చిన జైనమును కొంతకాలము స్వీకరించినందుల కేమనవలెను మనగతి యిట్లున్నపుడిక జైనులతో నారంభమై జైన కావ్యముల నేకములుగల కన్నడిగలందరు కట్టుగట్టికొని కావేరిలో దూకవలసినదే. ఒక జైనమేగాక సమానములగు నభిరుచులుగూడ నీరెండు దేశములందును మధ్యయుగమున బలిసినవి. కాదంబరీ ప్రభావము మురారి మాఘుడు మొదలగువారి వలనబడి రెండువాఙ్మయములందును పుష్కలముగ గనబడుచున్నది. ఈకాదంబరి తల్లిరఘునాథరాయల కాలము వరకును ఆంధ్రమున నిలచినట్లు లేదు.

ప్రౌఢదేవరాయని కాలము కన్నడమునకు సువర్ణయుగమని ముందే మనవిచేసితిని. ఆయుగమునందే మనకిచ్చట శ్రీనాథుడు ఆంధ్రసాహిత్యమునధ్యక్షించియుండినది. కొండవీటిరాజులకును విజయనగరమువారికిని సంబంధ బాంధవ్యములుగద్దు. కొండవీటిరాజుల కడనున్న వామనభట్టబాణుడు విద్యానగరము వాడే దేవరాయని కాలముననున్న కొందరు కర్ణాటకవుల నింతకుముందే పేరుకొంటిని వారందరును ఒక కుమారవ్యాసుడుదప్ప శైవులే ఇకను బోలెడంతమంది వీరశైవులు గలరు. వారందరును కర్ణాట సాహిత్యమున చుక్కలవలె నసంఖ్యులు రిక్కలవలె ప్రకాశమయులుగూడ. అట్టియెడ శైవముపై నమితాభిమానమున్న శ్రీనాథుడు శైవగ్రంథములనమితముగ వ్రాసి శివభక్తిని ప్రచారముచేసినవాడు కన్నడము నెఱుగనివాడని యనుటయు కన్నడమునుండి యేపదార్థమును మూతిముట్టలేదనుటయు మనఅనభిజ్ఞతను దురభిమానమును చాటునేగాని వేరుకాదు. ప్రౌఢదేవరాయని యాస్థానము కన్నడకవుల నెలవీడని మనకు దెలియును. కనకాభిషేకము శ్రీనాథునకు ప్రౌఢదేవరాయలు గావించెనని మనమెఱుగుదుము. అట్టిచో నచటి కన్నడ కవులతో శ్రీనాథునకు బరిచయముండదా? శివావేశపరుడగు కవిసార్వభౌముడు వారి గ్రంథముల జదివియుండడా! మఱి ఆపలుకుబడులు శ్రీనాథునిలోనున్న వన్నచో మనకు బాధయేలనో? అతడు దిరిగినదంతయు విజయవాటీ ప్రాంతములందే గదా! కొండవీడంతరించువరకు రాజమహేంద్రవరము ద్రొక్కిచూచిన వాడుగాదు. అందులకే, రాజమహేంద్రవరమున కాతడు పోయినపుడు అక్కడి కవుల కీతని పోకడలు క్రొత్తవిగా గనబడినవి. కనుకి నాడు నీకవితయందు గన్నడపు పలుకుబడి గొఱుక్కవ యని యాక్షేపించిరి. దానికి శ్రీనాథుడంగీకరించి "నాకవిత్వంబు నిజము కర్ణాట భాష" యన్నాడు. పై శ్రీనాథుని పలుకునకు గొందఱు మితిమీరిన యాంధ్రాభిమానముగల పెద్దలు "కర్ణ+ఆట" అని విభజించి కృతిమనోహరమైన భాషయని యర్థము జెప్పి జయభేరీ వేసితిమి లెమ్మని సంతోషపడిరి. నాకు జూడ నివియన్నియు నర్థములేని యవకచేష్టలు. శ్రీనాథునకు దనపొరుగు భాషయగు గన్నడము రాదన్నచో అతడును మావలె దురావేశపరుడు, అనేక భాషానభిజ్ఞుడు, గుణగ్రాహి కానివాడని, చెప్పినట్లగునేకాని ఆసార్వభౌమునకు మనముచేసెడు ఉపకారమేదియు లేదు. ప్రౌఢదేవరాయలకు ముందున్న గన్నడ కవులతో బోల్చిచూచినపుడు శ్రీనాథునిలో ఆపోకడ లెన్నియున్నవో యుభయభాషావేత్తలనడిగి చూడవలెను. కుమారవ్యాసుని భారతమును శ్రీనాథుని కావ్యములను చూచినపుడు పరస్పరము పుణికి పుచ్చుకొన్నటులుండును. శ్రీనాథుని కంటె కుమారవ్యాసుడొక ముప్పది సంవత్సరములు ముందటి వాడనుకొందును. కాని ఆభారతము వ్రాయబడిన వెంటనే అసామాన్య ప్రచారములోనికి వచ్చినది. కన్నడిగలు చాలగర్వమున చెప్పికొనెడు కవులు ముగ్గురే కుమారవ్యాసుడు, జైమినీభారతకర్త లక్ష్మీశుడు, సర్వజ్ఞుడు. ఇప్పటికినిగూడ "కుమారవ్యాసను హాడిద నందరె, జగదల భారత వగుబేకు" అన్నప్పుడు, అందరును-"బేకు, బేకు" అనెడువారేగాని - "సాకు-సాక" నెడువాడొక్కడును లేదు. మరియొకమాట. అందఱు తెనుగుకవులు గూడ కన్నడపువారి ననుసరించిరని చెప్పుచున్నావే

గాని తెనుగువారిని కన్నడకవి యొక్కడును ననుస రింపనేలేదా! వారిని పేర్కొనడేమి? నీవేమి కన్న డిగలకు వకాల్తా పుచ్చుకొన్నటులున్నదని మీరు గ్రహింతురేమో! మనమట్లు బాధపడనవసరములేదు. శ్రీనాథు ననంతరము ఆతని ననుసరించినవారు కన్నడి గలలో కొల్లలున్నారు. అట్టివారిని వేరొకచోట చర్చింతుము. ప్రకృతమునకు వత్తము.

నాచనసోముడు గుత్తివాడు. బుక్కరాయల కాలమువాడు. ఆతనికి గన్నడము గాదందమా! కర్ణాటకవులతో గలసిమెలసి బ్రదికిన బుక్కరాజు లకు గన్నడము రాదందమా! మన పెద్దనామాత్యు నకు గన్నడమేకాక తుళువముగూడ వచ్చును. అత డళువదేశపు నడిబొడ్డులోనున్న కడవాచి సీమకు మహామండలేశ్వరుడుగ నుండెను. పెద్దనకు [illegible] సంప్రదాయము దెలియనపుడాప్రాంతములందు రాచ రిక మెట్లు నడుపును? అనాటి ప్రభువులు ప్రజా సామాన్యముతో సంబంధములేని నేటి మన యధ కారులవంటివారు గారుగదా!

సాహితీసమరాంగణ సార్వభౌముడగు రాయలు నిండుకొలువున "కుమారవ్యాసుని" భారతమంతయు జదివించుకొని వినెనట. అప్పుడు సకలకవీశ్వరులు నాతనితోగూడ వినిరట. ఈ విషయమును కన్నడ భారతకర్త తిమ్మణ్ణ చెప్పుచున్నాడు. ఆ కవులయందు పెద్దనాదులుండి యుండరా! వారి కర్థముగాకున్న నెట్లు వినిరి?

"నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక దెచ్చి
యిచ్చు, క
ప్పురవిడె, మాత్మకింపయినభోజన, మూయెల
మంచ, మొప్పుత
ప్పురయురసజ్ఞు, లూహ తెలియంగలలేఖ కపాఠ
కోత్తముల్
దొరకినగాక యూరకకృతుల్ రచియింపుమటన్న
శక్యమే!"

అనెడు యీపద్యము పెద్దనామాత్యులదిగదా! కవుల స్వాతంత్ర్యమును నేటిది గాదనుకొనుడు. ప్రకటింపవలసి వచ్చినపుడంతయు నీకృతిని ప్రతి యొకరును వర్ణింతురు. ఈ పద్యము గన్నడమున కనువాదమాత్రమే, ఈక్రిందిదానిని వినుడు:—

"నిరుపహతిస్థలం, మృదుకరాసన, మెల్పుణి
సింపుదంబులం
నరపవపుస్తకప్రతతి, లేఖకవాచకసంగ్రహం,
నిరం
తర గృహనిశ్చితస్థితి, విచారకసంగతి,
సత్కృతిక్షేత్ర సా
దరతయునుల్లి సత్కవియు నూనువదాగదె కావ్య
వార్ధియుం"

ఇది మల్లికార్జునునిది. ఇతడు పెద్దన్నకు సుమారు మున్నూరేండ్ల క్రిందటివాడు. అసలు కర్ణాటమున తిమ్మణ్ణ రచించిన భారతమంతయు సోమయాజికవితకు గన్నడీకరణమేగాని యేమాత్రమును లేదని చాలమంది వాదము. కన్నడిగలకు కోపము వచ్చునేమోగాని యీ వాదమునందు చాలవరకు సత్యమున్నది.

పంపనిభారతమును భట్టారకుని భారత రచనమున కును బోల్చిచూచినప్పుడు రెండు గ్రంథములను రచిం చినదొకరేనా? యున్నంత పోలిక గనుపించును. కొంత సావధానముగ వింటిరేని యొక్కటొక్కటిగా మనవిచేతును.

భారతమును రచించిన పంపడాంధ్రుడని దెలిసి కొంటిమి. ఇతనికాశ్రయదాత అరికేసరియనియు నెఱుగుదుము. "కవితాగుణార్ణవ" "సుకవిజన మనో మానసోత్తంసహంస" "సంసార సారోదయ" "సరస్వతీ మణిహార" "పురాణకవి" "కవితా గుణార్ణవ" మొదలైనవాతడు సంపాదించుకున్న బిరుదులు. చిత్రవిచిత్రములుగ నుండును.

పంపమహాకవి చాళుక్యవంశమును బ్రహ్మాండముగ నభివర్ణించినాడు.

అట్టియెడ చాళుక్యవంశమునకు జెందిన రాజ నరేంద్రునకు దానితో నాతని యాశ్రితులకు పంపని భారతముపై సహజముగ నభిమానముకద్దు. రాజ నరేంద్రుని నిండోలగమునందు పంపనిభారత మప్పు డప్పుడు చదువబడుచుండుట యథార్థమగునేకాని

అతిశయోక్తి గాదు. పైగా ఆ మహాకవి వేంగిదేశము వాడగుట మరికొంత యాదరమునకుఁ గారణము. కవికిని వేంగివిషయమన్న నభిమానమే.

పంపమహాకవిపై నింతటి యభిమానము పూర్వచాళుక్యులకున్నను అతని విషయమై యొకయతృప్తియు లేదనలేము. పంపడు ప్రచారముచేసినది జినధర్మమును. రాజనరేంద్రుడు శైవుడు. దానితో భారత శ్రవణాసక్తి యెంతయున్నను ఆస్థానియందు "పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవము" లేదే యన్నకొఱత రాజరాజునకు తప్పక యుండి యుండును. పశ్చిమచాళుక్యులు జగద్విదితముగ భారతమును వ్రాయించి తమకీర్తి కాయువుపోసికొనిరి. పూర్వచాళుక్యులుగూడ "దుగ్ధమార్గ జల గౌరవ భారత భారతీ సముద్రము" ను మథించి కీర్త్యమృత కలశమును బొందవలెనను దాయాదులకు సహజమగు భావముగూడ అతనికుండదనుకొనలేము గదా! దీనితో రాజనరేంద్రుడు భట్టారకుని భారత రచనమునకు పురికొల్పినాఁడు.

నన్నయకే, సహజముగ భారతమును ఆంధ్రీకరింపవలెనను ఆవేశమున్నది. ఇది అతని దృష్టిలో ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రము. అధ్యాత్మవిదులకు వేదాంతము, నీతివిచక్షణులకు నీతిశాస్త్రము, కవివృషభులకు మహాకావ్యము, లాక్షణికులకు సర్వలక్ష్యగ్రంధము, ఐతిహాసికుల కితిహాసము, పరమపౌరాణికులకు బహుపురాణ సముచ్చయము. ఇట్టి భారతముపై పంపడువేసిన జినముద్ర భట్టారకుని మనస్సును శూలమై బాధించినది. పంపభారతము నెవ్వరైన నెత్తినపుడంతయు తాను వ్రాయబోవు "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థము" కనులయెదుట నిలచుచుండినది. రాజరాజు తన్నడుగుటతో నాకవికి రెక్కలు వచ్చినట్లయ్యెను. భారతరచన కుపక్రమించినాడు. కాని మహాకావ్యకరణక్షమమైన భాషయేదీ! అందుచే సంస్కృతము నండగాగొని నాటి తెనుగునేలయందలి తేటలగు తెనుగులను జాగ విడువక జతజేర్చుకొన్నాడు. ప్రాచీన కర్ణాటసాహిత్యమును గాలించి కళగల పదములపై కన్నువేసి యుంచినాడు. ఆ పోకడలో పంపనిభారతమును గూడ నాతడెన్నియోసారులు జదువవలసి వచ్చినది. పంపడు జినధర్మమును ప్రతిపాదించినచోట నంతయు వైదికధర్మము నుత్తేజితమొనరించుచు భట్టారకుడు భారతమును వ్రాసెను.

కన్నడభారతమునందర్జునుడు నాయకుడు. ద్రౌపది యాతనికొక్కనికే భార్య. అర్జునునకే పట్టాభిషేకము. పంపమహాకవి అరికేసరికిని అర్జునకును అభేదప్రతిపత్తి గల్పించు రచనమొనర్చెను.

తనభారతము నందర్జునుని వృత్తాంతము వచ్చినపుడంతయు - అరికేసరి బిరుదములన్నియు - శ్లేషగనో స్పష్టముగనో తగిలింపదాతనికి నిద్రబట్టదు, ఇట్లే రన్నడుగూడ - తనగదాయుద్ధమున తైలపునిగుమారుని - భీమునితో బోల్చుచు గ్రంధమును సాగించెను. కన్నడమునందిది యొక విచిత్రమగు సంప్రదాయము.

పంపడుగావించిన యీ చమత్కారమును నన్నయ భట్టారకుడు - చూచినాడు, అతని కన్న మెఱుగుగ - ధ్వని మార్గమున దానిపనిని చేయదలచెను, భారతములోని

||ఉ|| రాజకులైకభూషణుడు, మొదలైన పద్యములను జదివినప్పుడు - రాజరాజునుధర్మరాజునకు బోల్చినదా మిస్పష్టముగ గనుపించుచుండలేదా! దీనియందు మరియొక చమత్కారమున్నది. రాజరాజెట్టున్నాఁడో దెలుపుటయేగాక యెట్లుండవలెనో గూడ నీ భాగము వ్యంగ్యమార్గమున దెలుపుచున్నది. ఇది పంపనిజూచి - యనుసరించిన త్రోవయే. అసలు "అంకితము" సేయుట - అనుపద్ధతి తెనుగునకెక్కడి నుండి వచ్చినది?

సంస్కృతమున నంకితమొసగు పద్ధతి - నేను జూచినంతలో లేదు. రాజులను గురించి ప్రత్యేకముగ వ్రాసిన గ్రంధములున్నవి. ప్రాకృత కావ్యములందు గూడ నీ మార్గములేదు. కనుక కర్ణాటానుకరణమే ననుకొందును.

నన్నయ భట్టారకుడు "హరిహర రాజగజాననార్కషడాస్య మాతృసరస్వతీ, గిరిసుతాదికదేవతా

తతికి నమస్కారించెనట! మనకు కనిపించునది శిష్య శిక్షకైయాతడు - గావించినదొక శ్లోకము దప్ప మరేదియు లేదు. పోనీ మానసిక నమస్కారమే జేసినాడను కొందము. అర్కునకు షడాన్యునకు మాతృకలకు నమస్కారమెందులకు గావించెను? అది సంప్రదాయమా? పంపభారత మందీస్తుతులన్నియు గలవు. మనోజస్తుతి పంపడు గావించినాడు. దాని నాచారవిరుద్ధ మగుటచే నాదికవి నన్నయభట్టు వదలెను.

ఇట్టి చోటులనేగాదు. తెడుపంపని నమస రించిన చోటులందంతయు వేదమార్గమునకు విరుద్ధ మగు వానిని పదలిపెట్టెను వ్యాసమహర్షిని నర్ణంచుచు పంపడు "నీలాంబుదశ్యామనుం కనకపింగళి జటా బంధ కళాపనుం దండకపాళిహస్తనుం కృష్ణమృగ త్వక్పరి ధానసుమాగి వ్యాసభట్టారకకింపుట్టువుదు"

అని పలికెను, నన్నయభట్టు పైదానిని కృష్ణాజిన పరిధాన కపిలజటామండల దండకమండలు మండి తుండైయని సంకోచపగచినాడు, పైదానియందున్న కపాళి ధారణము పనికిరాదనియే పదలివేసెను.

పూర్వ కవులను నుతించుచు - సంపుడుహాకవి

ఉ॥ వ్యాపమునీంద్ర రుంద్ర వచనామృత వార్ధియ
నీసువెంకవివ్యాసనెనెంబ గర్వమెనగిల్ల"

అని పలుకగా - అంతతో తృప్తిపడనివాడు వోలె భట్టారకుడు.

ఉ॥ భారభారతీ శుభగభస్తి చయంబునజేసి ఘోరసం
సారవికార సంతమసజాల విజృంభమువాపి యూరిచే
తోరుచిరాబ్జ బోధనరితుండగు దివ్యపరా శరాత్మజాం
భోరుహమిత్రుగొల్చి, మునిపూజితు భూరి యశోవిరాజితుణ్

అని బ్రహ్మాండముగ నభివర్ణించెను. "వ్యాస మునీంద్ర వచనామృత వార్ధి" యనెడు రూపక మింతకుముందే "భారత భారతీ సముద్రము" అనుచోట నదికి పోయినది. ఈ సందర్భమున పంపడు - నుతింపక విడిచిన

"గురుపద్య విద్యకునాద్యుడుగు, అంబురుహ గర్భ నిభుడునునగు "ప్రచేతసుపుత్రునిగూడ" నన్నయగూడకట్టికొనెను. తనకవితాప్రయోజనమును దెల్పుచునన్నయలిట్లనిరి

||ఉ|| సారమతింగవీంద్రులం ప్రసన్నకథాకలి తార్థయుక్తిలో
నారసిమేలునా నితరులక్షర రమ్యత నాద రింప - నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టుడె నుంగనర్ల మహా
భారతసంహితారచన బంధరుడయ్యె జగద్ధి తంబుగణ్

ఇట్లే పంపడును:-

ఉ॥ ఆసకశార్థసంయుత మళింకృతియుక్తి ముదాత్త వస్తువి
న్యాసము నేకలక్షణ గుణప్రభవం మృదుపాద మాదవా
క్రీసుభగంకళా కళితమెంబ సెగర్తయ నార్థికబ్బమం
కూసునునీవుదీవు దరికేసరిగల్లదవస్తుగీవునే!

చ॥ లలితపదం ప్రసన్నకవితా గుణమిల్లదె పూర్ణుపేర్దదె
శ్లిశికృతిబంధముంబిరెహ కాలరకైగళి కేడు నుణ్ణవ
ప్పళికదకేడుపేలసి దొడర్థకేడినె పేర్దువీగిపా
ట్టళిసిసెగర్తగాటినువ దుష్కవి యొంబె లెక్కయో

అని మొదలుగా చెప్పికొన్నాడు. భట్టారకుల "ప్రసన్న కథార్థ"మును పంపని ప్రసన్న కవితా గుణం" "ఉత్తమవస్తువిన్యాసం" అనెడునవి రమ్మని పిలుచుచున్నవి" అర్థయుక్తిని అసకలార్థసంయుత"

అనుశబ్దము పెనగూడుచున్నది. "అత్యురరమ్యతకు పంపమహాకవిమృదుపాదం "లలితపదం" వాక్ర్కీ సుభగం అనబడునవి బంగారు నగలగుచున్నవి. కవీంద్రులారసి మేలునాణ "సుభావమును పంపడే స్పష్టముగ చెప్పినాడు ఇక తక్కినపదములన్నియు నన్నపార్యునకు బుసరుకులుగ దోచియుండుట, చే వదలివేసిరి, పంపని కారికములిట్టివి

"నారిదనపెద్దు (6-21) వైరియుమాడిద (8-90) తన్నుడిద (12-190) నరకాంతకనంనుడి నరేంద్రం (12-129)

పై వానియందు - ద్వితీయమున ప్రసను - చతుర్థికి ద్వితీయ తక్కిన వానియందు ప్రధమము ష్ఠీ వాడ బడినవి.

పై వానిని తెనిగించినచో.

" నారిమని చెప్పని - వైరిచేసిన - తను చెప్పు- నరకాంతకుని నరేంద్రుడు పలికెను." -

ఈ పై కారికములు - నన్నయవాడునవో వేరో - వాఙ్మయవేత్తలసు నేను చెప్పవలసిన పనిలేదు.

భట్టారకుని సంస్కృత సమాసములందు స్పష్టత యెక్కువ. వారి కవిత్వమునకే స్పష్టత జీవము. సమాసములందు - ఒక పదమును - మరియొకటి - అందుకొనుచున్నట్లులున్న - చిన్నారి - ముత్తెముల వంటి ప్రాసలు అందముగా నదికియుండును. సంస్కృత సమాసములను - బ్రహ్మాండముగ పెంచి పెద్దచేసి - యసహ్యాకరముగ మాన్పుటాతని తెలుగని విద్య. ఈ గుణములన్నియు - కన్నడ కవిసమాస గ్రధనమునందున్నవి. మచ్చునకొక రెండు చూపెదను.

"అదంతరానె - పయుష్మిమ్మప్పినిన రత్నమాలా ప్రభాభీలారుణ జలపల్లవ పిళోళివీచీరియ ప్రసారిత కులాచలోదధి పరీతమాగిర్ద జంబూద్వీపదొళనుంటు నాడు కురుజాంగణ నామదెం- అంతాకురు జాంగణ విషయదొళ్."

కం|| అతం నిజభుజవిజయ
ఖ్యాతియ నార్ద్రార్ధిసధిక బలనవనిపతి
వ్రాత మణిమకుట కిరణ
ద్యోతితపాదం సపాదలక్ష క్షితియం||

కం|| శ్రీపతిగె యుద్ధమల్ల మ.
హీపతిగె నెగ ల్తపుట్టి పుట్టిదసఖిల
క్ష్మాపాల మౌళిమణికిర
ణాపాళిత నఖమ యూఖరంజితచరణం.

సైవచనమునందు - పద్యములందు కన్నడము పదములను తెనుగుచేసి - ఆంధ్ర విభక్తులమచేర్చి నచో - నన్నయ కవితకన్న వేఱుగా వానిని చూడ లేము. వారిద్దరి వచన రచనము గూడ చాల - పోలిక గలది.

వచనములయందు - గధావృత్తాంతమును ధారా వాహికముగ వేగముతో పలుకుట అవసరములగు విషయములను పెంచుచుండుట - లఘువులైన సమా ములు బహుళముగ వాడుట, వైదిక వాఙ్మయము నందు వాడునట్టి సాంస్కృతికముల ప్రయోగించుట —భట్టారకు నిలక్షణము. ఆగుణములు పంపని గద్య మునందు గలవు.

ఇకపద్య రచనల నుదహరింతును.

కంద పద్యమునందు పాదాదిని జగణము - నన్నయ యొక్క యొయ్యారమునకు వాడును. అ సొగసు - మృదంగ వాద్యమునకు ముక్తాయింపు వంటిది.

కరుణానిరతులు ధర్మ
స్వరూపులింతకు మదీయ జనకులు సను దెం
తురు వారు వచ్చినీ కి[చ్చిరేని]
చ్చిరేని పాణిగ్రహణము సేయుమునన్నన్.

ఇట్టి పద్యములునన్నయగారి కవితలందు కొల్ల లకు దొరకును. స్పష్టముగా తెలిసిన విషయములందు దాహరణములిచ్చి నాకాలమును ఖర్చుచేయుట నా కిష్టము లేదు. ఇట్లే పంపడును,—ఒయ్యారమునకు —ఒక విషయమును జెప్పి - ముగింపదలచినపుడు-

కొన్ని యెడల భావస్ఫూర్తికి—ఒక విషయమును జెప్పి - విషయాంతరమునందుకొనవలసినప్పుడు - పలుకును.

పాఠకుల మనస్సులపై నొక విషయమును దృఢముగా పాదుకొనునట్లు చేయవలెనని - భట్టారకునకు దోచినప్పుడు వారొక పదమును పునః పునగా వర్తింతురు.

క|| అన్యోన్య ప్రియభాషణ
లన్యోన్య హితైషులసురలన్యులబోలెన్
మన్యు పరిప్రేరితులై
యన్యోన్యాభిహతి జనిరి యనుపురమునన్।
(ఆది 8.113)

క|| గంగాధర పింగిజటా
సంగమ మంగళ విశాల సలిలతరంగన్
గంగానది సేవించెను
గంగాద్వారమున విగత కల్మషుడగుచున్.
(ఆది 8.126)

ఇట్టివి పంపడు గూడ ఇట్టి సన్నివేశములందు ఈరీతిగనే ఒకపదమునే పలుమారు త్రిప్పి త్రిప్పి వాడును.

క|| విజయారంభ పురస్సర
విజయగజంగళెనె పిడిదు ఘూర్జరరాజ
ధ్వజిని యనిఅగోడిసి భుజ
విజయదె విజయనుమనిఅసిదం నరసింహం.

క|| ఆత్మభవనా నరాధిప
నాత్మజనానహుషపృథు భగీరథనతమా
హాత్మర నిఱలు నెగఱ్దమ
హాత్మంనరసింహ నెఱవినోళ్ పరమాత్మం.

నన్నపార్యుని కవితలు విమర్శించునపుడు వారు "వస్తుకవిత" ప్రధానము పలుకుదురని రసికులందురు. "వస్తుకవిత పంపనిలోనిదే! పాండు మహారాజు మాద్రి వీరిశృంగారమును వర్ణించునపుడు పంపడు పెద్ద వచనములను వ్రాసినాడు. దానిభావమునే నన్నపార్యుడు లయగ్రాహులలో సుందరముగ చిత్రించెను. రసపిపాసువులంబోల్చి చూచుకొన వచ్చును.

నన్నయభట్టు వ్రాసిన

సీ|| శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుదగిలి
కదలక వినుచుండు కరులును కరికర
శీతలచ్ఛాయ దచ్ఛీకరాంబు
కణములచల్లని గాడ్పుసపడి వాని
జెంది సుఖంబున్న సింహములును
భూసురప్రకరులు భూతబలుల్ దెచ్చి
పెట్టి నీవారాన్న పిండతతులు

గీ. గడగిభక్షింప నొక్కట గలసిగాను
చున్న యెలుకలు పిల్లులు యొండుసహజ
వైరవర్గంబులయు సహవాసమునను
సూచి మునిశక్తి కెంతయు చోద్యమంది

అనెడు నది, చాల బాగున్నదని నేటి విమర్శకు లెందరో యన్నారు. పూర్వకవులలో దీనికనుకరణములు కొల్లలు ఈవర్ణనము పంపని రచనకు నీడవంటిది. పాండుమహారాజు దరిసించిన శతశృంగముని దలి ఋషుల యాశ్రమ భూములిట్లుండెనట.

"తాపసకన్యకర్కడసి దెళిలతెగళొళెఅగి తుఱుంగి సామవేద ధ్వనియోళ్ మెరెవతుంబి గళుమం పణె అగిద తెదాశ్రమద తరుగళమేగిర్ద పుగిల్ పుగివెంది త్త బన్నిమిరి మెంప పొంబణ్ణద కోగిలెగళుమం ముని కుమార రోదుప వేదవేదాంగగళం తప్పువిడిదు జడిదు బగ్గిసువ పదుమరాగద బణ్ణదర గిళిగళుమం సురభిగళ తూరెద మొలెగళ నుణ్బువరమఅగళం పూగెనూంకి కూంకి మొలెగళనుణ్బ కిశోరకేసరిగళుమం తమ్మ నెనలి దాడువ కిశోరకేసరి గళంపిడిదు తెగెవ కరికల భంగళు మనాగళాగళింద పాయ్వపులిగళమఱగళోళ్ పరిదాడువ తరుణ హరిణం గళుమం మత్తం ముత్త కరుడ తవసింగళక్కెయంపిడిదుయవర గుహెగళం పుదిప పొఱమడి పచపళకపి గళుం ... చోద్యంబట్టు"

పద్యముల యెత్తుగడలుగూడ చాల చోటుల నిరువురు సమము నెత్తికోలుగావింతురు. చూడుఁడు అడవికి బోయిన పాండురాజునకు శాపమురాగా

క. ఎత్తివనమెత్తిమృగయా
వృత్తికమీ తపసియెత్తిమిగ మిందంతా
నెత్తెచ్చెనాత్మ కర్మాయత్తం పెంట లిరెల్ల
మఘటిత ఘటితం.

అని చింతించెనట ఇట్లే నన్నయయు

క. ఏనెట నీనెట సుతుడెట
యేనెన్నడు దొల్లిజూచి యెఱుగనునిన్నన్
మానిను లసత్యవచనలు
నానిట్టుల సత్యభాషణం బుచితంబే
అని యనును.

కాశ్యపులు, మాగధులు, సాల్వురు, అనుసమూ
హార్థములును నన్నయవలెనె పంపనిలోను మాటి
మాటికి గనుపించును. "భట్టారక" శబ్దము నన్నయకు
వలెనే పంపనికిని ప్రియము. ఇక నన్నయ "ప్రసన్న
కథా కలితార్థ" యుక్తియు పంపని యందున్నది.
కావలసినవారు వారి కర్ణజనన" కుంతీ కర్ణ సం
భాషణ" శతశృంగమున పాండురాజుకథ" మొదలై
నవి బోల్చిచూచి కొనవచ్చును.

పంపమహాకవిని గుఱించి కర్ణాటసాహిత్యకారులీ
క్రింది యభిప్రాయమొసగిరి.

నవీన కల్పన, రసానుగుణమైన కథాశరీర రచన,
వస్తును రూపరస నిర్మాణము రసమునకు దగినట్లు
ఛందస్సును వాడుట, కావ్యసౌందర్యమును జెడనీ
యక అంగోపాంగముల వర్ణించుట ఇవి పంపని
గుణములు.

అతడు పాత్రలకు జీవమిచ్చి యెదుటనిల్చి మాట్లాడు
నట్లు చేయును. అనౌచిత్యమును బరిహరించి సహ
జముగ నభివర్ణించును. అభిప్రాయము వెంటనే మన
మునకు దోచినట్లు స్పష్టముగ వెల్లడించును. సన్ని
వేశమునకు దగినట్లు మితిమీరనట్లు కథనునడపును.
అతని రచనమందు సంకుచితి యెక్కువ. బహువిధ
ప్రయోగదక్షతను జూపును. బంధపు బిగియు శైలీ
సారళ్యమును వర్ణనారమ్యతయు పంపనిస్వభావము.
సముచ్చయములు విరివిగా వాడుటయు నతనిపోకడ.

పైచెప్పిన లక్షణములలో జాలవరకు నన్నయ
యందున్నవనగా నాపల్కుగాదను వారుండరను
కొందును.

సోమయాజి కవితలు చూచినపుడు వారిపలుకు
బడులు గమనించినపుడు వారికిఁ గన్నడ పరిచయ
ముండునని యూహింపవీలున్నది.

వారికాశ్రయదాత మనుమసిద్ధి నెల్లూరియందు
న్నను, తిక్కన తండ్రితాతలు జీవించినది "రాజం
పేట తాలూకాయందలి "పొత్తపి" యని తమకు
మనవిచేయుచున్నాను.

ఇంతవరకును కర్ణాటసాహిత్యపు వెలుగుబాటల
నడచిన యాంధ్రరచనల గురించి దెలిసికొంటిమి.
అట్లే యాంధ్రకవుల నొరవడిగా ననుసరించిన
కన్నడకవులను గమనింపనిది మనపని పూర్తిగాదను
కొందును.

తెనుగునుండి బసవపురాణము గన్నడీకరింప
బడెనని యింతకుముందే నివేదించినాను.

కృష్ణరాయల యాశ్రయమందుండిన తిమ్మణ్ణ
రచించిన "భారతము" సోమయాజి తెనుగుసేతకుఁ
గర్ణాటరూపమేననియు దెలిపితిని. ఇకను దెలుగు
కవుల ననుసరించిన కన్నడిగలెవ్వరైనను న్నారేమో
చూతము.

భారతము శాంతిపర్వమునందు కర్ణాట కవికుల
సార్వభౌముఁడు:-

సరసిజోద్భవ నెసెపముఖపం
కరుహ మధ్యదిహంస యెంచెం
తెరెవిరాజిసుతిప్ప వరవాణీనితంబినియా
అనెడి ప్రార్థనలో నలువనెమ్మోముదమ్ములు

"కేళిగృహములు" ఈకవిసార్వభౌముని పలుకు
బొందికను విపులీకరించెనని దోచుచున్నది. ప్రౌఢ
దేవరాయని కాలమునుండియు మన శ్రీనాథుని కన్నడి
గలు అమితమగు నాదరముతోఁ జూచిరి.

ఇట్లే లక్ష్మీశుడుగూడ కవిసార్వభౌముని "వాణీ
నఖముఖరిత వీణాతంత్రీ నినాదమాధుర్యం" అను
చరణమును హృదయమందుంచుకొని:

# తెలుగు కన్నడముల చుట్టరికము

"వీణెయుం గానమంనుడి నువందదిలోళ
వాణియుం కవితెయుం పేళిసిద సెందందు.

ఈరీతిగా తనకవితావీణను సారించినాడు. ఈ లక్ష్మీశుడు పదునేడవ శతాబ్దివాడు. కర్ణాటకులకు గర్వకారణములలో నీగ్రంథమునొకటి. ఇతనికి "కర్ణాటకవి చూతవనచైత్ర" అను బిరుదుండెడిది.

ఈవిషయమును "విద్వత్సభావలయమరి యెవిరచిసిదం భరద్వాజగోత్ర భవనణ్ణమాంకనసుత లసద్వినుత కర్ణాటకవిచూత వనచైత్ర లక్ష్మీశనేంబోర్వను." అని కవియే పల్కినాడు. ఈలక్ష్మీశునిపై కాదంబరీ ప్రభావ మెక్కువగా గనుపించును. మధ్యయుగము సందు కర్ణాటాంధ్రములలో నారంభమైన భట్ట బాణుని పలుకుబడి చాలకాలమువరకును దగ్గలేదు.

లక్ష్మీశ్వరుడు రాయులకాలమునాటి ఆంధ్ర గ్రంధములను బాగుగా ననుసరించినాడు. పెద్దనా మాత్యుల శయ్యాసైగనిగ్యము చూచినట్లు నడచు పాదముల పిలుపులు లక్ష్మీశునియందు పూర్తిగా ప్రత్యక్షమగును.

ఆంధ్రసాహిత్యమునకు వసుచరిత్ర యొక అమూల్యమగు నలంకారము. రసముచే నిండిన కొన్ని కావ్యములను మనము నిరాదరించినట్లే దీనిపైనను పరామరిక విడచితిమి. వసుచరిత్ర పాకమునకు మెచ్చి అన్ని చమత్కారములకును అందవేసిన సంస్కృతకవులు ఇట్టిది మనకు లేదేయని—దానినున్న దున్నట్లు — సంస్కృత శ్లోకములతో వ్రాసికొనిరి. కన్నడజైమినీ భారతకర్తకు—మనవసుచరిత్రపై. యెక్కువ ఆదరమున్నట్లుగుపించును, ఇతడు శ్లేషవాడిన "మహిళా" చతురాస్యుల్ - వర వర్ణకువలయా, సుమనోనురాగ, మొదలైన - చాలమట్టు కన్నిపద ములను అతడు తన శ్లేషలలో వాడుకొన్నాడు.

వసు చరిత్రకారుని

భావం బెక్కడలేక వృత్తనియమాపాయంబు
చింతింపకం
దేవర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి
సంభావింపఁగ నవ
కవిప్రణీత కృతిసామాన్యా కృతింబూనిపైపై
వన్నెల్ప చరిత
పదాని తిలకింపంబోరు ధీశోత్తముల్.

అనుపద్యమును మననున్నందుంచికొని.

పారదపరార్థమం వరయతిగె భంగమం।
తారద నిజాన్వయక్రియ గర్గెదూషణం।
బారద విశేషగుణ కళాగౌరవం, తీరద
దురుక్తిగళ్గె

సేరద సుమార్గదోళ్ నడెవ సత్పురుషనగ
భీరదపకవహేళ్యాకావ్య ప్రబంధమం।
శారదెయకరుణ దింపేళ్వెనాదోషమం।
తెరదల్లరుం కేళ్వుదు ॥

అను, ఛందస్సును వ్రాసికొన్నాడు.
రాయలు చూచిన "కొళి కొళిమంచున్న"
నీరుకోళ్లు కొలకులయందున్న అంచపిండులు.
రసదాడిగ నెలు, లక్ష్మీశుడు గూడవీక్షించినాడు

మన వేమనను జూచినచో—ఇక సర్వజ్ఞుని చూడబనిలే "దన్నంత—రచనా సామ్యము—వారిర్వరకున్నది. ఆకాలమునందు—ప్రాంతీయ భేదములు లేవు. వారికున్న యావేశములు వేఱు అట్టియావేశములే—మనకుగూడ కావలెనని నేనను. కాని—మన భావములను—వారిపై రుద్దుట - ప్రాచీనులకు మనముచేయు మహాపచారము.

ఇంతవరకును కన్నడమునుండి కావలసిన కావ్య సంపత్తిని దీసికొన్న కవులనుగురించి తెలిసికొన్నాము అట్లే ఆంధ్రముననుసరించిన సత్కవులను గమనించితిమి. ఇప్పటికి మనపనిముగిసినట్లే. ఇకనివి నాలుగు తీరికమాటలు. కన్నడిగలు గర్వపడు కవిపుంగవులను గూర్చి వారిపోకడలనుకూర్చి కొంత చర్చించుకొందము. పంపడాంధ్రుడనియు ఆతడాది మహాకవియనియు మనవిచేసితినిగదా! కన్నడమునందు భారతరచనము లెక్కువ. "సాత్వభారత మొకటి గలదు, శుభచంద్రుడు జైనుడు. సంస్కృతమున "పాండవపురాణ" మొకటి వ్రాసినాడు. ఇతడు కన్నడిగ, పైరెంటికిని అంతర్వ్యాప్తి ఆభాషలో

గనపడదు. అసలు పంపనిభారతమునకును కుమార వ్యాసునికున్నంత పలుకుబడి లేదు. వారికిని ప్రసిద్ధ రామాయణముకద్దు. అది "తొరవె" రామాయణము. భారతములందు కుమారవ్యాసునకువలె రామాయణములలో "తొరవె" రామాయణమునకే వ్యాప్తి, రామాయణ కవిత్వము మనుగడమైనదియే. కుమార వ్యాసుని దలచినచో నాకొడలు పులకించును, కృష్ణుడు రాయబారము మొనరించిన తర్వాత మరలి పోవుచు కర్ణుని తనతోగూడ రమ్మని అతనిని రాజ్యము మున్నగున ఆశలుబెట్టి ప్రలోభింప యత్నించును. సోమరాజు లావృత్తాంతమును "వెడవెడయేను దొలి పుదివింటికి" అని 5, 6, పద్యములలో ముగించిరి. ఈసందర్భమును చాలనావేశకరముగా వర్ణించి కుమారవ్యాసుడు కర్ణునిలోకోత్తరునిగా జేసినాడు.

ఈ కర్ణుడు దేవతలకతీతుడు. ఈ సందర్భము నిట్లు వర్ణించినకవి మానవుల కతీతుడుగదా!

కర్ణాటకులు గర్వపడు వారిలో రన్నడుగూడ నొకడు. ఇతడు గదాయుద్ధమును రచించెను. "వీర రసము నిట్లు వర్ణించుకవి వేరొకడు లేడని వారందరు రన్ననికి "కవిచక్రవర్తి యని బిరుదు" దానికిదగినట్లు మదనావతారము కనకదండ చామరములు ఉన్మత్త మదేభము ఉత్తుంగజయభేరియు" నుండెడివట ఇతని నెల్ల "ఉదాత్తకవితిలక" యని పిలచెడువారు. ఇంకను రన్నడు చెప్పికొన్న

||క|| కవిముఖచంద్రం, కవిచ
క్రవర్తి, కవిరాజశేఖరం, కవిరాజం,
కవిజన చూడారత్నం,
కవితిలకం, కవిచతుర్ముఖం, కవిరత్నం.

ఇత్యాదులు చాలాగలవు, గదాయుద్ధమునందు దన పొగడ్త సుమారు పదిపద్యములవరకు గవి కావించుకొనెను. పంపభారతమునందలి గదాయుద్ధ ఘట్టమును సంస్కృత వేణీ సంహారము ననుసరించి రన్నడు కావ్యమును గూర్చినాడు, అతనిపోకడ యిట్టిది:-

||చ|| రణదొళరాతి వారణ ఘటాళియనోర్వనె
గెల్ద నొంమవారణదొళమాన దానగుణదర్పిత పూరణ
నిష్టతుష్టదారణనవదాతకీర్తిగృహతోరణ నన్య
నరేంద్ర గంధవారణమదవారణం విజయకారణ
నమ్మనగంధవారణం।

సంస్కృతమున కితడు సేవచేసినట్లున్నదే కాని. కన్నడపు పలుకుబడి యంతగా గానరాదు. ఒక్కొక చోట:—

మ|| ఖలదుశ్శాసనకృష్ణలోహిత జలాశ్లిష్టం కురు
ప్రోద్యత్ప్రతిజ్ఞాత్ సుయోధ నోరుకుటోద్ఘట్ట
ప్రతిజ్ఞాక్షణా వళి న్యస్త విశాలనిశ్చల శిలాస్తంభం
కురుక్షేత్రనోళ్ ప్రతియోగ్రాంతక నత్తుతోర్వినొళ
కొండిర్గం హిడింబాంతకం"

అనేకస్వతంత్ర భావములు గూడగనుపించును. కానియట్టివి చాలతక్కువ, ఇతడు భావములపై కంటె భాషపైననే యెక్కువగా గన్నువేసినట్లున్నది కథా ప్రతినాయకుడగు దుర్యోధనునిపై నిరగొంత సానుభూతి చూపియుండిన బాగుండెడిది, గదా యుద్ధమున సోమరాజుల దుర్యోధనుడొక మహా వ్యక్తి. అరుచి చూచిన మనకు రన్ననిలో గొప్ప విశేషము గన్పించదు. ఎట్లైనను "వాగ్దేవియ భాండారముద్రయనొడెదం" అని కవియనన్నాడు. కర్ణాటకులును అందురు.

కన్నడము నందలి వచనకారులను తలపనిచో నీవ్యాసము పూర్తియైనట్లుగాదు, వచనకవిత్వము నారంభించినది వీరశైవులే, బసవని వచనములు హృదయద్రావకములుగానుండును. పేరునకవి వచనములేగాని వానియందొకతూగు ఒకఛందస్సు ఉండనే యున్నది. పదునొకండవ శతాబ్దము ఉత్తరార్థమునుండి 1475 వరకు కన్నడమున వచనకారుల పంట. వచనములు వ్రాసిన వారిలో "కల్లుమరద ప్రభుదేవ జక్కణార్య గుబ్బియ మల్లణ్ణ మాదరసు చెన్నబసవడు ప్రభుదేవుడు బాచరసు మొదలగు వారు గలరు. వీరందరును విరక్తులు, వీరశైవులు. వచనకారులలో అక్కమహాదేవి నాయకమణి, వీరి

రచనములలో ఒక్కొక్కరి దొక్కొక్క వేదన ఒక్కొక్క ఛందస్సు. కన్నడములతో దులతూగు వాఙ్మయము. మరియే భాషయందును లేదు.

వీరశైవులే ప్రజాకవులు. సామాన్య జీవనపు మేరలలో వారి హృదయము భాషతొంగిచూడని చోట లేదు. కాని వచనములలో నింకను ఆర్ద్రముగా ప్రజాహృదయములలోని వాఙ్మయమును దోచిరి. ప్రతివచనమునకును కడపట "త్యాగయ్య కృతులకు వలె, వారియంకితముండును. కన్నడిగలచూచి తాళ్ళపాకవారు మొదలైన వైష్ణవులు వచనములు తెనుగునందును వ్రాసిరి. కాని అవ్యవి అంతవ్యాప్తికి రాలేవు.

సర్వజ్ఞుడు మనవేమన వంటివాడు వైశ్యుడు. వేమనలో హాస్యమెక్కువ, అతనిలో ఆవేశపు మాత్ర అధికము. ఒక్కొకచోట అసహ్యముగా చెప్పుటకనుగూడ జంకడు. మాటలకేంద్రము మనసు తీంద్రము సర్వజ్ఞునకు సాధారణ గుణము. సామాన్య ప్రజాహృదయముల చూరగొనుటలో సర్వజ్ఞుని మించిన వాభాషలో లేవు.

నేటికిని పుట్టణ్ణ శ్రీకంఠయ్య, బేంద్రి, ఆనె కృష్ణయ్య మొదలైన ప్రసిద్ధులు కన్నడపు పేరుప్రతిష్ఠలనిలుపుచున్నారు.

కన్నడభాషకు షట్పదీవృత్తమొకయలంకారము వసూధినీ షట్పది, భామినీ షట్పది, పరివర్ధినీషట్పది వార్ధక షట్పది, భోగషట్పది అని వానికొన్ని భేదములు. "రగడలు" కూడ వారు మాత్రలు మార్చిమార్చి చిత్ర చిత్రములుగ వ్రాయుదురు. వీనిలో గొన్నిటి మన ప్రాచీన కవులు వాడుకొన్నారు. మన అన్నమాచార్యులను పురందరదాసులు అనుసరించిరి. ఎవడో యొకడు

కన్నడము కస్తూరి
తెనుగు తేట
అరవ మధ్వాన్నము

అని కొంటెగా నన్నాడట. దీనియందు కొంటెగానన్నను కొంతనిజమే యున్నది. కాని "అరవ మధ్వాన్న" మనుట మాత్రము నేనంగీకరించను. తెనుగు తేటమాత్రమేగాదు. కస్తూరి గుణమునుగూడ కలికితనమున సంగ్రహించి కొని కమ్మనిదైనది.

నా యుపన్యాసము ముగిసినది. భావములలో మెలపను దప్పియుండవచ్చును. భాషలో పొలపము సన్నగిల్లియుండవచ్చును. కవిసహృదయాఖ్యమైన సరస్వతీ తత్త్వము వానిని క్షమింపకున్న నెట్లు

ఓర్వలేని పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయ్
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్

—గురిజాడ.

<u>సంస్కృత సాహిత్య గోష్ఠి</u>

# ఆంధ్రగీర్వాణముల సంబంధము



వాచస్పతి

## శ్రీ గుండే రావు హర్కారే

పూర్ణమదః పూర్ణమిదం - ఓం శాంతిశ్శాంతిః

**ఆం**ధ్ర సారస్వత విలాసముల సప్తమ వార్షికోత్సవమైన యిది అత్యంతానందకరమైనది. ఈ పరిషత్తులో నవనవోన్మేషమైన యాంధ్ర సరస్వతీలలిత పదవిన్యాస నిపుణములైన గద్య పద్యాద్యనేక శాఖలు కల్పించి తత్కృతి న్యాయమున నా యాశాఖలకు తగిన పండిత ప్రకాండులయధ్యక్షతన వేర్వేఱుగా నుత్సవములు జరుపఁబడుచున్నవి. ఈ ప్రకారముగా సహృదయులకు సహజముగా నానందదాయకమైన కావ్యాసందము వేయి రెట్లధికమైనది. తదనుబంధముగా నేర్పాటు చేయఁబడిన సంస్కృత సరస్వతీదేవి విలాసములను గూర్చి కొంత ప్రస్తావింపవలసినదిగా నాంధ్రసారస్వత పరిషన్నియామకులచే నియమింపఁబడియున్నాను. కనుక నేను సర్వధా వారి యుపకారములు స్మరించి వారికి కృతజ్ఞతా వందనములు సనుర్పించుకొను చున్నాను.

ఆలంపురము దక్షిణకాశియని పేరొందిన మహాక్షేత్రము. దాని మాహాత్మ్యము సర్వవిదితము కావున వేఱుగఁ జెప్పఁబని లేదు. పురావస్తుపరిశోధకులు (Archaeologists) కూడ విశేషముగా నీ క్షేత్ర మహిమనుద్ఘాటించియున్నారు. ఇట్టి పుణ్యక్షేత్రమున నీ పరిషత్తు జరుపఁబడుచున్నది. దీని మూలమున పరమవైదికులును సారస్వత సేవాపరాయణులును అయిన ప్రాచీన చాళుక్యాది మహారాజులు స్మృతికి వచ్చుచున్నారు. ఇచ్చట బ్రాహ్మీ మాహేశ్వరీత్యాది సప్త మాతృకలు, లెక్క లేని శివలింగములు, పరశురా

మూడి దేవతా విగ్రహములు నా కాల మందలి ధర్మస్వరూపమును, ఉపాసనా ప్రకారమును, శ్రద్ధాభక్తి విశేషములను దెలుపుచున్నవి. దేవాలయము, సభా మంటపము మున్నగువాని నిర్మాణ ములోఁ జూపించిన శిల్ప కళా నైపుణ్య మసదృశము. సూర్య, నాగ, శక్తి, శివ ప్రతిమలు విశేషముగ స్థూలమానముతో బౌద్ధాద్యవైదికమతములు నిర్మూలింప బడ్డ తరువాత శైవసంప్రదాయము ప్రవ ర్తించిన కాలమును దెలుపుచున్నవి. ఈ రీతిగా వారాణశి కాశితో దీనికి సాదృశ్య మున్నకారణమున ఆలంపురికి దక్షిణకాశి యన్నది సార్థకనామధేయము.

ఆంధ్ర సారస్వత ప్రస్తావను జరుగు చున్న యిప్పుడు సంస్కృత చర్చవలని ప్రయోజనమేమి ? అని సందేహము కలుగవచ్చును. దీని కుత్తరమేమనఁగా ప్రసంగవశముననే సంస్కృత ప్రస్తావము రావచ్చునని చెప్పవచ్చును. ప్రసంగము వలనఁ గూడ సంగతి పుట్టునని శాస్త్ర మున్నది. ఆంధ్రగీర్వాణ భాషలకుప జీవ్యోపజీవక భావసంబంధము నిప్పటి భాషేతిహాస శాస్త్రజ్ఞు (Philologists) లంగీకరింపక పోయినను ఆంధ్రజ్ఞానము వల్ల సంస్కృతమెట్టి దనుజిజ్ఞాసకలుగుట తప్పదు. కావున నీరెండింటికుపకార్యోప కారకభావము మాత్రము తప్పదు. కనుక నాంధ్ర వాఙ్మయముయొక్క పూర్వాపర ముల గూర్చి శ్రద్ధాపూర్వకముగా సవిస్తర మైన చర్చ జరిగినప్పుడు తప్పక సంస్కృ తము స్మృతికి తట్టును.

సంస్కృత భాషయొక్క ఉపకారక త్వము ప్రమాణ శుద్ధమూకాదా ? అను విచారము చేయునప్పుడిది యే ప్రకార ముగా నుపకారము చేయునని విచారిం చుట యావశ్యకము. కాని మొదట సంస్కృత భాషయొక్క అధ్యయనపద్ధతిని గుఱించి యే యొకమనవి చేయఁదలంచు కొన్నాను. ఈ విషయమున ఐరోపీయ పండితులు మనకు మార్గము చూపించు నాచార్యులు. వారు మనకు సంస్కృత భాషయొక్క ప్రతిశాఖ నభ్యసించుట యందు క్రొత్త త్రోవ చూపించినారు. కాని వారుపదేశించినది వారే నిర్వ హింపఁజాలకపోయిరి.

జగత్తులో నిప్పుడుండు యావద్గ్రంథ ములలో ఋగ్వేద మతిప్రాచీనమైనది. ఈ విషయమున నెవరికిని సందేహ ముండ జాలదు. ఋగ్వేదమున రాజకీయ, సామాజిక ధార్మికసాంప్రదాయ విశేష ములు బోధించు మార్గములెన్నియో తెలుపఁబడియున్నవి. కాని యా విషయ మున పరిశోధనముజరిగి కాలనిర్ణయము, విషయవిశదీకరణ మీా వఱకుఁ గాలేదు. ఋగ్వేద భాష బహుప్రాచీనమైనది. అది సంస్కృతముకాదు, మఱియొక భాషయని కొంద అభిప్రాయపడుచున్నారు. ఇతర వేదముల భాషకు ముఖ్యముగా తైత్తిరీయ, ఐతరేయబ్రాహ్మణగ్రంథముల భాషకును ఋగ్వేద భాషకును జాల భేదము గలదు. ఈ భేదకారణములు పాశ్చాత్యపండితులు నానా ప్రకారములుగాఁ జెప్పుచున్నారు. వారు తర్కించిన కారణములకన్న భిన్న

మైన కారణములవల్లఁగూడ నిట్టిభేదము సంభవింపవచ్చును. కాని మనదేశ సంప్రదాయముల ననుసరించి ఇట్టి భేదకారణముల నిర్ణయమవశ్యము.

వ్యాకరణ శాస్త్రము జగత్తులో మన దేశమున దక్క మఱి యెచ్చటను లేదు. మితి లేని ప్రాధాన్యతులాడు గ్రీకు దేశములోఁగూడ నాభాషకు వ్యాకరణమే లేదు. గ్రీకు రాష్ట్రము పూర్తిగా నశించిన తర్వాత రోమనులు ప్రాచీన వాఙ్మయమభ్యసింపనారంభించినప్పుడు గ్రీకు పండితులు తమ భాషకు వ్యాకరణము క్రొత్తగ వ్రాసి వారికి బోధించిరి. భారతదేశము నందతిప్రాచీనకాలమునగూడ వ్యాకరణము పరమోన్నత స్థానము నాక్రమించి యుండెను. పాణినిమహర్షి బుద్ధునికంటెను బూర్వకాలమువాడు. పాణినికన్నను బూర్వమే వ్యాకరణ శాస్త్రమునభివృద్ధికిఁ దెచ్చినవారు పలుబదిమందికంటెనెక్కువ యుండి యుండిరని సంప్రదాయముతో వచ్చిన విషయము. కావున సంస్కృతవ్యాకరణమన్ని దేశములలోని భాషలకుపదేశము చేయునదని నిస్సందేహముగవక్కాణింప వచ్చును. నన్నయభట్టారకుఁడు గూడ పాణిని పద్ధతిననుసరించి యా సంజ్ఞలాపరిభాషలే యెత్తికొని సూత్రగర్భితమైన కారికలు రచించి యాంధ్రభాష ననితరసాధారణముగా నన్నివిధములను బాగుపఱచెను. ఈ రీతిగ భాషను బాగుపఱచుట సారస్వతసేవయేగదా !

ఇంతియే కాక న్యాయశాస్త్రము వేదాంతశాస్త్రము యొక్క అధ్యయనము గూడ వానికి ప్రతియోగియయిన బౌద్ధాది శాస్త్రములు చక్కఁగ పరిశీలన చేయక పోయిన యెడల పూర్తికాఁజాలదు. సంస్కృత సాహిత్య శాస్త్రముకూడనిట్టిదే. అశ్వఘోషాది ప్రతిభాశాలురయిన మహాకవుల కావ్యములభ్యసింపక పోయినచో సంస్కృతమసంపూర్ణమగును. కనుక సంస్కృతభాషయొక్క అభ్యాసక్రమమే మార్చవలయును. ఇప్పుడు క్రొత్తగాఁ గని పెట్టఁబడిన వైజ్ఞానికభౌతిక శాస్త్రముల పరిశోధనవల్ల నిష్పన్నములయిన తత్త్వములు గూడ విశదపఱచుట యావశ్యకము. ఈ రీతిగఁ గ్రొత్త సంస్కారములతో సంస్కరింపఁబడిన సంస్కృతము చే నాంధ్రభాషాసంపద నభివృద్ధి పఱచవలెను. దీని చే నాంధ్ర భాష సర్వాంగ సంపన్నముకాఁ గలదు. దీని వల్ల నిప్పుడాంధ్రభాష వికలాంగమైయసంపూర్ణమైయున్నదని యభిప్రాయపడఁగూడదు. పూర్వికులును అర్వాచీనులును అగు నాంధ్రభాషా పండితులును కవీశ్వరులును శాస్త్రాధ్యయన పరులును ఆంధ్ర సరస్వతీ దేవి సేవలో నేమాత్రము న్యూనతనుంపలేదు. ప్రాచీనకవులాంధ్రసరస్వతిని జక్కఁగ నలంకరించినారు. కావ్యరచనయందాంధ్రభాషను సంస్కృతముతో సమానమైన స్థితికిఁ దెచ్చినారు. ఇంతియే కాదు. కొన్నియంశములలో నాంధ్ర కావ్యము సంస్కృతముకన్నమించియున్నది. చూడుఁడు. ఓజోగుణమును వ్యక్తపఱచుటకు పెద్దపెద్ద సమాసములు కావలయునను నియమము లేదు. ఇందుల

కుదాహరణముగా నే సాహిత్యకారులయి నను "యో యః శస్త్రం బిభర్తి" యను వేణీసంహారములోని యొకే పద్యము నెత్తి చూపుదురు. ఆంధ్రవాఙ్మయమున నిట్టి పద్యములు కేవలము కావ్యములందే గాక పురాణములలోఁగూడ విపులముగాఁ గలవు. "నీ చేసిన పాపమునకు నీ చాత్మక యముఁడు వలదు" అనుభాగవత పద్యమునందఱును సర్వసాధారణముగనే చదువుచుందురు. ఈ పద్యమున రౌద్ర రసము చిన్నచిన్న శబ్దములతో నే రీతిగాఁ బరిపోషింపఁబడియున్నదో తమకే విదితమైయున్నది. ఐనను ఆంధ్రవాఙ్మయమునకు సంస్కృతముయొక్క సాహాయ్య మావశ్యకమైయున్నది. కేవలము సరి స్తోత్రమునకు శృంగార రసమునకును మాత్రమే ప్రాధాన్యమీయఁబడినది. కావ్యాదులయందు వ్యక్తపఱుపఁ బడిన యుదాత్తభావముల ఊహాపోహములు సాహిత్య శాస్త్ర సిద్ధాంతములను బట్టి చేయుట యత్యావశ్యకము. కొన్ని సాహిత్య గ్రంథములు శాస్త్రమునకు విరుద్ధముగాఁ గూడ రచింపఁబడినవి. అట్టి గ్రంథములు పాఠ్యపుస్తకములలోఁగూడ చేర్చఁబడియున్నవి. దీనిచే సమస్తవాఙ్మయము వ్యాకులమైయున్నది. నిన్నటి దినమే మహాపండితులయిన ఆచార్య రాధాకృష్ణయ్యగారు "ఈ నవ్య యుగములో భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించినపుడు జగత్తులో సమస్త దేశములతో సాక్షాత్సంబంధములు గలిగియున్నప్పుడు సరస్వతీదేవి రాజుల నాశ్రయించి యుండదు. ప్రజలనేయాశ్రయించి యున్నది", అని సెలవిచ్చినారు గదా!

నిజముగ విచారించినచో ప్రజలభావ ప్రవాహమే యెప్పుడును వాఙ్మయములో ప్రతిఫలించుచుండును. గోల్డు స్మిత్తు మహాకవిగూడ "సారస్వత సామ్రాజ్యమున నెల్లప్పటికిని ప్రజాస్వామ్యమే అనఁగా (Democracy) యే యుండు" నని చెప్పియున్నాఁడు.

ఈ ప్రకారముగా నాంధ్ర గీర్వాణ భాషలకు నిత్యసంబంధముగలదు. మఱియు నా సంబంధము దినదినాభివృద్ధిగాంచుచున్నది. ఆంధ్రభాషా శ్రేయస్సుఁ గోరినే నిప్పుడీ సంస్కృతగోష్ఠిని ప్రారంభించుచు పండితులు తమతమ యమూల్యాభిప్రాయములు వ్యక్తపఱుపవలసినదిగాఁ బ్రార్థించుచున్నాను.

[ప్రారంభోపన్యాసమునుంచి]

# అమరసాహిత్యము



శిరోమణి

## శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి



చరిత్రాత్మకమగు నీ యలంపురమున నేడు సంస్కృత సాహిత్య సమావేశము జరుగుటలో వింతయేమియు కానరాదు. ఈ అలంపురము కొన్ని శతాబ్దములనుండియు సంస్కృత భాషాపోషణమునకును, పండితాదరణమునకును పేరుగాంచినది. నేటికిని ఈ ప్రాంతమున విశేషముగా మాన్యములుండుటయే దీనికి తార్కాణము. అమరశిల్పభూమియగు నీ అలంపురమున అమరభాష యభివృద్ధిపొందుట మెచ్చదగిన ముచ్చటేగదా.

సంస్కృతము అమరభాష. అమరభాషయన అమరుల భాషయని నా అభిప్రాయముకాదు. మరణించని భాష, అమరమైన భాష యని నా అభిప్రాయము. ప్రతివస్తువుగూడ అమరమే. ఏలయన వస్తువుయొక్క దృశ్యమాన, శ్రవ్యమాణ, జ్ఞాయమాన స్వరూపము అనిత్యమైనను, వస్తుమూలతత్త్వము అనిత్యము కానట్లు సంస్కృతభాష వ్యవహార స్వరూపము మారినది. ఆ సంస్కృత భాషాప్రవాహానికి చెందిన ఒకపాయ మన సంస్కృతిరూపముదాల్చి మనరక్తమున రక్తమై జీర్ణించినది. వేరొకపాయ పంజాబీ, బెంగాలీ, మాగధీ, రాజస్థానీ, గుజరాతీ, మరాటీ మున్నగు నేటిభాషల రూపముదాల్చి మన కట్టెదుట కానవస్తున్నది, వినవస్తున్నది, అయినప్పుడు, సంస్కృతభాషను అమరమనక మరేమనగలము ?,

మన సంస్కృతి, సాహిత్యము, కళాశాస్త్రములు; భాషాపరిణామ వికాసములు, వేయేల మన సంపూర్ణ జీవితమే సంస్కృత భాషాజ్ఞానము లేనిచో అందని మ్రానిపండ్లుకావా ? విడగొట్టరాని సమస్యలే కావా ? సంస్కృత భాషాజ్ఞానము లేనినాడు మన సంస్కృతిని గుర్తించలేము, గ్రహించలేము, ఆకళించుకొనలేము.

ప్రాతతెలియనిదే క్రొత్త సృష్టించలేమని యొక తత్త్వవేత్తయనినాడు. ప్రాత, క్రొత్తల మేలికలయికే సృష్టికి మూలము. ప్రాత లోతులలోనికి చూడవలెనన్న దృశ్య ప్రపంచ ప్రతిబింబమగు ప్రాత సాహిత్యమును తరచక తప్పదుగదా ? ప్రాత సాహిత్యమను మణిమంజూషను తెరచి, సభ్యతా సంస్కృతులను చూడగోరవలెనన్న సంస్కృత భాషయను తాళపు చెవి యవసరము. ఆ తాళపు చెవిలేకున్న ఆ మణిమంజూష తెరచుట సాధ్యముకానిపని. అజ్ఞానాంజన

శలాక లేకున్న సంస్కృతీ సాహితుల దివ్యదర్శనము సులభముకాని సుద్ది.

సంస్కృత భాష యనగానే, ప్రాచీనసాహిత్య మనగానే వేదము—నాలుగు నోళ్ళతో నన్ను పలుకరించుచున్నది. విశ్వమానవజాతి పతనాభ్యుత్థానాల పరిణామ పత్రమే వేదమనినా డొక పండితుడు. నిజముగా నది చరిత్రయే, కొన్ని సహస్రాబ్దాల వెనుకకు మన చూపును—ఈ చర్మ చక్షువును గాదు, మనోనేత్రమును — మరలించితిమేని ప్రాచీన విజ్ఞాన సర్వస్వమగు వేద స్వరూపము మనకు సాక్షాత్కరించును ———దారి తెన్ను తెలియక కొట్టుమిట్లాడుచున్న ఆదిమానవ సంఘము ఎప్పటి కేమి యుత్పాతము కలుగునో, మిన్ను విరిగి మీద పడునోయని భయమందుచు తమకు కానరాని వినరాని, తెలియరాని శక్తికి తలయొగ్గి చేసిన స్తవములు చెప్పిన సూత్రములు. తుదకు ఆశక్తి భయము వల్లనే ఈ ప్రపంచమున్నదను నమ్మకమును తమ భయమును ప్రకృతికే అంటగట్టి "భీషాస్మా ద్వాతః పవతే. భీషోదేతి సూర్యః మృత్యుర్ధావతి పంచమ ఇతి" అని నిశ్చయించుకొనుటలు, కన్నుల పిండులైన ఉషస్సులను చూచి తనిసితనిసి తబ్బిబ్బు పడుటలు, అంగీరసుడు అగ్నిని సాక్షాత్కరించుకొనిన నాడు—అగ్నేనయ సుపథా రాయే అస్మాన్......అని చేసిన ప్రార్థనలు. క్రమముగ విజ్ఞానము సేకరించుకొని, శరీరమర్మ మెరిగి, దహర విద్యను, జీర్ణకోశ రహస్యమును తెలుసుకొని "తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వావ్యవస్థితా. నీలతో యదమధ్యస్థాత్ విద్యుల్లేఖేవ భాస్వరా నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః అని వర్ణించి. సబ్రహ్మ సశివస్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్" అని మురిసిపోవుటలు— ఇవన్నియును మానవజాతి పరిణామ చరిత్ర విజ్ఞానేతిహాసము కాక మరేమి?

వేదము చరిత్ర మాత్రమే కాదు. మానవజాతి ప్రథమ ఖండకావ్యము, మహాకావ్యము కూడ నేమో. శాస్త్రమును నదియే. ఆకసముల వెన్న ముద్దవలె తేలు వెన్నెల ముద్దను వేదపురుషుని— భగవంతుని మనస్సుగాను, వాయువును ఊర్పులుగను, కన్నును సూర్యునిగను నాలపించిభావుకతను కవిత్వమనియే కాక, దానికన్న మిన్నయన వచ్చును.

భావుకత, వివేచన అవినాభావ సంబంధము గల జంట కాబోలు, భావుకతకే పెల్లుబికి సృష్టికి మూలము కాగా వివేచన యా సృష్టిని—సృష్టించిన వస్తువును క్రమబద్ధ మొనరించును. మరి కొంత కాలమునకు భావుకత వివేచనపై తిరుగబడి ఉవ్వెత్తుగా లేచును, మరల వివేచన నెమ్మదిగా భావుకతకు కళ్లెము తగిలించును, ఇది జాతి పరిణామగతి. కాగా వేదములలో పొంగి పొరలిన, భావుకతకు సూత్రకాలమున వివేచన కళ్లెము తగిలించినది, భావుకత పొంగు చల్లారినది. నిబంధనలు తలయెత్తినవి. కళ కళ కొరకు అను నేటి మొండివాదము మన పూర్వు లెరుగరు. మనకు కూడా గిట్టనిది. మన కళలు, శాస్త్రములు మన లక్ష్య సాధనకు, పరమార్థ సిద్ధికి సాధన మాత్రములే, కనుక వేద విషయముల సదాచరణకు, వివరణకు సూత్రములు వెలసినవి. ఈ వివరణలో షడంగములు, గృహ్య, శ్రౌతముల మూలమున రేఖా గణితాది శాస్త్రములు పుట్టినవి.

నిప్పును బట్టతో కట్ట గలమా? భావుకత అనునది నిప్పుకన్నను తీక్ష్ణమైనది. అది శాస్త్రముల సంకెళ్ళను పటపట తెంపినది. కానీ అజ్ఞాత విషయ జిజ్ఞాస కోసము అంగలార్చు స్వప్నకాలమగు వేద యుగము కాదిది. ఆ భావుకత క్రొత్తనడకతో క్రొత్తతీరు సొరులతో వాల్మీకి నుండి "మానిషాద! ప్రతిష్ఠాంత్వం అగమః శాశ్వతీ స్సమాః" అని వెలువడినది. దీనితో వేదములలో కనిపించిన ఖండకావ్యము మహాకావ్య రూపమును సంతరించుకొన్నది. వాల్మీకి ఆదికవి అమరకవి, అయినాడు. ఆభావుకతయే మరొక రూపాన నాట్యశాస్త్రమును పంచమ వేదమునకు ఆయుర్వేదమునకు దారి చూపినది. బ్రహ్మ జిజ్ఞాసకు బాటతీర్చినది. భాసుని నాటకాలు వెలసినవి.

కాని, భాష ప్రవాహిని, ఎప్పడికప్పుడు మార్పులు చెందుట దాని స్వభావము. కనుకను సంస్కృతమైన ఈ భాషలోని ఒక పాయ కొంత మార్పుతో పాలీగా వికృతి చెంది, గొప్ప ధర్మమునకు, సాహిత్యమునకు ఆలవాలమైనది. శాంతి స్థాపనకు దుఃఖ నివారణకు జీవిత మంకితమొనర్చిన బుద్ధ భగవానుడు పాలీని ప్రజాభాషగా గ్రహించి, దానిలోనే ఉపదేశముల నిచ్చినాడు. ఒక మాండలికముగా నుండి వికసించిన ఈ పాలీ కొన్ని శతాబ్దములవరకు బౌద్ధ వేద భాషగా వెలిగి, ఖండ ఖండాంతరములకు వ్యాపించినది. మాండలీకములుగా నిలిచిపోయిన మరికొన్ని సంస్కృత శాఖలు మరింత మార్పుతో పెక్కు ప్రాకృతము లయినవి.

ఆ మార్పు కాలము మన భారత దేశమునకే సువర్ణయుగమను కొందును. ఒక వైపు సంస్కృతము మరొక వైపు ప్రాకృతములు పోటాపోటీలు పడి ముందుకు పరుగిడి పోవుచున్న కాలమది. తక్షశిల నలంద, అమరావతి, వేంగి, నాగవాపి, కాంచి మున్నగు విశ్వవిద్యాలయములు విదేశీయులకు కూడ నువ్విళ్లూరజేయుచు సంస్కృత సారస్వతమును వ్యాపింప జేయుచుండ, శాతవాహనుడు మున్నగువారు ప్రాకృతమును రాజభాషగా స్వీకరించి పెంపొందించినారు. ఆ కాలముననే గుణాఢ్యుడు పైశాచీ భాషలో బృహత్కథను రచించినది. ప్రపంచ కథా వాఙ్మయమున నిదియే తొలిదనుట-అదియు మన రాజధానియగు భాగ్యనగర పరిసరములలో నేడు కుగ్రామమైయున్న కొండాపురమునరచింపబడినదనుట మనకు గర్వకారణము. అప్పుడు మన హైద్రాబాదు ప్రాంతీయ మహిళలెందరో కవయిత్రులయి యుండురు గాథా సప్తశతిలో అణులచ్చి, అనులద్ధి, మున్నగువారి ముక్తాలను హాలుడు సేకరించు కొనుటయే ఆ విషయమును చాటుచున్నది.

అయినను ఈ పోటీలో తర్వాత సంస్కృతము పై చేయియయినది. గుప్తులకాలమున జరిగిన వైదిక మతపునరుద్ధరణ మహాయజ్ఞమున సంస్కృత భాష సోమిదేవమ్మ యయినది. ఆమె కీర్తి చంద్రికలు ప్రాచ్య పాశ్చాత్య ఖండములకు సంస్కృతీ ప్రతినిధుల రూపమున వ్యాపించినవి.

ప్రపంచ భాషలపైననే సంస్కృత సారస్వత ప్రాభవము విరచుకొని పడినరోజులవి. రోమకశాస్త్ర సంప్రదాయాలను మనము గ్రహించి సంస్కృతీకరించుకుని స్వంతంచేసుకొనిన ఉదారకాలమది. విదేశీయులకు విజ్ఞానభిక్ష పెద్దకాలమాయుగంలోనే జరిగినది. అప్పుడే దీపాలలో సందాదీపముగా, నందనోద్యానములోని మందార వృక్షముగా కాళిదాసు అవతరించినాడు.

భావుకతకు పరాకాష్ఠ ననదగిన మేఘదూత కావ్యమునకు సాటియగు, లిరికల్ కావ్యము ఇక పుట్టదేమో. కాళిదాసు చిత్రకారుడును కాబోలు. ఇతడు తన రచనలలో చూపిన వర్ణకాభంగమును చిత్రకారులుగూడ చేయరనుకొందును. ఈ నందాక్రాంతను వినుడు.

గత్నచ్ఛాయా పరికర ఇవ
ప్రేక్ష్య మేతత్పురస్తాత్
వల్మీకాగ్రాత్ప్రభవతి
ధనుఃఖండమాఖండలస్య
యేసశ్యామం వపురతితరాం
కాంతిమాపత్స్యతే తే
బర్హేణేవస్ఫురిత రుచినా
గోపవేషస్యవిష్ణోః

దీనిలోని రంగుల కలయికను నేను చిత్రకారుడయినచో వివరించగలనేమో ? ఆ వివరణయును కాళిదాసుని హృదయమును తెలుపుటకు మారు నొప్పించునేమో.

అతిలోక, అనింద్య సౌందర్య స్వరూపిణిగా పార్వతీదేవిని అతడు శివునితోనిట్లు వర్ణింపజేసినాడు.

యదుచ్యతే పార్వతి పాపవృత్తయే
నరూపమిత్యవ్యభిచారితద్వచః
తథాహి, తేశీలముదారదర్శనే
తపస్వినామ ప్యుపదేశతాంగతం.

కాళిదాసుడు శిల్పియు కాబోలును, లేకున్న నొక్క మాటలో శిల్పకళారహస్యమును జోటజోట జాలువార్చగలుగునా ?.

స్థితాఃక్షణం పక్ష్మసు, తాడితాధరాః
పయోధరోత్సేకని పాతచూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణనాభిం ప్రథమోదబిందవః
అని యనగలిగి యుండునా ?

కాళిదాసుని కవిత, భావుకత బంగారు పండించినది. అభిజ్ఞాన శాకుంతలమున, కుమార సంభవము లోని దేవభూములలో ప్రాకృతికి దివ్యసౌందర్య శీలాలకై సేత విడ్డూరమనిపించినదేమో అతనికి. శాకుంతలమున ఒక మానవిని, దేవ సంబంధమున్నను, పాంచభౌతికతయే హెచ్చుగానున్న వ్యక్తిని - సంపూర్ణ దివ్యత్వవిలసితగా తీర్చి దిద్దినాడు. దేవలోక, మానవలోకములకు సమన్వయము కుదిర్చినాడు.

బాణోచ్ఛిష్ట మిదంజగత్ అయిన హర్షవర్ధనుని కాలమున సంస్కృత సాహిత్య ప్రభ భగ్గున వెలిగి యారిపోవుచున్న దశకువచ్చినది. అప్పటికి సంస్కృతము వ్యవహారచ్యుతమై గ్రాంధికమైనది. ప్రాకృతములు అపభ్రంశములై నేటి పెక్కు భాషలుగా బయలుదేరినవి. వానిలో సారస్వతములు కూడా తలయెత్తసాగినవి. క్రీస్తుశకం ౯,౧౦ శతాబ్దాలు మన దేశమున పెక్కు ప్రాంతీయ సాహిత్యములకు ప్రోది పెట్టినవి. సంస్కృతము పూర్తిగా మూలబడక పోయినను రాజాస్థానముల పండిత గోష్ఠుల సామాన్య భాషగా మాత్రము మిగిలినది. దీనితో వాఖ్యానకాలము పుట్టినదనవచ్చును.

అప్పటికి తెలుగు దేశమున కాకతీయ రాజ్యమేర్పడినది. సంస్కృత భాషకు తెనుగురాజులు, తెలుగు దేశము చేసిన సేవ అపారము. ఇంతకు ముందు పేర్కొన్న గాథా సప్తశతి సంస్కృత భారతికి తెనుగు దేశమిచ్చిన ౭౦౦ యాణిముత్తెముల నివాళి. నాగార్జునుడు, నిత్యనాధుడు. కుమారిలుడు మున్నగువారు శాస్త్ర విజ్ఞాన వికాసమునకు చేసిన కృషి సాటిలేనిది. నిత్యనాధుడు తన రసరత్నాకరమువాద ఖండమున బంగారు, నానా మిశ్ర లోహములు, నేడు మనము తరచు చూచు మాయ ముత్తెములు మాయబంగారు మున్నగునవి చేయు విధానము తెలిపినాడు.

కాకతీయుల కాలమున సంస్కృత సాహిత్యము మరల చిన్నగద్దె యెక్కినదే యనవచ్చును. మహాలంకారికుడగు విద్యానాధుని ప్రతాపరుద్ర యశోభూషణము, సోమనాధుని భాష్యము మున్నగు శాస్త్ర గ్రంథములుండగా, "ఉదాహరణములు" అను నూతన సాహిత్యశాఖయే చిగిర్చినది. మొదటిది త్రిపురాంతకోదాహరణము. ప్రఖ్యాత మల్లినాధుని వ్యాఖ్యలు నీకాలమువే.

కిందారుణా శంకరటింకరేణ
కింవా ససా-చీకిరిబాకిరేణ
సర్వజ్ఞ భూపాల విలోకనార్థం
వైదుష్యమేకం విదుషాం సహాయః.

అని మల్లినాధుడు మెచ్చిన సరజ్ఞసింగ భూపాలుని రసార్ణవ సుధాకరము, త్రిపురాంతకుని ప్రేమాభిరామము, రెడ్డిరాజుల కాలమునాటికి కుమారగిరిరాజీయము మొదలగునవి సంస్కృత సరస్వతి నలంకరించినవి.

విజయనగర సామ్రాజ్యమున మరొకమారు సంస్కృత భాష యందల మెక్కినది, అంతవరకెవరికిని దక్కని కీర్తి వేద భాష్యముతో విజయనగర రాజులకు దక్కినది. సంగీత, నాట్యశాస్త్రములను గొప్ప రచనలను కైసేసినది. వెంకటపతి రాయల కాలమునకు మరల పతనావస్థ మొదలయినది, ఈ పతనావస్థలో సంస్కృత భాష తలయెత్తినది అప్పయ్య దీక్షితుని కాలమున నొకమారు, జగన్నాథ పండిత రాయల కాలమున మరొకమారు తలయెత్తినది,

తంజావూరు రాజుల కాలమున దోబూచులాడిన సంస్కృత భాష గత శతాబ్దినుంచి ఆంధ్ర దేశమున వనపర్తి గద్వాల, ఆత్మకూరు, సురపురం,

విజయనగరం సంస్థానములలో శాస్త్రచర్చలద్వారా అప్పుడప్పుడు తొంగిచూడ దొడగినవి మాత్రమే.

సురపురమున కిరీటం వెంకటాచార్యులు, వనపర్తిలో శ్రీ కృష్ణబ్రహ్మ పరకాలదేశికులు, అష్టభాషా బహిరీ గోపాలరావు, విజయనగరమున పరవస్తువారు ఎన్నదగిన పండితోత్తములు.

మన రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ సంస్కృత విశ్వ పరిషత్తులో ఉద్ఘాటించినట్లు మన సభ్యతా సంస్కృతులకు మూలకందమయిన సంస్కృతభాష నేడుపేక్షింపబడుట యెంతయు శోచనీయము. సంస్కృత భాషాభ్యాసము జీవికోపయోగి కాదను భ్రమయే ఈ యుపేక్షకు కారణము కానోపును. మన ప్రాచీను లెవరునూ చదువు సందెలను జీవికతో ముడిపెట్టలేదు. ఏదియో వృత్తితో జీవిక నిర్వహించుకొనుచు తమ ఈప్సితమగు సాహిత్యమునకు సేవచేయుటయే వారు తమ లక్ష్యముగా భావించిరి. అట్లు కానిచో బమ్మెర పోతన మడి దున్నుకొనుచు మహాభాగవతమును తెనుగు చేయునా? భవభూతి గద్గద నదద్గోదావరి వారి ధారను పురుడించే వాగ్ధారతో రచనలు కొనసాగించునా? కాని, నేడు కాలము మారినది, జీవికా నిర్వహణ మొక సమస్యయై దయ్యమువలె మనలను పట్టి పీడించి యుద్విగ్నులను చేయుచున్నప్పుడు సాహిత్యసేవ వంటి సున్నితమగు పనికి పూనుకొనుటకు నెమ్మది యేది? పెద్దన కోరినట్లు నిరుపహతి స్థలంబు రమణీప్రియ దూతిక మున్నగునవి నేడు మనము కోరక పోయినను, తినతిండి, కట్టబట్ట నివసించుట కిల్లు అను నిత్య జీవితావశ్యక వస్తువులు ముఖ్యములు కదా?

ఈ విషయమున ప్రభుత్వములు, వివిధ సంస్థలు కృషిచేయుచునే యున్నవి. ఇతోధికముగ చేయగలవని ఆశించవచ్చును కూడా. జీవికా నిర్వహణ సమస్య తేలిక యయినది. గనుక మనము మరొకమారు స్వర్ణయుగ స్థాపనకు నడుము కట్టుదము నిర్విరామ కృషి యొనరింతము. మానవజాతికి విజ్ఞాన భిక్షపెట్టిన మన భారత ఖండపు దివ్వెను మహోజ్జ్వల మొనరింతము గాక.

[అధ్యక్షోపన్యాసం నుంచి]

రచయితలు ప్రజల మనస్తత్వాన్ని మార్చాలి. లౌకిక సమస్యలనుంచి తప్పించుకొనిపోయే స్వభావాన్ని మార్చి కార్యోన్ముఖులను చేయడం ఈనాటి రచయితల కర్తవ్యం.

—గోపీచంద్.

# వర్తమాన రచనా విధానము



శ్రీ శివశంకరస్వామి

స్వస్తి! ఆర్యమహాశయులారా, ఈనాడు ఈ సభావేదికమీద ఉపవిష్టుడనై అభిభాషణము చేయుటకు నాకు అవకాశము కల్పించిన ఆంధ్రసారస్వత పరిషత్ కార్యవర్గమువారికి విశేషించి పరిషదధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజారావుగారికి, కార్యదర్శి శ్రీ పులిజాల హనుమంతరావుగారికి, పూర్వాధ్యక్షులు శ్రీ పర్సా వెంకటేశ్వరరావుగారికి ఆశీస్సులు. ఈసమావేశము దక్షిణకాశి అనే అభిఖ్య చెందిన అలంపుర క్షేత్రములో జరగడము చాల సముచితము. అలంపురము నాకు అపరిచితముగాదు. శ్రీశైలానికి పశ్చిమద్వారమని ప్రసిద్ధిచెందిన ఈ పవిత్రక్షేత్రానికి 1938 సంవత్సరములోవచ్చి ఉత్తరవాహిని ఐన తుంగభద్రలో స్నానముచేసి స్వామిని దేవతలను శిల్పసౌందర్యమును సందర్శించి చరితార్థుడనైనాను. ఆంధ్రసారస్వత పరిషత్తు నాకు ఆప్తవర్గములోనిది. ఆదినుంచి అభివృద్ధిని గమనిస్తూనే యున్నాను. ఇటీవల పాఠ్య ప్రణాళికలు నిర్ణయించి, పరీక్షలు ఏర్పాటుచేసి జనములో విద్యావ్యాప్తికి దోహద మిచ్చి ఒకవిధముగా ప్రభుత్వమువల్ల నెరవేరనిపని పరిషత్తువారు నిరంతరాయముగా నిర్వహించినారని నిష్కంపముగా చెప్పగలను. విద్యావ్యాప్తి ఒక్కటే కాక ఉత్తమగ్రంథ ప్రచురణముకూడ ఉచితరీతిగా జరిగినది. విద్వత్సమ్మానములు, వివిధసభలు, విద్యాగోష్ఠులు, పరిషన్మహావృక్షచ్ఛాయలో పలుమారులు ప్రశస్తి గాంచినవి. ఏతత్ప్రస్తుత వార్షికోత్సవము జగద్విఖ్యాతులైన, విద్వద్వరేణ్యులు తత్వశాస్త్ర వేత్తలు భారతోపాధ్యక్షులు అగు శ్రీ రాధాకృష్ణ పండితులు ప్రారంభించుట ఆంధ్రమహాజాతికి ఆనంద దాయకము. సుప్రసిద్ధాంధ్ర నాయకులగు రాధాకృష్ణుల మహోపదేశము ఆంధ్రజాతి అవశ్యము లక్ష్యముసంధించుకో దగినది. వారి ఆశీస్సువల్ల సారస్వత పరిషత్తు సర్వథా సమాదరణీయమైనది.

ఈ విశాలమైన తెలంగాణములో విద్వాంసులు, విమర్శకులు, ఐతిహాసికులు, శిల్పకళాకోవిదులు, కవులు, కథకులు, నాటకకర్తలు, సాహిత్యోపాసకులు వివిధ రచయితలు విశేషముగా వృద్ధి పొంది యున్నారు. వీరు ఏ దేశమునకైనా ఏ వీటికైనా గణ్యత తేగలిగినవారు. ఇక్కడ సమావిష్టులైన వర్తమాన రచయితలు సాహిత్య వీధులలో వన్నెకెక్కినవారు. మీ కందరికీ తెలిసిన విషయములైనప్పటికి ప్రసక్తము కావడము చేత రచనను గూర్చి కొన్ని కొన్ని విషయములు వివరించ దలచినాను.

తత్త్వదృష్ట్యా పరిశీలన జేసినప్పుడు భూత భవిష్యత్ వర్తమానములు అనే కాలవిభాగము కల్పిత

మని గ్రహించవచ్చును. ప్రాచీన సాహిత్యమని వర్తమాన సాహిత్యమని విభాగము చేయడము అలవాటైపోయినది. న్యాయము ఆలోచిస్తే అతిప్రాచీన కాలములో రచించిన గ్రంథమైనా ఈనాడు చేసినటు ఇంపుగా ఉండవచ్చును; నేడు వ్రాసినదైనా వాడిపోయినవల్లరివలె వన్నె తరిగియుండవచ్చును. కాబట్టి ప్రాచీన అర్వాచీనత్వములు గాని బాగోగులు గాని కాలమానమునుబట్టి గణించకూడదు. ప్రతిభావిశేషముచేత నవనవోన్మేషశాలి అయిన రచన ఎప్పటిదైనా రమణీయమే. మనమందరము అట్టి రచనను పూనుకొని కృతకృత్యులమైతే ధన్యులమని భావించవచ్చును.

ఒకసారి విద్యమాన రచనా విధానముల విమర్శింతాము. ప్రాచీన మార్గాను గతముగా పండితులు పద్యకావ్యములు రచిస్తున్నారు. అందులో విశేషభాగము పురాణములకు అనువాదముగాని ప్రాచీన కథల వివరణముకాని విశిష్టముగా వుంటున్నది. గతకాలములోని కథలను యథాతథముగా ప్రపంచించి ప్రబంధ రూపమున ప్రదర్శించినప్పుడు ఈ కాలపు వారికి అవి ఎంతవరకు ఆకర్షకములో ఉపాదేయములో ఔతవో గమనించవలె. ఇటి కావ్యాలలో విశేషముగా కృతకభాష గోచరిస్తుంది. గ్రంథస్థ భాష కాలక్రమేణా చైతన్యము కోలుపోవచ్చు, అనేక పదములు వ్యవహార భ్రష్టము కావచ్చు అందువల్ల రచన సజీవముగా కనబడక పోవచ్చును. ప్రాచీన మతావలంబులు గ్రామ్యమని అడుగడుగున భీతి చెందుతూ వుంటారు. గ్రామ్య శబ్దార్థము జుగుప్సాకరము, అశ్లీలము ఐతే హేయమే కాని మనవంటి వారము మాట్లాడేభాష గ్రామ్యమే ఐతే ఉత్తమభాష ఉద్భూతమయ్యేది యెక్కడి నుంచి? కొన్ని కొన్ని పుస్తకములవల్ల కొంత మేలు, కొంత చెరుపు కలుగుతూ వుంటుంది. బాలవ్యాకరణమటువంటిది. తత్కర్త చిన్నయ్య సూరి తనకు తెలిసిన విషయములను వ్యాకరణములో రమారమి (౯౦) సంవత్సరముల నాడు నిబంధించినాడు. ఒక్క మానవుడు ఎంత విజ్ఞానవంతుడైన "సర్వజ్ఞుడు కాలేదు. శబ్దాంబుధిని మథించి సారముతీయలేడు.

ఆయన అభిప్రాయము తన వ్యాకరణము శాశ్వతమనిగాని ఏకైక ప్రమాణమని గాని కాదు. మహర్షులనేకులు సంస్కృత వ్యాకరణము నిబంధించినారు. మహేశ్వర సూత్రములు మొదలు పాణిని వరకు ఎంతో పరివర్తనము జరిగినది. కాత్యాయన పతంజలులు ఎన్నో మార్పులు సూచించినారు. నేటికి గీర్వాణ వ్యాకరణ సంస్కారము జరుగుతూనే యున్నది. ఇటువంటి స్థితిలో ప్రవాహిని, దేశ్య ఐన ఆంధ్ర భాషావ్యాకృతిలో సంస్కారమెందుకు జరుగకూడదు. బాలవ్యాకరణముమీది భ్రమచేత విద్వాంసులు తాళి పత్రములలోని పాఠములను తదనుగుణముగా దిద్దుతున్నారు. పైగా ప్రాతబడి పోయిన బాలవ్యాకరణమునకు ఇంకా వ్యాఖ్యలు వ్రాస్తున్నారు. ఆగ్రంథాన్ని విస్మరించి వివిధ భాషావేత్తలు, శబ్ద తత్వవిధులు ఐన నవీన వైయ్యాకరణులు పరిషద్రూపముగా సమావిష్టులై సరళీరూపమున ఆంధ్ర వ్యాకరణము నిబంధించడము సముచితము.

అభిధాన గ్రంథముగూడ అత్యావశ్యకము, వావిళ్ళవారి ఆంధ్ర నిఘంటువు అచిరకాలములోనే ప్రకటిత మవుతుందని వినికిరి. ప్రమాణ భూతమైన సూర్యారాయ నిఘంటువు శీఘ్రకాలములోనే సమాప్త మవుతుందని ఆకర్ణించి ఆనందించినాము. ఈ నిఘంటువులు గ్రంథస్థ శబ్దముల కర్థములు వివరించేవి. ఇంకొక ప్రయత్నము కూడ జరుగుతున్నది, ఆయా మండలాలలో ఉండే కొందరు నైఘంటికులు వ్యవహారములో ఉండి గ్రంథాలలోకి ఎక్కని శబ్దజాలము సేకరిస్తున్నారు, ఇది ప్రశంసాపాత్రము, కాలక్రమేణ పద సందోహము ప్రవృద్ధమై ఆక్సుఫర్డ్ అభిధానమువలె మనకు కూడ మహా నిఘంటువు నిర్మాణము కావలె, అప్పుడు అర్థ విషయములో సంశయ విచ్ఛేదము సంభవిస్తుంది, శబ్దార్థాలు కరతలామలకమైతేనే గ్రంథ రచనకు రాచబాట ఏర్పడుతుంది

ఆధునికులకు వ్యుత్పత్తి తక్కువ అని అపప్రథ ఏర్పడ్డది, ముఖ్యముగా ప్రాచీన మతావలంబులు ఈలా అంటూ వుంటారు. వ్యుత్పత్తిలోపము

ఒక్క ఆధునికులదే అనుకో నక్కరలేదు. ఆంధ్ర భాషలో చక్కని రచన చేయవలెనంటే సంస్కృత ప్రాకృత, పాలి, భాషా జ్ఞానము దాక్షిణాత్య భాష లలో తమిళ, కర్నాటక, భాషా ప్రవేశము ఆవ శ్యకము. వివిధ విషయ విజ్ఞానము, అలంకార, చ్ఛందో, వ్యాకరణ, జ్ఞానము.ప్రాక్పశ్చిమ సాహిత్య సమీక్షా విధాన వివేకము కూడ అవసరము, అల్ప సంతుష్టి విడిచిపెట్టి సిద్ధత కోసము విశేష కృషి ఎవరైన చేయవలె.

అనువాద సాహిత్యము అధికముగా వ్యాపి స్తూన్నది. శరచ్చంద్ర చట్టోపాధ్యాయుని కథలు నవలలు, అనేకులు ఆంధ్రీకరిస్తూన్నారు. ఆ రచన అన్ని ముఖాల చర్విత చర్వణంగా ఆంధ్రుల కు అందజేయ నక్కరలేదు. ద్విజేంద్రలాల్ రాయల నాటి దండయాత్ర అంతరించినా శరత్సాహిత్యము శమించ లేదు. ఆంగ్ల భాషలోనుంచి అనేక నవ లలు, కథలు, అన్ని పత్రికలలో అవతరిస్తున్నవి అనువాద రూపముగా అనువాద కర్తలు ఏవి ఆంధ్రీకరించ వచ్చునో ఆలోచించకుండా వెదజల్లు తున్నారు. వాటిలో అచార వ్యవహారాలు, ఆయా దేశ స్థితిగతులు సామాన్య పాఠకులకు సరిగా తెలియవు, ఉచిత రీతితో కొంత వివర ణము చేయడము కూడయుక్తము. ఆంధ్రునికి ప్రపంచ సారస్వతములో మారుమూల పుస్తకాలు అందచేయక పోయిన నష్టములేదు. సంస్కృత ములోనుంచి అనువాదాలు అనేకము వస్తూన్నవి. రామాయణమును పద్యరూపములో వచన రూప ములో అవతరింపజేస్తూన్నారు. కొందరు దేవీ భాగవతమును, పద్మపురాణమును. పట్టుకొన్నారు. ఈ కాలము పురాణాదికమును పద్యరూపములో, చెప్పడంకన్న సరళమైన వచన రూపములో యథా మాతృకముగా సంతరిస్తే సంతోషించ వచ్చు. మూలగ్రంథముల నిర్దుష్ట పాఠము నిర్ణయిస్తే వాఙ్మ యానికి మహోపకార మవుతుంది. ఆర్య ధర్మ స్వరూపము అసంశయముగా అవగత మవుతుంది. కేవలం అనువాదములతోనే ఆనందించగూడదు, ప్రాచీన గ్రంథజాత సమీక్ష సమీచీనము ,ఈ సంద ర్భములో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. కోట వేంకటాచలముగారు కొంతవరకు ఉత్తమకృషి చేసినారు. బ్రహ్మశ్రీ వారణాశి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి సంస్కృత మహాభారత విమర్శ గమ నించ దగినది.

ఇతిహాసములోకూడ పరిశోధన జరుగుచున్నది. శ్రీయుతులు నేలటూరి వెంకటరమణయ్య, సోమ శేఖరశర్మ, భావరాజు కృష్ణారాయప్రభృతులు చరిత్రలో నూతనవిషయములు వెలికిలాగుతున్నారు. సాహిత్య సమీక్షలో శ్రీ విశ్వనాథ సత్యనారా యణ, తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య, నిడుదవోలు వెంకట్రావు, శిష్టా రామకృష్ణశాస్త్రి, పారనంది జగన్నాధస్వామి, నరసింహశాస్త్రి, గిడుగు సీతాపతి, వావిలాల సోమయాజులు, దేవులపల్లి రామానుజా రాయ ప్రభృతులు అనేక విషయములు ఆవిష్క రిస్తున్నారు. సీతారామ భట్టాచార్య, పిల్లలమర్రి హనుమంతరాయ సంగ్రధితమైన నవ్యాంధ్ర సాహిత్యవీధి ద్వితీయ ముద్రణ గమనింపదగినది. సంస్కృతి చరిత్రలో ప్రతాపరెడ్డి లక్ష్మీరంజనాదులు ఉత్తమగ్రంథములు రచించినారు. ఈ విధముగా ఆంధ్రవాఙ్మయము అభివృద్ధి పొందుతున్నది.

వర్తమాన రచయితలు వివిధ శాఖలలో వెలువడు తున్న వాఙ్మయము లక్ష్యము చేయదగ్గది. ఇది యావత్తు విద్వత్తుకేగాక వ్యుత్పత్తికిగూడ ఉపక రిస్తూంది. ఐతే ఇక్కడ ఒకచిక్కు ఏర్పడ్డది. నేటి రచయితలు తమ కృతులలో ఎటువంటి వస్తువును స్వీకరించి ప్రదర్శించాలె అనేది గట్టిప్రశ్న. అన్నిటి కన్న అర్థశాస్త్రజ్ఞానము వివిధ రాజనీతి విధానములు అందరినీ ఆందోళనపరుస్తున్నవి. తరుణ రచయితలు ముఖ్యముగా తబ్బిబ్బులైపోతున్నారు. కండ్లయెదుట కనబడుతున్న ప్రజాహృదయ క్షోభము ప్రతివారిని బాధిస్తూన్నది. తమను కలతపెట్టే తాత్కాలిక విష యముల ప్రభావమే పడుతుంది యువకులమీద, ఐహిక విషయములే ఆకర్షిస్తవి. ఆముష్మిక విష యములు అంటవు. ఇటువంటప్పుడే కొంచెము ఓపిక పట్టి సింహావలోకనము చేయవలెను. ఏది తాత్కాలి

కముగా తాటాకుమంటవలె భగ్గుమని వెంటనే నిర్వాణముచెందుతూందో దాన్ని సారస్వత రూపముతో నిబద్ధముచేస్తే ఉపన్యాసమువలె కరపత్రమువలె త్వరలోనే కాంతిహీనమై పోతుంది. 'నిలుకడ వలయుకృతికి' అనే నిశ్చయము ఉంటే ప్రతివిషయము రచనకు ఉచితముకాదు అనిపిస్తుంది. ఈలా అనడంవల్ల సంకోచదృష్టితో నేను చెప్పినట్టు భావించవద్దు. సమ్యక్ దర్శనమే సమాదరణీయము, ఆదృష్టి ఏర్పడ్డప్పుడు ఏది స్వీకరించినా ఇబ్బందిలేదు.

ప్రతిపుస్తకములో నూతన సత్యమేదో ప్రతిపాదించవలెననికాని, ఏదో సందేశము ఇవ్వవలెననికాని యత్నించనక్కరలేదు. సత్యము అనాది శాశ్వతము అతీంద్రియ శక్తికల యోగులుకూడ సత్యనూతన స్వరూపము ఆవిష్కరించలేరు. సందేశమివ్వడము సామాన్యమైన పనిగాదు. తత్వవేత్తలు అనుభవజ్ఞులు ఐన మనీషులే జంకుతారు. ఇటువంటి విషయాలలో సామాన్యులు సాహసించగూడదు.

గ్రంథములుచదివి తయారుచేసే కితాబీ వాఙ్మయముకంటే విశేషమైన అనుభూతివల్ల వెలికివచ్చే రచనే రమణీయతరము. దీనివల్ల బహుగ్రంథావలోకనము పనికిరాదని నా ఆశయముకాదు. ఎంత విద్యా సంభారమువుంటే అంతమంచిది. బ్యాంకర్, బ్యాంక్రప్ట్, అని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చేసిన విభాగము చిత్తములో వుంచుకోతగ్గది.

ఆంధ్రదేశములో అక్షరాస్యులు తక్కువ అందుచేత రచయితలు అనవసరముగా అనేకగ్రంథములు చేసి దేశములో నింపడము నిరుపయోగము. అసలు గ్రంథవిస్తరభీతి ఉండడమే ఉచితము. అపుకోలేని ఉత్సాహోద్రేకము ఉన్నప్పుడే రచనరానీయడము రమ్యము. వ్రాతలు యంత్రాగారములో ఉత్పత్తి అయ్యే వస్తువులువలె కొల్లలుగా అల్లరాదు, విస్తృతి ఉన్న నిస్సారగ్రంథము నిజభారముతో క్రుంగి పోతుంది.

దేనికైన ఆదిమధ్యాంతములను అందముగా పొందుపరుచాలె. ఈ సందర్భములో కళ కళకొఱకే అనే సూక్తి జ్ఞప్తికి రాకతప్పదు. ఈ సిద్ధాంతమును పలువురు పరిహాసిస్తున్నారు. శాంతముగా యోచిస్తే దీనిలో సత్యము సమ్మతమవుతుంది. ముఖ్యముగా సరససాహిత్యసృష్టికి ఈ సిద్ధాంతము సంజీవివంటిది. నగలో పదార్థము బంగారమైనా నగిషీ తగినట్టుగా లేనప్పుడు మగువలు దానిని ధరించరు. జనాంగీకృతమైన వస్తువును స్వీకరించి ఏదోవిధముగా రచనచేస్తే రసికజనము దానిని రమణీయమని అంగీకరించదు. సాహిత్యము ఆపరితోషాద్విదుషాంనసాధు, అని నమ్మినవారు నాణెమైన రచన చేయగలరు. కాబట్టి ఆకార ప్రకారాలు అందముగా తీర్చి దిద్దడము అత్యంతావశ్యకము. సుకవులు సువర్ణకారులని గ్రహించవలెను.

ఆంధ్రసారస్వత పరిషత్తు అత్యంతవైభవముగా వార్షికోత్సవము ఏర్పాటుచేసినందుకు ఎంతో ఆనందము. ఇంతఘనముగా సంతరించిన ఈసభలు మృగ్యములు. ఆంధ్రదేశములో సజీవముగా సారస్వత కృషి సలుపుతున్న పరిషత్తులలో ఇది ప్రథమగణ్యము. శివానుగ్రహమువల్ల ఈ పరిషత్తు ఇతోధిక 'సంపత్తు పొందునుగాక'!

శుభంభూయాత్

# వర్తమానాంధ్రవచన రచన



సాహిత్యాచార్య

## శ్రీ పిల్లలమర్రి వెంకటహనుమంతరావు

నేడాంధ్ర సారస్వతరంగంలో వివిధభూమికలలో యథాశక్తిగా కృషిచేస్తూ ఆంధ్రసరస్వతిని అర్చిస్తూ ఉన్న కళారాధకులందరి సూావిధముగా ఒక్కచోట సమావిష్టులం కావడం ముదావహం. ఇందుకు కారణభూతులైన ఆంధ్రసారస్వత పరిషత్కార్యకర్తల నెంతగా కొనియాడినా తక్కువే. తేనెమాగాణమైన తెలంగాణములో ఆంధ్రసరస్వతిని దాదాపుగా పదేండ్లకుపైగా సమారాధిస్తూ అవిరళ కృషి సల్పుతూ గ్రామగ్రామాల సాహిత్య సందేశాన్ని అందిస్తూ అవిరళాద్భుత సేవగావిస్తున్న ఈ పరిషన్నేతలకు ఇవే నా అభివందనలు.

స్వాతంత్ర్యం సంస్థాపించుకొన్న నవభారతంలో ప్రాచ్య సంస్కృతి సంపూర్ణంగా సమున్మేషం పొందడానికి మనీషులెంతైనా పాటుపడవలసిన అవసరమున్నది. ఏళ్లతరబడిగా సుషుప్తిలో ఉన్న ప్రాచ్య కళాసరస్వతి స్వాతంత్ర్యోదయ కాంతుల ప్రసారంతో మేల్కొని, మహాకవి పండిత వైతాళికుల పవిత్ర మంత్రవాగ్ఝరులలో తానమాడి, పుష్టిచెందింది. సర్వతోముఖ విన్యాసాలతో నృత్యం సల్పి ఆనందామృతాన్ని ప్రాకృతులపైన చిలుకరించటానికి అనువైన కాలం ఏతెంచినది.

అద్భుతనాద సౌందర్యానికి ఆలవాలమైన మన ఆంధ్రభాషాసరస్వతి యావత్ప్రపంచాన "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు" అన్న గౌరవం పొందినా బహుభాషాయుతమైన భారతంలో ప్రత్యేక స్థితినే కాక ప్రథమ స్థానమునుకూడ అందుకోగల అంతశ్శక్తి ఆంధ్రసాహిత్యంలో సమగ్రంగా ఉన్నా ఇంతకాలమూ నివురుగప్పిననిప్పులాగా ప్రత్యేకావకాశాలు లేక మరుగున ఉంది. కాని ప్రజాస్వామ్యంలో సమానావకాశాలు లభింపనుండుటయే కాక ప్రత్యేక రాష్ట్రంగూడా పొందే శుభసమయం ఆసన్నం కావడమున్నూ కారణాలుగా ఆంధ్రసరస్వతికి రాగల అద్భుత భవితవ్యం అభివ్యక్తమౌతున్నది. అస్తు! ఈ విధముగా చారిత్రాత్మకంగా ప్రాముఖ్యం వహించిన ఈ సమయాన సారస్వతేయులము మన పూర్వాపరాలను కూర్చి శ్రద్ధతో పర్యాలోచించుకో బూనుకొనడం సముచితం.

ఈ సందర్భాన వర్తమాన వచనరచన ఎల్లా వున్నదో చెప్పడానికి సాహసిస్తున్న నన్ను మన్నించండి.

ఈ వర్తమానాంధ్ర సారస్వత యుగాన్ని వివిధనామాలతో సంభావించడం సముచితము కాగలదు. చూడండి వీరేశలింగం పంతులు యుగకర్తగా సంఘ సంస్కరణయుగమనీ వచనయుగమనీ చిలకమర్తి, వేంకటపార్వతీశ్వరుల కృషి నెన్నుచూ నవలాయుగమనీ, శ్రీపాద తిరుపతి వెంకటకవుల

ప్రభావాన్ని గమనిస్తూ అవధానయుగమనీ గిడుగు వారి భాషాసంస్కరణోద్యమ కృషిని గుర్తిస్తూ దీన్ని వ్యావహారిక భాషాకమనీ, తల్లావఝుల రాయప్రోలీత్యాది సాహితీసమితీయుల ప్రభావాన్ని సూచిస్తూ భావకవిత్వపు యుగమనీ కొమర్రాజు కట్టమంచి సురవరం మొదలైన వారల కృషిని గణిస్తూ పరిశోధనాయుగమనీ ముట్నూరిత్యాదుల కృషి నెన్నుతూ పత్రికా యుగమనీ శ్రీ పాద మునిమాణిక్యం మూడపాటి మొదలైనవారల రచనలను బట్టి కథానికాయుగమనీ ఇల్లాగే నారాయణదాసుగారి ప్రభావంతో హరికథల యుగమనీ ప్రజా వాఙ్మయయుగమనీ విజ్ఞానశాస్త్ర యుగమనీ ఇలా వస్తువును బట్టీ, ప్రక్రియనుబట్టీ, ఒక్కొక్కచో మహాప్రభావం నెరపిన సారస్వతేయుని పేరనూ యుగవిభజన చేయవచ్చును. కొందరిటీవల వస్తున్న సారస్వతమంతా ఇంగ్లీషు బెంగాల్ హిందీ ఉర్దూ ఫ్రెంచి, రష్యన్ భాషలనుంచి అనువాదాత్మకమైనదే కావడం చూచి అనువాదయుగమనీపిలవవచ్చు ననుకోవచ్చు. ఆమాటకువస్తే ఆంధ్ర సాహితి నన్నయదగ్గరనుంచీ నాదాకా ఉన్నటి సాహితి అంతా (ప్రబంధాన్ని హరికథను బుర్రకథనూ వదలివేస్తే) అనువాదసాహిత్యమే అవుతుంది ఇది మన జాతీయులకున్న ఔదార్యమును తెలుపుతున్నది. అయితే మనసాహిత్యం ఇతరభాషలలోకి హెచ్చుగా అనూదితం కాకపోవడం శోచనీయము. అందుకు వర్తమానకవి పండితులు కృషిచేయాల్సి ఉన్నదని మనవిజేస్తున్నాను.

వర్తమానాంధ్ర సాహిత్యాన్ని స్థూలంగా చూస్తే రెండు విభాగాలుగా కన్పిస్తుంది. ఒకటి పద్యగేయయుతము రెండవది వచనరచనోపేతము.

ప్రాచీన కావ్యాలలో వచనమనీ గద్యమనీ ఎడనెడ కనిపిస్తూఉన్నప్పటికీ ఆంధ్రసాహిత్యంలోవచన రచనప్రత్యేకంగావృద్ధి పొందిన దిటీవలి కాలమందే అనాలి. నాయకరాజుల కాలంలో వచనకావ్యాలు ఆ విర్భవించటం ఆరంభమైనప్పటికీ వచనం సర్వోపభోగ్యమైనది ఆంగ్లభాష సాహిత్య ప్రభావం భాగాపడిన 19, 20 శతాబ్దాలలోనే అనిగుర్తిస్తాం ఆధునిక రచనలో విస్పష్టంగా వినిపిస్తున్న అంతస్స్వరాలలో గద్యకవితాకన్యాశ్రావ్యకంఠం సమధిక స్థానాన్ని గొంటుంది,

సంస్కృతంలో లాక్షణికులు కావ్యాలు గద్య పద్య మిశ్రకావ్యాలుగా విభాజ్యాలనీ గద్యకావ్యాలైదు విధాలనీ అవి ఆఖ్యాయికా కథా ఖండకథా పరికథాకథానికా అన్నట్టివనీ గద్యంకవీనాంనికషం వదంతి అనీ ఓజస్సమాస భూయస్త్వం ఏతద్గద్య స్యజీవితం అనీ లక్షణాన్ని సూత్రీకరించినా ఎందుచేతనో సంస్కృతంలోనూ కొద్దిగానే గద్య కావ్యాలు కన్పిస్తున్నవి ఆ భాషాకావ్యాలల్లా ఉంచి శాస్త్రాలున్నూ అందులో ఛందోమయాలే కావడం విచిత్రం అసలు ఇల్లాగే తెలుగులో 18 వ శతాబ్దానికి పూర్వం వచనకావ్యాలు కనిపించడంలేదు సంస్కృత మర్యాదననుసరించి లక్షణకావ్యాలున్ను శాస్త్రములున్ను పద్యోపేతాలు కావడం విచిత్రమే. కనుక బహుళంగా వచన రచనం ఆంగ్లభాషా సంపర్కజనితమైన విశేషమన్న సూక్తి యదార్థమైనది. ఆంగ్లజాతిపైగల ద్వేషాన్నివారి భాషపైన విజ్ఞానంపైనా పండితులు చూపజాలరు గదా!

అందుచేత ఆంగ్లేయులు వచనాన్ని ఎలా దర్శించారో ఎలా వినియోగించారో పరిశీలిద్దాము.

## నిర్వచనం :

వచనం పద్యంవలె ఆవేశ పూరితమూ, భావశబలతాయుతమూ ఆలంకారిక రచనా బంధురమూ, వ్యంగ్యప్రధానమూ అయినట్టిదైతే కావ్యమే అనిపించుకొంటుంది. అది గద్యంలో ఉన్న కవిత. అలాంటివే వచన కావ్యాలు. పద్యకావ్యాలను వచనంలోకి దింపిన రచనలన్నీ ఈ జాతికి చెందినవే అవుతై.

ఛందోమయమైనది అంతా కవిత్వమనీ, ఛందోరహితమైన వచనమంతా కావ్యంకాదనీ అనుకోవడం తప్పిదమే అవుతుంది. వస్తుస్వరూప యాదార్థ్యం కలిగి, స్వభావోక్తి ప్రధానమూ, అన్వయ సౌలభ్య సహితమూ, ఆపేక్షమాత్రాన్నే విషయ

వివరణముచేసే ప్రకృతానుసారి యైనది వచనం. ఇది యంత్రవత్తుగా ఉంటుంది. ఛందో నియమాలు లేనట్టిది స్పష్టంగా సూటిగా చెప్పడానికి అనువైనది వచనం. ఇది తార్కిక ప్రణాళికకు లోనైనదే అవుతుంది. బుద్ధిజన్యమైన వచనం హృదయజన్యమైన పద్యంకన్నా భిన్నమై భాసిస్తుంది. వచనం వైశద్య ప్రధానమైన రచనగా గమనించడం ముఖ్యం. చక్కని వచనానికి ఉండవలసినవి సమత సంక్షిప్తత లనే గుణాలన్నారు.

పద్యానికి వ్యతిరేకమైనది వచనం అని తెలుపుతూ ఈవచనం సాహిత్యంలో ఎన్నెన్ని ప్రక్రియలలో వినియోగం పొందుతున్నదో వివరించిన సందర్భం చూచారుకదా: నవల కథానిక వ్యాసం విమర్శ లేఖ చరిత్ర జీవితకథనము ప్రవచనం ప్రసంగం లేక ఉపన్యాసం" అన్న ప్రక్రియలద్వారా వచనం అభివ్యక్తం కాగలదు.

### శైలి:

ఈ ప్రక్రియలలో ఉండే రచనఅంతా వచనమనే పేర పిలచినప్పటికీ ఈ వచనములో విభిన్నశైలులను బట్టి వివిధంగా భాసిస్తూ ప్రత్యేక స్థితులను పొందినటువంటిదౌతుందని గమనిస్తాము. పద్యకావ్యాలలో శైలులవలె వచన రచనలలోను శైలులుఅంటూ ఉన్నవి. అవి వస్తువునుబట్టీ రచనయొక్క ఆత్మీయతనుబట్టీ భిన్నిస్తూఉంటై. 'హోబ్రే' అన్న విమర్శకుడు వచనాన్ని మూడు విధాలుగా విభజించి పేర్కొన్నాడు. వర్ణాత్మకమనీ, వివరణాత్మకమనీ ఆవేశాత్మకమనీ, వచనాలు వాక్యములతో కూడినట్టివనీ పరిచ్ఛేదాలతో పరిఢవిల్లేవనీ విమర్శకులు ల్లేఖిస్తూ ఆవాక్య నిర్మాణమునుగూర్చి, విరామచిహ్నలనుగూర్చీ జిజ్ఞాస చేశారు. సహాసోదంతాలనుచెప్పే వచనములో ఆవేగము ఉత్కంఠ గూఢనిరూపణములనేవి ముఖ్యంగా ఉండాలని హెర్బర్టు రీడ్ అంటాడు. కథానికలలో ఆఖ్యానాత్మకశైలి ఉండడం ఒప్పిదం. శాస్త్రగ్రంథాలలో (విజ్ఞానశాస్త్రము న్యాయ, వేదాంత, మత, రాజకీయ, చరిత్ర, విమర్శలలో) వివరణాత్మకశైలి అవసరం. నవలలో వర్ణనాత్మకశైలి బహుళంగా ఉండడం ఉచితం.

### భాష:

భాషావిషయమైకూడ కొంత జిజ్ఞాస అవసరం. ఉదాత్తవస్తువునుబట్టి భాషకూడ ఉదాత్తంగాను గంభీరంగాను ఉండడం అవసరం. భాషా-సాహిత్య ఇతర శాస్త్రవిషయముల గ్రథనమంతా ఉదాత్త భాషోపేతమై ఉన్నదని ఆక్షేపించరాదు. కథానికలు, నవలలు, సులభబోధకమైన, సజీవమైన, స్వాభావికమైన భాషతో కూడిఉండడం ఎంతైనా ప్రయోజనకరము, ఔచితీయుతమూ అనిపించుకొంటుంది.

వచనరచనలో విభిన్న ప్రక్రియలను ప్రత్యేక ప్రత్యేక లక్షణాలంటూ పాశ్చాత్య విమర్శకులు నిర్వచించియున్నారు.

### విభిన్న ప్రక్రియలు:

నవల: నవల వచనరచనలలో అద్భుతస్థానాన్ని ఆక్రమించుకొన్నట్టి ప్రక్రియావిశేషమని గమనిస్తాము. ఇది చాల విపులమైన అవకాశాలుకల రచన. వర్ణనలు, సంభాషణలు, అనేక ప్రసంగాలు, బహుళపాత్ర చిత్రణము, జీవిత వ్యాఖ్యలు లోకపరిజ్ఞాన ప్రబోధకాలైన అంశాలనేకం కలిగిన మనోహరగద్య పద్యము నవల అనిపించుకొంటుంది. రసప్రధానమూ శిల్పసంయుతమూ అయినదీరచన. రమ్యమైన కథను కల్పించడంలో, వర్ణనల్ని కళ్లకు కట్టేలా చిత్రించడంలో సంభాషణలు, స్వాభావికాలు సజీవాలుగా రచించడంలో పాత్రోన్మీలనము సన్నివేశాల మరుగున క్రమంగా పొందించడములో, దేశకాలపరిస్థితుల నెఱిగిస్తూ చరిత్రలో వినుగుపుట్టింపక చిత్తాకర్షకంగా రచించడంలో అంగాంగీభావ నిరూపణంలో నవలాకారుడు: కథకుడు, నాటకకారుడు ఇదేమిటి, అదేమిటి సమస్తమూ తానే అయితీరాలి. విపులమైన రచనకావడంలో ఉత్కంఠ అనేగుణం అధికంగా ఉండకపోతే రాణించదీరచన. ఉత్కంఠ కొరవడి, చెత్త అనిపించుకొంటే లాభములేదు. వచన రచనలలో నవలదే ఉత్తమ తాంబూలమనీ, విమర్శదే అగ్రతాంబూలమనీ, గ్రహించాలి. నవల విమర్శను ఇముడ్చుకున్నా కావ్యత్వంకలదై విరాజిల్లునట్టిదని విస్మరింపరాదు.

### కథానిక:

ఇంక కథానిక నవలకు సూక్ష్మరూపమని గమనిస్తే వేరుగా దాని లక్షణాలు చెప్పాల్సిన అవసరం ఉండదు. ఈ కథానికలో వస్తువిస్తృతికవకాశము లేదు. అల్లాగే పాత్రబాహుళ్యం ఉండదు. వర్ణనాది విశిష్టావయవాలకున్న సావకాశము అట్టే ఉండనట్టిది. సూక్ష్మంలో మోక్షం కల్గించడమేదీని పరమార్థం. అన్ని వచన ప్రక్రియలలోను గణనకెక్కకపోయినా మనవాళ్ళు కథలు చెప్పడంలో మాత్రం ఎన్నిక వహించినవారని తెలుసుకుంటాము. కథాసరిత్సాగరానికి మూలమైన బృహత్కథ ఆంధ్రజాతి నిర్మించుకొన్నదని తెలిసికొని గర్వించదగిన అంశం. ఇప్పటికీ ముసలమ్మలు పిల్లలకు కథలు చెప్పి ఊరడిస్తూ ఉండడం ఆచారంగా వస్తున్నదే కదా!

### వ్యాసం:

వచనరచనకు చెందిన ప్రక్రియలలో వ్యాసమనేది పరిమితిలో చిన్నదైనా ప్రత్యేక శిల్పఖండమే అన్న సత్యాన్ని గ్రహించవలె. ఏ చిన్నవిషయమైనా రచయిత తన భావనాబలముచేత కేంద్రీకరించి, విస్తరించి, ఉత్తమశైలీ సంపదతో నిర్వహించిన రచన వ్యాసమనిపించుకొంటుంది. వ్యాసం పూర్వాపరభూత విషయ కథలతో ప్రారంభం కావాలనీ ఉద్దిష్ట విషయమునుగూర్చి ప్రస్తావించడం అత్యావశ్యకంగా జరుగాల్ననీ సాధారణానుభవాలను ఏకరువు పెడుతూ ఆవిషయ విస్తృతికి పూనుకోవాల్ననీ, ఏదైనా సన్నివేశాన్నో దృష్టాంతాన్నో జోడించి విషయబోధ చేయవలెననీ సంగ్రహం నీతినో, సందేశాన్నో, సారాంశాన్నో ఉదాహరించవలెననీ లక్షణాదికాన్ని ఉల్లేఖించారు. వ్యాసకర్తలు ప్రతిభావంతులే కాక విషయప్రస్తావనలో విశేషంగా చేయగల భావనాబలముకల ప్రజ్ఞానిధులు కావాలి. తార్కికశక్తితోపాటు ఆకర్షక గుణమున్నా వారి వచనాలలో కల్పించాలి. అంతేకాక బహువిషయ పరిజ్ఞానమున్నో ఏతద్రచనల్లో దోషరహితమానం కావడమున్నా అవసరముగా భావించవలె, వ్యాసాన్ని కావ్యవిభాగంగా పరిగణించి ఆంగ్లేయులు దాని గౌరవాన్ని హెచ్చుచేశారని గమనిస్తాం.

### విమర్శ:

విమర్శ వచనరచనలో ఉత్తమ మేధాసంపత్తికి నిదర్శనమైనది. పరిశీలనము, వ్యాఖ్య, సమీక్ష, వివరణము, ప్రశంస, పరిచయములను అంగాలతోకూడినట్టిదీ విమర్శనము. విమర్శకుడు విడమర్చి చూడడంలోను, విభజించి పరిశీలించడములోను, వేరుగా తుల్యవస్తువులతో పోల్చుట విలువకట్టడములో నేర్పరి అయిఉండాలి.

కొందరు విమర్శ అంటే నిరసించడమని అభిప్రాయపడి విమర్శకుడంటే భయపడతారు. అది సరియైన దృష్టి కాదు. ప్రసిద్ధ తత్వజ్ఞుడు "పోపు" అన్నట్లుగా అభిరుచితోను, వివేచనతోను, బుద్ధివైభవంతోను, సత్యాన్వేషణాబుద్ధితోను, విమర్శకుడు కావ్యం దరిచేరవలెనే కాని కవియొక్క ఉపజ్ఞను మీరి తనకౌశలాన్ని ప్రదర్శించరాదు.

సద్విమర్శకుడు విద్వేషంతో నిందించరాదు. అభిమానంతో ప్రశంసించరాదు. కవి మనోగత భావార్థాలను లక్షణాదికాన్ని వివరించడానికి యత్నించడమే అతని ప్రథమకర్తవ్యము. అతని విమర్శ కళాకారునికీ సామాన్య పాఠకునికీ ఉద్దేశితమై పరగాలి. అంటే ఆలోచనాత్మకమూ, వివరణాత్మకమూ అయివుండాలన్నమాట!

కేవలం శబ్దచర్చ చేసేవాడు భాషాభిజ్ఞుడే అవుతాడు కాని విమర్శకుడు కానేరడు. ఒక్కొక్కచో దోషజ్ఞుడనిపించుకొనే ప్రమాదమున్నా అల్లాంటి వానికి ఉంటుంది. భాషావిమర్శకాక భావవిమర్శ ప్రధానమైనదనిపించుకొంటుంది. వ్యాఖ్యల్లో. కావ్యం చదవనివానికి కావ్యపరిచయం చేయడం వ్యాఖ్యాత ప్రధానకర్తవ్యం. అనంతరం పాత్రచిత్రణం, వస్తుతత్వ పరిశీలనము వస్త్వైక్యము, శైలి, కవిఆత్మీయత, రసప్రమేయం, రసపరిశీలనము. నిర్మితీసౌభాగ్యము మొదలైనవన్నీ కావ్యవిమర్శలోని విశిష్టాంశాలై గణనకెక్కుతవి. కావ్యాన్నిపడిచి కవిహృదయాన్ని అనుసరిస్తూ కవిసందేశాన్ని కనుక్కోవడమున్ను విమర్శకుని ధర్మం. శబ్దసౌకుమార్యం, అర్థగౌరవం, భావగాంభీర్యం. ఆలంకారిక చమత్కారము, శిల్పాభి

వ్యక్తి వీనినన్నిటినీ పరిశీలించగల పరిజ్ఞాని అతడు. లక్ష్యలక్షణ సమన్వయకర్త విమర్శకుడంటే. విద్వన్మణి అయినా వినయవంతుడై సహృదయుడై తాను కవికన్న పైవాడనే అహంలేనివాడు కావాలి' విమర్శ ఆత్మాశ్రయ పరాశ్రయమై ద్వివిధంగా భాసిస్తుందికూడా.'

విమర్శకుడు సాహిత్యోద్ధారకుడుగా ఉత్తమ స్థానాన్ని అలంకరిస్తున్నాడు. అతని బాధ్యత గురుతరమైనది. సాహిత్యార్ణవకర్ణధారుణ్ణిగా పరిగణించారతన్ని: అతడున్ను ద్రష్ట స్రష్ట, 'కవిలాగానే. సహృదయత్వం తన్మయీభవనయోగ్యత కల్పించే గుణం అతనికి మెండుగా ఉండాలి. ఆతడు శీలీ, రసపిపాసువూ కావాలికాని కర్కశపాషండుడు కారాదు. చారిత్రకదృష్టి, కార్యకారణభావ సమన్వయమూ అతనికి అధికంగా ఉండాలి. పరిచయకర్తగా, గుణగ్రహణపారీణుడుగా, వ్యాఖ్యాతగా, వందిగా, న్యాయమూర్తిగా. విషయ వివేచనంనుంచి రసాభివ్యక్తివరకుగల వివిధ పరిస్థితులలోను సామాన్యుల నడిపించి శిక్షణనిచ్చి, అలరించి, ఆనందాన్ని పంచి, అమృతత్వసిద్ధి కల్గించే ఉత్తమదార్శనికుడు విమర్శకుడు. అందలి మహత్తరమైన దాతని వచన రచన!

ఇంక ఉపన్యాసం అల్లికలో బిగువులేని వచన రచన. కాని ఆంగ్లేయులు దానినికూడ ఒక కావ్యముగా పరిగణించి కృషిచేసినారు. ఈ విషయాన్ని గ్రహిస్తే విషయప్రబోధానికెంత గౌరవమిచ్చినారో భాషకు కూడా అంతటిబాధ్యత ఉన్నట్లు గుర్తించినారని తెలుస్తుంది.

## అన్వయం :

ఆధునికయుగాన్ని ముఖ్యంగా వచనయుగమని పేర్కొనడము సముచితముకాగలదు, నన్నయసూరి తెలుగుపద్య గంగావతరణానికి అలాంటివాడు. నన్నయకు పూర్వం పద్యమున్నట్లే చిన్నయ పూర్వం కూడ గద్యమున్నప్పటికీ "కావ్యభాష"ల తీర్చిదిద్దిన వాగను శాసనులున్నూ కావడంవల్ల వీరుభయులూ సార్థక్యాన్ని ఆర్జించుకొన్న వారవుతున్నారు. చిన్నయసూరి రచించిన 'నీతిచంద్రిక' ఆలంకారిక వచన రచనోపేతమై, వన్నెచిన్నెలుకలిగి. గంభీరోదాత్త శైలీసంపదఘటిల్లి వాక్యవిరామ పరిచ్ఛేద విభాగాములను పాటించనట్టిదై ప్రశస్తి వడయుచున్నది. ఈమార్గాన్ని అనుసరించినా కొక్కొండ వెంకటరత్నం వీరేశలింగంగారల రచన సంధి విగ్రహాది వచనకావ్యానువాదాలలో సహజంగా కన్పింపక కృత్రిమ మనిపించుకొంటున్నదని చెప్పాలి.

అయితే వీరేశలింగంగారు ఇంచుమించుగా వచన ప్రక్రియలన్నిటికీ శ్రీకారము చుట్టినవారై ఆంగ్లభాషా ప్రభావాన్ని తనరచనలలో హెచ్చుగా ప్రతిఫలింపచేసికొని వచనాన్ని సర్వసుభోగ్యంగా చేసినవాడు కావడాన్ని ఆధునిక గద్యతిక్కనయై వచన యుగకర్త అనిపించుకొంటున్నాడు. నవల, విమర్శనము, చరిత్ర వ్యాసము. ఉపన్యాసము, కవులచరిత్ర, జీవితచరిత్ర, యాత్రాచరిత్రలను మొదట తెలుగులో అవతరింపచేసిన కీర్తి వీరేశలింగంగారిదే. వీరి వచనగ్రంథాలు విజ్ఞానోపలబ్ధి కక్కరకు వచ్చునవై వచనప్రయోజనాన్ని నిరూపించినటివౌతున్నవి. వీరశలింగంగారు సంఘసంస్కర్తకూడ కావడం ఇక్కడ గమనించాల్సిన అంశం. రచనల ద్వారా సంఘాన్ని సంస్కరింపబూనుకొన్న ఈయన సులభార్థబోధకాలైన వచనాలనే అవతరింపచేయాల్సిన అవసరాన్ని గుర్తించి వచనరచనలో చిన్నయసూరి మార్గాన్నివదలి ఆకర్షవంతమైన సరళీవచన రచనా మార్గాన్ని సృజించినారు. అందుచేతనే వీరి "విగ్రహము"లోని వచన శైలికిన్నీ, జీసస్ చరిత్రలోని వచన శైలికిన్నీ చమత్కార రత్నావళి, ధర్మకవచోపాఖ్యానము యిత్యాది గ్రంథాలలోని వచన శైలికిన్నీ ఉపన్యాసములలోని వచన శైలికిన్నీ భేదం కన్పిస్తుంది. పదాడంబరయుతమైన శైలి కథాకథన శైలి ప్రబోధాత్మకశైలిఅని కందుకూరి వచనశైలిని యివ్విధముగాపరిగణింపవచ్చుగద్యరచనలోచిన్నయసూరిగారు ఎంత జటిలత్వాన్ని చూపినారో వీరేశలింగంగారు అంత సారళ్యాన్ని సాధించినారు. ఈయన తర్వాత వచ్చిన ఉపన్యాసకులు పానుగంటీత్యాది

వచన రచయితలకు వీరేశలింగంగారి వచనశైలే అనుసరణీయమైంది. కాకపోతే వారివారి ఆత్మీయతలు వారిశైలులలో ప్రతిఫలించడంకద్దు గనుక ఈషద్భేదాలు కన్పిస్తేకన్పించవచ్చు.

ఏమైనా వచన వాఙ్మయ బ్రహ్మ గా వీరేశలింగంగారు మనసాహిత్య చరిత్రలో కీర్తి పొందుతున్నారనీ ఆయనే వచనాన్ని సర్వవ్యాప్తమూ, ప్రజాహితము పడిసేలా చేసినవాడనీ చెప్పుకొని తీరాలి.

వచనములో కావ్యావతరణము తరువాత నవలారచన చక్కగా సాధింపబడింది. ఆంగ్లం, బెంగాలీ, హింది, మరాటీ, కన్నడం, మొదలైన భాషలలోంచీ అనేకనవలలు తెలుగులోకి అనువదితాలు అవుతూ వచ్చినవి. చారిత్రక, సాంఘికేతివృత్తాలను గ్రహించి స్వతంత్ర నవలా నిర్మాణంలోగూడా మనవారు పేరు పొందినారు.

తగుమాత్రంగా హాస్యరసంగూడా పోషించబడింది. కథానికా రచయితలు మొదట్లో కొద్దిమందే కనబడినా తర్వాతతర్వాత అసంఖ్యాకులుగా బయలుదేరడం శుభావహం. ఈప్రక్రియలోగూడ గ్రాంథికవ్యావహారిక వచనాలుపయుక్తాలు.

ఇటీవల వారి రచనలలో ఇతరభాషాప్రభావాలు అనేకాలు సంక్రమిస్తూ ఉండడాన స్వతంత్ర వచనశైలిఎడనెడ మృగ్యమై పోతున్నదనవలె.

లేఖలు మనవర్తమాన సాహిత్యంలోనేకాదు అసలు మన సాహిత్యంలోనే ఒక కావ్యప్రక్రియగా అభివృద్ధిచెందనేలేదనాలి. దీన్ని యువరచయితలు పెంపొందించాల్సిన అవసరాన్ని గుర్తించ వలెను.

ఉపన్యాసాన్ని వీరేశలింగంగారు ప్రారంభించినా అది కావ్యప్రక్రియగా గణనకెక్కడమిటీవలనే పానుగంటివారు మాత్రం సాక్షి సంపుటాలలో ఉపన్యాస వ్యాసములను కలిపి సాధించినారు. ఇటీవల కాలములో పరిషత్తుల అధ్యక్షోపన్యాసాలూ, రేడియో ప్రసంగాలు, లిఖితపూర్వకాలై ఉండడాన కొంత సాధన జరుగుతున్నట్లు భావించవలె కాని బర్కు, రస్కిన్, కార్లైల్, మున్నగువారి ధోరణిలో ఇంకా ఉపన్యాస రచన తెలుగులో వెలువడవలసియే యున్నది.

ఇంకను వ్యాసాన్నిగూర్చి శ్రమచేసిన నవ్యులనేకులు కృషిచేస్తున్నారు. రాజకీయ పరిజ్ఞానాన్ని కలిగించే వ్యాసాలు బహుళంగా ఈమధ్య వస్తున్నవి. కాని భాషావిషయకంగా జాగ్రత ఏమీరచయితలు వహించడంలేదు. ఇదిగమనార్హం.

పీఠికా కారులుగా కొందరు పండితులు వచన రచన సల్పినవారున్నారు. సవిమర్శకంగా కావ్యగతవస్తు శైలిలో అనువాదక విశేషాలనుగూర్చి వ్రాసివారు ఎంతో కృషిచేశారు. వీనిలో చాలభాగము సహృదయత్వదూరాలై కలహాలకు దారితీసినట్టివైనవని గమనిస్తాము.

కట్టమంచివారు వస్తుతత్వంపరిశీలనచేస్తూ పాశ్చాత్యవిమర్శ సూత్రాల నన్వయిస్తూ పరిశీలన గావించినవారిలో ప్రథములనాలి.

క్రమంగా తెలుగునాట భాషాసాహిత్య చరిత్ర పరిశోధనములంటూ బయలుదేరదీసిన కొమర్రాజువారికృషి కొనియాడదగలె. సాహిత్య విమర్శకులలో శాశ్వతంగా నిలిచే కృషిచేసినవారిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ముఖ్యులు. మనభాషా పరిశోధనలో గిడుగు, జయంతీత్యాది పండితులు చేసినకృషి అద్భుతమైనది.

కొందరిటీవల నవ్యసాహిత్యంపైన చక్కని విమర్శనలు చేసినారు. పండితులు కొందరు సాహిత్య శాస్త్రజిజ్ఞాస తెలుగు వచన రచనద్వారా చేస్తున్నారు.

ఈవిధంగా వివిధ ప్రక్రియలలో వర్తమానరచన కావిస్తూ నవ్యులు సాహితీ సేవచేస్తున్నారు. ఆయా ప్రక్రియలను పరిశీలించడంద్వారా ఉన్న లోపాలను గూడా గ్రహించినాము. వానిపూరణకోసమని రచయితలు పూనుకొందురు గావుత.

తెలుగు వచనరచనను స్థూలంగా పరిశీలిస్తూఉంటే రెండుభాషామార్గాలు కన్పిస్తున్నవి. ఒకటిగ్రాంధికం, రెండు వ్యావహారికం! ఈసందర్భాన గ్రాంధిక

వ్యావహారిక భాషోద్యమాల స్వరూపాన్ని తెలుసుకొనడం కొంత అవసరమే అవుతుంది.

గిడుగు రామమూర్తిపంతులు వ్యావహారిక భాషా ప్రచారముకోసమని యావజ్జీవితమూ కృషిసల్పిన భాషావేత్త. దాన్ని ప్రతిఘటిస్తూ జయంతి రామయ్య పంతులు ఆంధ్రసాహిత్య పరిషత్తుద్వారా గ్రాంథిక భాషా ప్రచారముచేసిన భాషాపోషకుడు. వీరిద్దరి కలహాలు తెలుగుభాషారంగానికి అద్భుత ప్రకాశము చేకూర్చడానికి కారణభూతాలైనవి. కృతకగ్రాంథిక భాషలో జాతీయం నశిస్తుందనీ శక్తియొక్క ఆవేగ ఉద్వేగ ఉద్రేకావేశాలు సహజ సిద్ధాలుగా ప్రతిఫలింపనేరవనీ విజ్ఞానం సులభమార్గాన ప్రసారం చేయలేనేగాక ప్రయోజనానికి దూరంగా ఉండే భాష మాటాడే భాషకు దూరంగాఉండే కృతకభాషనీ వ్యావహారికమునీ, అదే సుబోధమైనదనీ అందులోను శిష్టులు మాటాడుకొనే భాష ప్రామాణికమనీ అదే సర్వత్రప్రయోగించవలసినదనీ గిడుగువారు ప్రచారం చేయసాగినారు. ఈభాషా సంస్కారంకోసమని అనేక వ్యాసాలను, ఉపన్యాసాలను, గ్రంథాలను ప్రచురించినారు. బాలకవిశరణ్యం, గద్యచింతామణిఖలీసందర్భమున గుర్తింపదగినవి. ఏతదుద్యమం బాగా ప్రాచుర్యంపొంది పత్రికాముఖాన చక్కని ఆలంబం లభించినట్టిదై నేటికాలానికి పాదుకొని పోయినది.

అయితే ఈనాటికి వ్యావహారికభాష బహుళముగావేరూదికొని ఉందిగనుక దాన్ని తొలగించమని విజ్ఞులెవ్వరూ అనసాహసించలేరు. కాని వ్యావహారిక భాషకూడా కొందరి సందర్భాన కృతకంగా భాసిస్తున్నది. జమ్మలమడక రాయప్రోలు వ్రాస్తున్న భాష అటు జటిల గ్రాంథికాన్ని అంటిపెట్టుకొంటూ ఇటు వాక్యాంతాలలో వ్యావహారికం అనిపించుకొంటూ ఉంటున్నది. ఉచ్చారణలో చాలమంది శబ్దస్వరూపాన్ని గుర్తించకపోవడంమూలాన లోపాలు ప్రాకుతున్నవి. వక్తలముఖావయవలోపాలు ఉచ్చారణలోను అటునుంచి వ్రాతలోను సంక్రమిస్తున్నవి, వివిధమండలాలలో శబ్దాలు భిన్నార్థాలు కలిగి ఉంటూ వైచిత్రిని భాషలో ఘటించిపెట్టున్నవి. సర్కారు రాయలసీమ తెలంగాణాల తెలుగు భాషలో మాండలిక విభేదాలను యాసలను ప్రత్యేకంగా గమనించవలసిన అవసరాన్ని గుర్తించి ఈ మధ్య కొంత కృషిజరగడం విశేషం.

వ్యావహారికభాష శిష్టులదైతేనే ప్రామాణికమన్నారు గిడుగువారు. మరి ఇపుడు శిష్టులెవరో తేల్చుకోలేకుండా ఉన్నాము. భాషాస్వరూపాభ్యాసనాదులను బాగా తెలుసుకున్నవారు మన రచయితలలోఎందరున్నారు? పత్రిక ప్రవేశం లభించిన కలంపట్టుగల ప్రతిరచయితా శిష్టుడు కానేరడుగదా! పైగా నాఇష్టంవచ్చినట్లు నేనువ్రాస్తాననే విశృంఖలత్వం భాషాపోషకం కానేరదని హెచ్చరిస్తున్నాను.

భాషకువ్యాకరణం వెన్నెముకలాంటిది. ఈమధ్య భాషపై అధికారంలేనివాళ్లు వ్యాకరణంవల్ల ప్రయోజనం లేదని అంటూవస్తున్నారు. ఆంగ్లహిందీభాషా గ్రంథానువాదాలలో ఆయాభాషల జాతీయాలు కారకాలు వాక్యనిర్మాణ క్రమాలు దొర్లుతూ మన భాషను మరీ సంకరంచేసి తెలుగు కాదనిపించేటంత అన్యాయంగా పరిణమిస్తూ ఉండడం శోచనీయం. ఉభయభాషాధికారం సంపాదించనిదే అనువాదాలకు పూనుకోవడం అపకర్షహేతువు కాగలదని మనవి చేస్తున్నాను.

ఏతావాతా నే చెప్పవచ్చినదేమంటే వ్యావహారిక భాషకొక నియమం ఏర్పరచవలసి ఉన్నదని భాషకు పండితుడు అధికారి కాని పామరుడు కాదనిగుర్తించవలె. ప్రామాణికవ్యావహారికభాషాశాసనం చేయడానికి సీతాపతిగారి వంటి వారుపూనుకోవాలి. వ్యావహారికభాషా రచనలోకూడ కట్టుబాటులేకపోతేతీరని నష్టం భాషకు వాటిల్లడంతథ్యం. ఆప్రమాదాన్నుంచి భాషను కాపాడుకోవాలి. అందుకు పండితులు ప్రచారకేంద్రాలైన పత్రికలు రేడియోలు పూనుకోవాలి. అల్లాగే మాండలిక పదకోశముకూడా ఒకటి నలుమూలల ఉన్న కృషీవలుర సాయంతో నిర్మితం కావాలి. భిన్నకాలములపైన కవులపైన

(ప్రక్కపుటలో)

# వర్తమానకవిత



## శ్రీ అంబటిపూడి వెంకటరత్నం

వర్తమానం, ఈ క్షణానికి పూర్వం అంతాగతం ఈ క్షణానికి ముందంతా భవిష్యత్తు. కాబట్టి ఈ క్షణానికి సజీవులయివున్న కవులరచనలని అర్థం చేసుకుందామా? ఇప్పుడు వృద్ధులున్నారు. కొందరు యువకులు కన్నుమూశారు. కాగా రచనలు పురాతనాలు, నవ్యాలు అనుకుందామా? నవ్యాలు అనుకున్నవి పాతవై అతినవ్యాలువచ్చినై. అవీ మళ్లీపాతబడ్డయ్. అట్లాఅని పూర్వులమీద ఆదరణలేదా? పూర్వఫణితిన వ్రాసేవారున్నారు. చదివేవారున్నారు. కాబట్టి వర్తమానంలో అన్నికాలాల రచనలు ఉన్నై. భాగవతం శ్రీపాదవారువ్రాశారు. పురిపండవారు వ్రాస్తున్నారు. రామాయణం జనమంచివారు వ్రాశారు. విశ్వనాథవారు వ్రాస్తున్నారు. ఖండకావ్యాలు రాయప్రోలు వగైరాలు వ్రాశారు. అనేకులు వ్రాస్తున్నారు. అతినవ్య కవితారేఖలు దేవులపల్లివారు లిఖించారు. శ్రీ శ్రీ వగైరాలు లిఖిస్తున్నారు. అన్నింటినీ పరిశీలిస్తే ఒక అనుస్యూతమైన భారతీయత గోచరిస్తోంది. కావ్యం అనడంతోటే నాయికానాయక సంబంధమైన ప్రేమ ప్రకృతివర్ణన, దీనులను గురించి దయ, అధర్మం నశించాలన్న ఆవేదన, ధర్మం జయిస్తుందన్న ఆశతో అవ్యక్తమైన పరాశక్తిపై విశ్వాసం.

ప్రేమ 'రసములకునెల్ల, శృంగారరసము తల్లి' అన్నారు. 'కాంతా సమ్మితతయా' అనడంచేత కావ్యం పాఠకుల హృదయాలకు ఎక్కాలంటే శృంగారం అవసరం. సాంఘిక సూత్రాలమబోధించే చిత్రం తీయదలచుకున్నా నాయికా నాయకులను ప్రవేశపెడితేనేగాని జనంచూడరు. వేదాంతం చెప్పదలచుకున్నా శివుడు పార్వతికిట్లా చెప్పాడని స్త్రీపురుష సంభాషణ రూపంలో చెబితే జనానికి వినబుద్ధి అవుతుంది. వీరుడైనా గృహస్థె. కాబట్టిప్రేమ అనివార్యం.

నీమోవికి కావినినేనై
నా భావికి దేవివి నీవై
నీ కంకణ నిక్వాణంలో
నా జీవన నిర్వాణంలో
ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
ప్రపంచమును పరిహాసిస్తాం
భవిష్యమును పరిపాలిస్తాం.

---

(97వ పుట తరువాయి)

ప్రత్యేకంగా కృషిచేసినవారితో ఒక సంఘము ఏర్పరిచి సాహిత్య చరిత్ర సాధికారమైనది ఒకటినిర్మింప జేయడానికి పరిషత్తులు తలపెట్టాలి. వచనరచన ద్వారా భాషాసాహిత్యము చరిత్రలేకాక సమస్త శాస్త్రవిజ్ఞానమును సులభంగా ప్రజాయత్తంచేయడానికి మేధావులు ముమ్మందు విశేషంగా కృషిచేయాల్సిఉంది. అస్తు! ఆంగ్లవచనరచన ఆదర్శంగా పెట్టుకోవడంవల్ల మనకేట్టి న్యూనతాలేదనికూడ గుర్తించడం అవసరమని మనవిచేస్తున్నాను.

"కృషితో నాస్తి దుర్భిక్షమ్"

# వర్తమానకవిత

ఆంగ్లులలో ఉమర్ ఖయ్యాం తత్త్వం జీర్ణమై జీవికి వర్తమాన సుఖంకంటె మించిందిలేదనే భావంవంట బట్టి **Shelley, keats** వారైరాలు వ్రాశారు.

హృదయమునెల్ల లీనమొనరించి మనుష్యుడు
కోరుకొన్న
దయ్యది అడియాసయేదొ మసియాసో
ఫలించునొ చెప్పలేము చా
చెద హిమబిందువుల్ గడియసేపు తళుక్కని
దుమ్ములోన పా
గిదకణమట్లు లాపయి ధరంబడి రూపఱునట్టులే
కదా!

కడచిన దుఃఖముల్ మరలగల్గు భయమ్ముల
నార్పవేయని
ప్పుడు తగు పానపాత్రమును నిండుగబోయుము
మద్యమున్ చెలీ!
నుడువను రేపురేపని ననున్ పసిబట్టెడి నిన్న
లోసలన్
విడుచునొ నీదు రే పిటులువీడిన నిన్నలయేండ్ల
లెక్కయే.

పసచెడ వాదభేదముల పండితులన్ బడి
చావనిమ్ము ఈ
ముసలి ఖయాము కింత సుఖమున్ సమకూర్చగ
రమ్ము నెచ్చెలీ!
ఉసుఱను పిట్ట లేచునెపుడో యిది సత్య
మసత్యమన్య, మే
కుసుమము నిల్చిగాలక తగుల్కొని తీవియపైన
నిత్యమై.

ఈ విధంగా ఒక నిరాశ ఏర్పడి దాని ప్రభావంవల్ల వర్తమాన సుఖాన్ని నమ్మి దానిలో మగ్నులై వ్రాశారు. అట్టి రచనలు మన తెలుగువారుకూడా వ్రాశారు.

చలువ పిసాళిగాలినును చక్కిలిగింతల
కౌగిలింతలన్
నిలువునపాటగా నరగనేర్చునొ నీరవవేణువీధి నీ
వలపు తలంపు సోకినసె ప్రాణసఖీ! బ్రతుకెల్ల
కోటి గాం
తుల విడిసోనలై పారలు నూతన గీత సుధా
పథాలలోన్.

పురాతనులు ప్రేమను నగ్నంగా చిత్రించారనీ నవీనులు గోప్యంగా చెప్పారనీ అంటారు.

కులకుభాంగీ పయోధీర కుసుమమందు
మోహమధువె గ్రోలించె మున్నుసుకవి
సాత్త్విక ప్రేమకోశ పేశలములైన
సత్సలామృత గుచులను వలచె నేడు.

నగ్నంగా చిత్రించారన్న పూర్వులను సమర్థించే వారున్నారు. భోగాన్ని పూర్ణంగా అనుభవించమని వారట్లాచెప్పారు. కాని ఇదే చెప్పి ఊరుకోలేదు. ఆపైన ఆధ్యాత్మికదృష్టి కలిగించి పరంవైపు హృదయాన్ని మళ్లించారు. వీరు అలాకాక అంతా ప్రేమే అని విప్రలంభంలో పుట్టిపెరిగి లీనమైనారంటారు కొందరు. అలా అనటానికికూడా వీలు లేదు. ఎందుకంటే

వడలను వాడువారిన జపాకుసుమారుణ
రేకులందు రా
లెడు హిమశీకరంబులవలెన్ నడియెండల
పారి పారి సో
లెడు హరిణాంగనన్ గవుగలించెడు చల్లని
నీడలటు లె
క్కడుగ దపించుమానవులకున్ సుఖదమ్ములు
జ్ఞానమేఘముల్.

అని జ్ఞానప్రశంసకూడా చేశారు నవ్యులు.

అట్లాగే దీనావస్థలో ఉన్న జనాన్నిగూర్చి—

ఏడవకం డేడవకండి
వస్తున్నా యొస్తున్నాయ్
జగన్నాధుని రథచక్రాల్
శనిదేవత రథచక్రపు
టిరుసులలో పడినలిగిన
దీనులార!

అని ఓదారుస్తున్నా రతినవ్యులు, అధర్మం జరుగుతున్నది.

యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం
సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ
దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే!

ఈ విశ్వాసం ఆదికవినుండి ఆధునికకవిదాకా నాటుకొని ఉంది. ఈ విశ్వాసంలేని వాళ్లనుగూర్చి **Hollowmen** అన్నాడు **Illiot 'What the thunder Said'** అనే అతని రచన బృహదారణ్యకోపనిషత్తునుండి గ్రహింపబడ్డది. దత్త దయధ్వందామ్యత అనే మూడంశాల మీదా అతడు రచించాడు. కాబట్టి భారతీయమైన విశిష్ట భావాలను జగత్తులోని వివిధదేశాలు గ్రహిస్తున్నై. ప్రస్తుతం వారు భారతాన్ని సర్వభూతాని అనువదించుకుంటున్నారు. మన వారు ఆత్మవత్ సర్వభూతాని అనే మహోన్నత సూక్తిని జీర్ణించుకున్నవారు.

మలిచిన రాలయందు కుసుమంబుల వోయుగ
మీదనెన్నడే
ఫలమొకనాడు కల్గునను పల్కుగిరియెవ్వడు
నమ్మినాడు కో
మలవన రాజిలోన కుసుమంబును కోయుట
యెప్పుడప్పుడే
ఫలములు వోవో పోవునో ఉపాసకులాగ
తలంచిచూడుడా!

ఏమి సున్నితమైన అహింసాభావం!

ఎండలోవాడిపోవు లేయిగురులరసి
ఏడ్చునదుల ప్రేమోదంత మెవ్వడెరుగు?

ఎట్టి మృదులమైన కరుణభావం!

మానవుడెంత తెలివిగలవాడైనా ఇతడికి మించిన అగోచరశక్తి చేసేపనులు అర్థంకావని విభ్రాంతి చూడండి.

కాలమహత్త్వ మెవ్వరికి కన్గొనరాదు ప్రతి
క్షణంబు కా
ర్యాళి అయత్నలభ్యమగు కల్గవుకొన్ని ప్రయత్న
నియుక్తి నేల
లీల లయించు భాగ్యమవలీల దరిద్రత వోవు
నిట్టులే
తేలును మున్గు కాలజలధిన్ సకలంబును
అస్వాతంత్ర్యన్,
అందువల్ల అహంకృతి వహింపకు.

ఆ ఋషి ద్రష్ట. ధర్మాన్ని చెప్పలేడు. సర్వ సౌభ్రాతృత్వం మతము కోరుతాడు. ఎన్ని మతాలు! ఎన్ని జాతులు! కాని అందఱు ఒక్క దేశంలో సమాన ప్రతిపత్తితో ఉంటారు. ఇతర దేశాలలో హింసతో సాధించేది ఇక్కడ అహింసతో సాధిస్తానంటాడు. విజయం కోసం ఇతర దేశాలలో ప్రతిపక్షిని చంపడం ధర్మమైతే ఇక్కడ శరీరత్యాగం ధర్మం. ఈ సత్యాన్ని కవి ఉద్ఘోటిస్తాడు.

'నా నృషిఃకురుతే కావ్యం.'

ఋషికి సర్వం సమానం.

'ఘోరాటవిన్ లేటికూనకు పులివచ్చి పాలు ద్రావించిన బ్రహ్మభూమి' సుమా ఇది.

ఈ సాత్త్విక సూత్రంమీద నడుస్తూ నవ్యకవి కావ్యం రచిస్తూ ప్రకృతిని దర్శించినప్పుడు తదను గుణంగా ఆ దృశ్యం దృగ్గోచరమై ప్రస్తుతానికి ప్రతిబింబంగా భాసిస్తుంది. ఈతాదాత్మ్యం సంపాదించుకోడంవల్లనే కవి ఋషి ఔతాడు.

పుష్పం అనుకుంటున్నది.

నీచపు దాస్యవృత్తి మన నేరని భారత
మాతృదేశ సే
వా చరణమ్మునం దనువులర్పణ నేసిన వారి
పార్థివ
శ్రీ చెలువారుచోట తదసృగ్గుచులన్ వికసించి
వాసనల్
వీచుచు రాలిపోవగవలెన్ తదుదాత్త సమాధి
మృత్తికన్.

పేదల రక్తమాంసముల పెంపువహించి
దయారసామృతా
స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ము కై
మతో
న్మాదము పెంచు దేవునికి మాఱుగనిల్చిన రాతి
బొమ్మలం
దూదరపోవు పాడుబ్రతుకొక్క నిమేషము
సైపనాయెదన్.

కాబట్టి భావావేశంలో ప్రకృతిలో కవితాదర్శనం చేసుకొని కవి ఋషియై పలుకుతాడు.

అయితే పూర్వకవుల నిక్షేపాలు, ఆంగ్లకవుల సంపద చూచిన వారు ఆ ప్రభావంనుండి విడివడడం లేదు. ఎంత స్వేచ్ఛం అనుకున్నా వీరి రచనలో వాసనలు విరజిమ్ముతై.
దిఙ్మాత్రంగా చూతాం

'కారుమొయిళ్ళ కాటుకపోగలో వెలిగ్రక్కు
తమాలవాటినే
దారియు గానరాక వెలతా యెటువోయెద
నర్ధరాత్రి
మేఘైర్మేదుర మంబరం వనభువశ్శ్యామాస్తమాల
ద్రుమైర్నక్తం...

ఇంకా- 'ఉర్ణనాభుల తంతు సద్మోత్కరంబు
హిమకణావళి జెలువొందె —

ఈ విధంగా భావాలు కవినుండి కవికి పరిచయ విశేషంవల్ల సంక్రమించడం సహజం.

ఒక్కొక్క కాలంలోని సాంఘికాది స్థితుల వల్ల ఒక్కొక్క భావం అగ్రభూమి నిల్చినా సమస్తం చూచి ప్రకృతియొక్క విశ్వదర్శనం చేసుకొని చైతన్య బృంహితమైన కవివాక్కు ఏకదేశం చూచి సంకుచితంగా పలికే పామరులవలె పలకక సత్యసంపత్తితో విశాలబుద్ధితో సుందరభావంతో లోకక్షేమంకోసం బహిర్గతమౌతుందనే సారాంశం. 'విశ్వశ్రేయః కావ్యం' అని కదా సూక్తి.

నవ్యకవిత్వం-అతి నవ్యకవిత్వం-అనేవి ఇప్పుడు సాగుతున్నయ్. నవ్యంలో అన్యకావ్య ప్రభావం ఉన్నా ఛందోబద్ధమై లయానుగుణ్యమై స్వీయంగా భాసించే శక్తిని సంపాదించుకున్నది. వివిధ రసాలను క్రుమ్మరిస్తున్నది. అతినవ్యంలో వైదేశిక ప్రభావం మిక్కుటమై ఛందోరహితమై వ్యాకరణాన్ని అనుసరించనని దీక్షవహించి ఒకే బీభత్స రసాన్ని మాటిమాటికీ క్రుమ్మరిస్తూ పునరుక్తి సంభృతమై విసుగు గలిగిస్తున్నది. భావాలు పదాలు ఉపమానాలుకూడా వైదేశికాలే. సామాన్యనిఘంటువులు శబ్దమాత్రంగా [illegible] లయలేదని [illegible]సుకొంటున్నారు. అర్థం [illegible] నిఘంటువులకుకూడా చిక్కడం లేదు.

కాని సాంప్రదాయం తెలిసినవారు అతి నవ్యులు ఛందస్సును విడిచినా ఛందస్సులోనే వ్యాకరణాన్ని విడనాడినా వ్యాకరణబద్ధంగానే వైదేశికాలను వాడదలచినా స్వదేశీయాలనే వాడుతూ రచిస్తున్నారు.

నా నుడి నీ గుడిగా
నా గీతం నైవేద్యంగా
నా [illegible]సరిన రసవిస్ఫురకుసుమపరాగం
ఓహో రసధుని! మణిఖని! జననీ!

సంస్కృత భాషాపరిచయం పూర్వకావ్య ప్రభావం లేకుండా పై రచన సాగిందా?

వైదిక సంస్కారం చిత్తగించండి.

నా గీతం గుండెలలో
ఘూర్ణిల్లగ
నా జాతి జనులు పాడుకొనే
మంత్రంగా ప్రయోగించాలని నిర్మించా
నంటాడు.

ఈ ప్రక్రియలో వేదంచదివిన ఘనపాఠివలె

ఇంద్రశ్రేష్ఠాని
శ్రేష్ఠాని ద్రవిణాని
ద్రవిణాని ధేహి
ధేహి చిత్తం
దక్షస్య సుభాగత్వం —

వంటి రచనల మాదిరిగా

— నిద్రకు వెలియై
నేనొంటరినై
నా గదిలోపల చీకటిలో
చీకటిలోపల నా గదిలో
నా గదిలో
చీకటిలో
నేనొక్కడనై
నిద్రకు వెలియై
కన్నుల నిండిన కావిరితో
కావిరినిండిన కన్నులతో
కన్నులతో
కావిరితో —

అనే రచన సాగినట్లు కనబడుతుంది.

దీనికి ఉదాత్తానుదాత్తాది స్వరములు కూర్చి చదివితే మంత్రపాఠంవలె పలుకుతుంది. వైదిక ఛందస్సులను భారతీయ సంస్కృతిని జీర్ణించుకున్న ఈ పనసలు ప్రాచీనాలా నవ్యాలా ?

అన్వయం ఉన్నది. వ్యాకరణం పాటించబడ్డది.

భావి వేదముల జీవనాదములు
జగత్తుకంతా చవులిస్తాయోయ్

అని ఆయనే చెప్పాడు.

రణన్నినాదాలు, శోచిర్నివహం. ఝుం ఝూం ప్రభంజనం ఇత్యాదుల్లో వ్యాకరణపు సంకెళ్లు విడిపోయాయా ?

షెల్లీనవకపు హాల్లీసకమున

ఛందస్సుల పరిష్వంగం సడలిపోయిందా ?

పోవు. అవి కవిత్వానికి అవసరం.

ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కలకవికిముఖ్యంగాను.

ఆదిలో శబ్దాడంబరం శ్రవణసుఖాన్నిస్తుందని కవి తిప్పలుపడడం సహజం. పాఠకశ్రేణికూడా అంతే కాని, పరిణతినొందిన కొద్దీ కవిత్వానికి **clarification** అబ్బుతుంది. అదే పరిణామ లక్షణం. గాయత్రోలు నవ్యకవిత్వాన్ని వ్రాసినా ఛందస్సును వ్యాకరణాన్ని పాటించాడు, రాణించాడు. శ్రీ శ్రీ అభినవ్యకవిత్వం వ్రాసినా ఛందస్సును వ్యాకరణాన్ని పాటించాడు గణించాడు. కాబట్టి వ్యుత్పత్తి లేకుండా వ్రాసేవ్రాతలు పునాదులులేని గోడలు.

మలుపు తెరిగిన కంఠమే మార్గమందు
పయనమయ్యును తప్పుత్రోవలకుబోదు
కలసివచ్చిన బాటల గలపికొనును
బాటలేకున్న నొక క్రొత్తబాట వేయు.

విద్య నేర్చినవాడె విప్రుడు
వీర్యముండినవాడె క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి
మరచెదెందులకోయ్

—గురజాడ.

# మన చారిత్రక సంపద



## శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

పవిత్రమయిన యీ అలంపుర క్షేత్రమున, జరుగుచున్న ఆంధ్ర సారస్వత పరిషత్తు యొక్క సప్తమ వార్షికోత్సవ సందర్భమున చరిత్ర సమ్మేళనము నందు మన దేశము నందలి చారిత్రక సంపద''ను గూర్చి ఉపన్యసింపవలసినదిగా పరిషదధ్యక్షులగు శ్రీ రామానుజరావు గారు నన్నాజ్ఞాపించిరి. ఈ విషయములో మాట్లాడుటకు నాకు ఎక్కువ అర్హత లేకపోయినను, తప్పని సరి అగుటచే నేడు ప్రసంగించ సాహసించినాను. ఏదో నాకు తోచినకొలది నాపై బెట్టిన కార్యభారమును నిర్వహించెదను.

"నా హృదయము భూతమునందున్నది. నా శరీరము వర్తమానము నందున్నది. నాఆత్మ భవిష్యత్తు నందున్నది" అని అనియొకానొక తత్త్వవేత్తనుడివియున్నాడు. ఈ మాటలు వినోదార్థముకాని, అజ్ఞానులను మాడలు కొట్టుటకు వాడినపదాడంబరము గాని కావు ఈ మాటలలో గర్భితమయిన యొక సత్యమునే యతడు ప్రవచించియున్నాడు. మానవుడు భూతకాలమునకు ఋణపడియున్నాడనియు, వర్తమానముతో సన్నిహిత సంబంధము కలిగియున్నాడనియు, భవిష్యద్విషయముల యెడ బాధ్యత వహించి యున్నాడనియు ఆతత్త్వవేత్త భావము. మన భవిష్యత్ నిర్మాణకథ చెప్పుట జోస్యము. భూతకాలము మనకెట్టి పరిణామ పరిస్థితులను కలిగించినదో తెలిపెడు కథ చరిత్రయనబడును. పూర్వకాలపు వివిధోద్యమముల యొక్కయు, వివిధ సంఘట్టనముల యొక్కయు పరంపరా జనిత పరిణామ పరిస్థితులే మన ప్రస్తుత స్థితియని మనము గ్రహించినచో చరిత్ర పుక్కిటి కథగానుండక, మనకత్యంత సన్నిహిత సంబధముకల వాస్తవిక జ్యోతిగా ప్రకాశింపగలదు.

మన పూర్వుల ఆచార వ్యవహారములు, వ్యవసాయ వ్యాపారములు, రాకపోకలు, విద్యావిధానములు, రాజ్యాంగ పద్ధతులు, పాడిపంటలు, పరిశ్రమలు, మంచిచెడ్డలు మొదలగు వానిని గూర్చి మనకు చరిత్రకావలయును. మనజాతి

యొక్క వృద్ధి క్షయములకు కారణ భూతములయిన అంశములను దెలిసికొని మన కార్యక్రమమును సరిదిద్దుకొనుటకు మిగుల నుపకరించునవి చరిత్ర గ్రంథములే. అయితే యీ చరిత్ర రచన యందు మనపూర్వీకుల దృష్టి, విధానము వేరుగా నుండుటచే నవీన పద్ధతిని చరిత్ర నిర్మాణము సుకరమయిన విషయము గాదు. అయినను చరిత్ర పరిశోధకులీ విషయమున ప్రశంసనీయముగ కృషి సలుపుచున్నారు. యీ పరిశోధకుల దృష్టిలో పనికిరాని వస్తు వొక్కటియు లేదు. రాయిరప్పు, చెట్టుగుట్ట, గుళ్ళు గోపురములు, కోటలు పేటలు శాసనములు నాణెములు మొదలగు ఏయల్ప వస్తువు నయినను వారు పరీక్షించి, వాటి నుండి పెక్కు విషయములు తెలిసికొని పూర్వకాలపు చరిత్ర కథను తర్కబద్ధముగా నిరూపించుచున్నారు. యీ పరిశోధక పండితులకు మనము కృతజ్ఞులమయి యుండవలెను.

"ఆంధ్రదేశమును గురించియు, ఆంధ్ర రాజులను గూర్చియు, ఆంధ్ర వాఙ్మయమును గూర్చియు నెక్కుడు పరిశోధనలు చేసి క్రొత్త క్రొత్త వింతలను కనుగొనదలచిన వారికి హైదరాబాదు రాజ్యమండలి - తెలుగు భాగమొక బంగారమువంటిది." అని కీర్తిశేషులయిన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు సెలవిచ్చియున్నారు. యీ వాక్యము నందెంత మాత్రమును అతిశయోక్తి లేదు. యీ విషయ ప్రాధాన్యమును గ్రహించియే యీ రాష్ట్రమున రెండు సంస్థలు చరిత్ర పరిశోధనమందు పనిచేయుచున్నవి. అందొకటి మన ప్రభుత్వమువారి ఆర్కి శాఖ. రెండవది లక్ష్మణ రాయపరిశోధక మండలి. వారిశక్తి పరిమితమైనది. ఆర్కి శాఖవారు ఎన్నో నియమనిబంధనలకు లోబడి యుండినను ఎంతో ప్రశంస నీయముగ కృషిసల్పియున్నారు. ఆర్కి శాఖ వారు ఇంక నెక్కుడుగ పనిచేసి చూప గలరని మన మాశింప వచ్చును. ఇక లక్ష్మణరాయ పరిశోధక మండలికి అంగ బలము, అర్థబలము తక్కువగా నున్నది. యీ బలమునెట్లో సమకూర్చుకొని పని చేయుచున్నను చరిత్ర పరిశోధక పండితుల విధానము, తోడ్పాటు ఎంతయు ఆశాభంగకరముగా నున్నదని తెలుపుటకు మిగుల విచారపడుచున్నాను. చరిత్ర పరిశోధన మొక జగన్నాథ రథము వంటిది. పదిమంది భుజాలు వేసినగాని యీ రథము నడువదు. కేవలము చరిత్రాభిమానముతో నిరాడంబరముగ పని చేయవలసిన ఉద్యమమిది.

అయితే ఇట్టి చరిత్ర రచనకు సంబంధించిన సాధన సామగ్రిలో మిక్కిలి ప్రామాణికమయినట్టివి శాసనములు. పూర్వ కాలమునందలి రాజులో, రాణులో, మంత్రులో, సేనాపతులో, ధార్మికులో తాము చేసిన ఘనకార్యములను గురించి వివరించుచు శాసనములు వేయుచుండెడి వారు, వారు చరిత్ర దృష్టితోగాక పారమార్థిక దృష్టితో ఆ శాసనములను వేయించినప్పటికిని, చరిత్ర సాధనములలో

వీటితో సమానముగా ప్రాధాన్యము వహించునవి యింక నెవ్వియును లేవు. ఈ శాసనములు రెండు విధములుగానుం డును. ఒక విధము లోహము మీద చెక్కుట రెండవ విధము రాతిమీద చెక్కుట. లోహ శాసనములే మొట్ట మొదట ప్రారంభమయినట్లు కనబడు చున్నది. అత్యంత పురాతన కాలములో బంగారు రేకులమీదను, వెండి రేకుల మీదనురాగి రేకులమీదను శాసనములు వేయించుచున్నట్లు కనబడుచున్నది. రాగి రేకుల మీద చెక్కిన శాసనములే విరి విగా దొరకుచున్నవి. పండ్రెండవ శతాబ్ద మునుండి శిలాశాసనములు క న బ డు చున్నది. ఈ శాసనములలో ప్రశస్తి అను భాగము చాల ముఖ్యమయినది. అందు ఆ కాలపు రాజుల పేర్లు, బిరుదా వళులు, వంశావళులు, కీర్తి పరాక్ర మాలు, శాసనకాలము ఉండును. ఆ శాసనము విజయచిహ్నమో, వితరణ చిహ్నమో అందలివర్ణననుబట్టి గ్రహింప వచ్చును. లిపి, వర్ణక్రమము, భాష, వృత్తి నిర్మాణములు. పన్నులు ధార్మిక వి శా ్వ స ము లు మొదలగునంశము లెన్నియో యీ శాసనములనుబట్టి గ్రహింప వచ్చును. సందిగ్ధాంశములను ఎన్నింటినో శాసనములు నిర్ధారణ చేయ గలవు. ఒకానొక విదేశీయుడు కాకతీయ మహారాణి రుద్రమదేవి గణపతి దేవుని భార్య అనివ్రాయగా ఆవ్రాతనుబట్టి అది యే నిజమనుకొనిరి. శాసన పరిశోధనము ప్రారంభమయిన తరువాత ఆ వాదము సప్రమాణముగా ఖండితమయినది. ఆ మహారాణి రుద్రమదేవి గణపతి దేవుని కూతురని శాసనములు పేర్కొన్నవి. పురాణములలో రాజులయొక్కయు, రాజ వంశములయొక్కయు పరంపర గలదు. కాని ఆ విషయములనుగూర్చి శాసనము లలో వ్యత్యాసము కనబడుచున్నది. శాస నాంశములకు విరుద్ధములుగనుండు అంశ ములు కొట్టుబడి పోవలసినదే. కాక తిప్రోలరాజుచే ఓడింపబడినగుండ రాజును గూర్చి ఇంతవరకు ఏమియు తెలియదు. మంథెనలో ఒక శాసనము కలదు. అందు ఇతడు సూరేశ్వరాలయము, క ట్టి ం చి నట్లును, భూలోకమల్లునకు సామంతు డయినట్లును తెలియుచున్నది. ఈ శాస నము తెలుగుశాసనము. ఇంత వరకు ప్రకటింపబడ లేదు. ఈ శాసనములో గుండ్రెడ్డి అని పేర్కొనబడినాడు. ఇతడు కృష్ణాజిల్లా గన్నవరము దగ్గరనున్నమంతెన గ్రామవాసిగ ఇంతవరకు పరిశోధకులు భ్రమపడినారు. ఈ శాసనము ఇతడు కరీం నగరు జిల్లాలోని మంథెనవాడని స్ప ష్టము చేయుచున్నది. వేమారెడ్డి సోదరు డగు మాచిరెడ్డి శాసనము వాడపల్లిలో గలదు. ఆ ప్రాంతము రాజకొండ వెల మల రాజ్యములోనిది. ఇచ్చటికి వేమా రెడ్డి సోదరుడు ఏ సంబంధమునవచ్చెనో తెలియుట లేదు. రెడ్లకు, వెలమలకు విరోధము ఇచ్చటినుండి యే ఆరంభమయి యుండును. గురుమల్లికార్జున పండితా రాధ్యులవారు కాకతి రుద్ర దేవునకు సమకాలికుడను వాదము కలదు. హనుమ

కొండ దేవాలయములోను, రామప్పగుడి యందును ఆరాధ్యులవారి శిష్యుడగు విభూతిగవరయ్య లేఖనములు గనబడు చున్నవి. పండితుడు గణపతి దేవుని కాలమువాడనుటకు అవకాశము గలదు. ఇట్లు శాసనములు ప్రాత సమస్యలను పరిష్కరించుచు, క్రొత్త సమస్యలను లేవదీయుచున్నవి. శాసనములు నిజము దెలుపు అమూల్య సాధనములు.

శాసనములు సేకరించు పని కొంత వరకు జరిగినది. సర్కారువారు కొన్ని ప్రకటించినారు. లక్ష్మణరాయ పరిశోధక మండలివారు 123 శాసనములు గల ఒక ఉద్గ్రంథమును ప్రకటించినారు. మండలి వారు ఇంకొక సంపుటమును ప్రకటిం చుటకు సిద్ధముగానున్నారు. కాని ఆ శాసనపాఠములను పండితులు సిద్ధము చేయవలెను గదా! ఆ పండితులను తొందరపెట్టవలసినదిగా శ్రీ బాల బ్రహ్మేశ్వర స్వామివారిని ప్రార్థించు చున్నాను.

ఈ రాష్ట్రములో ఇంక నెన్నో శాసనము లున్నవి. మూల మూలలుగాలించి వానికి వెలుగు చూపవలసియున్నది. ఈ శిలాశాసనముల విలువను గ్రహింపక కొందరు ఆ రాలను గడపలకో, తూము లకో, గోడలకో ఉపయోగించుచున్నారు. మరికొందరు రోళ్ళుగా చెక్కించుకొని పాడు చేయుచున్నారు. ఈ యమూల్య సాధనములను మనము జాగ్రతగా కాపాడ వలయునని మనవి చేయుచున్నాను.

శాసనముల తరువాత దాదాపు సమానముగా ప్రామాణిక మయినట్టివి నాణెములు. నాణెములు వివిధ పరిమాణ ములుకలవిగ నుండవచ్చును. పలువిధ లోహములలో నుండవచ్చును. నాణె ములు ఆకాలపు ఆర్థికపద్ధతిని, రాజకీయ స్వాతంత్ర్యమును, రాజలాంఛనములను, భాషాస్థితిని, అభిరుచులను, లోహసంపద లను నిరూపించుచుండును. నాణెముల నుండి చరిత్రాంశములను కనుగొనుట కొంచెము కష్టమయిన కార్యమే. అయినను చరిత్రకారుడు నాణెములతో మాటాడి విషయములను గ్రహించుచునే యున్నాడు. ఈ నాణెములపయి వింతవింత లయిన సాంకేతిక చిహ్నములుండును. వీని యంతరార్థమును గ్రహించుటకు పండి తులు ప్రయత్నించుచునే యున్నారు.

చరిత్ర సాధనములలో తరువాత పేర్కొనబడినవి చారిత్రిక విలువగల పురాతన కట్టడములు. ఇవి దేవాలయముల రూపముననో, సమాధుల రూపముననో, చైత్యములుగనో, విహారములగనో, కోటలుగనో, గుహలుగనో ఉండును. శాసనములు, నాణెములు తెలుపని యంశ ములను ఈ కట్టడములు తెలిపి, విషయ సంపూర్ణతకు తోడ్పడుచుండును. ఈ కట్ట డములు చాలవరకు శిథిలమయియుండుట సహజము. మరికొన్ని భూమిలో పూడి పోవుచున్నవి. ఆ మంటిదిబ్బలను త్రవ్వి చూచినప్పుడు ఎంతో చరిత్ర సామగ్రి దొరకుచున్నది. దేవాలయములు, రాజ భవనములు, పట్టణములు, పల్లెలు బయట

పడుచున్నవి. బావులు, వీధులు, ఇండ్లు, వాకిండ్లు అద్భుతముగొల్పుచు గనబడును. ఈ మట్టి దిబ్బలక్రింద ఎన్నియో శతాబ్దములనుంచి పడియున్న నాణెములు, కుండలు, పాత్రలు, ఆయుధాలు, జపమాలలు, విగ్రహాలు, గాజులు, సొమ్ములు, పనిముట్లు ఎన్నో దొరకుచున్నవి. ఇవన్నియు ఆకాలపు జనుల జీవితవిధానములను సూచించుచుండును. ఇంతేయేకాదు. వారివైజ్ఞానిక, సంపదను, సాంఘికస్థితిని, ధార్మిక విశ్వాసములను, శిల్పనైపుణ్యమును ఇవి చాటుచుండును. పైఠణ్, కడ్కల్ బిదరు, వరంగల్, గుల్బర్గా, మాస్కి, కొండాపురము, ఫణిగిరి, గాజులబండ మున్నగు ప్రదేశములను భూగర్భమునుండి బయలుపరచి మన సర్కారువారు ఎంతో మహోపకారము చేసియున్నారు. వీటియందు దాగుకొనియున్న అపురూపపు వస్తుసముదాయము విస్మృతమైన దేశ చరిత్రాంశములను దెలుపుచు ముందడుగు వేయుచున్నది.

చారిత్రక విలువగల కట్టడము లీరాష్ట్రములో సుమారు 5000 లవరకునున్నట్లు తెలియుచున్నది. ఇందు 3000 లైన తెలంగాణమునందుండియుండును. వీనిని మొదటి తరగతి, రెండవతరగతి, మూడవతరగతి అని తరగతులుగా ప్రాముఖ్యతనుబట్టి విభజించి, అత్యంత ప్రాముఖ్యమయిన మొదటి తరగతి కట్టడముల పట్టికను మన ఆర్కి శాఖవారు ప్రకటించియున్నారు. ఈ పట్టికనుబట్టి రాష్ట్రములోని 604 టిలో మన తెలంగాణ ఎనిమిది జిల్లాలయందు 278 మాన్యుమెంటుసు ఉన్నట్లు కనబడుచున్నది. ఈ 278 కట్టడములలోను 37 కోటలు గలవు. ఆంధ్రేతర ప్రాంతమునందును ఆంధ్రరాజులు కట్టించిన దేవాలయములును, కోటలును ఉన్నట్లు ఈ పట్టికవలననే ధృవపడుచున్నది. కర్ణాటక ప్రాంతమగు రాయచూరు కోటను గూర్చి సర్కారువారు ఈ క్రిందివిధముగా నుడివియున్నారు. "ఈ (రాయచూరు) దుర్గనిర్మాణము ఓరుగల్లు రాజగు రుద్రమదేవిచే పూర్తిగావింపబడినది. దీని బహిః ప్రాకార కుడ్యములందు కన్నడ=తెలుగు భాషలందు ఒక శాసనముగలదు. ఓరుగల్లు మహారాణి రుద్రమదేవి మంత్రిసత్తముడయిన గంగయ్య రడ్డివారుకోట నిర్మాణ కర్తగా శాసనమునందు గలదు. కాలము క్రీ. శ. 1294 ఈ శాసనము చెక్కబడిన శిల 41 అడుగుల పొడవుగలిగి కోటలోని శిలలన్నిటిలోనికి పెద్దదయియున్నది. ఈ పెద్ద శాసనశిలాఖండము ప్రక్కనే మరియొక పెద్ద రాతిపలక గలదు. ఈ రాతిపలకపయి కొండ గనిలోనుండి కోటప్రాకారమువరకు దున్నపోతుల బండిమీద శాసనశిలను తెచ్చుచున్నట్లుగా అందమయిన చిత్రణముగలదు." ఈ లిఖితమునుబట్టి రాయచూరు కోటకును కాకతీయులకును గల సంబంధము స్పష్టమగుచున్నది. ఈ సందర్భమునసే సర్కారువారు ఇంకొక గొప్పవిషయమును సూచించినారు. వారిట్లు వ్రాసినారు. "ఆ ప్రదేశమందే మూడవ శిలాఫలకముమీద ఒక ఊరేగింపుటుత్సవము చెక్కబడియున్నది.

ఇందు రుద్రమదేవి విగ్రహమే కాబోలు చిత్రింపబడియున్నది." అని వ్రాసినారు. ఆ విగ్రహము రుద్రమదేవిదే అయిన యెడల అదిచాలా గొప్పవిషయముగదా! ఈ విషయము చరిత్రకారుల దృష్టికి తెచ్చుటకే యింతదూరము నుడువవలసివచ్చినది. పాడుపడిన ప్రదేశములలోను అమూల్య చరిత్రాంశములు కలవనియు, వానిని పరిశోధించుటయు, వానిని మంచిస్థితిలో నుంచుటయు కర్తవ్యమని నామనవి.

చరిత్ర సాధనములలో కవులు రచించిన కావ్యములు = ఏభాషలో నున్నప్పటికిని ప్రామాణికములుగా నెంచవలెను. పెక్కు గ్రంథములు అముద్రితములయి, ఏ దేవతార్చన పెట్టెలోనో ఏ అటకమీదనో పడియున్నవి. వీటి విలువ అపారము. ఈ గ్రంథ సంపద విలువను గ్రహింపక వివేక హీనులగు కొందరు మహానుభావులు తమ యొద్దనున్న తాళపత్ర గ్రంథములను చలిమంటల కుపయోగించినారట! ఎంత విషాదకరము! ఇట్లుచేయుట పాపకార్యముగా భావింపవలెను. వాటిని భద్రముగా కాపాడవలయును. లేదా సర్కారువారికి గాని చరిత్ర పరిశోధకులకుగాని యియ్యవలయును. అచ్చుశాలలు లేని కాలములో కష్టపడి వ్రాసి, ప్రాణసమానముగా భావించి కాపాడిన మనపూర్వుల ఆస్తిని నాశనముచేయు దోషాపచారమునకు కడంగగూడదు. ఈ కావ్యములు భాషా విషయమున మిగుల విలువగలవి. పదునారవ శతాబ్దమందుండిన కట్టా వరద రాజను కవి తనకవిత్వమునుగూర్చి యిట్లు వర్ణించియున్నాడు :—

"అందమై సుకవులెల్లరా యనఁజెవుల
విందుగాగ్రంబు వెదజల్లినట్లు
ధ్వనులు వ్యంగ్యములు వింతలువాసనలును
మినుకులు జగిబిగి మెఱవడుజాతి
వార్తలునుపమలు వర్ణనాంశములు
మూర్తి మద్వాక్యముల్ ముద్దులుసూప
ఒకమాటకన్న వేఱొకమాటవింత
ఒకపాదమునకన్న నొకపాదమొప్పు
ఒకదళంబునకన్న నొకదళంబలర
ఒకయుత్తరముమించి యొకయుత్తరంబు
నెలయంగ ద్విపదగావింపఁ జిత్తమున..."

ఈ వాక్యములందతిశయోక్తిలేదు. మధుర వాణీ విలాసమనునది అత్యద్భుతమగు మహాకావ్యము. ఇట్లు భాషావిషయమున ప్రాముఖ్యముగల గ్రంథములను మహానిధిగా మనము భావించవలెను. ఇక చరిత్ర విషయమునను ఈ కావ్యములు అమూల్యములయినవి. ఒక్కయుదాహరణము తమకు చూపెదను. నల్లగొండ జిల్లాలో ఆసూరి మరింగంటి వారిది విద్వత్కుటుంబము, మరిగంటి నరసింహాచార్యులుగారు రచించిన శ్రీకృష్ణ శతానందీయమను కావ్యములో తమ పూర్వుడగు మరిగంటి సింగరాచార్యులనుగూర్చి ఇట్లభివర్ణింపబడినది :—

"కుసుమకైదువువడినెసగపల్కనమర్చ
ఆశుకవినుడువు నట్టిబిరుదు
మూగచే ప్రతివాది మూకలతోడుత
వాదింపగాచేయు వసరుబిరుదు

అష్టభాషలచేత నలరుచు సత్ప్రౌఢి
వింశతికృతులు గావించుబిరుదు
శబ్దశాసనడనుచు జనములు కీర్తింప
రాణించు శతఘంట రాజబిరుదు
కల్లి మల్కిభరామ భూకాంతుచేత
మత్తగందేభ సితఛత్ర ముత్తమాశ్వ
హాటకాంబర చతురంతయానయగ్ర
హారములనందె శ్రీ సింగరాహ్వయుండు"

ఈ సింగరాచార్యులవారు ఎంత దొడ్డ కవియో చూడుడు. అంతటి దొడ్డకవి గానిచో మల్కిభరాము (ఇబ్రహింకుతుబుషా) చేత "మత్తగందేభ సితచ్ఛత్ర ముత్తమాశ్వ హాటకాంబర చతురంత యానాగ్రహారముల సందగలుగునా? ఎంత చారిత్రక విలువగల యంశమో ఊహించుడు. కాబట్టి కావ్యములుగూడ చరిత్రకు రత్నాలగనియని భావించవలెను. అట్టి రత్నములను గాజుముక్కలుగా పరిగణించకూడదు.

మన తెలంగాణములో తాళపత్ర గ్రంథములు చాలా ఉన్నవి. వాటినన్నిటిని గాలించి ఆకవుల పేర్లు మాసిపోకుండ చూడవలెను. ఎచ్చట ఏ గ్రంథరత్న మున్నదో! అథర్వణ భారతము, ఎఱ్ఱా ప్రగడ రామాయణము, సోముని పూర్వ హరివంశము, త్రిపురాంతకుని ప్రేమాభిరామము, శివదేవుని పురుషార్థసారము, శ్రీనాథుని పండితారాధ్య చరిత్రము, కమల నాభామాత్యుని పద్మపురాణము మొదలగు వానినిగూర్చి వినుటయేగాని ఆగ్రంథములు దొరుకలేదు. మన తెలంగాణములో దొరకుననను విశ్వాసముగలదు. కావున ఈ అముద్రిత గ్రంథ సంగ్రహాము నందు మంచి ప్రయత్నము జరుగవలసి యున్నది.

వాఙ్మయ విషయమునుగూర్చి ముచ్చటించునప్పుడు పల్లెటూరి పాటలను పనికి రానివిగా మనము త్రోసివేయకూడదు. ఆ పాటలనుండి భాషాపరిణామము, భావ పరిణామము, పతివ్రతల చరిత్రలు, వీరుల గాథలు, జానపదుల క్రీడావినోదములు, పండుగ పబ్బముల వేడుకలు, మున్నగు విషయములెన్నో మనము తెలిసికోగలము. శాంతము, శృంగారము, హాస్యము, వీరము మున్నగు రసములు వాటియందు చిప్పిలు చుండును. అట్టిపాటలను సేకరించినచో భాషకును, చరిత్రకును మహోపకారము జరుగగలదు.

చరిత్ర సాధనములనుగురించి ముచ్చటించు సందర్భమున "కెయిరను" లను గూర్చి తమకు కొంతనివేదించుటకు ఉత్సుకుడనయి యున్నాను. కెయిరనులనగా రెండువేల ఏండ్ల క్రిందటి మనపూర్వీకుల శవఖననపద్ధతిని దెలుపు సమాధులు. ఈ కెయిరనులు తెలంగాణమునందే ఎక్కువగా గనుపడుచున్నవి. ఇంకొక విచిత్ర మేమనగా ఈ కెయిరనుల వ్యాపకము మన రయిలుమార్గమునే అంటి పట్టుకొని యుండుట. రయిలుమార్గ నిర్మాణమునకు ఇంజనీర్లు భూసారమును, జనపదములను గమనించినట్టులనే, కెయిరనుల నిర్మాణమునకు ప్రాచీనపు ఇంజనీర్లు నిశ్చయించి యుందురా అనితోచుచున్నది. బేగంపేట, మౌలాలి, బాలానగరు, రాయగిరి, డోర్న

కల్లు, ఖమ్మంమెట్టు, చింతకాణి, మాను కోట, మధిర ప్రాంతములందు కెయిరనులు గుంపులు గుంపులుగా నున్నవి. ఈ అలంపుర ప్రాంతమునందును కెయిరనులు పెక్కు ఉన్నట్లు దెలిసినది. ప్రాచీనజనుల విశిష్ట నాగరికతనుజాటు ఈ కెయిరనుల ఉదంతము చాలగొప్పది. ఈ సమాధులు భూగర్భములో నుండును. కంటికి కనబడవు. అయినను వలయాకారముగా రాళ్లు పాతియున్నట్లు కనబడినచో ఆరాల మధ్య భూగర్భమున సమాధి యున్నట్లుగా గ్రహింపవలెను. ఆ భూగర్భములోనికి చొచ్చి, ఆసమాధులను పరిశోధించుట వలన తేలిన సారాంశ మేమనగా — ఆ ప్రాచీన యుగపురుషుడు రెండుమూడు వేల సంవత్సరములక్రిందనో అంతకంటె పూర్వమో ఉండియుండెను. ఇతడు తాటిచెట్టంత పొడవుగల గంభీరాకార రాక్షసుడుగా గాక మనవంటి సామాన్య మానవాకారముననే యుండెను. ఇతడు అయిదున్నర ఆరు అడుగుల పొడుగాటి మనుష్యుడు. ఇతడు స్థిరనివాసియయి ఇల్లు వాకిలి, గొడ్డుగోద కలవాడయి యుండెను. ఇతడు వ్యవసాయముచేసి పంటలు పండిచుచుండెను. ఇతడు శిల్ప నైపుణ్యముకల కమ్మరి, కుమ్మరియునై పరికరములను సిద్ధము చేయుచుండెను. ఇతడు పూసల హారమును చేయుచుండెను. ఇతడు గొప్ప గొప్పరాతి పలకలను మలుచుశక్తి కలిగి యుండెను. ఇతడు జ్యోతిషశాస్త్రము నందును కొంత పరిజ్ఞానము కలవాడయి యుండెను. ఇతడు వాస్తుశాస్త్రమునందు అనగా ఇంజనీరింగు విద్యయందు వేత్తయయి మంచికట్టడ నిర్మాణములందు దిట్టయయియుండెను. ఇతడు పునర్జన్మమునందు నమ్మకము గలవాడయి యుండెను. ఇతడు మృతులకు చేయుచుండిన కర్మకాండ అత్యంత వైభవముతోకూడి యుండెను. ఇట్టి యంశాదికములనుబట్టి తెలంగాణ నివాసిగానుండిన యీ ప్రాచీన పురుషుడు వేలకొలది సంవత్సరముల క్రిందటి మన పూర్వుడు విశిష్టమయిన సభ్యతగల జనుడయి యున్నట్లు స్పష్టమగుచున్నది. ఇది చాలా గొప్పవిషయము.

అయితే యీ కెయిరనుల స్థలనిర్దేశము చేయుచు వలయాకారముగ నుండిన రాళ్ళను వ్యవసాయకులు తీసివేసి, ఆ ప్రాంతములను పొలములుగా మార్చి దునున్నచున్నారు. వడ్డెరవాండ్రా రాళ్ళను పగులగొట్టి గృహనిర్మాణాదులకు అమ్ముకొనుచున్నారు. కొన్నిచోట్ల రాళ్ళమీద గడ్డిగాదములు పెరిగి అడవి ఏర్పడి మరుగయి పోవుచున్నవి. ఒకచోట సామాన్యపు అడవి పెరుగుటకు 500 సంవత్సరములు పట్టునని ఒక శాస్త్రజ్ఞుడు లెక్కవేసి యున్నాడు. కొన్నిచోట్ల జలప్రవాహముచే మట్టిదిబ్బలేర్పడి రాళ్ళనుగప్పి వైచినవి. కావున కెయిరనులను ఈ అడ్డంకులనుండి తప్పించి రక్షించవలసియున్నది.

మన చరిత్రకు సంబంధించిన సందిగ్ధాంశము లెన్నో యింకనుపరిష్కారము కావలసియున్నది. ఏమనగా—

1. అనపోతానాయడు రేచర్లగోత్రుడు మహావీరుడు. రాచకొండ రాజధానిగా

గలవాడు. ఇతడు సోమకుల పరశురాముడను ప్రఖ్యాత బిరుదముకలవాడు. ఈ బిరుదుకు సంబంధించిన యుద్ధము జల్లిపల్లి, ఇనుగుర్తులలో జరిగినది. ఇనుగుర్తిలో ఆ నాటి యుద్ధమును వర్ణించిన వీరవిగ్రహాములు చాలకలవు. ఈ యుద్ధమును గురించి వివరములు తెలిసికొనవలసి యున్నది.

2. శ్రీకృష్ణదేవరాయలు నేలకొండపల్లి, అరవపల్లి, వేల్పుగొండ మొదలగు తెలంగాణ దుర్గములు జయించి రాయపర్తి దగ్గర విద్యానగరమును నిర్మించినట్లు తెలియుచున్నది. ఆ ప్రాంతమంతయు విద్యానగర విషయములోనిది. విద్యానగరమునకు దీనికి సంబంధించిన పరిశోధన జరుగవలసియున్నది.

ఇట్టివెన్నో చరిత్రాంశములు పరిష్కరింప బడవలసియున్నవి. ఏశాసనమో, ఏగ్రంథమో, ఏకోటగోడో, ఏరాయియో పరిష్కార మార్గమును జూపవచ్చును. కావున చరిత్ర పరిశోధన విషయమున ఎట్టి అల్పసాధనమునుగూడ మనము విస్మరించక, దేశమంతయు గాలించి, వేయి కండ్లతో కనుపెట్టుచుండ వలయును. ఈ ప్రయత్నము వెంబడే ఫలించునదిగాదు. ఎంతో శ్రమ, ఓర్పు కావలయును. నిరాడంబరముగా కేవలము చరిత్రాభిమానముతో పనిచేయుటకు ఉత్సాహకులు నడుముకట్టి ముందుకు రావలసియున్నది.

# కవిః క్రాంతదర్శీ



శిరోమణి

## శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి

"తద్దివ్యమవ్యయం ధామ సారస్వతముపాస్మహే,
యత్ప్రసాదాత్ ప్రలీయంతే మోహాంధతమస
సచ్ఛటాః.

కవిసంఘం మన నాగరికత వికసించుట ప్రారంభించిన నాటినుంచీ లోకాన్ని ధర్మమార్గంలో (అంటే శాంతియుతమైన జీవనంలో) నడపడానికి ప్రయత్నిస్తూనే ఉన్నది. ప్రజలకు హితబోధ చేస్తూనే ఉన్నది. నిరంతరంగా ఆనంద ప్రాప్తిని చేకూర్చి లోకాన్ని గార్హస్థ్య సౌందర్యపిపాసకు ప్రోత్సహిస్తూనే ఉన్నది.

"ప్రాచేతస వ్యాస పరాశరాద్యాః
ప్రాంచః కవీంద్రా జగదంచితాస్తే,
గోష్ఠీనవీనాపి మహాకవీనాం
పూజ్యా గుణజ్ఞైః భువనోపకర్త్రీ."

అని ఒకకవి నవీనకవిగోష్ఠి అంటే కవిసమ్మేళనం ఆదరణీయమైనదని చెప్పాడు. "కవులు ఎన్నుకోబడని శాసనకర్త''లని ఒక ఆంగ్లకవి సూక్తి. మధురాతి మధురములైన వారి గద్యపద్యాత్మక రచనలు వాఙ్మయ ప్రభేదపరిగణనంలో కాంతా సమ్మితత్వాన్ని అలంకరించాయి. రససిద్ధులయిన కవుల యశశ్శరీరాలు అజరామరములు. సువర్ణకారుని కంకణ నిర్మాణ శిల్పరహస్యాన్ని సువర్ణకారుడే గ్రహింపగలిగినట్లు కవుల శబ్ద సౌభాగ్యాన్ని కవులయిన వారే గుర్తింప గల్గుతారు. అనంతమైన వారి ప్రతిభాజలంలో చరాచరాత్మకమైన ప్రకృతి రాజహంసిలా విహరిస్తుంది. అరసికులైన పండితమన్యులు ముక్తకంఠంగా కవిదోషాలను మాత్రమే ఉగ్గడింపగలరు గాని కవితా సౌందర్యాన్ని గుర్తింపలేరు. ఆ సౌందర్యోపాసన కవులకు, రసజ్ఞులకు మాత్రమే చెల్లుతుంది. మరందమాధురిని మధువ్రతములు గుర్తించినట్లు కావ్యమధుతత్త్వం ఎఱిగినవారు లోకంలో విరళంగా ఉంటారు. పంచమ నాద మిశ్ర చిత్రోక్తి విభూషా భూషితమైన కవివదనంలో సరస్వతి వీణావాదనం చేస్తూ విరాజిల్లుతుంది.

ఉదాత్తమైన కవిభావాన్ని వ్యక్తపరచే సామర్థ్యం అన్ని శబ్దాలకూ ఉండదు. ఆర్ద్రములైన కొన్నిటికి మాత్రమే అది ఉంటుంది. ఆర్ద్రపదాభివ్యక్తమైన కవిభావాన్ని గ్రహించి పులకితుడౌతాడు సహృదయుడు. కుసుమించిన వృక్ష సౌరభ్యాన్ని మందానిలం వెదజల్లినట్లు కవిపద్యం వ్రాస్తే సహృదయుడు దానిని ఆదరించి ప్రచారం చేస్తాడు. జన్మజరామరణ విహ్వలమై నశ్వరమైన జగత్తులో కవికీర్తి అమృతమయం కాబట్టి శాశ్వతంగా ఉండి పోతుంది. కవివాక్యామృత తీర్థ

స్నానాలుచేసి, పవిత్రత్వం పొందిన ప్రాచీన రాజాదులు వాఙ్మయాకాశంలో తారలై వెల్గుతున్నారు. కవిమండలిని ఆదరించి అజరామరమైన యశస్సును కొందఱు ఆర్జించితే ఆదరింపక కొందఱు అనామకులై మరణించారు. కవులు నిగ్రహానుగ్రహసమర్థులు. వారిచేత అనుగ్రహింపబడిన వారికి ఉత్తమయశోలాభం, అనుగ్రహింపబడని వారికి అధోగతి. ఉదాహరణంగా వేములవాడ భీమకవి ప్రభృతులను చూపవచ్చు.

"లంకాపతేః సంకుచితం యశోయత్
యత్కీర్తిపాత్రం రఘురాజ పుత్రః,
స సర్వ ఏవాదికవేః ప్రభావో
న కోపనీయాః కవయః క్షితీంద్రైః."

అన్నాడు ఒకకవి ఆదిరాజులకాలం కాబట్టి.

ఇక మనం కవి సంఘానికిచ్చే గౌరవమంతా కావ్యమహత్తను చెందినదేకాని కవి అన్న పేరును కాదు. కవి నామధారులు ఎందరో ఉన్నారు. "నరత్వం దుర్లభంలోకే, విద్యాతత్ర సుదుర్లభా, కవిత్వం దుర్లభంతత్ర శక్తిస్తత్ర సుదుర్లభా, వ్యుత్పత్తిర్దుర్లభాతత్ర, వివేకస్తత్రదుర్లభః." అన్న అగ్ని పురాణకారికలు "అస్మిన్నతి విచిత్రకవి పరంపరా వాహిని సంసారేద్విత్రాః పంచషా వా మహాకవయ ఇతిగణ్యంతే" అన్న ధ్వన్యాలోక సూక్తిని సమర్థిస్తున్నది. కవులకు శక్తి, నిపుణత. లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణం. కావ్యజ్ఞశిక్ష. అభ్యాసం అన్నీ ఉండవలసినవే. మమ్మటాచార్యుడు పేర్కొన్న శక్తినే అభినవగుప్తపాదుడు 'ప్రతిభ' అన్నాడు. దాన్నే మనం భావనాశక్తి అంటున్నాము. ఒకానొక ప్రతిభావంతుని చేత మాత్రమే కావ్యం ఉత్పన్నమౌతుందని భామహుడు అన్నాడు. ప్రతిభాహీనుడైన కవి రసత్కావ్యసృష్టిని చెయ్యలేడు. అయితే కేవలం ప్రతిభావంతుడైన మాత్రాన కవిత్వం సిద్ధించదు. కవికి ప్రతిభా పురస్కృతమైన వ్యుత్పత్తి. అభ్యాసంకూడా ఉండాలి. శాస్త్రజన్యమైన జ్ఞానాన్ని వ్యుత్పత్తి అంటున్నాం. కవికి సర్వశాస్త్రజ్ఞనమూ అవసరమతుంది. వ్యాకరణాది సామాన్య శాస్త్రజ్ఞానమైనా తప్పక ఉండాలి. అందుకనే పెద్దలు "యద్యపి బహునాధీషే తథాపి తథాపి పఠపుత్ర వ్యాకరణం" అన్నారు. శబ్దార్థ ప్రాధాన్యం కలిగిన శాస్త్రాలు కావ్యనిర్మాణంలో కవికి తోడు పడ్డాయి. కావ్యశరీరం "ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళి" అనుకున్నా, అదోష సగుణసాలంకార శబ్దార్థము లనుకున్నా తన్నిర్మాతకు ఛందోలంకార వ్యాకరణాది శాస్త్రాభ్యాసం, తజ్జన్యమైన జ్ఞానమూ అవసరమౌతాయి. అభిధా, లక్షణా, వ్యంజనా వ్యాపార పరిశోభితములైన శబ్దాల తత్త్వం యెఱుగక కావ్యం, అందులో మహాకావ్యం వ్రాయబూనుకోవడం హాస్యాస్పదమౌతుంది. కొన్ని కావ్యాలు ఘుణాక్షరన్యాయంగా సహృదయ హృదయ రంజకాలు కావచ్చు. కాని తత్కర్తలను అందులోని సారస్యం యెఱుకపడక పోవడం శోచనీయం కాదూ!

కవికి భావకల్పనంలోనూ, ఇతివృత్త నిర్మాణంలోనూ స్వాతంత్ర్యం ఉన్నది కాని నూతన శబ్దాలను సృజిస్తానంటే లోకం ఒప్పుకోదు. శబ్దాలు కవులవికావు ప్రజలవి. ప్రజలంటే గ్రామీణుల దగ్గరినుంచి పండితుల దాకా పరిగణనం చెయ్యవలసి ఉంటుంది. వీరిలో అందరికీ కాక పోయినా కొందరికైనా సుపరిచితమైన శబ్దజాలాన్నే కవి గ్రహించవలసి ఉంటుంది. సాంఘికమైన యీ శబ్దజాలం బహుకాలం నుండి వికసిల్లుతూ వస్తున్నది. ఇందులో కాలప్రభావం వల్ల కొన్ని శబ్దాలు తిరోహితాలు కావడం, కొన్ని నూతనంగా ఉద్భవించడం కూడా జరుగుతుంటుంది. అయితే అవి సంఘంలోనే పుట్టి సంఘంలోనే నశించాలి, క్రొత్తగా ఒక శబ్దాన్ని సృజించడానికి కవికి హక్కులేదు. ఇదంతా రూఢమైన శబ్దజాలం సంగతి. కవియౌగిక శబ్దసృష్టిని చెయ్యవచ్చు. కాని దానికి కూడా కొన్ని నిర్బంధాలున్నాయి. అనభిజ్ఞుడైన కవి స్వేచ్ఛగా ప్రయోగించే చ్యుతసంస్కారాది దోషదూషితమైన శబ్దజాలాన్ని రసజ్ఞపండిత లోకం ఆదరించదు. ఇతరులు అర్థం

(గ్రహింపలేక తికమక పడ్డారు. కాబట్టి శబ్దజాలం తాలూకుయావత్తు జ్ఞానమూ అంటే జాత్యాది భేదాలతో ఉన్న వాచక, లక్షక, వ్యంజకాది శబ్దాలు, రూఢములు, యౌగికములు, యౌగిక రూఢములు మొదలయినవీ, తత్సమ తద్భవ, దేశ్య, గ్రామ్యాదులూ క్షుణ్ణంగా తెలియడం జరిగితేగాని కవి తనరచనలో తాను స్వతంత్రుడు కాలేడు. కనుక కవికి శాస్త్ర జ్ఞానం అవసరం అని చెప్పే మాట అక్షరాలా సత్యం.

మహాకవిత్వం అంటే అన్నిరసాల్లోనూ, అన్ని వర్ణనల్లోనూ అకుంఠితమైన రచనాశక్తి ఉండడం. అగ్నిపురాణం "సర్గబంధో మహాకావ్యం" అని చెప్పి, "మంత్రదూత ప్రయాణాది లక్షణాలు చెప్తూ. "సర్వవృత్తి ప్రవృత్తంచ సర్వభావ ప్రభావితం, సర్వరీతిరసైః స్పృష్టం పుష్టం గుణ విభూషణైః", అత ఏవ మహాకావ్యం తత్కర్తాచ మహాకవిః" అన్నది. కాబట్టి కవికి లేదా మహాకవికి సువిశాలమైన జ్ఞానసంపద ఉండాలి. శాస్త్రజ్ఞానం అక్కర్లేదని భావించడం, ఇతరులను ప్రోత్సహించడం పనికిరాదు. అది వాఙ్మయానికీ తద్వారా ప్రజలకూ అపకారం (పూర్వనిబంధనలూ, పూర్వ జ్ఞానమూ వనికిరావని నూతనమైన సభ్యతా సంస్కృతులను నిర్మించాలనుకునే వారు సైతం నూతనశబ్ద సృష్టిని చెయ్యడం అసాధ్యం. కొంత సంస్కారం చెయ్యవచ్చునేమో కాని సరిక్రొత్త సంస్కృతినీ, సరిక్రొత్త శబ్దజాలాన్నీ సృజించడం అసంభవం కావచ్చు. భారతీయ సంస్కృతి సువిశాలమైన మహాసముద్రం వంటిది. ఇందులో ఏయితర సంస్కృతి వచ్చి చేరినాదానికి భారతీయ ముద్ర పడుతుంది. అదియిందులో లీనమై క్రొత్త శోభకు హేతువవుతుంది. అంతవరకు మాత్రమే ఇతర సంస్కృతులు దీనిని ఒత్తిడి చెయ్యగలుగుతాయి. అనంతకాలంనుంచీ అత్యంతంగా విస్తరించిన భారతీయ సంస్కృతి మొదలంట నశించడం యెన్నడూ జరుగదు. కనుక కవులు ప్రాచీన సంప్రదాయాలకూ, ప్రాచీన సంస్కృతికీ పుచ్ఛభూతంగానే తమ నూతన నిర్మాణాలు చెయ్యవలసి ఉంటుంది.)

"కవిః క్రాంతదర్శీ నానృషిఃకురుతే కావ్యం" అన్నసూక్తి కవులకు సమధిక గౌరవాన్ని యిచ్చింది. మహాతపస్వులైన ఋషులు ఆత్మసాక్షాత్కార ప్రభావం వల్ల క్రాంతదర్శులైనట్లు కవులు వాఙ్మయ తపస్సులో సిద్ధులై క్రాంతదర్శులు కావలసి ఉంటుంది. అలా ఋషిత్వం పొందిన కవులు వ్యాస వాల్మీకి కాళిదాసాదులయిన సంస్కృతకవులూ నన్నయాదులయిన ఆంధ్రకవులూను. కాంతా సమ్మితాలయిన వీరి రచనలు మృదుమధురశైలిలో లోకానికి ఉత్తమ సందేశాలను అందించాయి. వారి అడుగుజాడల్లో నడిచిన సంస్కృతాంధ్రకవు లెందరో మహాకవి స్థానాన్ని అందుకున్నారు. వారందరిలోనూ ప్రతిభాబలం, వ్యుత్పత్తి బలం నిండారి ఉన్నాయి. సంగీత విద్వాంసునికి దైనందిన సాధన వలె కవికి గూడా నిత్యాభ్యాసం, కావ్యజ్ఞ శిక్షా అవసరమౌతాయి. అభ్యాసంవల్ల ప్రతిభా వ్యుత్పత్తులు అభివృద్ధిని చెందుతాయని వామనాచార్యుడన్నాడు. సమగ్ర కవితాగుణధురంధరులైన కవులు కావ్యాలు వ్రాయడం వాటిని మనం చదివి సద్యః పరనిర్వృతిని పొంది, ఉత్తమ సందేశాలను అందుకోవడం బహుకాలం నుంచీ జరుగుతున్న విషయాలు.

"భిన్నరుచిర్హిలోకః" కనుక విభిన్నరుచులుగల కవులు అవతరించారు, దానివల్ల కావ్యసంఘాతంలోనూ మార్పువచ్చి, రసభావ ప్రధానరచనలూ, అలంకార భూయిష్ఠరచనలూ, చిత్ర ప్రబంధాలు అవతరించాయి. భరతముని రససిద్ధాంతాన్ని ఆనందవర్ధనుడుస్థిరీకరించాడు. అంటే ఇతడు వస్త్వలంకార ధ్వనులూ రసధ్వనీ వ్యంజనా వ్యాపార సముపలభ్యములని — చెప్పడమూ. అభినవగుప్తపాదుడు రసధ్వనికి ప్రాధాన్యమివ్వడమూ జరిగి కావ్యాత్మరసమే అన్న సిద్ధాంతం ప్రచారంలోకి వచ్చింది. రసపరిప్లుతరచనలకే ఆదరం లభించింది. ఆయితే ఈ విధమైన రచనలు చేయడానికి ప్రతిభాబలం పూర్ణంగా ఉండాలి. ప్రతిభాజన్యమైన వ్యంగ్యార్థము నందుకోలేని వారికోసమనండీ, తమకు ప్రతిభాబలం తక్కువగా ఉండి

అనండి కొందరు కవులు అలంకార భూయిష్ఠ చిత్ర రచనలు చేశారు. వీరిని అలంకారవాదులయిన భామ హాదుల అనుయాయులని అనడం న్యాయమనిపిస్తుంది. శబ్దార్థ చిత్రముల నెఱిగిన కవి ప్రతిభా శూన్యుడుగా ఉంటాడని అనుకోవడం పొరపాటు కావచ్చు. వారి పంథా వేరైనదని తెలుసుకోవడం సమంజసం. వ్యంగ్య రచనలకు ప్రాధాన్యం ఇచ్చి రసవత్కా వ్యాలు ఉత్తమ కక్ష్యను చెందుతాయనీ, అలంకార భూయిష్ఠరచనలు ఉత్తమేతరాలనీ ఆలంకారికులు కొందరు విభాగం చేశారు. మరొక రకంగా పరిశీ లించి అష్టకవి సప్తవిధకవులను చూపాడు. ఏ విధమైన రచనలు చేసినా కవిసామర్థ్యం పరిస్ఫు టంగా గోచరిస్తే వాటిని లోకం ఆదరిస్తుంది. అలంకార భూయిష్ఠ రచనలూ సామర్థ్యం లేనిదే కుదిరేవి కావు గనుక కవులందరూ మనకు పూజ్యులే. సర్కసుచూస్తాం, నగిషీశిల్పాలు చూస్తున్నాం, శాస్త్రీయ సంగీతంలో స్వరప్రస్తారాన్ని వింటు న్నాం, గారడీ చూస్తున్నాం. వీటన్నిటిలోనూ చమత్కారమేగాని అందుకోవలసిన సందేశం అంతగా లేదు. అసలు లేదన్నా సరిపోతుంది. అలాంటి మనకు రసాభివ్యక్తి తక్కువగా ఉన్నా ఇతర చమత్కారాలు బహుళంగా ఉన్న కావ్యా లను అభినందించడం అంతకష్టమైన పనికాదు.

రస ప్రధాన రచనలు కూడా దోషవర్జితంగా ఉండడమే వాటి ఉత్తమ స్థాయి. ఏ రకమైన కావ్యాలయినా దోషజుష్టంగా ఉండడం వాంఛ నీయం కాదు. "కావ్యం స్ఫురదలంకారం గుణ వద్దోష వర్జితం" అన్నది అగ్నిపురాణం. ఇతర లాక్షణికులు కూడా ఈ విషయంలో నొక్కి చెప్పారు. కొన్ని అపవాదస్థలాలు ఉన్నా సామ దాయికంగా దోషవర్జనం కవికి ముఖ్యకర్తవ్యం. కావ్యసందేశాన్ని అందుకోవలసిన వారు ప్రజలు, కావ్యగుణాన్ని నిర్ణయించవలసిన వారు పండితులు. కాబట్టే కాళిదాసు.

"తంసన్తః శ్రోతుమర్హంతి సదసద్వ్యక్తి హేతవః,
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌవిశుద్ధిఃశ్యామి కాపివా".

అన్నాడు. లోక శాస్త్రోభయ సమ్మతంగా వ్రాసిన వారే మహాకవులు. నన్నయ భట్టారకుడు "విశ్వశ్రేయః కావ్యం, తదదోషౌ పరిష్కృతౌచ వా గర్థౌ" అన్న సూత్రద్వయంలోఇదే అంశాన్ని స్ఫురింపజేశాడు. స్వస్థానవేష భాషలనూ ప్రజాభి రుచినీ గుర్తించి ప్రజా శ్రేయస్సుకోసం మహా భారత సంహితారచన చేశాడు. మన ఆదికవి నన్నయ. "ప్రవాహినీ దేశ్యా" అన్న సూత్రం ద్వారా మన ఆంధ్రభాషఅభివృద్ధిని చెందడానికి అవకాశ మిచ్చాడు మన వాగనుశాసనుడు. ఆయన కోరిన భాషాభివృద్ధిని తిక్కయజ్వ సహస్రసాధకంగా చేశాడు. తిక్కనకు తిక్కనయేసాటి. సజీవములయిన తెలుగు జాతీయ పదాలలో ఉన్న వ్యంజనాది వ్యాపారములను ఆయన గుర్తించినంతగా గుర్తిం చిన వారరుదు. ఆయన మార్గంలో కొందరుమాత్రం నడిచారు. మరికొందరు సంస్కృత ప్రతిబింబరచన లనే చేశారు. తెలుగు రామాయణం మొదలయినవి పేరుకుమాత్రమే అచ్చతెలుగు కబ్బాలు. వాటిలో జాతీయతకన్నా సంస్కృత ప్రతిబింబత్వమే అధి కంగా ఉంది. వర్తమాన కవులు జాతీయాంధ్ర పదరచనలను పునరుద్ధరించడం ఎంతైనా అవసరం. భాష, శబ్దార్థ చిత్రాలు, రసభావ వ్యక్తి అన్న విషయాలలో కవులకూలాక్షణికులకూ ఐకమత్యం ఉండితీరాలి. మహాకవులు లక్ష్యాలను బట్టే లాక్షణి కులు కవితామార్గాలను నిర్దేశించారు. ఇతరులకు అవి క్షుణ్ణవర్త్మలుగా ఉండి కవితా రచనకు దోహదం కల్గిస్తాయి. కవితాలతలు ప్రాకటా నికి వేసిన పందిళ్లే లాక్షణికుల సిద్ధాంతాలు. వాటిని నిరాకరించడం నేలవిడిచి సాముచేయడం వంటిది. స్పష్టములూ, సుందరములూ, అనుసరణీయములూ అయిన నూతన రచనలువస్తే వాటికి లాక్షణికులు స్వాగతంచెప్పి, తదనుకూలమైన నూతన సిద్ధాంతా లను వాఙ్మయంలో ప్రవేశపెడ్తారు. ఆ విధంగా

అభివృద్ధిని చెందినదే మన కావ్య వాఙ్మయమంతాను. మానవుని ఉద్రిక్తావస్థలో ఉదయించడం కళలకు లక్షణమైతే, సన్నిహిత వస్తుపరిశీలనం శాస్త్రాలకు లక్షణం. కనుక శాస్త్రాలు లేని కళలూ కళలు లేని శాస్త్రాలూ అభివృద్ధిని పొందజాలవు. ఆ రెండింటికీ సన్నిహితమైన బాంధవ్యం ఉంది. ఇక్కడ వర్తమాన లాక్షణిక శిరోమణులయిన వేదాల తిరువెంగళాచార్యుల వారిని స్మరించడం అప్రస్తుతం కాదనుకుంటాను. వారు కావ్యాలంకార సంగ్రహంలోనూ, ధ్వన్యాలోకలోచనంలోనూ సమకాలిక రచనలను ఉదాహరణాలనూ స్వీకరించి ఆంధ్ర సాహిత్యానికి అపూర్వమైన ఔన్నత్యాన్ని చేకూర్చినారు. ధ్వన్యాలోకంలో 'రాయప్రోలు సుబ్బారావు' సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి మొదలయినవారి రచనలను కూడా పరిగ్రహించారు. అలాంటి ఉత్తమలాక్షణికుల మన్ననలను పొందడమే కవితా రచనకు ఏకాంత శోభ. కాబట్టి నవీనంగా వచ్చే రచనలు స్ఫుటతరమైన మార్గంలో నడవడం ఎంతైనా అవసరం. అవి పద్యాత్మకంగా ఉన్నా గేయాలుగా ఉన్నా మనకు విప్రతిపత్తిలేదు. కవికంఠం ఎత్తి గేయాలు పాడ్తానంటే వినదలచుకోని అరసికులు ఇంకా మనదేశంలో పుట్టలేదు.

ఇతి వృత్తాన్ని గురించి పరామర్శించినట్లయితే సువిశాలమైన భాషా ప్రపంచలో కాంతా సమ్మితమైన కావ్యవాఙ్మయం కర్తవ్యోపదేశం కోసం ఉద్భవించింది. మహాకవులు రసాన్వితంగా కర్తవ్యోపదేశం చేశారు. కొందరుమాత్రం కేవల రసాత్మకాలూ, అలంకారాత్మకాలూ అయిన రచనలు చేశారు. వాటికి ఆనంద చమత్కారాలు మాత్రమే ఫలం. మహాకవులెవ్వరూ లోకాన్ని విస్మరించలేదు. వారికావ్యాల్లో నాటి సాంఘిక పరిస్థితులు గోచరిస్తాయి. రాజాదుల కంకితం చెయ్యడం, చంద్రోపాలంభ నాదివర్ణనలు ప్రతికావ్యంలోనూ ఉండడం, ప్రాచీనాంధ్ర కావ్యజాతంలో ఉన్న దోషాలని కొందరు ఉగ్గడిస్తారు. సాంఘిక పరిస్థితులనుబట్టి కవితా శిల్పాన్ని విమర్శించడం అన్యాయం. ఉత్తమ కావ్యాల ద్వారా రాజు చిరయశస్సును ఆర్జింపదలచి, దీనారటంకాంలలో తీర్థమాడించి, "తన చూపు సుకవి సంతానంబుమీద సంతతముమాడలవసంతములాడగా" "కవిని ఆదరించి అర్థించినప్పుడు తదాశ్రితుడైన కవికి అది అనుల్లంఘ్యంకాదూ? ఈనాడు దేశనాయకుల మీద, జిల్లాబోర్డు ప్రెసిడెంట్లమీదా! పంచరత్నాలూ, నవరత్నాలూ కవిలోకం కురిపిస్తూనే ఉన్నదికదా! అది కవిలోపంకాదు. అది సాంఘికం. సంఘాన్ని నిరాకరించిన కవి నిలువలేడు. కనుక పూర్వులు చేసిన అంకితాలు దోషజుష్టరచనలు కావని నా మనవి. అవే మన చారిత్రికులకు భిక్షపెట్టాయి. చంద్రోపాలంభ నాదివర్ణనలు అన్నిటిలోనూ ఉన్నా ప్రతిదానిలోనూ ప్రత్యేకమైన శిల్పం ఉంది, స్త్రీమూర్తిని చెక్కిన శిల్పాలు, శిల్పఖండాలు ఎన్ని లేవు? వాటిలో పౌనః పున్యదోషంలేదా? కళా మురుసూకికి పునరుక్తిదోషం పట్టదని నా వినతి.

పై రెండు విషయాలను అలావుంచి పరిశీలిస్తే ప్రాచీన కావ్యాలలోని సందేశభాగం మనకు గోచరిస్తుంది. అవన్నీ బూజుపట్టిన రచనలనీ, వాటిని చదవడం వెనక్కు నడవడమనీ భావించడం యుక్తం కాదు. విషయప్రాధాన్యం కలిగిన పురాణాలూ, ద్విపదకావ్యాలూ తత్త్వాలూ, కీర్తనలూ, శతకాలూ మొదలయిన రచనలు అనంతంగా మన వాఙ్మయంలో పాల్కురికి సోమనాథుడు, గోనబుద్ధారెడ్డి, బద్దెన, వేమనయోగి మొదలయిన దేశహితైక రచనాధురందరులు స్మరణీయులు. కథా కౌశల్యం రసప్రాధాన్యం రెండూ వెల్లివిరిసిన కళాపూర్ణోదయాలు ఉండనే ఉన్నాయి. కనుక అనంతగుణోపేతమైన ప్రాచీన కావ్యవాఙ్మయస్రష్టల ఆశీస్సులను పొందిముందుకు అడుగువేతాం.

ఇక గతశతాబ్దం చివరిభాగంనుంచీ వర్తమాన శతాబ్దంలో ఇంతవరకూ ఆంధ్ర సారస్వతంపొందిన అభివృద్ధి బహుముఖంగా ఉన్నది. సంస్కారప్రియులు, సంప్రదాయ రక్షకులూ అయిన ఉభయ రచయితలూ ఈ కాలంలో విజృంభించి రచనలు చెయ్యడం జరిగింది. దానికి తగిన కారణాలూ, సౌకర్యాలు ఈ యుగంలో లభించాయి. ఈ

కాలాన్ని సమిష్టిగా వీరేశలింగ యుగమనీ, తిరుపతి వెంకటేశ్వరయుగమనీ వ్యవహరించవచ్చు. రెండు పద్ధతులూ గంగా యమునలవలె ప్రవహిస్తూ వస్తున్నవి. జటిల పద్యరచనను సులభపరిచి తిరుపతి వెంకటకవులు ప్రచారంచేస్తే వాఙ్మయంలో కొరత పడిన అన్ని రచనలూ చేసి ప్రచారంచేశాడు. వీరేశలింగకవి. ఎవరిమార్గం వారిదే అయినా ఉభయ మార్గాలూ శాఖోపశాఖలుగా వర్ధిల్లినాయి. ఈ రెంటికీ కాస్తదూరంగా ఉన్నట్టు భాసిస్తూ శ్రీపాద కృష్ణమూర్తి కవిసార్వభౌముడూ, జనమంచి శేషాద్రిశర్మ, ఆంధ్రవాల్మీకి, వేదం వెంకటరాయ శాస్త్రి ప్రభృతులు అపారమైన వాఙ్మయాన్ని సృజించారు. చిలకమర్తి, పానుగంటి మొదలయిన ఉత్తమ రచయితలు ఒక్కొక్కరూ ఒక్కొక్క యుగంలో తయారుకాదగినన్ని పుస్తకాలు వ్రాశారు. అవ్వారి సుబ్రమణ్యశాస్త్రి, వేలూరి శివ రామశాస్త్రి, పిశుపాటి చిదంబరశాస్త్రి ప్రభృతులు గురువునుమించిన శిష్యులు. పింగళి, కాటూరి విశ్వనాథ, రాయప్రోలు, సన్నిధానం, జాషువ, దువ్వూరి ప్రభృతులయిన సుందర సుకుమార కవితా విశారదులంతా తిరుపతి వెంకటేశ్వర యుగోద్యానంలోని గులాబీ మొక్కలే.

ఈ విధంగా అభివృద్ధిచెందిన కవిబృందంవల్ల ఉభయమార్గాలలలోనూ వైశిత్యం ఏర్పడింది. విశ్వనాథ సత్యనారాయణగారు వివధరంగాలలో ప్రతిభను చాటితే గడియారం వెంకటేశశాస్త్రి ఒక్క శివభారతంతోనే రసజ్ఞలో కొన్ని యేలడం జరిగింది. రాజశేఖర శతావధాని తిక్కన ఫక్కీలో రాణాప్రతాప చరిత్రను రచించడం జరిగితే, తిక్కన్న పోతనామాత్యుడూ ఒక్కమనిషిగా పుట్టి వ్రాసినట్లుంది శివభారతం. ఈ విధమైన ఉత్తమ వాఙ్మయాన్ని ఎంతగానో నేటి కవులు మనకు అందిచారు.

సాహితీ సమితి, నవ్య సాహిత్య పరిషత్తు (వీటికి ఆట్టేభేదంలేదనుకోండి) మొదలయిన వాటివల్ల భావకవిత్వం లేదా నవ్యాంధ్ర కవిత్వం ప్రచారంలోకి వచ్చింది. దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతులు ఈ సందర్భంలో స్మరణీయులు. అద్వైత వేదాంత ప్రచారానికి ఆదిశంకరులు ఎంతవారో, నవ్యాంధ్ర సాహిత్య స్థాపనకు శివశంకర స్వాములవారు అంతవారు. పద్యనాటికలు వీరి ప్రత్యేక రచనలు.

వీరి ప్రభావమువల్ల భావప్రధాన రచనలు సాగిపోవడం జరుగుతున్నది. గిడుగువారు వారి వ్యావహారిక వాదాన్ని, నవ్యసాహిత్య పరిషత్తు భావప్రదాన వాదాన్ని జీర్ణించుకొన్న ఉత్తమ జానపదగేయకవి నండూరి వెంకటసుబ్బారావు. ఈయన రచించిన ఎంకిపాటలు ఆంధ్రజాతి ఉన్నంతకాలమూ నిలుస్తాయి. వీటిలో సజీవమైన భాష, ఉత్తమమైన వ్యంగ్యమూ వెల్లివిరిశాయి.

ఈ శతాబ్దంలో స్వాతంత్ర్యవాంఛ, ఉద్యమ సంసిద్ధత రేకెత్తడం మూలాన దేశభక్తి గేయాలు ఎన్నో వచ్చాయి. “దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్” ఏదేశమేగినా ఎందు కాలిడినా పొగడరానీ తల్లి భూమి భారతినీ” అన్న గీతాలు ఎవరిచేత వ్రాయబడ్డాయో, ఎంతగా ప్రచారం పొందాయో మీకు తెలుసు. ఇలా పర్యాలోకనంచేసే వర్తమానయుగంలో మహాకావ్యాలు, ఖండ కావ్యాలు, గేయాలు, జానపద గీతాలు, వచన రచనలు, నవలలు, నాటకాలు, ఆంధ్రీకరణాలు, కథలు, కథానికలు ఇంకా ఎన్నో ఎన్నో రచనలు విశేషంగా వ్రాయబడి, విరివిగా ప్రచారం పొందుతున్నాయని మనకు తెలుస్తుంది. ఇది ఆంధ్ర వాఙ్మయానికి అభ్యున్నతి కాలం.

సాముదాయిక దేశభక్తి చరితార్థమవుతూ ఉండగా ఉండగా పీడిత ప్రజానీకంవైపు దృష్టిని మళ్ళించి స్వార్థపరులను నలగద్రొక్కడానికి జగన్నాథుని రథ చక్రాలు వస్తున్నాయని గర్జనం చేశాడు శ్రీరంగం శ్రీనివాసరావు. ఆనందంకంటే కర్తవ్యోపదేశమే కవిత్వానికి లక్ష్యమనీ, జాతిని వీర్యవంతం చెయ్యాలనీ సిద్ధాంతీకరించుకొని రచలు వ్రాసేవారికి శ్రీ శ్రీ మూలపురుషుడు.

( ప్రక్కపుటలో )

# చిన్న కథ



## శ్రీ పాలగుమ్మి పద్మరాజు



కథాశిల్పములోను, సంవిధానములోను ఒకొక్క ప్రాంతానికి ఒకొక్క ప్రత్యేక లక్షణము ఉంటుంది భాషావైచిత్రిలోను పాత్రచిత్రణలోను ఆలక్షణము వ్యక్తమవుతూ ఉంటుంది. కథానికలలో ప్రతిబింబించేది, ఎక్కువభాగము రచయిత చుట్టూ ఉన్న భౌతికవాతావరణము, మానవసమాజమున్నూ. ఈరెంటినీ ఒకొక్క రచయిత ఎల్లా దర్శిస్తాడో, ఎల్లా చిత్రిస్తాడో వాటిమీదనే అతనిప్రతిభ ఆధారపడివుంటుంది. రచయిత తను నివసించే సమాజానికీన్నీ, విశాలమయిన ప్రాతిపదికమయిన మానవప్రకృతికీన్నీ ఒక సమన్వయము తన రచనద్వారా ప్రదర్శించి తీరుతాడు. హైదరాబాదులోని వ్యక్తులు వ్యవస్థలు మాకు విజాతీయముగా ఉండవచ్చు. ఇక్కడ హాస్యాస్పదముగా కనిపించేవి, మాకు బరువుగా తోచవచ్చు కాని వ్యక్తికి అడుగున ప్రవహించే ఒక సనాతనమయిన సార్వజనీన మయిన జీవము ఆ వ్యక్తిలో ఆ వ్యవస్థలో మనకు చూపించగలిగిననాడు రచయిత ఒక పరమార్థాన్ని సాధించాడన్నమాట. ప్రతిభావంతులైన రచయితలు అన్ని ప్రాంతాలలోనూ ఉంటారు. వారిద్వారా వారివారి, ప్రత్యేకమానవసమాజాం గూడా మనకు దగ్గరిగా, ఆప్తముగా అవుతాయి అటువంటి కథకులు హైదరాబాదులో ఉన్నారని నాకు తెలుసును. వారి వైశిష్ట్యాన్నిగురించి వినడానికీ వారికృషిని గురించి తెలుసుకోడానికీ నేను చాలా కుతూహలపడుతున్నాను.

---

( 115-వ పుట తరువాయి )

ఈయన రచనల్లో అనంతమైన ప్రతిభ. చురుకైన శబ్దజాలం ముమ్మరంగా ఉన్నాయి. ఈ తెగకు చెందిన కవిత్వం ఇతర భాషల్లోనూ వస్తున్నది. హిందీ కవులులోనూ ఇలాంటి వారున్నారు.

ఈ విధంగా మన కవులు వివిధ మార్గాలలో రచనలు సాగిస్తున్నారు. ఇంచుమించుగా ప్రతి ఒక్కరి అభిరుచికీ అనుకూలమైన రచనలు ఈ నాడు లభిస్తాయి.

ఓం స్వస్తి.

—కవిసమ్మేళనం అధ్యక్ష ప్రసంగం నుంచి

కథారచన ఈనాడు అన్ని సాహిత్యాలలోనూ గూడా ఒక ప్రముఖస్థానాన్ని సంపాదించుకుంది ఫ్రెంచి రష్యన్ సాహిత్యాలలో చిన్నకథకు చాలా పెద్ద చరిత్రవుంది. అయినా ఈనాడు చాలా సాహిత్యాలలో మొదటిస్థానము నాటకానికీ రెండో స్థానము కథానికదిన్నీ, తెలుగుసాహిత్యములో మట్టుకు ఈయుగములో కొంతకాలము భావకవిత్వానికి ప్రథమస్థానము. ఇప్పుడు మాత్రముకథానికదే ప్రథమస్థానము. కథానికచరిత్ర తెలుగులో చాలా చిన్నదయినా, అతిత్వరగా కథానికకు ఒక స్వరూపము ఏర్పడడము, ఏసాహిత్యముతో పోల్చి చూచినా తూగగల బలాన్ని సంపాదించడము జరిగింది. చెప్పుకోదగ్గకథలను వ్రాసిన వారిని తెలుగు దేశములో ఒక ఇరవయి మందినయినా, పేర్కొనవచ్చును. కథానిక నేటిసాహిత్యములో అద్వితీయమయిన స్థానాన్ని సంపాదించుకుంది.

ప్రపంచము మొత్తమునీద పద్యరచన పలచబడింది; వచన రచన బలపడింది. పద్యాన్ని సాధ్యమయినంతవరకు వచనానికి దగ్గరగా తీసుకరావడము జరిగింది. పద్యానికి మొన్న మొన్నటివరకు ఆకారాన్ని నిర్ణయించిన ఛందస్సు అనుప్రాసాది శబ్దాలంకారముగా తొలిగి పోతున్నాయి. పాశ్చాత్య సాహిత్యాలలో వచన పద్యాలుగూడా ప్రచారములోకి వచ్చాయి ఈ మార్పు ఈ యుగలక్షణములా కనపడుతోంది. దీనికికారణాలు అనేకము. ఒకటి ప్రధానముగా విద్యాధికుల హృదయాలలో వైజ్ఞానిక శాస్త్రాల ఒత్తిడి. అధునిక విజ్ఞానము తర్కప్రధానమయినది. పద్యరచనకు బలాన్నిచ్చేది ఉద్వేగపూరితమయినభావన. నేటి కవి, కోకిల కంఠములో ఉన్నతీపినీ పువ్వులోని సుగంధాన్నీ, వెన్నెలలోని చల్లదనాన్నీ కూడా శాస్త్రీయముగా నిరూపించాలి. కేవలము హృదయానుభూతిగా చిత్రిస్తే అతనికి సంతృప్తిగా ఉండదు. ఆనందాన్ని ఆనందముగానే దర్శించే అమాయకత్వము అతనికి పోయింది. అందుచేత ప్రతీ ఉద్వేగములోకీకూడా తర్కము ప్రవేశిస్తోంది. ఈమార్పే కవిత్వములో రకరకాల ఉద్యమాలకు కారణమయింది. Neo classicism, Surrealism వగైరా కవితారీతులనీ హృదయానుభూతినీ మనస్సుయొక్క కొలబద్దతో కొలవడానికి ప్రయత్నాలు. వీటిలో కొన్ని విచిత్రముగా ఉంటాయి: కొన్ని వికటముగా ఉంటాయి. అయితే హృదయానికి చెప్పుకోవలసిన అవసరముఉంది. అది చెప్పుకోడానికి ఒక పరిభాష కావాలి. తెలుగుదేశములో ఈనాటికి కథానిక ఆపరిభాష అయింది. అందమయినభావనకూ అదే, అతిక్లిష్టమైన సమాజనియమాలను నిరూపించడానికీ అదే అపురూపమయిన కవిత్వాన్నీ. అతిలోకమయిన భావాలనూ, తాత్విక సూత్రాలనూ, మనశ్శాస్త్రమర్మాలనూ, చిన్నకథలో మనము చెప్పగలుగుతున్నాము.

చిన్నకథకు ఈనాడు ఉన్న ప్రజాదరణము, ఇంక ఏ సాహిత్య శాఖకూలేదు. సాహిత్యములో చిన్నకథయొక్క ప్రాముఖ్యాన్ని ఈ ఒక్కవిషయమే నిరూపిస్తుంది.

ఇంక ఏ సాహిత్య శాఖకూలేని వినియోగవైశాల్యముకూడా చిన్న కథకువుంది చక్కని కావ్యాన్ని కథగా చెప్పొచ్చు, ఒక చిన్న భావనను కథలో రూపించవచ్చు. గాఢమయిన తాత్విక విషయాన్నీ, అతి సామాన్యమయిన నీతిని, గంభీరమైన సత్యాన్నీ, కేవలము ఒకపాత్రను, ఒక అందమయిన దృశ్యాన్నీ, ఒక చిన్న అనురాగాన్ని, లేక ఒక స్పర్ధను, ఏది ఇతివృత్తముగాతీసుకున్నాను అది కథలో ఇముడుతుంది. విషయాన్నిబట్టి భాష,రచనా విధానము మారుతుంది. కథయొక్క ఆకృతి మొత్తము మీద చాలా మెత్తనిది. రచయిత తనకు అవసరమయిన ఆకారానికి దాన్నిమార్చుకోగలడు అయినా చిన్నకథ చిన్నకథే. ఎన్నిరకాలకథలు ప్రచారములో ఉన్నా అన్నిటికీ సామాన్యలక్షణాలు మళ్ళీ ఉన్నాయి.

చిన్నకథ చిన్నదిగా ఉండాలి అని ఒక ఆంగ్ల విమర్శకుడు చమత్కరించాడు అందులో నిజము కూడా చాలా ఉంది. అయితే ఇన్ని పేజీలలో ఇమిడితే చిన్నకథ దాటితే పెద్దకథ అనిచెప్పలేము

ఈచిన్న తనాన్ని నిర్ణయించడానికి ఒకటేమార్గము. కథయొక్క చివరివాక్యము చదివేసరికి కథఎక్కడ మొదలు పెట్టిందో చటుకుని జ్ఞాపకము రావాలి ఈలక్షణము పేజీలు ఎక్కువ తక్కువలతో ఎట్టి నిమిత్తము లేనిది. కేవలము కథాశిల్పముమీద ఆధారపడివుండేదని ఎంతదూరము పోయినా, ఎన్నిదేశాలుతిరిగినా, కథ ప్రతీ అంగములోనూ సూటిగా మనది ప్రత్యక్షమయ్యేది ఏదోవుండాలి అది కథ అంతటా అల్లుకు పోయివుండాలి. ప్రతివాక్యము, ప్రతిభావము ఒక పల్లికలోకి ఇమడాలి. కథాశిల్పానికి మనము లక్ష్యాలుగా పెట్టుకో దగ్గకథలు, ఇతరసాహిత్యాలలో ఎన్నో ఉన్నాయి. ఎందరో గొప్పకథకులున్నారు. ఏ క్రొత్త కథకుడయినా తన ప్రత్యేక ప్రతిభకు అనువయిన కథాస్వరూపాన్ని సృష్టించుకునే ముందు గొప్పకథలుగా పేరన్నికగన్నవాటిని చదవడము, వాటిలోని శిల్పాన్ని జీర్ణించుకోవడము అవసరము. చెహోవ్ అనే రష్యన్ కథకుడు గోర్కీకి ఇచ్చినసలహా కథకులందరూ అనుక్షణము జ్ఞాపకము ఉంచుకోవడము మంచిది. వెన్నెలలో ఒక వనాన్ని నువ్వు వర్ణించదలుచుకున్నప్పుడు ఇటు వెన్నెలనీ, ఆకాశాన్ని ఇటు భూమినీ, వనములో ఉన్న వేరువేరువృక్షాలనూ వర్ణించడము అవసరము. ఆవెన్నెల వనముమీద పడుతుంది. అక్కడక్కడ కొన్ని ఆకులమీద పువ్వులమీదపడి మెరుస్తుంది. ఆ మెరసే చోట్లు నువ్వుచిత్రిస్తేచాలు, అప్పుడునువ్వు వనాన్ని వర్ణించినట్టూ వెన్నెలనూ వర్ణించినట్టే, ఈ రెండుకాని ఇంకోవిషయాన్నికూడా నువ్వు చిత్రిస్తున్నావు. అది ఆవనానికీ ఆ వెన్నెలకూగల ఒక ఆంతరంగిక సంబంధము. అదే నీకు అసలు కావలసినదికూడా అన్నాడు. నేనుకూడా కథకుడినిగనుక ఆ ఉత్సాహములో నేను కథాశిల్పాన్నిగురించి చెప్పినందుకు మీరు నన్నుమన్నించాలి. కథకులయిన వారందరికీ వారి వారి తరహాలనుబట్టి ఆ శిల్పము నిర్ణయము అయి పోయే వుంటుంది. నిజముగా నేను చెప్పదగినదీ, మీరు నేర్చుకోదగినదీ ఏదీ లేదు.

ఒకవిషయమయి నాకు ఎంతో సంతోషముగా వుంది. తక్కిన రాష్ట్ర ప్రభుత్వాల లాగకాక హైదరాబాదుప్రభుత్వము కథానికలకు ఒకపోటీ పెట్టి ఉత్తమ కథకులను బహూకరించి సాహిత్యానికి అపారమయిన ప్రోత్సాహాన్ని కల్పించారు. అదే గాక ఈ వార్షికోత్సవాలలో తాముసంపూర్ణముగా సహకరించి చేయూతనిచ్చారు. ప్రభుత్వము సంస్కృతి విషయమయిన తనిధర్మాన్ని. ఇంత భాగాళిముగా నిర్వర్తించడము మాకందరికి ఎంతో సంతోషముగావుంది. ఇంతకంటె పెద్దవీ, ప్రజాస్వామ్యప్రభుత్వాలు చిరకాలంనుంచి నడుపుతున్నవీ అయిన ఇతరరాష్ట్రాలలో ప్రభుత్వాలు ఈమాత్రము సహాయము సాహిత్యానికి చెయ్యక పోవడము శోచనీయము. ఈ విషయములో హైదరాబాదు ప్రభుత్వము తక్కిన రాష్ట్ర ప్రభుత్వాలకు మార్గదర్శకమయినదని నేను గట్టిగా చెప్పగలను. ఈ సందర్భములో కేవలము నాకు సంబంధించిన ఒక్క విషయాన్ని చెపుతాను. సదస్యులు మన్నిస్తారని తలుస్తాను. మొన్న హైదరాబాదు కథలపోటీలో రెండోబహుమానము పొందిన పాలగుమ్మి రామారావు మా ఆఖరుతమ్ముడు. అతనికి ఈరచనావ్యాసంగము ఉందన్న సంగతి నాకు మొన్నమొన్నటి వరకూ తెలియదు. అయితే మా అన్నదమ్ముల ప్రత్యేకత ఒకటిమాత్రము కనబడుతోంది. నాకు భాగతకథకులలో రెండోస్థానము లభించింది. మా తమ్ముడికి మళ్ళీ హైదరాబాదు కథకులలో రెండోస్థానము. పాల గుమ్మి వారికీ రెండవస్థానానికీ కొంత అవినాభావము ఉందేమోననిపిస్తుంది.

ఇంకను ఆంధ్రరాష్ట్రము కొద్దికాలములో నిర్మాణము కాబోతోంది. ఉత్తరసర్కారుల ప్రజలమయిన మాకు మమ్మల్ని పరిపాలించుకోగలశక్తి ఉందా అని ఒక అనుమానము అప్పుడప్పుడు కలుగుతుంటుంది. అయితే తమిళ పరిపాలనలో ఉండడానికి మాకు ఇష్టములేదు. అది న్యాయముకూడాను అందుచేత నాకేమనిపిస్తుందంటే హైదరాబాదులోని తెలుగుజిల్లాలు తొందరలో విడిపోయి ఆంధ్రరాష్ట్ర

( ప్రక్కపుటలో )

# కథాసాహిత్యము



## శ్రీ ఇల్లిందల సరస్వతీదేవి



మానవుడి సాహిత్య పరిచయము కథతో ప్రారంభమవుతున్నది. మాటలు వచ్చీరాని బిడ్డకు కథయందుగల సహజకుతూహలమే ఈవిషయాన్ని ధృవపరుస్తున్నది. ప్రతిదేశములోను ప్రతిభాషలోను ఏదో ఒకరూపమున కథలు ప్రచారములో ఉంటూనే ఉన్నాయి.

ప్రాచీనకాలములో కూడా ఆంధ్రభాషలో పండితులు పద్యములలో కథలను చెప్పుకొంటే పామరులు పాడిమాటలలో చెప్పుకొని ఆనందించేవారు. ఆకాలములో శంకరుడు ఉమాదేవికి చెప్పినవీ-మునులు శిష్యులకు చెప్పినవీ నారదుడు ప్రచారము చేసినవీ అనేకవిధములైన కథలు ప్రచారములో ఉండేవి. ఏవిషయముగాని కథారూపమున బోధించినట్లయితే సులభగ్రాహ్యమని చాలాకాలము క్రిందటనే గ్రహించబడినది. మూర్ఖులైన రాజకుమారులకు ప్రపం

---

( 118-వ పుట తరువాయి )

ములో జేరితే ముఖ్యపటణముగా సికింద్రాబాదు ఏర్పరచుకుని హైదరాబాదు ఆంధ్రుల చేతికి పరిపాలన అప్పగించి సుఖముగా మేము మళ్లీ మావ్యక్తి విభేదాలతో కాలము గడపవచ్చుననిపిస్తుంది ఆ ముహూర్తము త్వరలోనే రాగలదని ఆశిస్తున్నాను

ఇంతవరకు ఉత్తరసర్కారులలో అన్ని సాహిత్య శాఖలకూ ప్రాతినిధ్యము వహించ గలిగిన సంస్థ ఏదీలేదు. హైదరాబాదులో ఉన్న మాసంస్థకు మొత్తము తెలుగు భాషకు ప్రాతినిధ్యము వహించ గలశక్తి ఉన్నది. ప్రస్తుతము రాష్ట్రాలు వేరయినా భాషోద్యమము మట్టుకు ఏకముఖముగాచేసి, మా సంస్థలో మమ్ము లందరినీ చేర్చుకుని మా సంస్థను తెలుగుజాతికంతకీ ఏకైకసంస్థగా చెయ్యమనీ, ఉత్తర సర్కారులలోని రచయితలప్రతిభను, మాకార్య దీక్షను జతపరచి సాహిత్యోద్యమానికి జీవము సంపాదించమనీ నేను మిమ్మల్ని కోరుతున్నాను. కేంద్రప్రభుత్వము **Indian Academy of Arts and Letters.''** సాపించబోతున్నారు ఆసందర్భములో తెలుగుకంతకీ ఒక కేంద్రసంస్థ ఉండడము మంచిది. మాసంస్థప్రభుత్వము తలపెట్టిన అకాడమి ఆశయములను చాలాబాగుగ ఆచరణలో పెడుతున్నది. అందుచేత మాసంస్థ అన్నివిధాలా మాకందరికీ పాతినిధ్యము వహించలగదు.''

(ప్రారంభోపన్యాసంనుంచి)

చక్షానము గరపుటకుగాను పంచతంత్రము ఉద్భవించినది. కాశ్మీరదేశపు రాణియైన సూర్యమతీదేవి వినోదార్థము బృహత్కథ ఆధారముతో కథాసరిత్సాగరము రచింపబడినది.

మనసాహిత్యములో చిన్నకథ క్రొత్తవస్తువు కాదు. ఆఖ్యాయిక-కథ-ఖండకథ-పరికథ-కథానిక అని గద్యకావ్యము ఐదువిధములుగా విభజన చేయబడినది. కథావస్తువునుబట్టి దివ్యకథ-దివ్యమానుషకథ అనే విభాగముకూడా అగ్నిపురాణములో స్పష్టముగా వివరింపబడి ఉన్నదని సాహిత్య వేత్తలు చెప్పుతున్నారు.

తెలుగుభాషలోని పద్యకావ్యాలలో అవాంతర కథలుగా చిన్నకథలు అనేకముగా ఉన్నాయి. శుకసప్తతి-హంసవింశతి-విక్రమార్కచరిత్ర మొదలైనవి మనకు సంస్కృతమునుండి దిగుమతి అయినవి. వ్రతకథలు-పాటకథలు మొదలైనవి మాత్రమే కాక 19వ శతాబ్దపు గుజరీపుస్తకాలలో కాశీమజిలీకథలు బేతాళ పంచవింశతి కథలు రామలింగనికథలు ఇత్యాదులు అనేకముగా ఉన్నాయి. ఇవి ఒక్కొక వ్యక్తిని ఆశ్రయించిన పద్ధతిలో నడచిన కథామాలలు.

అయితే ఆ కాలపుకథారచయితలయొక్క దృక్పథము వేరుగా కనబడుతుంది. మానవుల చరిత్రలు దుఃఖభూయిష్ఠములని సుఖమయములైన దివ్యుల చరిత్రలనే కథలలో చిత్రించేవారు. వాటిలో వైచిత్రికి ఎక్కువ అవకాశములేదని కథాసరిత్సాగరములో కవిదివ్యమానుషకథలను వర్ణించినాడు. అంచేత సంభావ్యశ్రేణికి చెందినవీ-చెందనివీ కథలు కథాసరిత్సాగరములో కలసినవి.

ఆధునిక భావములో కథాస్వరూపము ఆంధ్రభాషలో 20వ శతాబ్దములో ఏర్పడినది. నవ్యాంధ్ర సాహిత్యోద్యమము ప్రారంభమైన తరువాతనే ఇది కూడా ప్రచారములోకి వచ్చినది.

ఆంగ్లభాషాధ్యసనమువల్లను దాని ఒత్తిడివల్లను ఆంధ్రులలో కొంత చైతన్యము కలిగినది. తత్కారణముగా ఆంధ్రసాహిత్యానికి అఖండమైన మెలకువ వచ్చినది. ఈ మెలకువలో ఉత్పన్నమైనది నవ్యసాహిత్యము ఈ ఉద్యమము 19వ శతాబ్దపు మధ్యకాలములో బయలుదేరినది. ఆంగ్లభాషలోని చిన్నకథలను పునరుద్ధరించవలెనన్న ఉత్సాహము కలిగినది. దాదాపు 1912లో హిందీభాషలో ఆధునిక కథ పుట్టిన కాలములోనే ఆంధ్రములోకూడా కథాసాహిత్యము తిరిగి ఉద్ధరించబడినది.

ఆంగ్లములో Shortstory అనే సాహిత్య విభాగానికి సరిగా చిన్న కథఅనీ-కథానిక అనీ మనవారు వ్యవహరింప బూనుకున్నారు. కథ సుఖాంతమైనదిగాని హాస్యరసపూరితమైనదిగాని కరుణాత్మకమైనదిగాని పావుగంటనుండి 50 నిముషములలో చదువగలుగునట్లుగా ఉండాలి. హృదయమును కదలించి ప్రశాంతము చేయగలుగునట్లుగా రచింపబడిన కథానిక రమ్యముగా ఉంటుందని H. G. wells అభిప్రాయపడినాడు. మనము ఏవిధముగా చిన్న వస్తువులను భూతద్దముద్వారా స్పష్టముగా పెద్దదిగా చూడగలుగుతున్నామో అవిధముగానే ఒక నిశ్చితమైన ఎత్తుగడసహాయముతో సామాన్య దృష్టికి అందనివిషయాలను చక్కగా గమనించగలుగుతాము. కనుక కథకు ఎత్తుగడ ముఖ్యాంగమనీ కథావస్తువు ఎవరూ గమనించనిదిగా ఉండవలెననీ కల్పనాకథలలో ఇదే ముఖ్యమనీ సామర్ సెట్ మామ్ అభిప్రాయపడినాడు. పొందికగా సులభశైలిలో పఠితలను భయసంభ్రమాశ్చర్యాలలో ముంచే విచిత్ర సంఘటనలతో కథాగర్భమున హృదయాన్ని కరగించగల సన్నివేశాలతో పాఠకులు ఊహించని క్రొత్తమలుపులతో విచిత్రముగా కథ ముగియవలెనన్నారు మనవారు.

చిన్నకథ అంటే పెద్దకథనుగాని నవలనుగాని చిన్నదిగాచేసి వ్రాసినదికాదు. ఇది ఒక ప్రత్యేక రచనా విధానము కలది చిన్నఆకుపైన నిలచిన హిమబంధువు దాని పరిమితికి తగినట్లుగా ప్రకృతిని అద్దమువలె ప్రతిబింబింపచేసినట్లుగా చిన్నకథ దాని సరిహద్దులలో రచయిత దృక్పథముతో ఒక సంఘటనద్వారా కథను పూర్తిగా తెలుపగలుగుతుంది. కథానికలో సంఘటన ఒక్కటే ఉంటుంది. సంఘ

టనకు ముఖ్యముగా సంబంధించినపాత్రలే ఉండాలి. సంఘటనకు సంబంధించిన వాతావరణము కల్పింపబడాలి. రచయిత చెప్పదలచిన విషయము ధ్వనిమాత్రముగా సూచ్యార్థకముగా ఉండవలెనేగాని వాచకముగా ఉండగాదు. స్వగతాలు ఉపన్యాసాలు చిన్న కథలో నిషేధాలు. చిన్నకథ సుదూరముగా సాగిపోకూడదు కనుక కథాంశము, సన్నివేశము నిశితముగా కళ్లకుకట్టినట్టుగా చిత్రింపబడటము అవసరము. జాగ్రత్తలో తక్కువమాటలలో ఎక్కువ అర్థమును ఇవ్వగలశబ్దజాలమును వాడగల నైపుణ్యము కథారచయితకు చాలా ముఖ్యము. కావ్యభాష వల్లనూ కవిత్వపు చెక్కడముల వల్లను కథకు జీవకళ చెదరిపోతుంది. భావమును వ్యక్తపరచుటలోను తీర్చిదిద్దుటలోను కథానికారచన పద్యకవిత్వానికి చేరువలో ఉంటుంది. కథారచయితకూ చిత్రకారునికి ఎక్కువ వ్యత్యాసములేదు. చిత్రకారుడు తనకుంచెను రంగులలో ముంచి రమణీయమైన చిత్రమును చిత్రించినట్లే కథాసన్నివేశములను సంఘటనలను భావస్ఫోరకముగా ఆకర్షణీయముగా మనోజ్ఞముగా చక్కగా కుదింపబడిన పదజాలములతో నవరసములను ఒలికిస్తూ రచయిత చిన్నకథను రచిస్తాడు. ప్రకృతి ప్రతిబింబించిన చిత్రము సర్వజనానందకరమైనట్లే ప్రకృతి ప్రతిబింబించిన చిన్నకథ ఆకర్షణీయముగా ఉంటుంది. కథలోని భావము పూసలోని దారమువలె అంతర్వాహినిగా ప్రవహించాలి లేని పక్షమున తీర్థము తీర్థముగాను ప్రసాదము ప్రసాదముగాను ఉండిపోతాయి.

నిశ్చలముగా ఉన్న సరస్సులో ఒక రాయిని విసరివేసినట్లయితే దానితాకిడివలన నీటిలో అలల రూపమున సంచలనము ప్రారంభమవుతుంది. ఆవిధంగానే ఉత్తమ కథానిక పాఠకుని హృదయములో ప్రవేశించి భావసంచలనమును కలిగించుతుంది. హృదయమును వికసింపచేస్తుంది. మాయని ముద్రలను వేస్తుంది కథాశిల్పముకంటె కథాప్రయోజనము ముఖ్యమైనది కనుక కథావస్తువు ఉదాత్తమైనదిగా ఉండవలెననీ రచయిత ఔచిత్యమును పాటించవలెననీ మనవారు చాలమంది అభిప్రాయపడ్డారు.

ఈలక్షణాలతో ఆంగ్లసాహిత్య సంపర్కమువల్ల కలిగిన చైతన్యముతో ఆకాలములో సాహితీసమితి సభ్యులుకొందరు కథానికలను రచించటము ప్రారంభించారు. ఆంధ్రభారతి త్రిలింగ సాహితీ పత్రికలలో కథానికలు ప్రచురింపబడుతూ ఉండేవి. ఆంధ్రభాషలో మొదటికథా రచయితగా గురజాడ అప్పారావుగారు పేరు పొందారు.

కథానికా రచన గ్రాంధిక శైలిలో చేసినట్లయితే అస్వాభావికముగా ఉంటుందికనుకను మనము సంభాషించినట్లే సామాన్యమైన వాడుకభాషలోనే కథారచనసాగితే రమ్యముగాను స్వాభావికముగాను ఉంటుందని నిర్ణయించుకొని చాలామంది వాడుకభాషలోనే వ్రాస్తూవచ్చారు. గ్రాంధికభాషలో రసవంతమైన కథలను రచించినవారుకూడా ఉన్నారు శ్రీ వేలూరి శివరామశాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగార్లు అప్పటినుండీ యిప్పటివరకూ గ్రాంధిక శైలిలోనే కథానికలను రచిస్తున్నారు.

ఆకాలమున ఉత్తమ కథారచయితలుగాపేరు పొందినవారు శ్రీయుతులు చింతాదీక్షితులు మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యము నరసింహారావు విశ్వనాథ సత్యనారాయణ అడవి బాపిరాజు నోరినసింహశాస్త్రి, శివశంకరశాస్త్రిగారలూ ఇంకా ఇతరులూ ముఖ్యులు. వీరిలో చింతాదీక్షితులుగారికి కథాచక్రవర్తి అను బిరుదుకూడా వచ్చింది. క్రమాగతముగా కథారచయితలు అసంఖ్యాకముగా బయలుదేరినారు. ఈరోజులలో కనీసము నాలుగు కథలైనా లేని పత్రికకు ప్రచారములేదు. కొన్నిపత్రికలు కేవలము కథలకొరకే ప్రత్యేకింపబడ్డాయి.

కథారచనా విధానము రచయితల సంస్కారాన్నిబట్టే, అభిరుచినిబట్టె సాగిపోతున్నది. ఆర్య సంప్రదాయానుసారముగా మంగళాంతమైనవే విశ్వశ్రేయస్కరములని కొందరు ఎంతకష్టపడియైనా సుఖాంతముగా కథలను ముగిస్తున్నారు. విదేశీ సంప్రదాయమైనప్పటికీ హృదయములో చిరకాలము నిలిచేశక్తి విషాదాంతకథలలో ఉన్నదని కొందరు ఆవిధముగానే రచిస్తున్నారు. కథను కొందరు

హాస్యముతోను, కొందరు ఆకలితోను కొందరు, ప్రేమతోను నింపుతున్నారు. కథను కొందరు ఆది నుండి అంతమువరకూ స్వగతముతోనే నడిపిస్తున్నారు. కొందరు పాత్రలచేత ఒక్కొక్క అధ్యాయమును చెప్పించి ముగిస్తున్నారు కథను. రసవత్తరమైన ఘట్టములలో ఎత్తుకొని పూర్వాపరాలను క్రమముగా వివరిస్తూ ముగిస్తారు కొందరు. ఈపంథాలో అరితేరిన కథారచయితలలో కుటుంబరావుగారు ముఖ్యులు; తక్కువ మాటలలో ఎక్కువ వ్యంగ్యము నీయగల శబ్దజాలమును వాడగలరు. కథనంతా సంభాషణల రూపములో నడపగలవారు కొందరు; వారిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అగ్రగణ్యులు. కథలో కొన్ని భాగములను చుక్కలతో నింపి పాఠకుని మెదడునుకూడా పరీక్షచేసే రచయితలు కొందరున్నారు; వీరిలో శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి, వెంపటి నాగభూషణముగారలు ఉన్నారు.

కథలు అనేకరకాలుగా ఉంటున్నాయి. వాటిలో తగినంత వైవిధ్యముకూడా కనబడుతున్నది. నీతిబోధాత్మకమైనవి-మానవుని ఆంతరంగిక ప్రవృత్తులను సత్యము, శివము సుందరమనే దివ్యస్థితిలో లయము చేయాలన్న సంకల్పము కొందరికి. జాతీయ జీవనములోని పవిత్రమాధుర్యము, ఐక్యత యుగయుగాల నుండీ వస్తూఉన్న ఆధ్యాత్మిక వాతావరణము ఆర్య సంప్రదాయాలను కథలలో చిత్రించటము కొందరి అభీష్టము. ఈ మార్గమున నడచినవారిలో విశ్వనాథ సత్యనారాయణ శివశంకరశాస్త్రి చింతాదీక్షితులు గారలు ముఖ్యులు.

ప్రచారోద్దేశక కథలు:___ కాలప్రవాహములో పడి కొట్టుకొనిపోయే సంఘము అనేకమైన మార్పులకు గురిఅవుతుంది. సంఘము సర్వాంగసౌష్టవముగా ఉంటేనేగాని జాతికి బలములేదు. సంఘములో ఒకకాలానికి సంస్కరణగా ఉపకరించినవి మరొక కాలములో జాతీయపురోభివృద్ధికి అవరోధకమవుతాయి. సంఘము అనేక అరిష్టాలకు గురిఅవుతుంది. పాశ్చాత్యనాగరికతవల్ల పురుషులలో అతి నాగరికత విద్యలేమినే స్త్రీలలో అనాగరికత ఇవి పరస్పర విరుద్ధభావాలై గృహజీవితములో అశాంతికరమైన పరిస్థితులను పుట్టించినవి. అప్పటి సాంఘిక పరిస్థితే కథలలో ఆనాడు ప్రతిబింబించినది. వితంతు వివాహాలను గురించి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనేక కథలను వ్రాశారు. 'అరికాళ్లక్రింద మంటలు' అనే కథ ఆనాటి బాలవితంతువుయొక్క చక్కని చిత్రణ. వారి కథావస్తువులో వైవిధ్యములేదు. రసవంతమైన శైలి, చమత్కారమైన సంభాషణ, చక్కని కథాసంవిధానముతో వారికథలు మణులవలె ఉంటాయని పేరువచ్చింది. జాతీయోద్యమాన్ని గురించి శ్రీ చింతా దీక్షితులుగారుకూడా హృదయంగమమైన రచనలను చేశారు. సూరీ సీతీ వెంకీ వారికథలలో సజీవపాత్రలై నిరంతరమూ బిడ్డలను ఆకర్షించుతూ ఉంటాయి. వీరి వటీరావు ఒక అపూర్వమైనసృష్టి. అది అవిస్మరణీయమైన పాత్ర. పట్టణాలలోని యువతులయిన కొందరికి వటీరావు అక్కవలె కనిపిస్తుంది, దీక్షితులుగారికి విశ్వనాథ వారికి రియలిజములో ఐడియలిజమును చూపగలరను పేరు వచ్చినది.

౨. సాంసారిక కథలు:___ ఆశ్రమము లన్నిటిలో గృహస్థాశ్రమము ఉత్తమమైన దనిపించుకొన్నది. గృహస్థుడు సమస్తధర్మములను పోషించగలడు, వ్యక్తితానుసుఖియైనగాని సంఘాన్ని సుఖింపచేయ లేడు. సంసారసౌఖ్యము ధనముతో లభించేదికాదు. దంపతుల సమైక్యభావనలతో అనురాగరసముతో, సాంసారిక లౌకికసమస్యలను ఛేదించుకుంటూ సకల జనానందకరముగా జీవించటమే వాంఛనీయము. జీవన మొకకళ. సంసారములోని ఆనందరసాస్వాదనమును ఆకర్షణీయముగా, చమత్కారముగా వర్ణించి, సంసారములో స్వర్గమును చూపించగల చతురుడు మునిమాణిక్యము నరసింహారావుగారు. వీరి కాంతము కథలు ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధములైనాయి. కాంతము నిండుహృదయముతో, అందాల నడకలతో, హాస్యరసము వెదజల్లుతూ కథలో ప్రవేశిస్తుంది. వేయిమంది పిల్లలను అదుపులోపెట్టుకొన్న ఆంధ్రరమణి. ఈధోరణిలో కథలను వ్రాసిన వారు పూడిపెద్ది వెంకటరమణయ్య, టేకుమళ్ల కామేశ్వరరావుగారలు. మొక్కపాటి నరసింహశాస్త్రి

గారు, హాస్యరచయితగా పేరుపొందారు. వీరి కథలలో శిల్పిద్వయము, భిక్షువు ప్రసిద్ధములైనవి.

సెక్సు కథలు:— సంఘముపెట్టిన కట్టుబాట్ల వలన మానవనైజములో సహజమైన కామప్రవృత్తి అణచబడి ఉంటున్నది. వ్యక్తులకు సంఘపు కట్టుబాట్లు నిర్బంధకాలనీ, అనారోగ్యకరములనీ మానవ పురోభివృద్ధికి హానికరములనీ, మానవుడు స్వేచ్ఛలోనే ప్రకాశించగలడనీ కథలద్వారా ప్రచారము చేసిన మొదటి ఆంధ్రరచయిత శ్రీ గుడిపాటి వెంకటచలముగారు. భావనాచాతుర్యము, రసవంతమైన శైలి క్రొత్తపోకడలు ఈయన సొత్తు. అయితే ఈయన రచనలన్నీ మొ. పా. సా. రచనలకు ప్రతిచిత్రాలనే పేరువచ్చింది. తరువాత ఏమనుకున్నా ఆయన రచనలను ఆమూలాగ్రముగా చదవకుండా ఏపాఠకుడూ విడిచిపెట్టడు. ప్రారంభములో ఈయన కథలను ప్రకటించడానికి పత్రికలు సమ్మతించేవికావు. క్రమముగా సెక్సుధోరణి చాలామందిని ఆకర్షించింది. రచయితలు చాలామంది గుడిపాటివారిని భావనా గురువుగా భావించారు. సెక్సు మెరుగులేని కథలు రసవంతముకాదన్న అభిప్రాయము ప్రజలలోకూడా కలిగినది. ఈ కథలవల్లనే చాలా పత్రికలకు ప్రచారము అధికమైనది. ఈ ధోరణిలో రచించినవారు బుచ్చిబాబు, ధనికొండ మొదలైనవారున్నారు; కుటుంబరావుగారు, శ్రీనివాసశిరోమణిగారుకూడా కొన్ని రచించారు. వీరిలో స్త్రీలుకూడా ఒకరిద్దరు ఉన్నారు; రచయితల నామములలోని నిజానిజములు బైటికి తెలియలేదు.

గ్రామీణజీవితము:— సామాన్య మానవసమాజములో ఔన్నత్యములేకుండా మేధాసంపత్తిగల వర్గము దూరదూరముగా ఉండటము ప్రతిదేశములోనూ కనబడుతున్నది. విద్యావంతులకూ విద్యాహీనులకూ గల కృత్రిమవ్యత్యాసము దేశమునకు అరిష్టసూచకము. అగ్రజాతివారు పుట్టుకతో అన్నిహక్కులూ సహజముగా తమకున్నాయని భావించుతూవుంటారు. నిమ్నజాతివారు ఏవిధమైన హక్కులూ లేనివారు. ఊరిబైట పూరిగుడిసెలలో జీవితాలుగడుపుతూ ఉంటాయి. వారి సంతతికి విద్యలేదు, మానసికాభివృద్ధిలేదు, వారికి సంఘములో తావులేదు. భారత జాతీయజీవనరంగంలో మహాత్ముడు పురోగామి అయినదాదిగా జాతీయతాతృష్ణ దేశమంతటా వ్యాపించి సర్వమానవ సౌభ్రాతృత్వము ప్రచారములోనికి వచ్చినది. పెట్టుబడిదారులకు కూలీలకుగల వ్యత్యాసము వారి అహంకారము వీరి దైన్యము. వారి ఉపేక్ష వీరి అవసరము. మనకు నిత్యమూ సంఘములో ఎదురయ్యే సంఘటనలు. రెక్కాడినా డొక్కాడని దీనదశ నేటి కూలివానిది. సంఘములోని వాస్తవికితను కథలలో చిత్రించినవారు కరుణకుమార్, మాధవపెద్ది, గోపీచంద్, చక్రపాణి, కవికొండల మొదలైనవారు ముఖ్యులు.

మన స్తత్వము - బిహేవియరిజము:— మానవ స్వభావము సుగుణాలప్రోవుకాదు, అచంచలితమైనదీకాదు. వివిధప్రవృత్తులుగలది. మానవుడు ఒకక్షణములో ధీరునివలెను, మరుక్షణములోనే అధీరునిగను ప్రవర్తించుట సహజము. మానవస్వభావము నదీప్రవాహమువంటిది. నది ఒకప్పుడు ఉరవడిగాను, ఒకప్పుడు మందముగాను, ఒకప్పుడు నిర్మలముగాను, మరొకప్పుడు బురదలుగాను, ప్రవహించుతుంది. ఒక్కొక్కసమయములో పొంగిపొరలి గ్రామాలను తుడిచిపెట్టే అవకాశముకూడా ఉన్నది. ఇది జరిగిన మరునాడు శాంతించి, తిరిగి మెల్లగా ప్రవహించగలదు, మానవుడి ప్రవర్తనకూడా ఇంతే. మానవస్వభావములో అగోచరముగాఉన్న గుణాలు సామాజిక జీవితములో సభ్యతకొరకు అణచిపెట్టబడి ఉంటాయి. అప్పుడప్పుడు కొన్నిసమయాలలో స్వభావములోని నిజస్వరూపము నాగరికతతోను, సభ్యతతోను నిర్మించుకున్న సరిహద్దులమీద తిరుగుబాటుచేసి బయటపడుతుంది. దీనిని కథలలో నిరూపించినవారు కుటుంబరావుగారు, తాతా కృష్ణమూర్తిగారు.

అనువాదాలు:— ఇతరభాషలలోని ఉత్తమ కథానికలను అనువదించి భాషాసేవచేసినవారు కొందరున్నారు. హిందీ, ఆంగ్లము, కన్నడ, బెంగాలీ భాషలనుండి అనువాదాలు జరిగినవి. వారిలో మాడపాటి హనుమంతరావుగారొకరు. వీరు స్వతంత్ర

కథానికలనుకూడ రచించారు. గుమ్మడిదల దుర్గాబాయమ్మ, చక్రపాణి, నెల్లూరి కేశవస్వామి, వేమూరి ఆంజనేయశర్మ, వెంకోబాచారి మొదలైనవారు కూడా సేవచేశారు.

కథారచనలో సిద్ధహస్తులైనవారు చాలామంది ఉన్నారు. కొందరు స్త్రీలుకూడా ఉన్నారు. పేర్లు వివరిస్తూపోతే ఉపన్యాసం దీర్ఘమవుతుంది. తెలంగాణాలోకూడా కథారచయితలసంఖ్య అభివృద్ధికరముగానే ఉన్నది.

ఈవిధముగా అనేక దృక్పథాలతో, కథాసాహిత్యము జీవనదివలె ఒడ్డులొరుసుకుంటూ సాగిపోతున్నది.

ఆంధ్ర వాఙ్మయములో కథాసాహిత్యములో అన్నిశాఖలకంటె కృషి బాగాజరిగినది. ఇతరభాషలలోని కథాసాహిత్యాలకు ఏమాత్రము తీసిపోదని ప్రపంచ కథానికలపోటీలో పద్మరాజుగారికథ చాటినది. దీనితరువాత మనవారందరికీ కథాసాహిత్యముపైన ఆదరము హెచ్చింది. చిన్నకథ వ్రాయటము ఎంతసులభమో, మంచికథ వ్రాయటముకూడా అంతకష్టమే. కథానికలలో ఏది ఉత్తమమైనదని నిర్ణయము చేయటముకూడా కష్టమే. ఒకరిదృష్టిలో 'చాలాబాగాఉన్న' కథ, మరొకరి దృష్టిలో 'బాగానే' ఉన్నట్లుండి, ఇంకొకరి దృష్టిలో 'ఏమీ బాగా ఉండదు'. నిర్ణయముకూడా వ్యక్తుల సంస్కారాన్నిబట్టి భిన్నిసుంది. కథానిక మంచిచెడ్డలను నిర్ణయించటానికి మూడు విషయాలను చూడవలసి ఉంటుంది.

కథానికకు ముఖ్యమైన అంగాలు భావము, శైలి, శిల్పము. ఈ మూడింటిలో ముఖ్యమైనది భావము. ఈభావము ఉదాత్తమైనదా, వాస్తవికతకు చేరినదా, దేశకాలపాత్రలకు సంబంధిచినదా, విశ్వజనీనమైనదా, దీనిలో ఔచిత్యమును పాటించవలెనా అనే విషయాలు వివాదాత్మకమైనవి. కొంతమంది కథకు ప్రయోజనమున్నదంటున్నారు. కథ జీవితచిత్రణమా లేక ఫోటోగ్రాఫా అనే ఒక వాదన ఉన్నది. చిత్రమే అయినట్లయితే చిత్రకారుడు తన దృక్పథములో చిత్రమును చిత్రిస్తాడు. ఫోటోగ్రాఫ్అంటే ఉన్నది ఉన్నట్లుగా చూపటము. సమస్యను పరిష్కారము చేయటము రచయిత పని కాదు. సమస్యను ఎత్తిచూపటమే రచయితపని అని కొందరి అభిప్రాయము. కథ ఫోటోగ్రాఫ్ అయినట్లయితే శిల్పానికి ఎక్కువ అవకాశములేదు. భావము కూడా ఇతరులకు చెప్పతగని అంశాలు అంటూ ఉండవు.

ఈనాటి ప్రజల అభిరుచులు మారినవి. పురాణనీతులను వల్లించే పాత్రలను లెక్కపెట్టరు. వ్యక్తుల మధ్య సంఘాలమధ్య దేశాలమధ్య సంఘర్షణప్రాతదైపోయింది. కథలో చిత్రింపబడిన భావము వాని ప్రయోజనము పాఠకుడికి అవసరములేదు. ఆభావము కలిగిన మనస్సుయొక్క తత్త్వవిచారము పాఠకుడికి ముఖ్యము. ఇప్పటి పత్రికలలో వచ్చే ప్రకటనలను గమనించినట్లయితే ఈనాటి తత్త్వము బాగా అర్థమవుతుంది.

"ఈక్రొత్త రకపు దుస్తులు మీదేహానికి అందాన్నిస్తాయి. సమాజములో మీకున్న గౌరవము వీటివల్ల అధికమవుతుంది"

"గృహిణులకొక తాజావార్త డాల్డానేతితో పాకరుచులను వృద్ధిచేసి కోల్పోయిన భర్తప్రేమను తిరిగి పొందండి"

"ఈకారుకొంటే మీకీర్తిప్రతిష్ఠలు వృద్ధిపొందుతాయి సమాజపుదృష్టిలో మీరే ప్రథములుగా ఉంటారు."

దీనినిబట్టి ఏవ్యక్తిగాని తన దృష్ట్యా తగినంత ప్రయోజనములేనిదీ ఏపనిచేయటానికీ అంగీకరించడని తెలుస్తున్నది. ఈగాలి అమెరికానుంచి అన్నిదేశములకు వీచుతున్నది. ప్రస్తుతసమాజపుదృష్టి మానవుడి ప్రవర్తనలోని వైవిధ్యము వైచిత్ర్యము వైపుకు మళ్లినదని తెలుస్తున్నది.

శైలి భావమును వ్యక్తీకరించునది శైలి. ఆయా భావాలకు తగినట్లుగా రసవంతముగా ఉండటము అవసరము. శైలిలో జీవశక్తి ఆకర్షింప తగినది.

(ప్రక్కపుటలో)

# పెద్దల చదువు



## శ్రీ పాతూరి నాగభూషణం



విద్యావిషయంలో ఈడు ముదిరిన వారిది నేడొక పెద్ద సమస్యగా వుంది, చిన్నతనాన బడులలో చెప్పకునే పాఠాలే చదువనుకొంటే ఈ సమస్యకింత ప్రాధాన్యత ఉండేది కాదు. విశ్వవిద్యాలయములో పట్టభద్రులైన పండితులకూ పల్లెటూరి బడిలో ప్రైమరి వరకు చదువుకున్న విద్యార్థులకూ తమ జీవిత పర్యంతమూ అనేక విషయాలు తెలుసుకుంటూ, మానసికంగా నిత్యమూ అభివృద్ధి పొందుతూ వుంటేనే జీవితం ఉత్సాహంగా గడుస్తుంది. పుస్తకాలు, పత్రికల వగైరా సాధనల ద్వారా తమకు కావలసిన విషయాలను స్వయంగా తెలుసుకొనడానికి కొంతఅర్హత గడించిన అక్షరాస్యుల కుండే అవకాశం నిరక్షరుల కుండదుగాన, వీరు క్రొత్త సంగతులు తెలుసుకొనడానికి ఇతరులపై ఆధారపడవలసి వస్తుంది, జీవితమంతా పరాధీనంగా బతకడం సుఖంకాదు, వాంఛనీయ మంతకంటె కాదు, కనుక నరజన్మమెత్తిన ప్రతివారు సౌఖ్యంగాను, మర్యాదగాను జీవించాలంటే కనీసమైన వ్రాత చదువులు, లోక వ్యవహారానికి కావలసిన సామాన్య గణితం, సంఘంలో సత్పౌరుడుగా కాలంగడపడానికవసరమైన విజ్ఞానం తెలుసుకుని

---

(126-వ పుట తరువాయి)

కథానికకు కావ్యభాష గ్రాంధికభాష బాగుండవు కాని శబ్దస్వరూపమును కూనీ చేయటము పేలవముగా వ్రాయటము మెచ్చుకో తగినది కాదు.

శిల్పము:- కథానికకు శిల్పముకూడా గమనింప తగినదే. ఆకర్షణీయముగా రసవంతమైన ఘట్టములో కథను ప్రారంభించడము విషయాన్ని సమయానుకూలముగా చదువరికి పరిచయము చేయుటముకొన్ని చోట్ల కథను సూచించి వదలిపెట్టటము శిల్పము క్రిందికే వస్తాయి. చక్కగా చెక్కినట్లుగా కథానికను వ్రాయటానికి మంచి నైపుణ్యము కావాలి. పైలక్షణాలన్నీ పాకశాస్త్రమువంటివి. పాకశాస్త్ర గ్రంథముదగ్గర పెట్టుకొని వంటచేసినవారికి అరుచులు అనుభవైకవేద్యములు వీటిని అర్థము చేసికొని ఉపయోగించుకోవలసి ఉంటుంది.

వుండద మవసరం, కనుకనే నిరక్షరాస్యులసంఖ్యాకంగా వున్న మన భూమిలో అక్షరాస్యతా వ్యాప్తిని గూర్చి విశేష కృషిని మనము పూనవలసి వచ్చినది, వయోజన విద్యా వ్యాప్తికై మన మొనర్చు కార్యక్రమంలో నిరక్షరాస్యతా నిర్మూలన యిందువలననే ముఖ్యమైన పనిగా యేర్పడింది కాని యిదొక్కటే వయోజన విద్యయని మనమెంత మాత్రమును తలంచరాదు,

తెలియనివారికి వ్రాతచదువులు నేర్పడమో, ప్రజలలో జాతీయతను ప్రోత్సాహించడమో, వృత్తి విద్యను చెప్పడమో — దేనికది వయోజన విద్యయని చెప్పుటకు వీలులేదు, ఇవన్నీ చేరినా వయోజన విద్య నిర్వచనము పూర్తికాదు, ప్రతి వ్యక్తియు తన వృత్తికి తోడుగ స్వబుద్ధితో పట్టుదలగ సాగించు జ్ఞాన సంపాదనము, బడిచదువు ముగిసిన తమపరిణామించు జ్ఞాన సముపార్జనా ప్రయత్నములు వయోజన విద్యయొక్క అంతర్భాగములుగ అమెరికను లంగీకరించుచున్నారు, స్త్రీలుగాని, పురుషులుగాని తమ జ్ఞాన పిపాసను తీర్చుకొను నిమిత్తమును, ప్రపంచ పౌరులుగా సంఘములో తమ విధులను క్రమముగా నెరవేర్చుట కవసరమైన సమగ్రతను గడించు కొనుటకును, తమకుగల సహజశక్తులను వికసింప జేసుకొనుటకును చేయునటి సకల ప్రయత్నములు చేరి వయోజన విద్యయగునని బ్రిటను నందలి వయోజన విద్యాసంఘమువారు నిర్వచించియున్నారు. వ్రాత చదువులు నేర్పడముతో పాటు సాంఘిక రాజకీయ విజ్ఞానాన్ని కలిగించడం, సంఘ విధానములో, ప్రభుత్వాదర్శమును గూర్చి బోధించడం వయోజన విద్యకు ముఖ్యాంగమని అమెరికన్ విద్యావేత్త యొకరు సెలవిచ్చినారు, వయోజన విద్య యన్నప్పుడు అక్షరాస్యతా ప్రచారమునకే ప్రాముఖ్య ముండుటను గమనించి ఇండియా ప్రభుత్వమువారీ పేరును సహితము మార్చి సమాజ విద్యయని దీనికి నామకరణం చేసినారు. క్రొత్తగా అక్షరాస్యులైనవారి కుపయోగించే వాఙ్మయం మనకు చాలాతక్కువగానేవున్నది. దీని విషయంలో మొదటగా కృషిచేసిన గౌరవం క్రైస్తవ సమాజమువారికి దక్కినది. మత సంబంధమైన వివిధ రచనలతోపాటు ఆరోగ్య, సాంఘిక, విద్యా సంబంధములగు చిరుపొత్తములను పదులకొలదిగా ప్రకటించి ప్రచారం చేసినవారు క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ మదరాసుశాఖవారు. మన కైవారు చాల స్వల్ప ధరలను నిర్ణయించినారు. ఈ సందర్భంలో హైదరాబాదు రాజ్యంలో జరిగిన పనికి సంబంధించిన వివరాలు నా కెరుకలేదు. మదరాసు ప్రభుత్వంవారు కొంతకాలం క్రిందట కర్తలకు ఏబదేసి రూపాయల చొప్పున బహుమతు లిచ్చిన పుస్తకాలు పదకొండింటిని వారి సహాయంతో దక్షిణ భారత వయోజన విద్యా సహకార ప్రచురణసమితి మదరాసువారు ప్రకటించినారు. వెంకట్రామా అండు కో., విజయవాడవారు కూడా యీనడుమ నూతనముగ అక్షరాస్యులైన వారికొరకు వివిధ విషయములపై దాదాపు 16 చిరుపొత్తములు ప్రకటించినారు. శ్రీ మాగంటి బాపినీడుగారి ఆధ్వర్యాన సాగుచున్న జాతీయ జ్ఞాన మందిరము-మదరాసు పక్షాన విజ్ఞాన సంబంధంగా 3 పుస్తకాలు వెలువడినవి. పూజ్యులు ప్రతాపరెడ్డిగారు 'యువజన విజ్ఞానము' అను పేరుతో కొంతకాలము క్రిందట బృహద్గ్రంథమును ప్రచురించినారు. ఇందులో జన సామాన్యానికి తెలియదగిన అంశములు చాల గలవు. ఈ రీతిగా కొన్ని ప్రయత్నాలు వచ్చుట ప్రారంభమైనవి. కాని యిప్పటికీ శాఖలో వెలువడిన వాఙ్మయం బహు స్వల్పం. శీఘ్రగతిని ప్రజల అభిరుచులను, అంతస్థులను, అవసరాలను సరిపోవు పుస్తకాలను విరివిగా ప్రచురించి ప్రచారంలోనికి తెచ్చుటకైన వయోజన విద్యా వ్యాప్తి ఆదర్శంగాగల ప్రజాసంస్థలు గట్టిగా కృషిచేయవలెను. ఈప్రయత్నానికి ప్రజలు, ప్రభుత్వము పూర్తిగా తోడ్పడవలెను. ఆంగ్లములోను, హిందీ మరాఠీ, కన్నడం వగైరా యితరభాషలలోగల వయోజన వాఙ్మయాన్ని పరిశీలించి అనువదవానిని అవసరమైన మార్పులతో మన భాషలోనికి మార్చుకోవలెను. ప్రజలలో ప్రచారం నిమిత్తం ప్రభుత్వశాఖలు ప్రచు

( ప్రక్కపుటలో )

# వయోజనులకు విద్య



## శ్రీ పర్సా వెంకటేశ్వరరావు



ఏదేనొక దేశసౌభాగ్యము, ఆదేశప్రజల విద్యాసంపదపైనాధారపడియుండును అవిద్య, దారిద్ర్యము, ఒకదాని నొకటిపెనవేసుకొని యుండును. విత్తుముందా, చెట్టుముందా, అన్న సామెతప్రకారము అవిద్యవల్ల దారిద్ర్యము దారిద్ర్యమువల్ల అవిద్య ఉత్పన్నమగుచున్నవి. దరిద్రునికి ప్రొద్దున లేచినది మొదలు పొట్టతిప్పలేగాని. విద్య నేర్వవలయునన్న ఆసక్తి యుండదు. జీవనభృతి సంపాదించుటకు విద్యముఖ్య సాధనముగావున ఆసక్తి లేకున్నను, పొట్టకూటికై కోటివిద్యలు నేర్వవలసియుండును. కావున అవిద్యాదారిద్ర్యముల పారద్రోలుటలో విద్యావ్యాప్తి ముందు ఆవశ్యకము.

---

(128-వ పుట తరువాయి)

రించు కరపత్రములు, చిరుపొత్తములుగాగల ప్రచురణ లన్నింటిని నూతనంగా అక్షరాస్యులైన వారికందుబాటులో నుండునట్లుమార్పించి ప్రకటించినచో చాల ప్రయోజనముండును.

వయోజన వాఙ్మయంలోనికి జమవచ్చేవి పుస్తకాలు, పత్రికలు, కరపత్రాలుమాత్రమే కాదు. కంటితో జూడడానికి చెవితో వినడానికి అవకాశమిచ్చే విజ్ఞానదాయకమైన పరికరాలన్నీ వయోజన వాఙ్మయ విభాగములే. నేటి మన విద్యావిధానంలో దీనికి చాల ప్రాధాన్యమేర్పడినది. వయోజనవిద్యాప్రణాళికలో వీనిస్థానం చాలముఖ్యమైనది, కనుక పఠనాపరికరాలతోపాటు సినెమటోగ్రాఫు, మ్యాజికులాంతరు, రేడియో, గ్రామఫోను వగైరా పరికరాలను, సైన్సు పరికరాలను, దేశపటములను చార్టులను వయోజనవిద్యా ప్రచారసంస్థలు సమకూర్చుకొని వీనిని తరచు ఉపయోగించుచుండుటవసరము.

పైపరికరాల సేకరణ, వినియోగములు గ్రంథాలయ కార్యక్రమములక్రిందికి వచ్చును. కనుక ఒక్కొక్క వయోజన విద్యామందిరము గ్రంథాలయమొకదానిని నెలకొల్పినదుపవలెను. ప్రజలను అక్షరాస్యులుగా చేయుట వయోజన విద్యావ్యాప్తికి మొదటిమెట్టుగ చెప్పుకున్నాము. వారిని విద్యావంతులను చేయుటకు సాయపడు మొదటిసాధనము గ్రంథాలయము. దీనిద్వారా స్వయంశక్తితో ప్రతియొక్కరూ జీవితకాలమంతా విద్యాసముపార్జనము చేయవచ్చును.

(ప్రారంభోపన్యాసమునుంచి)

హైద్రాబాదు రాష్ట్రములో నూటికి ముగ్గురు స్త్రీలు, పదిహేనుమంది పురుషులు మాత్రము వ్రాయను చదువను నేర్చినవారని 1951 సంవత్సరపు జనసంఖ్య గణనమువల్ల తేలినది. సామాన్యముగ మాతృభాషలో సంతకము పెట్టగలిగిన వారందరిని చేర్చికొనినచో పై సంఖ్యలు తేలినవి. ఇందులో గ్రంథపఠనము చేయ గలిగినవారు సగముకంటె తక్కువగానుండగలరు. అనగా వెయ్యింట 15 మంది స్త్రీలు, వెయ్యింట 75 మంది పురుషులను మాత్రమే మనమునిక్కచ్చిగా సామాన్య విద్యావంతులని చెప్పవచ్చును. మిగతా వారంతా విద్యాగంధవిహీనులని, పశు సమానులని చెప్పవలసియుండును. మన దేశదౌర్భాగ్యము, మనప్రజలశోచనీయావస్థ పైసంఖ్యావివరణములో దర్పణము వలె కాన్పించుచున్నది.

మనదేశప్రజలు ఆర్థికముగ వృద్ధిలోనికి రావలయునన్న నేటి పారిశ్రామిక యుగములో సాంకేతిక విద్యఅత్యంతావసరము. మన ప్రజలు ప్రాథమిక విద్యలో నిష్ణాతులైనగదా సాంకేతిక విద్యనేర్వజాలుట. ఉట్టికి ఎగరలేనమ్మ స్వర్గానికి ఎగరజూచినట్లు ప్రాథమిక భాషాపరిజ్ఞానము లేనిదే, సాంకేతిక విద్యగాని ఉన్నత విద్యగాని అలభ్యము. కావునమనదేశములో బాలురు వృద్ధులు, స్త్రీలు, పురుషులు యెల్లరు ప్రాథమిక భాషా పరిజ్ఞానము సంపాదించవలెను. 14సంవత్సరములలోపు బాలబాలికలు పగటిపూట నడుపబడు పాఠశాలలో విద్యనభ్యసించుటశ్రేయస్కరము. అచ్చట వారికి విద్యతోపాటు క్రమశిక్షణగూడ యలవడగలదు. కాని 14 సంవత్సరములకు పైవయస్సుగల బాలబాలికలు, వయోజనుల శ్రేణిలోనికి వత్తురు. చిన్న పిల్లలవలె పాఠశాలకు శ్రేణిలోనికి వెళ్లుటకు వారికి సిగ్గు, అభిమానము. పెద్ద వయస్సు వచ్చి చిన్న తరగతి చదువుతున్నావని యెవరైన యాక్షేపింతురేమోయని బిడియము. ఇట్టివారు పాఠశాలకు వెళ్లుటకు జంకి విద్యాభ్యాసమునే మానుకొందురు. కావున రాత్రి పాఠశాలలో వీరికి విద్యగరపవలసియుండును. మన దేశములో దారిద్ర్యవశాత్తున (14) సంవత్సరలోపు బాల బాలికలు సహితము పొట్టకూటికై పనులు చేయుచుందురుగావున, వారికి విద్య నేర్పుటకు రాత్రి సమయము తప్ప వేరొక అవకాశము లేదు. ఇట్టి పిన్న వయస్కులు, రాత్రి పాఠశాలలోచేరి. వయోజనుల పంచన చదువు నేర్చుకొనుటమననిత్యానుభవముతో చూచుచున్నాము.

వయోజనులకు విద్యనేర్పు పద్ధతిలో, పూర్తివర్ణమాల నేర్పకమునుపే, నేర్పిన కొద్ది అక్షరములను, కూడ బలుకుకొని, పదములను వాక్యములను చదువుటకు ప్రాధాన్యమివ్వబడినది. (56) అక్షరములలో కూడిన వర్ణమాల నేర్చుకొనుటకు, వలసినంత మనసు నిలకడ, వారి కుండదను మన సత్వసూత్రముపై, యీ పద్ధతి ఆధారపడియున్నది. బాలురకు అట్లుగాక, ముందు (56) అక్షరముల నేర్పి, తరువాత, వత్తులు, హల్లుల గుణింతము నేర్పుట సంప్రదాయము. సంయుక్తాక్షరముల పద

ములు, మూడక్షర పదములు, నాల్గక్షర పదములు, సరళ వాక్యములు, సామెతలు క్రమముగా నేర్పబడును. ఇట్టి క్రమ శిక్షణ ప్రకారము నేర్చిన విద్యార్థులు, చెప్పిన పద్యములు వ్రాయుట, శతకమును, భాగవతమునందలి సుప్రసిద్ధ ఘట్టములను, రుక్మిణీకల్యాణము, గజేంద్ర మోక్షము, శ్రీరామచరిత్ర, ప్రహ్లాదచరిత్ర వంటి వాటిని ధారాళముగ చదువగలుగుచున్నారు. పై క్రమ శిక్షణ వేదివిద్యార్థులు చిలుక పలుకులవలె చెప్పిన పుస్తకము మాత్రమే చదువ గలుగుచున్నారు. నేటి వయోజన విద్యావిధానములో గూడ నిదే లోపముగలదని నా యభిప్రాయము. గుణితము లేని తెలుగు చదువు, వానాకాలపు చదువుగానున్నదని, విశేష అనుభవముతో కూడ చెప్పగలుగుచున్నాను. వయోజన విద్యావిధానములో కృషి చేయు ఇతర కార్యకర్తలుగూడ నాయనుభవమును బలపరుచుచున్నారు. కావున వయోజనుల బోధనా గ్రంథములలో (56) అక్షరముల వర్ణమాల,వత్తులు, గుణింతము, సంయుక్తాక్షరములు, సులభపదములు,సరళ వాక్యములు, క్రమముగా చేర్చవలెనని నా సూచన. ప్రస్తుతము వాడబడుచున్న వయోజన బోధనాపటములు, అసమగ్రములని నా యభిప్రాయము. వర్ణమాలను సుబోధ మొనర్చుటకు పటముల తప్పక నుపయోగింపవలెను. గాని వర్ణమాలను వదిలివేసి, కేవల సులభ పదముల మున్ముందు బోధించుటకు యేర్పడిన పటములువయోజనునికి భాషను సులభముగా బోధపరుచుటకు బదులుగా, పదజాలముతో విభ్రమము కలుగజేయుచున్నవి. ఆధునిక పద్ధతితో నేర్చిన వయోజనుడు యేనాటికిని మహా భారతమువంటి గ్రంథము చదువ జాలకున్నాడు కావున గుణింతముతో గూడిన గ్రంథములను వయోజనుల బోధన నిమిత్తము, రచింపించవలెను.

రాత్రి పాఠశాలలను నడుపుటలోగల కొన్ని సాధక బాధకములుగూడ వివరింతును. ఉపాధ్యాయులు, ఉచితముగా తమకు విద్యనేర్పవలెనని, దీపముఖర్చు, పుస్తకములు పలకలు, బలపములఖర్చు గూడ, ఉపాధ్యాయులే భరించవలయునని వయోజన విద్యార్థుల కోరికగా యున్నది. సాధారణముగ గ్రామములోనున్న ఉపాధ్యాయులుగూడ బీదవారగనుక, ఉచితముగా యెంతకాలమని బోధచేయగలరు. వారు ప్రతిఫలము గోరుట సహజము గదా! వేతనములేని ఉపాధ్యాయులు, ఒకటిరెండు నెలలు ఉత్సాహముతో చదువుజెప్పినను తరువాత క్రమేణ వారి ఉత్సాహము చల్లారి, రాత్రి పాఠశాలలు మూసివేయ బడుచున్నవి. అదేవిధముగ దీపములకు నూనె ఖర్చులేక, పుస్తకములు లేక, రాత్రి పాఠశాలలు మూలబడుచున్నవి. వయోజనులు కనీసము నెలకొక రూపాయి ఉపాధ్యాయునికి వేతనముక్రింద ఖర్చులక్రింద సమర్పించనియెడల, వయోజన విద్యావిధానము జయప్రదము కాజాలదు. కొత్తగూడెం, బెల్లంపల్లి బొగ్గుగనుల కార్మిక సంక్షేమనిధినుంచి, ధనసహాయము

లభించినట్లుగా, ఇతరత్రా, తగినంత ధన సహాయము లభించనిచో, రాత్రి పాఠశాలలు సంతృప్తికరముగా నడువజాలవు. లేదా వయోజనులే నెలకొక రూపాయి తమవిద్యకొరకై వ్యయము చేయవలెను. డబ్బిచ్చి చదువుకొను ఉత్సాహము ప్రజలలో కలిగించుట చాలముఖ్యము. అవుసరముగూడాను.

వయోజన విద్యాబోధనచేయు ఉపాధ్యాయునకు శిక్షణనిచ్చుట, సాంఘిక సేవాసక్తులకు ఉపాధ్యాయులగా తరిబీయతు ఇచ్చుట చాలా అవుసరము. కొన్ని వేలసంఖ్యలో ఉపాధ్యాయులు లభించిన గాని, వయోజన విద్యావ్యాప్తి తృప్తికరముగా జరుగదు. ఒక్కొక్క కార్యకర్తకు నెలరోజుల శిక్షణనిచ్చుటకు రు 75-0-0 సుమారు భోజన ఖర్చులతోసహా వ్యయమగును. భోజనముబెట్టి, రాకపోకల ఖర్చుల భరించిననేగాని కార్యకర్తలు ఉత్సాహముతో వయోజన విద్యాశిక్షణ శిబిరములలోజేరరు. ఈ మధ్యనే, నల్లగొండ జిల్లాలో భోజనవసతి సౌకర్యముల నేర్పరిచి నూటయేబదిమందికి పైగా కార్యకర్తలకు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారి అధ్వర్యమున శిక్షణ ఇవ్వబడినది. ఇచ్చుట శిక్షణపొందిన కార్యకర్తలు మారుమూలల గ్రామములలో రాత్రి పాఠశాలల స్థాపించి విద్యావ్యాప్తి గావించుచున్నారు. ప్రతి పాఠశాలకు, దీపములు, గ్రంథములు, పలకలు, విరివిగా సప్లయి చేయబడుచున్నవి. ఉదార హృదయులిచ్చిన విరాళములతో యీ కార్యక్రమము నడపబడుచున్నది. ప్రాథమిక చికిత్స, శిశువైద్యము, వ్యవసాయము సహకారము స్థానిక స్వపరిపాలనయందు గూడ యిదే కార్యకర్తలకు శిక్షణ యివ్వబడినది. ఈ కార్యకర్తలు గ్రామముల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడగలరను గట్టి విశ్వాసము నాకుగలదు. పన్నెండు సూత్రములతోచేరిన నిర్మాణ కార్యక్రమ ప్రణాళిక కార్యకర్తలకు, ఆచరణలో పెట్టుటకై అందజేయబడినది. నిర్మాణ కార్యక్రమ శిక్షణ శిబిరములను ప్రతి తాలూకా కేంద్రములో నిర్వహింపవలయునని ఉద్దేశించి, హుజూరునగరములో, త్వరలోనే యిట్టి శిబిరమును నడపనున్నాము. సహృదయులందరువచ్చి చూచి తమ అమూల్యసలహాల నొసగ ప్రార్థన.

వయోజన విద్యావిషయంలో, దీర్ఘోపన్యాసములకు తావులేదు. క్రియారూపమున విద్యావ్యాప్తి గావించుటలోనే దాని పరమార్థముగలదు. గావున ఇంతటితో నా ఉపన్యాసమును ముగించుచున్నాను.

(అధ్యక్షోపన్యాసంనుంచి)

# అక్షరాస్యత



## శ్రీ కోదాటి నారాయణరావు

"ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులుగా ఉన్న సమాజంలో ప్రజాస్వామ్యం నిలువనేరదు. అక్షరాస్యత విద్యాసముపార్జనకుబలవత్తర సాధనాలయిన వ్రాత అచ్చుశబ్దాలద్వారా శిక్షితులగుటకు వ్యక్తులకు అవకాశము కలిగించును. కాబట్టి అదివయోజన విద్యలో అవశ్యమైన ఒక అంశంగా ఉండవలెను." అని వయోజన విద్యపైన జరిగిన మొదటి సెమినారులో అక్షరాస్యతను గురించి వివరించినారు. అయితే వయోజన విద్యలో అక్షరాస్యతకు ప్రధాన స్థానముండవలెననే విషయంలో ఎవరికీ భేదాభిప్రాయం ఉండనేరదు. వ్రాత, చదువుకంటే సులభతరమైన శక్తివంతమైనపని ఇంకొకటిలేదు. అంతేకాకుండా కొంతశిక్షణ పొందిన తర్వాత మరొకరి సహాయంలేకుండానే విజ్ఞానాన్ని ఆర్జించుకునే సావకాశం అక్షరాస్యతవల్లనే కలుగుతుంది. అక్షరాస్యత కాకుండాఇతరశ్రవ్యదృశ్య పద్ధతులద్వారా విజ్ఞానార్జనకు అవకాశాలున్నప్పటికీ అవికష్టసాధ్యాలు. అసమగ్రాలు పైగా ఆలోచనలను రేకెత్తించగలశక్తి వాటిలో తక్కువగా వుంటుంది. అక్షరాస్యతవలె చిరకాలం ఉండేవికావు. వీటన్నిటివల్ల వయోజనవిద్యలో అక్షరాస్యతకు ప్రధానస్థానం ఉన్నది. అయితే ఇది ఒక సాధనమని మాత్రమే గుర్తించవలసివుంటుంది. కాని దీనినే లక్ష్యంగా పెటుకుంటేమాత్రం తప్పుత్రోవ పడుతున్నామన్నమాట. భారతదేశంలో వయోజనవిద్యాఉద్యమంలో నిన్నమొన్నటివరకు అక్షరాస్యతనే లక్ష్యంగా ఉంచుకోవడం జరిగింది. ఇప్పుడిప్పుడు సాధనమని గ్రహిస్తూన్నా ఆచరణరీత్యా పాతపద్ధతిలోనే ఉన్నాము 1949లో మైసూరులో జరిగిన వయోజనవిద్య సెమినారులో అక్షరాస్యతను యీదిగువ విధంగా నిర్వచించారు. "ఒకమనిషి నిజంగా అక్షరాస్యుడయివాడంటే తనభాషను సులభంగాను స్పష్టంగాను మాట్లాడడానికి అర్థంచేసుకోనడానికి సమర్థుడుగా వుండాలి. తననిత్యజీవితానికి అవసరమైన విషయాన్ని చదువగలిగివుండాలి తనభావాలను వ్రాతమూలకంగా వెల్లడించగలిగివుండాలి. సులభమయిన లెక్కలను గుణించగలిగివుండాలి. సంస్కృతులలోను తన సంఘానికి దేశానికి సంబంధించిన సంస్థలవిషయంలోనూ కొంతవరకయినా తెలిసివుండాలి. ప్రపంచ సంఘంతో తన సంబంధాన్ని కొంతవరకయినా హర్షించగలిగివుండాలి. పైనిర్వచనం "చదువనగ్రాలు నేర్పుట చదువా?" అనేపూర్వకవిపద్యాన్ని గుర్తుకుతెస్తుంది అయితే ఇంతపాటి అక్షరాస్యతను మన వయోజన విద్యాబోధకుల అక్షరాస్యతాశిక్షణ ఇవ్వకలుగుతుందా? ఒకవేళ ఇవ్వగలిగిన శిక్షకుడు ఉన్నప్పటికీ ప్రతినిత్యం ఒక్కొక్కపాఠం ఓపికతో వయోజనుడు ఎన్నాళ్ళు నేర్చుకుంటాడు? అందుకు కావలసిన తీరిక శ్రద్ధాసక్తులు ఐచ్ఛికంగా చదివే వయోజనుల్లో ఉండడం చాలా అరుదు. అట్లా అయినపక్షంలో సంతకం చేయగలపాటి అక్షరాస్యతవల్ల ఏంబావుకున్నట్లు? యీ నేర్చుకున్న అక్షరాలు మననంలేక ఎంతకాలం అతనిహృదయంలో నిలుస్తాయి. ఒకవేళ నిలిచినా ఏమిప్రయోజనం కలుగుతుంది. యీసమస్యలను తర్కించుకున్న తర్వాత మనం ఒక్కనిర్ణయానికి రాగలుగుతాం. అక్షరాలు వ్రాయనూ చదవనూ వచ్చినప్పటినుండి వయోజనునకు పుస్తకాలు చదివే అలవాటు కలిగించవలసి వుంటుంది. అంటే కక్షరాస్యతానంతరం అతని దశమారుతుంది. అతనికిఅప్పుడు

పుస్తకాలు కావల్సివుంటవి. అప్పుడు వయోజన విద్యాలయంనుంచి అతడు గ్రంథాలయంలో అడుగు పెట్టవలసివుంటుంది. లేకపోతే అతని నిమిత్తం మనం పడ్డ కష్టం వ్యర్థమౌతుంది.

ఈదృష్టితో చూచినప్పుడు మనం ప్రస్తుతం గ్రంథాలయాలని పిలిచే సంస్థలు వీరినిమిత్తం ఉపయోగపడగలవా? అని సందేహం కలుగుతుంది. ప్రస్తుతం మన గ్రంథాలయాల నిర్వహణలో విజ్ఞానాభివృద్ధి కల్పించవలెననే కాంక్ష వున్నప్పటికీ స్పష్టమైన ప్రత్యేక ఉద్దేశ్యం లేదని చెప్పవచ్చును. అంటే ఏరకం ప్రజల ఉపయోగంనిమిత్తం మనం గ్రంథాలయాలు నిర్వహిస్తున్నాము? అని మనం ప్రశ్నించుకోవడములేదు. ఒక చిన్నపాటి గ్రామంలో గ్రంథాలయం పెడితే ఆవూళ్లో కొద్దిమంది చదువుకున్నవాళ్ల దగ్గరవున్న రకరకాల పుస్తకాలను సమకూర్చుకోవడం, తరువాత ప్రథమ ఉత్సాహంలో ఆవూళ్లో సమకూర్చతగిన గరిష్టద్రవ్యాన్ని సమకూర్చి బాజారులో కన్పించే పుస్తకాలు తెచ్చిపెట్టడమూ, అంతటితో ఆగ్రంథాలయం పనిముగిస్తుంది. లేకపోతే ఇతరవూళ్లల్లో పరిచయంవున్న కొద్దిమంది మిత్రుల వద్దనున్న గ్రంథాలు తెచ్చిపెట్టడం మామూలు కార్యం. ఈ విధంగా గ్రంథాలయాలు నడుస్తూన్నవనడంలో ఎవర్నీ తప్పుపట్టడం నావుద్దేశ్యం కాదు. దేశంలో వున్న పరిస్థితే అది. ఇప్పుడిప్పుడే మనకు ప్రజాస్వామిక దృక్పథం ఏర్పడుచున్నది. బయటికి అది రాచకీయంగా కన్పించినా జీవితానికి సంబంధించిన ప్రతి అంశంపైన ఈదృక్పథప్రభావం పడితీరుతుంది. ఇంతేకాదు జీవితపు ప్రతి బింబాన్ని ఈదృక్పథంతోనే పరిశీలించవలెనుగూడా.

అయితే గంథ్రాలయాలను ఈదృష్టితో నెలకొల్పవలెనంటే దేశంలో అత్యధిక సంఖ్యాకులు అక్షరాస్యులుకూడా కారని పల్లెటూళ్లల్లో వుంటారనీ వ్యవసాయమూ కొద్దిపాటి కుటీర పరిశ్రమలు మొదలయిన వాటితో జీవిస్తూవుంటారనీ మొదట మనం గమనించవలసివుంటుంది. వారిజీవితాలలో అనుశ్రుతంగా అవలంబిస్తూవున్న జీవన విధానాలూ సాంప్రదాయాలూ తప్ప ఇతర విధాలను తెల్సుకోదగిన అవకాశం వారికి కలుగలేదని జ్ఞాపకం వుంచుకోవాలి. పరిస్థితుల్లో కలిగిన మార్పులవల్ల జీవితంలో కలిగే సంఘర్షణలమూలంగా వరిపిడికి గురియై నెగ్గలేక జీవితంలో నిరాశ నిస్పృహ వీరిలో నెలకొనియున్నదని గుర్తుంచుకోవాలి. వీటన్నిటినీ తెలిసికున్న తర్వాత మనగ్రంథాలయాలు వీరికి బ్రతుకుతెరవులవిషయంలో ఏవిధంగా ఉపకరించగలవో ఊహించుకోవాలి. ఇదంతా ఆలోచించుకున్నప్పుడు ప్రస్తుత గ్రంథాలయ స్వరూపంలో విప్లవకరమైన ఒకమార్పురావలసివున్నదని తేలుతుంది. నిరక్షరాస్యతను నిర్మూలింపచేయడం మొదలెట్టిన తర్వాత వారికి అర్థంకాగల భాషలో ఉత్సాహాన్ని కలిగించే శైలిలో మనోహరమైన రూపంలో బ్రతుకుతెరవుకు అక్కరవచ్చి జీవితంలో ముందుకు తీసుకోపోదగిన పుస్తకాలు వారికి అందివ్వడం రెండవపని. ఈపనిలో ప్రజల విద్యాస్థాయి హెచ్చుతున్నకొద్ది వారికందిచ్చేపుస్తకాలస్థాయికూడా హెచ్చవలసివుంటుంది. గత డిశంబరులో ఢిల్లీలో జరిగిన సెమినారులో వయోజనులకు అనువయిన సాహిత్యసృష్టినిగురించి చర్చజరిగింది. ఆచర్చను ఉపక్రమణికగా శ్రీ యస్. ఆర్. రంగనాథన్‌గారు వ్రాసిన వ్యాసంలో వారు పాఠకులను నాలుగు తరగతులుగావిభజించారు.

1 బుద్ధివికాసంలో ప్రథమ శ్రేణికిచెందిస్వయంగా విద్యావ్యాసంగంచేయడానికి సమర్థులు వీరు తమకు కావల్సిన గ్రంథాలను సాధారణంగా యితరుల సహాయం అవసరం లేకుండానే ఎన్నుకోగలుగుతారనుకోవచ్చును.

2. బుద్ధివికాసములో పై తరగతి వారికంటె తక్కువ స్థాయిలోవుంటారు. అయితే స్వయంగా విద్యావ్యాసంగం చేయగలుగుతారు. వీరికి గ్రంథపఠనంలో కొంతవరకు ఇతరుల సహాయం అవసరం వుంటుంది. (మన గ్రంథాలయాలు ప్రస్తుతం యీ తరగతివారికే సరిపోవును.)

3. రెండవతరగతి వారికంటె బుద్ధివికాసంలో చాలా తక్కువ. అయినప్పటికీ విద్యావ్యాసంగం చేయడానికి తగినశక్తి అలవరచుకొనివుంటారు. ఇట్టి

వారికి ఇతరుల మార్గదర్శకత్వం పూర్తిగా అవసరం. యీ తరగతికి సంబంధించిన పాఠకులకు అందించే సాహిత్యంపైననే వయోజనవిద్య భవిష్యత్తు ఆధార పడి వుంటుంది.

4. వ్రాయను, చదవను మాత్రమే నేర్చుకొని విద్యాభ్యాసంగం చేయడానికి శక్తి ఇంకా అలవరచుకోని ప్రజానీకం, వీరిచేత పుస్తకాలు చదివించి వీరిని మూడవతరగతి పాఠకులుగా తయారు చేయవలసి వుంటుంది.

(a) మొదటిపాఠకుల నిమిత్తం మనం అంత హెచ్చుగా ఆలోచించవలసిన పనిలేదు. వారికి కావల్సిన పుస్తకాలు అందించే పరిస్థితిలో మన గ్రంథాలయాలు లేవని చెప్పవచ్చును. వారికి కావలసినవి ఆమాకీ గ్రంథాలయాలు. అవి సాధారణంగా పట్టణాల్లోగాని ఉండవు.

(d) రెండవతరగతి పాఠకునికి సంబంధించిన సాహిత్యమే ఇప్పుడు హెచ్చుగా లభ్యమాతున్నది. మన ప్రస్తుత గ్రంథాలయాలుగూడ వీరికే ఉపయోగపడతవి. వీరి విషయంలోకూడ ప్రస్తుతానికి అంతగా ఆలోచించవలసిన పనిలేదు. ఎందుకంటే వీరు వయోజన విద్యాపథకం క్రిందికిరారు. వీరు అభ్యసించిన చదువు మరచిపోయ్యే ప్రమాదం లేదు.

(c) మూడవతరగతి పాఠకుని నిమిత్తమే మన కృషిని హెచ్చుగా కేంద్రీకరించాలి. వీరి విషయ గ్రహణాశక్తిపైననే మన కృషిఫలితం ఆధారపడి వుంటుంది. వీరికి కావలసిన పుస్తకాలు తయారు చేయడంలో హెచ్చుజాగ్రత్తగూడా అవసరం. ఎందుకంటే వీరు క్రిందితరగతికి, అటుపైతరగతికీ చెందని మధ్యతరగతివారు, సాధారణంగా వీరిది తెలిసీ తెలియని మనస్తత్వం.

5. వీరి నిమిత్తం ఇదివరకే కొంతకృషి ప్రారంభమైనది. ప్రాథమిక విజ్ఞానం సులభశైలిలో అందించి వారికి పఠనాసక్తి కల్గించడమే మనధ్యేయం.

పైనవివరించిన విధంగా పాఠకులకు పుస్తకాలను అందించడానికి అనువైన పద్ధతులను ఏర్పాటుచేసికోవడం. మూడవపని, మొదటిపని ప్రస్తుతం వయోజన విద్యాకేంద్రాలు నిర్వహిస్తూఉన్నవి. ప్రస్తుతం హైద్రాబాదురాష్ట్రంలో వయోజన విద్యాబోధనలకు గరిష్ఠపరిమితి నాలుగు నెలలుగా ప్రభుత్వం నిర్ణయించింది. యీ నాలుగునెలల్లో బోధకుడు ఎంతగా కృషిచేసినప్పటికీ సంతకానికి మించిన చదువు నేర్పలేడు. కాబట్టి అక్షరాస్యతానంతరం పుస్తకాలందించే ఏర్పాటులేకపోతే అక్షరాస్యతవలన కలిగే ఫలితం అత్యల్పం. అంటే గ్రంథాలయంలేని వయోజనకేంద్రం నిరుపయోగం అన్నమాట.

గ్రంథాలయం ఉన్నంతమాత్రాన కేవల అక్షరాస్యునికి నిత్యజీవితంలో ఉపయోగపడి అభ్యుదయపథంలో ముందుకు తీసికోపోగల గ్రంథాలు గ్రంథభాండాగారి యివ్వగలుగుతాడా అన్నదిగూడా ఒక సమస్య. గ్రంథభాండాగారి సాహిత్యోత్పాదకుడుకాడు. ఉన్నపాటి సాహిత్యంలో తనకు తెల్సిన దానిని అతడు ప్రజలకు అందిస్తాడు. అంటే అందుకుగాను మరొకరు పూనుకోవలసియున్నది. ప్రభుత్వంగాని, ప్రజాసంస్థలుగాని లేక ప్రజలు ప్రభుత్వం కలసిగాని యీ పని నిర్వహించవలసియుంటుంది. యీ రంగంలో యిప్పటివరకు జరిగిన కృషి తెలుగులో చాలాతక్కువ. ఎక్కడనయినా ఎవ్వరయినా యీపనిని సాగించినా ఒకఉద్యమంగా క్రమపద్ధతిన సాగించలేదు. యీరీకమైన సాహిత్యాన్ని ఉత్పత్తి చేయడమంటే సులభమైన మాట గాదు. ఇట్టి సాహిత్యోత్పాదకసంస్థకు ఏవైపుకు ప్రజలను నడిపించవలెనో స్థూలంగానైనా ఒక ఆదర్శం ఉండవలెను. ఆయా ప్రాంతాలలో ప్రజలకు నిత్యజీవితంలో ఎదుర్కోవలసిన సమస్యలేవో తెల్సియుండవలెను. వాటికి పరిష్కార విధానాలు స్పష్టంగా తెల్సిన విజ్ఞులను సమకూర్చుకోవలెను. యీ విధానాలను మనం ఏరకపు ప్రజలకు అందించవలసి వుంటుందో ఆరకపు ప్రజలస్థాయికి తగినట్లు రమ్యమయిన శైలిలో వ్రాయగల రచయితలను సంపాదింపవలెను. తరువాత పాఠ్యాలలోని విషయాలు చక్కగా చిత్రించగల చిత్రకారులను సమకూర్చి

వారితో బొమ్మలు వేయించవలెను. తరువాత అచ్చుపని పుస్తకాల స్వరూపం. సులభంగా అందుబాటులో వుండగలధర మొదలయినవి నిర్ణయించవలెను. యివన్నీ చేసికొని పుస్తకాలు ప్రకటిస్తే అప్పుడు గ్రంథభాండాగారిపని ప్రారంభమవుతుంది. భారతదేశంలో ముఖ్యంగా హైదరాబాదు రాష్ట్రంలో అధికసంఖ్యాకులు వ్యవసాయికులు, గ్రామీణులు, వారికి సంబంధించిన సమస్యలు అంటే వ్యవసాయం, సహకారోద్యమం, పశుపాలన. తీరికసమయాల్లో కుటీరపరిశ్రమలు మొదలయిన వృత్తులకు సంబంధించిన, సాహిత్యం వారికి అవసరం. మలేరియా, కలరా, నారిపుండు మొదలయిన అంటువ్యాధుల నిరోధానికి చికిత్సకు సులభమైన పద్ధతులు వారికి అవసరం. తప్పనిసరియైన వ్యవహారానికి తగినవాటి భోగట్టా వారికి తెలిసియుండవలెను. వీనిని మించి పౌరసత్వాలూ, ఓటూ, వివిధప్రభుత్వాంగాలూ, మొదలయిన రాజకీయ విజ్ఞానం అతనికి ఆవసరం. వీటన్నిటికీ సంబంధించిన సాహిత్యం ఒక నిర్ణీతపద్ధతి ప్రకారం ఉత్పత్తి చేయవలెను. అక్షరాస్యతానంతరం అతనికి భాషతో ఏపాటి పరిచయం వుంటుందో ఆపాటి స్థాయిలోనే అర్థమయ్యేటంత సులభంగా రచనలు ఉండవలెను. చదువుతూవుంటే మరీమరీ చదువవలెననే ఉత్సాహంకలిగే శైలిలోనూ, ధోరణిలోనూ పుస్తకాలను వ్రాయించవలెను. అయితే యీపుస్తకాలు వ్రాసేటప్పుడు ఆప్రదేశానికి సంబంధించిన జీవితవిధానంలో గట్టిపరిచయం ఉన్న వారితో వ్రాయించవలెను. ఉదాహరణకు తెలంగాణావారికి సముద్రప్రాంతవాసులకు వుపయోగించే పాఠాలు ఉపకరించవు. ఆంధ్రదేశంలోని, కృష్ణా గోదావరి డెల్టాప్రాంతాలలోని వ్యవసాయ పద్ధతులకు రాయలసీమ పద్ధతులకూ తెలంగాణా పద్ధతులకు చాలా తేడావున్నది. భాషలోనూ వైవిధ్యం వున్నది. పసుపు, చెరుకు, జనుము, కంద మొదలగు పైరులు తెలంగాణాలో వేయడం అలవాటు తక్కువ. ఆముదాలు, కుసుమ మొదలయిన పైరులు కృష్ణా గోదావరి డెల్టా రైతులు వేయరు. ఒకే విధమయిన పుస్తకాలు వీరికి సంబంధించవు. తెలంగాణాలో మోటలక్రింద వ్యవసాయం హెచ్చు. డెల్టావాసులకు మోటలంటే తెలియదు. సముద్రతీరవాసుల్లో జాలరి ఒక ముఖ్యవృత్తి. యీ విషయాలన్నీ రచనల సమయంలో జ్ఞాపకం పెట్టుకోవాలి. దీనితోపాటు భాషలోగల తేడాలనుగూడా గమనించవలసి వుంటుంది. దమ్ముచేయడం, ఊడ్పు, ఆకుమడి మొదలయిన శబ్దాలు తెలంగాణా రైతులకు అగమ్యగోచరాలు. మాగి, కరిగట్టువరం మొదలగు శబ్దాలు డెల్టారైతులకు వింతగా కన్పిస్తాయి, వీటన్నిటితోపాటు మాండలికవ్యవహార భాషనుగూడా గమనించవలసి వుంటుంది. తోడల్లుడు, పాలేరు, అప్ప, ఇగురు మొదలగు పదాలు తెలంగాణాకు ఎంతదూరమో, యాగాలు, పెయ్య, కూసం, మొగులు, గుబులు మొదలగు పదాలు కోస్తావారికంతే దూరం. అందుకోసం వివిధప్రాంతాల రచయితలను సమకూర్చవలసి వుంటుంది.

గ్రామవాసులకు కావలసిన సర్వసామాన్య వ్యవహారాలకు, సంబంధించిన భోగట్టాగల పుస్తకాలు చాలా అవసరం. దరఖాస్తులు దస్తావేజులు అధికార్లతో ఉత్తర ప్రత్యుత్తరాలు గ్రామీణులు తెలిసికోవడం అవసరం. వీటన్నిటికంటె మించి పౌరసత్వాలూ రాజకీయవిజ్ఞానం అంచెలంచెలుగా తెలియపరుచవలసి వుంటుంది. ఏస్థాయికి ఎంతవరకు చెప్పవలసివుంటుందో ఆంతవరకు చెప్పవలెను. అప్పుడే అక్షరాలు నేర్చుకున్న వ్యక్తికి రాజ్యాంగ చట్టాన్ని గూర్చినసారం చెప్పడం తగనిపని. వీటన్నిటికీతోడు ఆయా ప్రాంతాల్లో సాధారణంగా జానపదులు వాడుకునే కథలు గాథలు పాటలు సేకరించిఇవ్వడం అవసరం. తమవూళ్లలో వాడకంలోవున్న పాట పుస్తకంలోవచ్చేసరికి ఆపుస్తకంమీద ఎక్కడలేని మోజుకలగడం సహజం. ఉదాహరణకు. పాలకుర్తి సోమనాథునికీర్తనలు, బలుగురి కొండలరాయుని కథ బాలనాగమ్మ కష్టాలు మొదలయినవి తెలంగాణా జానపదులను ఆకర్షించ కలుగుతాయి పైవాటిన్నింటిని సమన్వయించుకోనిదే చేయవలసిన రచనలు సులభంగా జరుగనేరవు. సామాన్యమైన వ్యక్తులూ, తలపెట్టనుగూడాలేరు. ఆంధ్రసారస్వత

పరిషత్తువారు ఇట్టిసాహిత్య సృష్టికి పూనుకుంటే సంస్థ యీపనికి కావల్సిన ధనసహాయాన్ని పొందడం కష్టంగాదు.

రచనలతో పాటు బొమ్మలు గీయించడంలోనూ ప్రాంతీయ పద్ధతుల తేడాలు గమనించవలసి వుంటుంది. దీనికితోడు ముద్రణవిషయంలోనూ ప్రత్యేకమైన శ్రద్ధ అవసరం శిక్షణస్థాయికి తగిన పాటిసైజులో అక్షరాలు ఉండవలెను. సైపులో పాంకం, లెథోప్రింటింగులో సవ్యమైనలిపి, ఉండ వలసిన అవసరం ముఖ్యంగా తెలంగాణాలో ఎంత యినావున్నది. తప్పొప్పుల పట్టికలు సంపూర్ణంగా నిషేధించాలి. పుస్తకాలు మంచిరకపు కాగితములు గలిగి ఒకే సైజులో ఉండవలెను. విషయానికి సంబంధించిన ఏదయినా ఒక బొమ్మ అట్టమీద వుండడం. లేదా ఒకవిషయానికి సంబంధించిన పుస్తకాలకు. ఒకేరంగుఅట్టావుండడం అవసరం. ఇట్లాంటి విషయాలు జాగ్రత్తగా గమనించి ప్రము రించ వలసివుంటుంది.

పుస్తకాలనెల మనదేశంలో ముఖ్యంగా తెలం గాణా ప్రాంతంలో పుస్తకాలు ఎక్కువగా అమ్ముడుపోవు. కాబట్టి ఎక్కువకాపీలు అచ్చు వేయించడం జరుగదు. కొద్దిప్రతులను వేయిస్తే ధర హెచ్చుతుంది. అప్పుడు కొద్దిపాటి ప్రతులుగూడా అమ్ముడుపోవు. పోనీ ఎప్పుడయినా అమ్ముకోవచ్చు ఎక్కువప్రతులు వేయిస్తే చిమ్మటలు గొట్టడం చెదలు పట్టడం అసలు దీరకపోవడం వడ్డినష్టం ఇతప్పవు యీవిషమ చక్రంనుండి తప్పుకోవడానికి పుస్తకాలు కొనే గ్యారంటీనిగాని, సబ్సిడీగాని ప్రభుత్వం యివ్వడం అవసరం. పైదంతా సాహిత్యసృష్టికి సంబంధించిన విషయం. గ్రంథాలయాల విషయంలో మాట్లాడినప్పుడు ఇదివిషయాంతరం అవుతుందేమో కాని, యీ విషయాలను ప్రస్తావించకుండా గ్రంథా లయాలను గూర్చి ప్రస్తావిస్తే సృష్టిలేని స్థితివలె ఉంటుంది. గ్రథాలయాల విషయములో పాత పద్ధతులలో విప్లవకరమైన మార్పులు రావలసి వుంటుందని ముందే చెప్పినాను. గ్రంథాలయశోభ గ్రంథభాండాగారిని బట్టివుంటుంది. చాకచక్యము, బుద్ధికుశలత, విషయ గ్రహణశక్తి కల్పుగోలుతనం, చొరవ మొదలయినవి అనేక సులక్షణాలు కలిగి వుండి సుశిక్షితుడైతే గ్రంథాలయాన్ని ఆకర్షణీ యంగా నిర్వహింపగలుగుతాడు. నిత్యజీవితంతో సన్నిహిత సంబంధంగల అన్నివిషయాల భోగట్టా అందించగలిగి వుండాలి, అన్ని ఉద్యమాలతో సంబంధంకలిగివుండాలి ఒంటెత్తుగా నడిపితే గ్రంథా లయంసాగదు అందుకనే గ్రథాలయం అనే సంస్థ ప్రత్యేకంగా ఉండడంకంటె కమ్యూనిటీ సెంటర్ల గ్రామాలలో ఏర్పరుచడం బాగుంటుందని నేటి సమాజశాస్త్ర వేత్తలు సలహాలిస్తున్నారు. గ్రంథభాండాగారి అంటే దాదాపు కమ్యూనిటీ లీడరుగా ఉండవలెను. ప్రతిగ్రామంలో ఇటువంటి కార్యకర్తలు దొరకడం కష్టము. శిక్షణపొంది తన శక్తినీ సమయాన్ని తోటి ప్రజానీకానికి నివేదిం లంటే అతనిజీవనోపాధి విషయం గూడా ఆలో చించవలసివుంటుంది. యీ విషయంలో ప్రభుత్వం జిల్లాబోర్డులూ పంచాయితీలు మొదలగు స్థానిక సంస్థలు, తదితర సమాజసేవాసంస్థలు కలసి ఒక పథకాన్ని రచించుకోవలసి వుంటుంది. ప్రతి గ్రామంలో గ్రంథాలయాన్ని నిర్వహించడం ఇప్పుడు సాధ్యమయ్యేపనిగాదు. 10, 12, మైళ్లలో గల గ్రామాలకు పంచాయితీబోర్డు గల ఒక గ్రామాన్ని కేంద్రంగా ఎన్నుకొని అచ్చటి సుశిక్షితు డైన గ్రందభాండాగారివల్ల గ్రంథాలయాన్ని నడుప వచ్చును. అతడే పంచాయితీబోర్డు నిర్వాహకుడుగా పనిచేయవచ్చును. యీరెండుపనులకూ కల్పి అతనికి తగిన జీవనభృతిని పంచాయితీబోర్డు ఇవ్వవచ్చును. చుట్టుప్రక్కల గ్రామాలలో గ్రామ పాఠశాలల ఉపాధ్యాయులూ గ్రంథభాండాగారి సలహాతో గ్రంథాలయంనుండి పుస్తకాలు తెప్పించి ఆగ్రామ వాసులు చదివింతర్వాత తిరిగి పంపించే ఏర్పాటులు చేయవచ్చును దీనికి సంచార గ్రంథాలయపేటిక

( ప్రక్కపుటలో )

# అక్షరవ్యాప్తి



## శ్రీ గంగుల శాయిరెడ్డి

అన్యదేశములందు అక్షరాస్యత వ్యాపించి నిరక్షరాస్యత నిర్మూలింపబడి విద్యావిజ్ఞానజ్యోతులు వెదజల్ల బడినవి. ఆయా దేశములందు ప్రజలు ప్రభుత్వము పట్టుబట్టి అజ్ఞానాంధకారము నంతరింప జేసిరి—అనగా పరదేశములందు వ్యక్తిగతముగా కొందరు, సంఘములందు జేరి కొందరు, మఠాధిపతులు మతగురువులు, సన్యాసులు, సంసారులు, బ్రహ్మచారులు పాఠశాలలు, వివిధ వృత్తులవారు, వేయి రీతులశోధించి బోధించుచున్నారు. మన మతగురువులకాపని చేతగాదు. శిష్యుల అవిద్యకువారు బాధ్యులుగారట! మన పూర్వ గ్రంథాదులలో ప్రతిరాజుకొక పురోహితుడు. అతడే చదువుపంతులు=దేవగురువు=రాక్షసగురువుల వృత్తిపురోహితము. ఉపాధ్యాయులు=వసిష్ఠుడుకూడా ఇదేరీతి. ఈ విధముగా వేల ఉదాహరణలున్నవి. నేడు ఫాదిరీగురువులు దేశమంతట తమపీఠముల స్థాపించి వైద్యసౌకర్యములు, వసతిగృహములు, దీనులకు కల్పించి, పాఠశాలలు స్థాపించి, ప్రార్థన మందిరముల నిర్మించుచు, లఘుపుస్తకముల ప్రకటించుచు, కొన్ని ఉచితముగా కొన్ని కొద్ది ధరలకు ప్రజలచేతికిచ్చుచున్నారు. విద్యా

---

( 137-వ పుట తరువాయి )

లేదా మనిషితో తెప్పించుకునే ఏర్పాటు చేయవచ్చును ఇట్లా అందించే పద్ధతికి అయ్యే ఖర్చులు జిల్లాబోర్డు భరించవచ్చును. పుస్తకాలు శిక్షణ ప్రభుత్వం యివ్వవలసివుంటుంది. యీవిధమైన ఏర్పాటులు జరిగితే ఏ ఒక్కరిపయినా విశేషభారం పడకుండా వుంటుంది. పుస్తకాలకుతోడు. అప్పుడప్పుడు ఫిల్ములు గ్రామఫోనులు రికార్డులు మొదలయినవి జిల్లాబోర్డు ఖర్చులపైన ప్రదర్శింపచేయవచ్చును యీవిధమైన ఏర్పాటులు దేశమంతటా ఒకేసారిజరుగలేక పోవచ్చును. గాని ప్రతిజిల్లాలోను రెండు మూడు రివిన్యూఫిర్కాలను తీసికొని అక్కడ అభివృద్ధి పథకాన్నంతా సాగించడం బాగుంటుంది. అంటే ప్రభుత్వపు అన్నిశాఖల పక్షాన అభివృద్ధి కార్యక్రమాన్ని కేంద్రీకరించవలసి వుంటుంది. ప్రజలలో ఉత్సాహాన్ని రగుల్కొలిపి పరిశ్రమను గూడా సహకారంగా తీసికోవలసి వుంటుంది. వీటి పరిణామం కమ్యూనిటీ ప్రాజెకులంత ఉండకపోవచ్చును. గాని ఇంచుమించుగా అంత ఫలితాన్ని ఇవ్వవచ్చును. యీవిషయంలో మద్రాసు ప్రభుత్వం ఫిర్కాడెవలప్‌మెంటు కార్యక్రమాన్ని చాలాకాలంగా అనుసరిస్తూవున్నది.

ర్థులకు వివిధరంగములందు సహాయపడు చున్నారు.

మన మతగురువులు మతాధిపతులు పురోహితులు ప్రజల పీల్చిపిప్పిచేసి శాపము బెట్టుతామని బెదిరించుటదప్ప వేరే ఉపకారము వారిచేతగాదు. మన గురువులకు రాజకీయార్థికాదుల సంబంధము లేదు. ప్రత్యక్షమోక్షము చూపుదురట. ఆబాటయే లోకమునకో గురుశిష్యులకగోచరము. పురోహితులు మంత్రములు దప్ప వేరే తంత్రముజెప్పరు, ఇక చదువు చెప్ప గురువులెవరని విచారించగా సర్కారుమాస్టరే శరణ్యమా! అతనికి ఇహాపర సాధనలతో పనిలేదు. చిలుకపలుకులువల్లించి శిష్యులు పరీక్షలో ప్యాసైతే చాలును. ఇపుడు మనకు నిరక్షరాస్యత నిర్మూలనకావలెను, ఆపనికి సాయపడువారెవరని చర్చించవలసిన సమయము. కనుక ఈ పనికెవరు బాధ్యులని ప్రస్తావించవలసివచ్చినది. సర్కారీ పంతుళ్లలో నూటికి (90) మంది వయోజన విద్యారంగములో ఉత్సాహము చూపుటలేదు. "పగలు పనిచేసి అలసిన మేము రాత్రి పాఠశాలలు నడుపజాలమని యందురు.'' పిల్లల బెదిరించుపద్ధతి, పెద్దలవిద్దెలో సరిపడదు. క్రమశిక్షణకు కట్టుబడియుండవలెనని పంతుళ్ళూహింతురు. రాత్రి పాఠశాలల విద్యార్థులను యజమానులని భావించవలెను. మిత్రులతో సంభాషించు రీతి మెలగవలెను. నీతినియమాలగూర్చి ప్రీతితో చెప్పవలెను. ఆరోగ్యమునుగూర్చి అధ్యాపకుడు స్వయముగా ఆచరించవలెను. ఒకరినిచూచి ఒకరు క్రమముగా అనుకరించుదురేగాని పాఠశాలకు వచ్చిన దినమే ఈరీతికూర్చుండుడు ఆ రీతి మాట్లాడడని చెప్పిన, వెనుకటి అలవాటును ఆపలేక కొందరు, అవమానించిరని కొందరు విద్యావిముఖులగుదురు. మనకిపుడు కావలసినది అక్షరాస్యత ఎక్కువజన మేరీతి చదువుకొందురు. వారికే యేసౌకర్యములు కల్పించవలెనని మనమాలోచించవలెను. వయోజనుల మన స్తత్వములబట్టి క్రమముగా వారికి బోధించవలెనని అనుభవజ్ఞులొక నిర్ణయమునకు వచ్చుచున్నారు.

కొందరు వయోజనులకు విద్యచెప్పు టొకపాలు విజ్ఞానము బోధించుట మూడు పాళ్ళుండవలెనందురు. చరిత్ర భూగోళము పదార్థ విజ్ఞానశాస్త్రాదులు పత్రికా పఠన శ్రవణాదులుండవలెనందురు. పై పాఠములు పట్టణవాసులకు కొంతయభిరుచి యుండవచ్చును. కాని పల్లెటూరివారి నాకర్షించుటకీ మార్గములేకావు. ఇంక వివిధ మార్గములున్నవి. వారివారి వృత్తుల అభివృద్ధిమార్గములు కొన్ని, చుట్టుపట్టుల వాతావరణముల ననుసరించి కొన్ని, చదువుపంతుళ్ళు సంగ్రహించి పాఠముల బోధించవలెను. మరియు ఎక్కువజనము చెప్పుకొనేకథల చెప్పవలెను. అనగా రామునిచరిత్ర. కృష్ణునికీర్తి, పాండవుల బాధలు ఈ కతలనే వీథిభాగవతులు, బొమ్మలాటకాళ్ళు, భజనపరులు ప్రచారముచేసిరి. చేయుచున్నారు. ఇంక వివిధ వృత్తులవారు పాడుకొను జానపదగేయముల సేకరించి చెప్పవలెను. యావజ్జనము

వినికనే వానిని అక్షరరూపముగా ప్రకటించి ప్రచారము చేయవలెను. ఇవి అక్షరాభ్యాసమునకు మొదటిమెట్టు. వేటకానికి తుపాకి మొదలైన ఆయుధము లేరీతి యవసరమో అదేరీతి మనకు పుస్తకములవసరము. మందుగుండురీతి అక్షరములుండును. మందుగుండు లేనిది తుపాకి వ్యర్థము. తుపాకిలేనిది మందుగుండువ్యర్థము కొందరు అక్షరాభ్యాసమునకు ప్రాధాన్యత నిచ్చుటలేదు. కేవలము నోటిమాటలుచేత విజ్ఞానము బోధించవలెనందురు. నేను అక్షరాభ్యాసము వెంట కొంతవిజ్ఞానము. సమయోచితముగా బోధించవలెనందును. అది పరిసరవస్తువులగూర్చి యుండవలెను. తనబాధ్యత తనయింటిసంగతి తదుపరి తన గ్రామచరిత్ర తాలూక జిల్లాల చరిత్ర దేశ చరిత్ర తదుపరి ప్రపంచపాఠములు చెప్ప వలెను. తన సంసారమే తనకు తెలియదు. పరుల సంసారములేరీతి బాగుపరుచును. "మొదట ఇంటగెలచితె పిదప రచ్చగెలుచును" కావున ప్రతివ్యక్తి గ్రామచరిత్ర గ్రహించవలెను. ఏయే ఆహారాదులవసరమో వానినే పండించవలెను. నూనెగింజల పంటలులేకున్నను జీవింతుము. పొగాకుపంట ఇతర మసాలపంటలు కరువులో పెట్టగూడదని యొందరు గ్రహించిరి. ప్రభుత్వము ప్రస్తుతము అనాహారవస్తువుల పండించిన దండుగడుగును పంటకాపు దండుగలిచ్చి పండించును. పర్యవసానమేమి? ఉద్యోగులు కోరునది డబ్బు. వర్తకులుకోరునది డబ్బు. వ్యవసాయకు లారీతికోరగూడదు. "అందరికి కూడుగుడ్డలు జెందవలెను. భావికాలంబు యోజించి బాటవట్ట కర్షకాలెమ్ముకై కనువిప్పి కట్టునదుము; ఇది ప్రస్తుత విజ్ఞానము. ఈ విజ్ఞానము రాజప్రముఖునుండి రైతువరకు వ్యాపించవలెను. అన్నదాతలకు అక్షర దానము చేయుటకు విజ్ఞానవేత్తలు వేయి రీతుల సాయముచేయవలెను.

అక్షరవ్యాప్తి కావలెనంటె, అజ్ఞానము పోవలెనంటె అందరు తమతమ బాధ్యతల గుర్తించవలెను. సంస్థలన్ని యథోచితముగా గ్రంథముల ప్రకటించి చౌకధరలకు విక్రయించవలెను. కమిషన్ ఏజంట్లు లేకుండా ప్రతిపుస్తకము చదువుకొనేవారి చేతికందు పద్ధతులపూనవలెను.

ఎవరికొరకు పుస్తకము వ్రాయబడినదో వారిమాటలు పాటలా పుస్తకమందుండవలెను. "తెలుగుపలుకు" అను మొదటి తరగతి పుస్తకమందు ఆదినుండి తుదవరకు వాడుకొనుపదములు సామెతలు గూర్పబడినవి ఆ పుస్తకమొకటి చాలదు అటువంటివి వందల గ్రంథములు కావలెను.

అక్షరమాల వరుసవెంట చెప్పవలెనని వాదించువారు పెక్కురుగలరు. ఆవరుస వ్యాకరణ సూత్రశబద్ధమనియు; తొలుత వ్యాకరణ మక్కరలేదని పండితులనేకులు నమ్మెదరు. ఇక అకారాది స్వరబద్ధమెందులకు? లిపిలేనికాలమందు; అచ్చులేనికాలమందు; కంఠపాఠము చేయుటకు చెవికి ప్రాధాన్యతయుండెను. ఇపుడు కంటికి పని కల్పింపబడినది. కావున అక్షరముల పోలికల గుర్తించి మార్పులుచేయుట మంచిది. 'ల' పోలికలప్ప కొడవలి 'ల' నుండి సుల

భమునగా అ, ట, త అగును. ల అనుదు లేక అరసున్న అనుడు లేక చందమామ అనుడు బోర్లవేసినగ, అగును గ, పోలికగంట లేక గండ్రగొడ్డలిగనుండి క, ర, ద, డ, చ బజ అగును. స, పోలిక కీలుకత్తి (మడత కత్తి) స నుండి న, ప, వ. మ, య, అగును. ఈరీతిగా సున్నను కలుపుకొనిన (19) అక్షరములగును ఈ (19) అక్షరములతో తెలుగుపలుకునందు పదములు వాక్యములు కతలుకూర్చితిని తుదకు తక్కిన (38) అక్షరములకూడ పోలికలవెంట చూపితిని అక్షరాస్యత వ్యాపించుటకు తొలుతకొలది అక్షరములే ఉండవలెను. ఆ యక్షరములు కూడ వ్రాయుటకు సులభముగానుండు రీతి మలకలుండగూడదు. అరసున్నలు కొన్ని వానికి తలకట్లు కొన్ని కత్తిరించి పెట్టుకొంటె అన్ని అక్షరములు చేయ వచ్చును. మాటలు సూటిగా అర్థమగురీతి వాడుక పదములతో కూడియుండుట మంచిది. వాక్యములు దీర్ఘ సమాసములలో నుండగూడదు. ఏ పాఠము చదివినను విద్యార్థిమనస్సు వికసించురీతి గూర్చవలెను. వచనరచన చదివిన తదుపరి, వేమన శైలిపద్యముల నేర్పవలెను. తదుపరి ద్విపదలు, జానపదగేయములు, యక్షగానములు తందానకతలు మొదలైనవల యల చెప్పవలెను. తెలంగాణ జాతీయ పదములన్ని యక్షగానములందు, జానపద గేయములందు దాగుకొనియున్నవి. అక్షర వ్యాప్తికోరువారు, జాతీయముల సంగ్రహించువారు, జానపదగేయముల శీఘ్రమే సేకరించి నిరక్షరాస్యత నిర్మూలింతురని ముగించుచున్నాడ.

కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేది
పాడేదీ పాడించేదీ
మునుముందుకు సాగించేదీ
పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి.

—శ్రీశ్రీ

# మన జానపద సాహిత్యము



శ్రీ నాయని కృష్ణకుమారి

జానపదులచేత ఏనాటినుండో పాడబడి నేను ఉండమా ఊడమా అన్నస్థితిలో ఉన్న పాటలు పాత పాటలు. పాతపాటలనగానే దీనికి వెనుక ఎంతో చెప్పవలసి ఉంటుంది. నన్నయ్యగారే మొదటి తెలుగు కవి కాదనీ, భారతమే ఆది ఆంధ్రకావ్యం కాదనీ అనవలసి ఉంటుంది. అంతకుముందు ప్రజలు కావ్యాత్మ కలవారనీ వారినోట పాటలకుమల్లే భావావేశం కవిత్వమై పొంగి పొరలిందనీ వారే తెలుగుకు ప్రాణప్రతిష్ఠచేసి విడచిన విగ్రహాన్నీ అంగీకరించవలసి ఉంటుంది. ఇట్లా అనడం కష్టమే! అయినా ఇదిసత్యం

నన్నయగారు సంస్కృత కవులసొత్తును తెలుగు బురఖా తొడిగి మనదనుకొమ్మన్నారు. ఈ సోమనాదులు వాళ్ళజాతికి అనువైనట్లు వాళ్ళభావాలనే స్వంతగా వాళ్ళమాటల్లో పాడుకున్నారు. ఇందులో ఎవరు మెరుగుత్రోవలు తొక్కిందీ ఎవరిని మనం విస్మయంతో ఆమోదించవలసిందీ మన మనస్సులకు తెలుసు.

పాల్కురికి సోమనారాధ్యుడు, తుమ్మెదపదాలు గొబ్బి, చంద్ర, వెన్నెల పదాలు పాడుతూ యాత్రికులు శ్రీశైలయాత్ర సాగిస్తూండేవారని చెప్పాడు. ఇంకొక సోమన వీటికొక లక్షణం చేకూర్చుదామని యత్నించి విఫలుడై విసిగి కాబోలు, అనియతగణైః యతిప్రాసోవా" అని మాత్రం చెప్పి సరిపెట్టుకున్నాడు. కాకపోతే వీటికి బంధమేమిటి? యతిప్రాసల గొడవేమిటి?

మనుష్యుడు కష్టంకానీ సుఖంగానీ ఇనుమిక్కిలై పట్టరానప్పుడు దానినే గొంతువిప్పి స్వేచ్ఛగా పాడుకుంటాడు. తన ఉద్యోగ ఉత్సాహాలను బహిఃప్రపంచలో మూకంగా ఉన్న శక్తులకు పంచి బరువు దించుకుంటాడు. అక్కడికి అతనికి ఒక తృప్తి. అటువంటి భావవైచిత్ర్యం పండితులు మెచ్చుకుంటున్నారా అని చూడడు. యతిప్రాసా కుదరాలనిచూడడు కాని చిత్రమేమంటే అతని ముఖంలో పాట రూపొందుతున్న పాదాలు ఎక్కడికక్కడే సొంపుగా విరుగుతూ ఉంటాయి. ఇది తెలుగు మాట్లాడేవాడి మన సత్వంలో ఉన్న రహస్యం తనకు తెలియకుండానే మాట్లాడుతున్నప్పుడూ వాడు మొదట పలికిన పదానికి ఉచ్చారణలో సమీపంలోఉన్న పదం, మళ్ళీ పలకాలని చూస్తాడు.

అంటే ఆకూ అలమూ అనేజంట ఉంటేఅక్కడ అలానికి అర్థంఉంది. అట్లాగడ్డీగాదంలో గాదానికి అర్థం ఉన్నది. కాని వంకర టింకర అన్నప్పుడు టింకరకుగానీ మంచీగించీ అన్నప్పుడు గించికిగానీ అర్థం లేదు. అట్లాఅవి వ్యర్థ పదాలయినా మొదట పలుకబడ్డ మాటలకొక సౌష్ఠవాన్ని తెచ్చిపెడతవి. వినే వారి చెవులకు ఇంపును కలిగిస్తా.

ఇటువంటి పాతపాటలులో పాండిత్య ప్రకర్ష ఉండదు. కాకపోతే భావావేగముంటుంది. లౌకిక జ్ఞానం పరిపూర్ణంగా ఉంటుంది. కావ్యాల్లో కవితన పాత్రల్ని నఖశిఖపర్యంతరం నిండుగా అలంకరించి

ముచ్చిబొమ్మల్లా నిలువబెడతాడు. ఆ కన్నూ, ఆముక్కూ, ఆతీరూ దూరంగా ఉండిచూడడానికే గాని దగ్గరకువచ్చి తడివి పరిశీలించేట్లయితే, నిర్భాగ్యుడి స్వప్నంలా ఎక్కడికక్కడ భగ్నమైపోతుంది.

ఇంకొక విషయం చెప్పాలంటే కావ్యనాయికలూ నాయకులూ రాచకుటుంబంలోవారు లేదా ఉన్నతవంశోద్భూతులు, నాయికలు ఆకాశంలో విహరిస్తూంటారుగాని భూమిమీద నిలువరు వారికి తల్లి, తండ్రీ, అన్నాచెల్లెలూ, భర్తా, అత్తామామా మొదలైన బంధువర్గమంతా ఉన్నట్లు కవి చూచాయగా తెలుపుతాడు. అదీ కథావసరాన్నిబట్టి మాత్రమే అంతేకాని అవిడకు వారిలోగల పొత్తు ఎట్లాంటిదో, వాళ్ళవాళ్ళ మెలకువలు ఎట్లాంటివో మనకు తెలియదు. ఎంతసేపూ నాయిక విరహవేదన పడుతుంది. నాయకుడికోసం ఎదురుతెన్నులు చూస్తుంది. ఇక చెలికత్తెల శైత్యోపచారాలూ, చంద్రాద్యుపాలంభనాలూ, చివరకు విరహం ఇదీ జరిగే కలాపం. నాయకుడో ధీరోదాత్తుడే అయితే ప్రియాన్వేషణ,సమాగమంలోనే కావ్యాంతానికి వచ్చేస్తాడు దక్షిణ నాయకుడే అయితే ముందటిభార్యకాళ్ళకు మ్రొక్కుతూనే ఆవిడ చెల్వగు పదపల్లవంపు తాకిళ్ళతో తనుపులకాగ్రకంటకవితానుడైకూడా మరికొందరు స్త్రీలకోసం ఆరళ్ళుపడుతూనే ఉంటాడు.

ఎప్పుడూ ఇటువంటి వృత్తాలనే తీసుకుని పాండిత్యప్రకర్షకోసం పాకులాడుతూ యతి ప్రాసలలో తమ భావాలను బిగించుకొంటూ నడిచే కవిలో, మనస్సుకుతటిన ఊహను హృదయం వెలువరించాలనుకున్న భావాన్ని అప్రయత్నంగా చెవులకింపుగా వెలువరించే నిష్పండితుడి పాటకున్న మార్దవం కాని, భావస్ఫోరకత గాని ఉండడం కష్టం.

అతనిపాటల్లో అర్థంలేని పదాలు ఉండవచ్చు. వేంకట పార్వతీశకవుల గీతాలలోమాదిరి కేవలం శ్రుతిమాధుర్యమే కలిగితీసివేసినా చెప్పబోయేభావం చెడని పాదాలకు పాదాలుండవచ్చు. అయినా అతణ్ణి భావలోపంలేని మహారసికుడనాలి. చెప్పదలచుకొన్నది వినేవారికి సులువుగా స్ఫుటమయ్యేట్లు చెప్పగలిగిన ధన్యశాలి అనాలి.

ఇటువంటి పాటలు ఎవరిచేతనన్నా రచింపబడనీ ఎక్కువగా పాడబడేది స్త్రీలచేత. నాఉద్దేశం, వీటిలో ఒక గుంపుకు కేవలం స్త్రీలే కర్తలనికూడా. అవి జోలపాటలూ, సంసారసంబంధి అయిన మరికొన్ని పదాలూ.

ఈసంసారానికి సంబంధించినవాటిలో సామాన్య సంసారి జీవితం విస్పష్టంగా విదితమౌతుంది. తెలుగు సంసారంలో తల్లి, తండ్రి, కూతురు, అల్లుడు, కొడుకు, కోడలు వీళ్లకున్న స్థానం ఎటువంటిది? ఇందులో ఎవరిది గాచరికం ఎవరిది తొత్తరికం అనే సమస్యలకు జవాబులు దొరుకుతవి.

సంసార శకటానికి స్త్రీపురుషులు రెండు చక్రాలు. అయినా యీగీత వాఙ్మయంలో స్త్రీకున్న ప్రాముఖ్యమూ, ప్రాబల్యమూ పురుషుడికి లేదు. ఆడ, బిడ్డగా, కోడలుగా, భార్యగా, తల్లిగా, అత్తగా సంసారరంగంలో విహరించేస్తుంది. అరితేరిన అనుభవశాలిగా అన్ని రంగాల్లోనూ తన్ను నిరూపించుకుంటుంది. మగవాడి విషయం అట్లాకాదు. అతడు బాల్యంలో మాత్రమే గోముగాలాలించబడతాడు. బాల్యదశ గడచిన పురుషుడికి ఈపాటల్లో అంతగా స్థానం ఉండదు. అతడికి బాల్యంలోనైనా ఆముద్దు తల్లికి మగపిల్లని మీద మోజు ఎక్కువగా ఉండడంవల్లనేనేమో!

ఇటువంటి సంసారాల్లో ఆడబడుచులా హంసలు, చిన్నకోడళ్ళు చిలకలు, పావురాలు బాలపాపలు, కొత్తకోడళ్ళు కోయిలలు, చిలకల్లు చిలకల్లు అందురేకాని, చిలకలకు రూపేమి పలుకులేకాని. అని ఒక యిల్లాలు ప్రశ్నించుకుంటుంది. ఆవిడకు చిలుకలో అందమేమీకనిపించదు. కాకపోతేదానికి పలుకు సొగసు ఉన్నది. ఇంతమాత్రమే నాకూచిన్నకోడలికి పలుకుతోపాటు అన్నీ ఉన్నవని గర్వపడుతుంది. ఆభావనలో అసలు చిలుకనుత్రోసిరాజని "చిలుకల్లు మాయింటి చిన్నకోడళ్ళూ అని సృష్టి కర్తమీదకే సవాలు తీస్తుంది.

ఇక తల్లిగా స్త్రీకి చక్కని బాధ్యత ఉన్నదని నిరూపిస్తవీ పాటలు. ఆవిడ పిల్లల్ని లాలిస్తుంది. గోముగా పెంచుతుంది. ఉయ్యాలలో ఊచుతూ తన మనోభావాల్ని అహృదయంలేని పసికూనతో చెప్పుకుని మురుస్తుంది. తన బిడ్డనుగూర్చి అడిగినవారికీ అడగని వారికీ చాటుతుంది. అందులో ఆవిడకు ఆడబిడ్డల మీదకన్న మగపిల్లలమీద మోజు హెచ్చు. కాబట్టి కొడుకులకననివాళ్ళ కడుపేమి కడుపు? అని నిశ్చలంగా ఒక గిరి గీసుకుంటుంది. ఇట్లాంటి కొడుకు పక్షపాతం చాలా ఎక్కువగా కన్పిస్తుంది. ఇక్కడ ఒక యిల్లాలికి వాంఛనీయాలు చాలా ఉంటవి. అందులో ముఖ్యమైనవి ఇవి.

తింటేను తియదోస-పండ్లైతినాలి
కంటేను కొడుకుల్ల కాన్పేకనాలి
అందితే అన్నతో వియ్యమందాలి
ఆడితే వదినతో జగడమాడాలి.

అటువంటి కొడుకులకోసమై గొడ్రాళ్ళంతా సింహాద్రి అప్పన్నగుళ్ళముందు ప్రాణాయామం పడతారు. "కొమాళ్ళనియ్యమని కోరిపడతారు"

అబ్బాయికి తండ్రితోనే కాక మేనమామలతో కూడా ఎక్కువ సంబంధం కల్పిపెడుతుంది తల్లి. "అందితే అన్నతో వియ్యమందాలి." నేది స్త్రీ వాంఛలలో ఒకటని ఇదాక చెప్పుకున్నాం.

అందుకని యీపాటల్లో మేనమామలప్రసంగాలు తరుచూ వస్తుంటవి. వారిని వర్ణిస్తూ.

చెవిచెవికి బారెడే పోగుల్లవారూ
అంచుపంచెలవారు అంగీలవారూ
పటుపంచెలవారు పాగాలవారూ
పెసరకాయల వంటి పెదిమల్లవారూ
కందికాయలవంటి కనుబొమలవారూ
మిరెపకాయలవంటి మీసాలవారూ

అని చెప్పి 'వారు మాఅబ్బాయి మేనమామల్లూ' అని తీవిని ఒలకబోస్తుంది. అదే కూతురి మామగారిని, అనగా తన వియ్యంకుడిని పాడేటప్పుడు ఆవిడ ధోరణి వేరు. అక్కడ ఆమె ఎంతఎగతాళి-చేసి హాస్యాన్ని చిలుకరిస్తుంది. చూడండి

అమ్మాయి మామల్లు ఎటువంటివారూ
చేపగంపలవద్ద చెయిజాచువారూ
గుడ్డిగుర్రాన్నెక్కి గోజారువారూ
పందిపిల్లానెక్కి పరుగెత్తువారూ

ఇట్లా అనడానికి కారణం ఆమామ, తన తమ్ముడో అన్నో కాడుగనుక ఏమంటే ఆకాలంలో ఎదురు మేనరికాలు నిషిద్ధం. అన్నకూతుర్ని తన కొడుక్కు చేసుకుంటుంది. లేదా తన తమ్ముడికి కూతుర్నిచ్చి చేస్తుంది. అంతేగాని అన్నకొడుక్కు తన కూతురిని ఇవ్వదు.

అటువంటి మామలదగ్గర తన కొడుక్కుఎక్కడ లేని అధికారం. వాడంటే వాళ్ళు బెదరాలి. అల్లుడిని మంచి చేసుకోవడానికి అవీ ఇవీ తెస్తుండాలి.

ఆతల్లికి కొడుకుమీదేగాని కూతురిమీద ప్రేమ ఉండదని కాదు. అదెట్లా లేకుండా పోతుంది? తనూ ఒకరికి కూతురేనాయె! కాని అక్కడ, ఆమె అనురాగప్రకటనకు, పరాయింటికి పోబోయే పిల్ల అనే దిగులు అడ్డువస్తుంది. దానితో అక్కడ ఎట్లా మెలగవలెనో ఎన్నిజాగ్రత్తలు కలిగి ఉండవలెనో ఆవిధంగా కూతురిని తయారు చెయ్యవలెననే జిజ్ఞాస కలుగుతుంది. అక్కడ ఆమె గురువు కూతురు శిష్య. కొడుకు విషయంలో ప్రకటించే అంతగోము ఈ సంబంధంలో ప్రకటిత మవడానికి వీలుచిక్కదు.

కూతురు పుట్టిననాటినుండి ఇంటెడుచాకిరిచెయ్యడంలో తర్ఫీదు కావలె. వంటవండడంలో, చేయెత్తి పోటెయ్యడంలో ఎద్దడినీళ్ళు తేవడంలో ఆఖరికి ఏరుపిడకలు సంగ్రహించుకోవడంలోకూడా దానికి నేర్పు కావలె. ఇవన్నీ అత్తింటికోడలైనపుడు అత్తగారి ఆగ్రహానికి గురిగాకుండా ఉండేసాధనాలు.

ఇకతల్లి తనకూతురికి నగలు కావాలని ఆరాటపడుతుంది. ఏమితెలియని పసికూన ఉయ్యాలలో పాలకేడ్చినా "అదిగోనమ్మా వారు నీకు పెట్టెడు నగలు తెస్తున్నారు. ఇదుగోనమ్మా వీరు నీకు గంపెడు నగలు తెస్తున్నారు. అని సముదాయిస్తుంది. అట్లా తెచ్చేవారిలో తనపుట్టినింటి తరపువారెక్కువ. వాళ్లు పిల్లను మెచ్చి, ముత్యాలు గుప్పించిన నత్తు,

చిలుకలు వేయించిన చీర, రత్నాలు తాపించిన రవికలు పంపుతారు. వాళ్ళఆశ అంతా ఆపిల్లమీద. తల్లికూడా ఎప్పుడూ తనతమ్ముణ్ణి అల్లుణ్ణి చేసుకోకావాలని ఉంటుంది.

యీవాజ్మయంలో అత్తా కోడలూ కలసిమెలసి పూసల్లో దారానికిమల్లే ఉన్నట్లు ఎక్కడా కనపడదు. ఎప్పుడూ అత్త కోడలిమీద కారాలు మిరియాలు నూరడం, కోడలు చాటున మాటున గ్రుడ్లనీరు గ్రుడ్లకుక్కుకుంటూ ఈశని ఎప్పుడు విరిగడవుతుందా అని దణ్ణాలు పెట్టడం పరిపాటి. అత్తకోడల్ని సాధించలేని మేదకురాలైతే కోడలే తిరగబడి అత్తను సాధిస్తుంది. వాళ్ళిద్దరికి ఎప్పుడూ పులీ మేకా సంబంధం. అత్త అడుగుతుంది కోడల్ని

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా
పచ్చిపాలామీద మీగళ్ళుఏవి
వేడిపాలామీద వెన్నలుఏవి
నూనెముంతలమీద నురుగుల్లుఏవి !—

దానికి కోడలు ఎదురుగా సమాధానం చెప్పదు. కళ్ళునిప్పులెప్ప ఊరుకుంటుంది. కాని సందుదొరికితే వారినీ వీరినీ పిలిచి,

ఇరుగు పొరుగూలోని ఓచేడెలార!
అత్తగారాగిళ్ళు చిత్తగించండి!
పెత్తనం లాగేస్తె పేచీలు పోను!

అని ఎత్తిపోస్తుంది. అంటే కోడలూ స్వతహాగా మెత్తది కాదు. కాకపోతే అత్త అనేశక్తికి భగవంతుడు లాంగి ఉండమన్నాడని ఆపిడ నమ్మకం కాబట్టి తన అత్త తనమీద చెలాయించిన అధికారం తనకోడలిమీద చూపడానికి ఎదురుచూస్తుంది. ఈ వత్తిడికి రెండువైపులా పదును. ఇది ఒక చక్రం. కాబట్టే

అత్తలేనీ కోడలు ఉత్తమూరాలు
కోడలూ లేనత్త గుణవంతురాలు

అని పాడుకుంటుంది స్త్రీ.

అట్లాగని అత్తంటి కోడలు అలిగి పడుకుంటే "అలుకల్లు తీర్చేదిములుకల్లకఱ్ఱ—ఇదికోడలిజీవితం.

ఆదశదాటినభార్యబ్రతుకు చక్కనిదే. అక్కడే ఆవిడ అన్నీసమర్థించుకో గలదు. భర్తప్రమేయం లేకుండా ఇల్లుసరిదిద్దుకోగలదు దానికీ దీనికీ అనక చాలావరకు భర్తపై అధికారం చెలాయించగలదు. వారిద్దరికీమధ్య అప్పుడప్పుడు అలకలు సాగుతుంటవి. అప్పుడు భార్యభర్తతో మాట్లాడదు.

వంకాయకూరండాను వరికూడువార్చాను
తినమనీ చెప్పవే తడికా తడికా !—

అని భర్త వినేటట్లు మధ్యనిర్జీవ వసువుతో సంభాషణ సాగిస్తుంది. దానికి సమాధానంగా అతడు

వగలాడి మాటలకు వళ్ళంతమండింది
వద్దని చెప్పవే తడికా తడికా !

అని తిప్పికొడతాడు. దానితో ఆ కోపం పెరుగుతుంది. దానికి సహించలేక కొంచెం మెత్తబడేవంతు భర్తది. ఈమారు అలిగేవంతు భార్యది.

"పట్టు-చీర తెచ్చాను పెట్టెలో పెటాను
కట్టమని చెప్పవే తడికా తడికా !"

అంటాడు భర్త. దాంతో ఆవిడ చప్పునలేచి చీర చూడడుకుంటుంది, కాని మూతివిరిచి,

"చీరకంచులు లేవు చుట్టు చెంగులు లేవు
వద్దనీ చెప్పవే తడికా తడికా !"

అని తన నిరసన తెలియజేస్తుంది. కాని తరువాత వారిద్దరికీ రాజీ ఎట్లాగో కుదురుతుంది. ఇక ఆ కోపాలు వారికుండవు.

తెల్లగా తెల్లవారీ భర్త నిద్రలేవకపోతే, భార్య సరసంగా,

చుక్క తెల్లవారె తూర్పు తెలవారె
బూరుగపూచింది బారువనంలో
కలవల చెర్లోకి నీళ్ళుచేరాయి
కాళ్ళుకడుగ మీకు వేళాయెలెండి !

అని లేపుతుంది, ఆవిడ భర్తను ఉడికించాలని ఎప్పుడూ అతనిముందు తనవారిని పొగడుతుంటుంది. దానికి ఊరుకోక భర్త కర్మచాలక,

"అన్నల్ని పాడేవు తమ్ముల్ని పాడేవు
నన్నేల పాడవే?

అని అడిగినా?

ఏమని పాడేది వెఱ్ఱిమాధవుడా?"

అని అమాయికతను నటిస్తూ ఎగతాళిచేస్తుంది.

ప్రేమగలభార్య బిడ్డకు జోల పాడేటప్పుడుకూడ భర్తను మర్చిపోదు.

నిద్రపో బలభద్ర రాజకుమారా
నిద్రకూ నూరేళ్లు నీకునూరేళ్లూ
నినుగన్న తండ్రికీ నిండునూరేళ్ళూ

అని భర్తనుకూడా కలుపుకుని ఆశిషాలు కురిపిస్తుంది.

తనఇంటికి చుట్టాలు పక్కాలు రావాలని ఇల్లాలు ఎప్పుడూ ఆశపడుతుంది.

కాకమ్మ కుయ్యావే తరిమి కుయ్యావే
కుయ్యావే మాయింటి గుమ్మాలలోన!

అని అర్థిస్తుంది.

వెళ్ళవే మావారు అంటిచెట్లకూ
మెసలవే మావారి మల్లెసాలల్ల!

అని ఆహ్వానిస్తుంది కాకిఅరుపు చుట్టపురాకకు సూచన కాబట్టి ఆమె ఆశ చక్కనిదే.

భూమిగల ఇల్లాలైతే వానలు కురిపించమని దేవుణ్ణి ప్రార్థిస్తుంది. ఆ ప్రార్థన భక్తుడు భగవంతుడికి విన్నవించినట్లుకాదు. ఒకబంధువు ఒకబంధువు నడిగినట్లు.

వానదేవుడ నీకు వరసచెల్లెల్ని
వర్షాలు కురిపించు పరిమళ్ళలోన

అని దేవుడితోకూడా ఆవిడ వరుసలు కలుపుకుంటుంది. లాలనలోనే కాక కోపం వచ్చినప్పుడు ఆమె శాపాలు పెట్టడానికీ సమర్థురాలే!

ఆకార్యం జరిగేపక్షంలో,

"సరసగానీవార్ని వగసాడబోతే
పురుషుడానీ శిరసు ధరణికొరిగేనీ
కానివార్ని నీవు కాగాడబోతే
కాముడానీ శిరసు కాటికొరిగేనీ!"

అని కోపోద్రిక్త అవుతుంది.

ఇక వారితుష్టినీ, నిష్కామతత్వాన్ని కూర్చి ముక్త సరిగా చెప్పాలంటే వాళ్ళకుండే కోరికలు చాలాకొద్ది. అయినా ఆశపాశాలు లేనివారి సంసారం సజావుగా నడుస్తుంది. వరిఅన్నం వండినా చారుచేసినా వారికి పండుగ. కూర తాలింపుపెట్టుకున్న నాడు పర్వదినమే.

ఈ విధంగా జానపదుల నిరాడంబర మధుర జీవనం, ఈ సాహిత్యంలో ఎక్కడపట్టితే అక్కడ మనోహరంగా వర్ణించబడింది.



పట్టప్రదాన సభ

# స్నాతకోపన్యాసము



కవిసమ్రాట్

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ



ఆంధ్ర సారస్వత పరిషదధికారులకు పరిషత్సన్నివిష్టులకు నమోవాకములు,

నన్ను స్నాతకోపన్యాస మిమ్మనుట మహాగౌరవముగా భావించుచున్నాను. మీ పరిషత్తు ప్రజా విద్యా పరిషత్తు. రాజకీయ విద్యాపరిషత్తులలో మాదృశులకు స్థానమే లేదు. అవి యధికారికదృష్టి గలవి. మీది ప్రజాదృష్టి. ప్రజలలోనున్న కవులను, మేధావంతులను, అనధికారులైనను మీరు గౌరవింతురు, ఇది ప్రజాభ్యుదయకరమైన దృష్టి. మీది యచ్చముగా నాంధ్ర భాషాపరిషత్తు. నలుబదియేండ్ల తపస్సు పంట కున్ముఖమైయున్నట్లు నేడాంధ్రము కనుచూపుమేర గన్పించుచున్నది. మనకు రాబోవు నాంధ్రరాష్ట్రము రాజకీయ రాష్ట్రమా? భాషా రాష్ట్రమా? రాజకీయ వ్యవహారములు మాతృభాషలో జరిగినప్పుడే సర్వజనుల వ్యవహారములు అందరికి సులభముగా సిద్ధమగుటయు, సుఖజీవనము జరుగుటయు సంభవమగును, పరరాజ్య మిచ్చుటనున్న స్వభావము మనదేశనాయకులు చేసిన ప్రచారము. స్వరాజ్యము వచ్చినంతనే యూపివేశ మంతరించి పరభాషా వ్యామోహమే పాదుకొన్నది

దేశీయమైన ప్రతిభ స్వభాషాభ్యాస తద్భాషాగత భావ జీవనములనుండి పుట్టును. ఇది శాస్త్రీయమైన నిర్వివాదాంశము. దోహదక్రియలచేత నొక వృక్షమును పుష్పింప చేయవచ్చును. ఫలింపజేయవచ్చును. ఒకపొలములో నధికమైన పంట పండించవచ్చును. మొదటిది రామణీయకదృష్టి. రెండవది యార్థికదృష్టి. సహజదృష్టి కాదు. అన్నము వికారము పొంది శరీరమునందు రక్తముగా బరిణమించును. సహజాన్నభోక్త యొక్క రక్తగుణములు సహజములై నిరుపద్రవకరములై యుండును. కృత్రిమాన్నభోక్త రక్తగుణములు అసహజములై విప్లవములకు దారితీయును. అట్లే మాతృభాషాపఠన తద్గతభావ చర్వణములనుండి పుట్టిన ప్రతిభతద్దేశకాల పరిస్థితు

లకు సహజములై సాధువులు, దేశీయ లక్షణముల కనుకూలములు తనయొక్క యాత్మగుణములు పుష్పించుటకు సహజవికాసము పొందుటకు యోగ్యములై రమణీయకార్యములుగా వైపరీత్య స్పర్శ లేకుండ పరిణమించును. తన బుద్ధి వికసించువరకు మాతృభాషనే చదువువాడు సహజమైన వికాసమును పొందును. ఎవనిబుద్ధి పరభాష చదువుటచేత వికసించునో వానిది వికాసము గాదు. అది వికృతిమత్తు అదియు వికాసమే. ఆవికాసముయొక్క లక్షణము వేరు. ఒక వస్తువునందలి పరిచయము తద్గతదోషములను భాసింపజేయనీయదు. పరిచయము మానవ భావపరంపరకు మూలకందము. వాని విశ్వాసములకు మూలాధారము. సర్వభావనయు ప్రజ్ఞామితము. మనుష్యునియొక్క యూహ సర్వము వానికి పరిచితములైన వస్తుజ్ఞానమునుండి సముద్గత మగుచున్నది. వానికి పరిచితమైన వస్తుసామగ్రినుండి యీ యూహ పుట్టుట సముచితమే. ఆ యూహా పరంపరకూడ సుసంగతమే. మొదటిదైన వస్తు సామగ్రియొక్క స్థితియు, నౌచిత్యము విచార్యములైనపుడు తదనంతర భావపరంపరా సుసంగతత్వము క్లిష్టమై సత్ఫలదాయి కాకపోవుచున్నది. సామాన్యమైన మానవ ప్రకృతి తత్కాల దృశ్యమానమగుచు పరిచితమైన పదార్థములయందు బద్ధాదరమగుచున్నది. ఎవడో వేయి మందిలో నొకడు, పదివేలమందిలో నొకడు కృత్రిమేతరమైన భావములను, పరిస్థితులను సన్నికృష్టమైన యితరభావములచేత సమాకర్షింపబడక యూహింపగలవాడు. అతడు సహజముగా విచారణదక్షుడైయుండును. అతని స్వభావము విచారణ చేయుట. అతని ప్రకృతి తదితరముల పొంత పోదు. అతనికి లౌకికాధికార దృష్టిలేదు. తద్గతవాంఛలేదు. అతడు స్మృతికారుడు. పూర్వ ఋషులు ఏతాదృశులు. రాజ్యములను చేయుటయు, ప్రజలను నియమించుటయు వారి పనికాదు. వారు ప్రజానుస్థితి మార్గముల నూహించువారు. వారేస్మృతికర్తలు వారే ఋషులు. వారి యాలోచనాసారమును రాజులంగీకరింపవలయును. పాలకులు స్వీకరింపవలయును పాలించువాడు తద్విచారణ దక్షుగాడు. అతని శక్తి తత్స్మృతి మహార్థములను లోకాచరణమునందు భద్రపరచుటలో నున్నది. పాలకుని కార్యమిది. స్మృతికర్త చేయు పని యది. సర్వజనులకు మనస్సున్నది, యూహయున్నది. అందరికి సమానముగా నున్న వీనియందు సామాన్యాంశకొంత? భేదాంశ కొంత. ఈ విశేషాంశ యధికమైనది. విచారణదక్షుల యందు విశేషాంశ యున్నది. అది పరమమైన కోటినిపొందిన దానిని ఆదరించుట లోకస్థితి హేతువు.

ఇచట నిష్కృష్టమైన విషయము మానవుని బుద్ధి స్వభాషాపఠన తద్గతభావ చర్వణములవలన వికసింపవలయు ననునది. స్వభాషయొక్క పరిణాహము తద్గతభావ సామగ్రియు నల్పమైనని. అందుచేత దానికంత సామర్థ్యములేదు అనియొకవాదనచేయవచ్చును. ఒకవేళ నట్టిదేయైనచో నాభాషయొక్క స్వత్వమునకు పరమానుకూలమైన భావపరంపర మరి యేయితర భాషయందున్నదో యా భాషను స్వీకరింపవలయును.

సంస్కృతభాష మృతభాషయని మనదేశీయులను ప్రతారించి తమభాషనేర్పితమ భాషయందు వ్యామోహము గలిగించి స్వప్రయోజనముకొఱకు మననాగరకతయందు వైముఖ్యముగలిగించిన బ్రిటిష్ రాజనీతిజ్ఞుల తంత్రముచేత మనము మూఢులముకారాదు. బ్రిటిష్ రాజకీయములు తత్ఫలమునందలి దౌష్ట్యము తెలిసి మనస్వరాజ్యము మనకువచ్చిన తరువాతకూడ ఆనీతితంతులను కాలదన్ని తెగద్రెంచక పోయినచో మనము ఋషులైన విచారణదక్షులచేత నుపన్యసింపబడు మహాఫలదాయియైన సహజ మార్గమునందు స్వమార్గమునందు పోవుటయందు విమనస్కులమన్న మాట. లేదా పెరవాడు కల్పించిన భ్రాంతి అంత గాఢముగా నున్నదన్నమాట. అనేకములైన యాధునిక ప్రకృతి శాస్త్రాదిక ఫలితములైన విషయములు వేదములందున్నవి. నేటి డార్విన్ పరిణామవాద మున్నది. ఇట్టి వేవియు మనకు క్రొత్తగాదు.

మనము పరభాషాభిమానులచేత, పరదేశనాగరకతా వ్యామోహవంతులచేత పాలింపబడు

చున్నాము గనుక, వారికిని మన పూర్వనాగరికతా సంపూర్ణ జ్ఞానములేదు, రానివిషయము తెలియదు గనుక దానియందభిమానములేదు. అభిమానము పరిచయాధిక్యముచేత గలుగును. ఈరహస్యమే ఆంగ్లేయ రాజనీతి వేత్తలకు తెలియును. వారు దానిని మనమీద ప్రయోగించిరి. మన మెట్లు కావలయునని వారనుకొనిరో మన మట్లయితిమి ఎంతవరకైతిమనగా మన మని, మన మొకర మున్నామని తెలియనంతవరకైతిమి. ఇట్లు చెప్పిన మనలో నొకనిని మనలో నింకొకరు విరోధిగా పాటించు నంతవరకైతిమి. ఆహా! ఆంగ్లేయ రాజనీతివేత్తృ నిర్మాణ చాతుర్యము.

ఇది సంస్కృత నాగరకతనుగూర్చి చెప్పబడినది. ఇదియంతయు తెలుగుల నాగరకత యెట్లగు నని కొందరు ప్రశ్నింపవచ్చును. తెలుగుజాతియొక్క స్వత్వము సంస్కృత భాషాగత నాగరకతా స్వత్వముకంటె భిన్నముగాదు. భిన్నముగాదన్న విషయము బహుసహస్ర సంవత్సరములచేత నిరూఢమైన విషయము.

భాషా స్వభావదృష్టితో జూచినను ఆంధ్రులు ద్రావిడులుకారు. ద్రావిడనాగరికత యని వేరే నాగరకతయున్నదని చెప్పుచున్న చరిత్రవేత్తలు పాశ్చాత్యభావజనిత భావసామగ్రి కలవారు. మొహంజోధారప్పలలో నున్న నాగరకతకూడ ద్రావిడనాగరికతయని బాలురపాఠ్య గ్రంథములలో వ్రాయుచున్నారు. ఆ నాగరకత యైదువేల యేండ్ల పూర్వముది యని వారే యనుచున్నారు. భారత యుద్ధమైదువేల యేండ్లకు పూర్వము జరిగినది. మొహంజోదారోహారప్ప గ్రామములు పాంచాలదేశోపకంఠములు. పాంచాలురు కౌరవులువిద్యమందిన వారు. శ్రౌతరాహమైన నాటి నాగరకతయంతయు సంస్కృతనాగరకత. అదియెట్లుపొసగునో తెలియదు

నేడు పాశ్చాత్యుల ప్రకృతి శాస్త్రపరిశోధనా విషయములు లోకమునకు మేలు చేకూర్చుచున్నవి. వానిని స్వీకరించిన తప్పేమి? యన్న ప్రశ్న. అందులో తప్పేమియు లేదు. అవి లౌకికోపయోగము గలవి. మానసిక సాంస్కృతిక విషయములను భిన్నములుగానే యుంచి లౌకికోపయోగ కరములైన వానిని శావన్మాత్రదృష్టితో చూచినచో జాతీయతకు భంగములేదు. లౌకిక విషయములందధిక ప్రజ్ఞావంతు డొకడున్నాడు. వానిని లౌకికవిషయములయందనుసరింపవలయును. ఆధ్యాత్మికాది విషయములయందనుసరింపగాదు. ఆధ్యాత్మిక సాంస్కృతిక విషయములయందు నీ సంప్రదాయము నీ పరంపర పరమార్థకములైనవి. అట్లు చేసినచో నీవు ప్రతారితుడ వగుచున్నావు. నీవది యెరుగవు. అదికాదనుచున్నావు. కాదు ఈ ప్రకృతి శాస్త్ర పరిశోధనల సంబంధమునమువారి ననుసరించుచున్నాము మనదేశస్థులైన మహర్షులవంటి వారైన యాధునిక ప్రకృతి శాస్త్రవేత్తలకు లౌకికాధికారము సాధించు మహావిషయములను కనుగొను దృష్టిలేదు. ఒక మహర్షికల్పుడు కాళిదాసాదులవలె వృక్షముల యందు ప్రాణమును చూచుచున్నాడు. మరియొక మహర్షిప్రాయుడు ఆకాశనైల్య హేతువును దర్శించుచున్నాడు. మరియు మణికిరణ ప్రసార హేతు విచికిత్సా ప్రయత్ను డగుచున్నాడు. ఒక శతఘ్నియో, సహస్రఘ్నియో, దశశత సహస్రఘ్నియో కనిపెట్టు ప్రయత్నములు లేవు. ఆ రీతిగా మనమీద అమెరికా రష్యాల ప్రాబల్యముపోదు. మనపూర్వ నాగరకత లౌకిక విషయములయందశ్రద్ధ వహించినదని కొందరియూహ, అదియెప్పుడునుగాదు.

నేటి పాశ్చాత్యనాగరకతలో గల యే విషయమునందును ప్రాచీననాగరకత తీసిపోలేదు. గ్రామ పారిశుధ్యము, గ్రామనిర్మాణము, గ్రామ పాలనము ఇట్టి విషయములయందు మన పూర్వులు నేటిస్థితికి మించియుండిరని కొంత మొహంజోధారప్పాలు చెప్పుచున్నవి. స్మరణీయుడైన లాలా లజపత్ రాయ్ రచించిన **Unhappy India'** అన్న గ్రంథములోనను, మరి పెక్కు గ్రంథములలోనను గ్రామపాలనాది విషయములు మన పూర్వ భారతదేశ విషయమున నెంతవఱకు చెప్పబడినవో తెలిసికొనవచ్చును, బహుగ్రంథములు తొలుత పాశ్చాత్యులు, ఇటలీ, పోర్చుగీసు, మిషనరీలు తగుల

బెట్టిరి: వారికి కనుపించిన ప్రతిగ్రంథమును తగుల బెట్టిరి. నెలనాళ్ళక్రింద పత్రికలలో ప్రచురింపబడిన విషయము సంస్కృతములో విమాననిర్మాణశాస్త్ర మున్నది. అందులో పేర్కొనబడిన కొన్నిరకములైన విమానములను పాశ్చాత్యులు కనిపెట్టలేదు. మన వాండ్రు మా పూర్వు లంతవారింత వారని చెప్పు కొనుటయేగాని నిష్క్రియ లన్ననింద యొక దున్నది. క్రియాచరణ మనునది తత్కాలానుకూల పరిస్థితులమీద నాధారపడియుండును. రాజ్యము మనదై పాలించువారు జాతీయతాపునరుద్ధరణ భావ నిష్ఠులై విద్యాపద్ధతి జాతీయతాభావ ప్రోద్బలకమై యున్నచో క్రియాచరణము జరుగును. తిండిలేక మాడుచు నెవడును మహాకార్యమును సాధించలేడు. ఎంతవరకు విదేశీయమైన ప్రతిభకు ప్రోత్సాహము. స్వజాతీయమైన ప్రతిభకు నిరుత్సాహము. దాని వంకనే చూడుము, ఎంతపరిశోధన పరిశ్రమలకు, ప్రకృతిశాస్త్ర విషయములకు, పాశ్చాత్యభాషాను కరణములకు ప్రోత్సాహము. ప్రకృతి మది తప్పు. నిజమే. స్త్రీభాషావిషయమును ప్రసిద్ధించరు. దేశభాషలను దిక్కరించెదరు. ఇంగ్లీషు చదివినచో వారు విద్యావంతులు. ఇంగ్లీషుభాష విద్యయున్న శాస్త్ర మునిసిపలు సభలవలె, అది స్వతంత్రదేశము భాష కాని యొకనాడు, మరియేండ్లు క్రితము కూడ గ్రాంథిభాష లంతర్జాతీయ భాష. ఇప్పుడు దానిని చదువుచున్నారా? రష్యన్లు, U. N. O. లో వారి భాషలోనే మాటాడుచుండిరి. వారికి గాని యింత జాతీయ భాషయొక్క యవసరము నీకేమున్నది? జాతీయ భావనిష్ఠుల కెప్పుడు నుండదు.

మనదేశములో విద్యావంతులన్నచో నింగ్లీషు చదువుకొనినవారుగా నేర్పడినది. ప్రచ్ఛన్నముగా సంస్కృతాంధ్రములు చదివినవారికి ప్రత్యేకస్థితి లేదు. వారు ఛాందసులని, ప్రపంచక జ్ఞానము లేని వారని ప్రమాణమగుచునే యున్నది. సంస్కృ తాంధ్రములు చదివినవారిలోకంటె ఇంగ్లీషు చదువు కొనినవారిలోననే యెక్కువమంది ఛాందసు లున్నారు. ఈ సంస్కృతాంధ్ర పండితులయందలి ఛాందస మెట్టిది? వారికి చరిత్ర భూగోళాది విషయములు తెలియకపోవుటయే ఛాందసమా? చరిత్ర భూగోళాది విషయములు ఊరకే చదువుకొని తెలిసికొనవచ్చును. వానికి పరీక్ష లక్కరలేదు. విద్యావంతుడైనవాడు వానివంకచూచి తెలిసికొన వచ్చును. ఈ విశ్వవిద్యాలయపు రాజకీయపు చదువుతో దేశమునందలి బాలురయొక్కయు, యువకులయొక్కయు శక్తియు, కాలమును వృథాగా వ్యయపరుపబడుచున్నవి. రెండునెలలు గట్టిగా చదివి పరీక్ష యీయదగిన పాఠ్యగ్రంథములకు రెండుసంవత్సరములు వినియోగింపబడుచున్నవి.

స్వర్గీయులు మహామేధావులు శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారికి నాంగ్లేయ భాషరాదు. షట్శాస్త్రములలో మహాపండితులును దేశ మందున్నారు. వారికి పెదయధికారము లెందుకు లేవు? వారి విద్యావిధానములో తప్పిదము పొందలేదు గనుక. నేడు ఉభయభాషా ప్రవీణ పరీక్షను వ్రాసెడువారు కూడ ఉన్నత పాఠశాలలలోవలె నారెండ్లు మూడు మెట్లుగా పోవలయునట. ఇంతవయసు నుండినగాని వారు పరీక్షకు కూర్చుండ రాదట. ఇది విద్యను వ్యాపింపచేయు లక్ష్యమా? ఉద్యోగముల దృష్టిలో విద్యను నియమించు లక్షణమా? ఇంతగగ్గోలుగా నున్న యీ పరిస్థితి దేశభాషలమీద తెనుముద్ర వేసినది. విశ్వవిద్యాలయ పరీక్షలతో తొలినాటి పాండిత్యము దేశమునందు తగ్గిపోయినది. పరీక్షా దృష్టి తప్పకవలయునది. సర్. సి. వి. రామన్ మహా పండితుడు. ఆయన తన ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానము నందు తారామండలమునందున్నాడు. అంతేకాదు; సంస్కృత పాశ్చాత్య సారస్వత వేదాంతముల యందు మహాపండితుడు. ఈ పాండిత్యము లేక పోయినను, ఆ మహాపండితునియొక్క ప్రకృతి శాస్త్రవిజ్ఞానము భాసింపకపోదు, ఆ మహాపండితునికి అట్లే ఒక వైయాకరణునకు, తక్కిన విషయములు తెలియనక్కరలేదు. ఆయనకు భూగోళము, చరిత్ర తెలియదనుట న్యాయమైన దృష్టికాదు. ఇంతకు ఈ శిరోమణులు, నుభయభాషాప్రవీణులు దేనికి? కళాశాలలలో రెండుమూడు భాగములలోని పాఠములు చెప్పుటకు, ఆ పాఠములు చెప్పుటకే శాస్త్ర

జ్ఞానమును నక్కరలేదు. సాహిత్యవేత్తృత్వముగూడ నక్కరలేదు. బహువిషయములు చెప్పబడి యే విషయమునందును సంపూర్ణజ్ఞానము లేకుండ జేయబడుచున్నది. పెద్ద పట్టభద్రులై తాము మాతృభాషలో మాటాడుటకు చేతకానివారు దేశములో నెంతమందియున్నారు, వారి భావములు చెప్పుటకు తెలుగుభాషకు శక్తి చాలదా? ప్రాథమిక పాఠశాలలో నేడు లెక్కలు మొదలైనవి తెలుగులో చెప్పపడుచున్నవి. ఆగ్రంథములు తెలుగులో వ్రాయబడినవి. అవ్రాసినవారు 'లీలావతీ' గణిత మెరుగరు. 'పావులూరి మల్లన్న' గణిత మెరుగరు. అచటి పరిభాషాపదములకు మన భాషలోని శబ్దము లేవో తెలియకవారు సృష్టించిన పదములు వేరు; మరియొకడు సృష్టించిన పదములు వేరు. ఇట్లే ఖగోళశాస్త్ర విషయములు వ్రాయ వలసి వచ్చినచో 'వరాహమిహురుని' నెరుగకుండ, వేదమునందలి బహువిషయములు నెరియకుండ సాధ్యపడదు. అట్టి కార్యమునకు యోగ్యులైన వారు శ్రీ వేలూరి శివరామశాస్త్రివారివంటివారు. వారి నడిగెడివారు లేరు. మన దేశములో చరిత్ర పరిశోధకులున్నారు. వారికి డిగ్రీలు లేవు. అందు చేత ధూపదీపనైవేద్యములు లేవు. ఆంగ్లేయులు రాజ్యము చేయుచున్నప్పుడు ఇదియంతయు వారి రాజనీతిలోని భాగము. అపుడు మనము నిస్సహాయులము. ఇప్పుడు స్వతంత్రులము గదా? ఆంధ్ర చరిత్రలో ననంతమైన పరిశోధన జరిగినది. ఈ విశ్వవిద్యాలయములలో దాని కెంత వరకు స్థానమున్నది? ఇంగ్లండుయొక్క చరిత్ర ఘనము పాఠ్యక్రమముగా చదువదగినంత యవసరమే మున్నది?

ఈ మహామంత్రములో, ఈ మహావాగుగలో సంస్కృతాంధ్రముల యొక్క జ్ఞానము క్షీణించి పోయినది.

మీ పరిషత్తు విలక్షణమైనది. నేటి విశ్వవిద్యాలయముల వంటిది గాదని మొదటనే విన్నవించితిని. ఈ పరిషత్పట్టభద్రులకు రాజకీయ విద్యాముద్ర లేదు గనుక జీవనోపాధి గడచుట కష్టము. రాజకీయ ముద్రతోపాటు తన్నిబంధనలు వచ్చును. ఆ నిబంధనలతో ప్రస్తుతస్థితి కచ్చమగును. ఒకదానిని వదలి యొకటిసాగదు. 'రాజానుమతో ధర్మః' అని చెప్పబడిన మాటయొక్క యర్థ మిదియే. ధర్మమును పాలకులు నిలుపవలయును. జాతీయతను పాలకులు రక్షింపవలయును. అంతవరకు మీ సంస్థలు పాండవుల వలె నరణ్యవాసము చేయవలయును. నన్నీ యుపన్యాసమునకు నిర్ణయించినందులకు మీ పరిషదధికారులకు మత్కృత నమస్కారములు.

"యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరకులు నించవోయ్ ’’

——గురజాడ

# బాలవాఙ్మయము-ఆవశ్యకత



## డా॥ శ్రీ గిడుగు సీతాపతి



బాల వాఙ్మయాభివృద్ధికి కృషిచేయ దలచుకొన్న వారందరున్నూ ముందుగా బాల బాలికల చిత్తప్రవృత్తులను లెస్సగా తెలుసుకోవలెను. మన దేశమందు ప్రాచీనకాలములో ఆధ్యాత్మిక విద్య వృద్ధి పొందినది గాని మనశ్శాస్త్రమంతగా కృషిగావింపబడలేదు. అక్కడక్కడ మానవచిత్త ప్రవృత్తులకు సంబంధించిన వాక్యములుమాత్రమే ఉన్నవి. వాటిని బట్టి మనశ్శాస్త్రమును గూర్చి మన పూర్వుల అభిప్రాయము లెట్లుండెనో కొద్దిగా తెలుసుకోగలము. పాశ్చాత్యదేశములలో ఈ మనశ్శాస్త్రకృషి ఇటీవలనే ప్రారంభమైనది గాని శీఘ్రకాలములో విపులముగా రూపొందినది. శాస్త్ర విషయములలో పాశ్చాత్యులు చేసే కృషి పరిశోధనలతోను నిరీక్షణలతోను క్రమక్రమముగా వృద్ధి పొందుతూ ఉంటుంది. ఈ మనశ్శాస్త్ర విషయములోకూడా వారికృషి ఆ విధముగానే సాగుతూవస్తున్నది. మన శాస్త్రము ఎక్కువగా వృద్ధిపొందిన కొంత కాలమునకు బాల బాలికల చిత్తప్రవృత్తులు కనుపట్టుటని ప్రారంభమైనది. ఇదికూడా తదనుకూలములయిన పరిశోధనలతోను, నిరీక్షణలతోను, సాగుతూ ఉన్నది. ఏకృషీ లేకుండా అనుభవమువలన మనమందరమున్నూ సాధారణముగా బాల బాలికల చిత్త ప్రవృత్తులు కొన్ని తెలుసుకొంటూనే ఉన్నాము. కాని, అందువలన ప్రయోజనము అత్యల్పముగా మాత్రమే ఉంటుంది. అంతేకాక, కార్య కారణములు లెస్సగా గుర్తించక కొందరు తమ పిల్లలు కనబరచే చిత్తప్రవృత్తులు అన్నీ అందరిపిల్లలూ కనబరచుతూ ఉంటారని భావిస్తారు. మరి కొందరు తాము ఉన్నత పదవులలో ఉన్న యెడల తమ పిల్లలు చూపించే తెలివితేటలకు మురిసిపోయి తమ కడుపున పుట్టినందుకు ఏశిక్షణా అంతగా అక్కరలేకుండనే తమవలెనే ప్రాజ్ఞులూ, గొప్పవారూ కాగలరను కొని తమపిల్లల విద్యాభివృద్ధియెడల తగిన శ్రద్ధ తీసుకోక వారిని చెడగొట్టిన వారవుతున్నారు; తమతప్పు తామొప్పుకోక అది వారి ప్రాతఫలమనిన్ని సమాధానము చెప్పుకొంటారు. దిక్కులేని కుటుంబములలోని పిల్లలు కొందరు తెలివి తేటలు చూపించి విద్యావంతులయిన యెడల అది వారి

# బాలవాఙ్మయము ఆవశ్యకత

పూర్వజన్మసుకృతమని భావిస్తారే కాని ఆ పిల్లల జీవిత చరిత్ర పరీక్షించి వారు పుట్టినది మొదలు వారిపై ఎటువంటి పరిసర ప్రాభవము ప్రసరించినదో ఎటువంటి సదవకాశములు వారికి కలిగినవో తెలుసుకొనుటకు ప్రయత్నమైనను చేయరు. బురదనుండి తామరపువ్వు పుట్టలేదా? మంచి మామిడిపండులో పురుగుపుట్టలేదా? ఆ విధముగానే ఎవరి అదృష్ట ఫలమువారిది అని సమాధానము చెప్పుకొంటారు. అంతే కాని కార్య కారణాలు పరిశోధించరు. ఇట్టి అలసభావము సంఘములో వ్యాపించి ఉన్నంత కాలము ఏశాస్త్రమును వృద్ధిపొందనేరదు.

పిల్లల విద్యాభ్యాసము ఎప్పుడు ప్రారంభించునంటే స్థూలదృష్టితో చూచి ఓనమాలు నేర్చుకొనుటకు మొదలుపెట్టిన నాటనుండియని అని సాధారణముగా చెప్తారు. కాని అది సరికాదు. పుట్టినప్పటినుండియని అని చెప్పవలెను. పంచేంద్రియములున్ను పనచేయుటకు ప్రారంభించినప్పటినుండియని అనుభవముతో జ్ఞానమభివృద్ధి పొందుతూ ఉంటుంది. ఏ శిక్షణమున్ను అక్కరలేకుండనే పిల్లలు తమ అయిదు ఇంద్రియములద్వారా జ్ఞానము సంపాదించుకొనుటకు గల శక్తి ప్రకృతి సిద్ధముగా పొంది యున్నారు. ఆశక్తి శిక్షణమును బట్టి ఉంటుంది. తగినశిక్షణముంటే బాగుగా వృద్ధిపొందుతుంది. లేకుంటే మందగతిని వృద్ధిపొందుతుంది పరిసరములను బట్టికూడా ఉంటుంది.

పిల్లలు పుటిన కొద్ది మాసములకే ఊసులాడుటకు మొదలుపెట్టి చిన్న చిన్న శబ్దములు పలుకుతారు. మనము చిన్న చిన్న మాటలు అప్ప, అమ్మ, తాత, అత్త మొదలయినవి పలికి వినిపించినప్పుడు వాటిని అనుకరించి పలుటకు ప్రయత్నించి మన ముచ్చరిస్తూ ఉన్నప్పుడు మననోరు పెదవులు ఎటు పెడుతూవుంటామో పరీక్షించి పిల్లలు ఆమాటలు పలుకడము నేర్చుకొంటారు, చెవిటివారుగాపుట్టిన పిల్లలకు మన మాటలు వినబడవు గనుక వారు మూగవారవుతారు. శిక్షణమును బట్టి భాష పిల్లలకు అలవడుతుంది. ముందుగా భావనలు పుడుతవి. వాటిని వ్యక్తపఱచుటకు కావలసిన మాటలకోసము పిల్లలు తడువుకొంటూ ఉంటారు. అట్టి సమయములో వారికి పుట్టిన భావనలు మనకుకూడా పుట్టి వాటిని వ్యక్తముచేయుటకు మనము ప్రయోగించే మాటలను విని వాటిని పిల్లలు అనుసరిస్తారు. ఉచ్చారణములో లోపమున్నప్పుడు తల్లిదండ్రులు దిద్దుతారు. కొంతమంది నవ్వి వెక్కిరిస్తారు. అదికూడని పని. దానివలన పిల్లలు మాటలు పలుకలేమన్న జంకుతో కొత్తమాటలు పలుకుట మానివేస్తారు. ఈ విధముగా భావనలు పెరిగినకొలదీ వారి మాటల సంఖ్య పెరుగుతూ ఉంటుంది. పెద్దలు సంభాషిస్తూ ఉన్నప్పుడు కొన్నిమాటలు అర్థము తెలియదు. కాని వారే సందర్భములో అమాటలు పలికినారో ఆ సందర్భములు వచ్చినప్పుడు పిల్లలామాటలు పలుకుట జరుగుతూ ఉంటుంది. అర్థము తెలియకపోయినా కొన్నిమాటలు సమయానుకూలముగానే ప్రయోగించడమూ కూడా జరుగుతుంది. ఇట్టి అవస్థ పెద్దలవిషయములోకూడా జరుగుతుంది.

పిల్లలకు అయిదవయేట అయిదవమాసములో ఓనమాలు వ్రాయడము నేర్పుతూ ఉంటారు. చదవడానికి వ్రాయడానికి పూర్వము బాలబాలికలకు విద్య అలవర్చడానికి అవకాశము లేనేలేదన్నట్లు భావిస్తారు. ఇది సరికాదు. ఇటీవల కిండెరుగార్టన్ మొదలయిన పేర్లతో పసిపిల్లలకోసము పాఠశాల లేర్పడినవి. విద్యాభివృద్ధికి చదువు, వ్రాత గొప్ప సాధనములే కాని, ఆసాధనాలు వినియోగించుటకు పూర్వము పసిపిల్లల జ్ఞానాభివృద్ధికి ఆటపాటల మూలముగా అనేక సాధనాలు కలిగించవచ్చును. ఆటలలో కొన్ని ఏకాగ్రబుద్ధి శ్రద్ధ, పట్టుదల అలవరచేవి ఉన్నవి. కొన్ని సంఖ్యలను తెలియజేసేవి ఉన్నవి. పాటలమూలంగా వినోదంతోపాటు మాటలశక్తి, మాటలకూర్పు లయ, భావము, రచనా చమత్కృతి మొదలయినవి అలవర్చవచ్చును, చిన్న పిల్లలకు పాటలంటే చాలా ఇష్టము. వేగంగా కంఠస్థం చేయగలరు. చురుకుతనముగల పిల్లలు లయజ్ఞానం అలవర్చుకొని తమ

సొంత మాటలతో చిన్న చిన్న పాటలు కూర్చగలుగు కూడాను. పసి పిల్లలకు కథలుకూడా వినోదాన్ని కలిగించి జ్ఞానదాయకంగా ఉంటవి. అయితే అట్టి చిన్న పిల్లలకు తగిన కథలు వారికి బోధపడే చిన్న చిన్న మాటలతో వారికి అందుబాటులో వున్న భావాలతో నేర్పుగా చెప్పడం సులభంకాదు. చిన్నపిల్లల చిత్తప్రవృత్తులు తెలుసుకొని, వారికి వచ్చియున్న ముద్దు పలుకులతో గ్రహించి వారికి బోధపడేటట్టు కథలు చెప్పడం అభ్యసిస్తేనే కాని రాదు. ప్రతి యింట తాతలు, అమ్మమ్మలు పిల్లలకు కథలు చెప్పుతూ ఉంటారు. నేను చిన్నప్పుడు మా అమ్మమ్మ కథలు చెప్తూఉంటే వినేవాణ్ణి పెద్ద వాణ్ణి అయిన తర్వాతకూడా వింటూ వచ్చాను. కాని అవి పసిపిల్లలకు బాగుగా అర్థమయ్యేవి కావు. ఇప్పుడిప్పుడు చిన్న పిల్లలకోసం చిన్న చిన్న కథలు రచించడం కొందరు అలవరచుకొంటున్నారు. పాటలు పద్యాలు, కథలు చదువు నేర్పక మునుపే పసిపిల్లలకు నేర్పవచ్చును. వీటితోనే బాలవాఙ్మయం ప్రారంభిస్తుంది. ఐతే ఈ పాటలు, పద్యాలు, కథలు గల పుస్తకాలు పసి పిల్లలకు చదివి వినిపించడానికే కాని వారిచేత చదివించడానికి వీలుండదు. అయినా తమకు చదివి వినిపిస్తూ ఉన్నప్పుడు తామే చదువుకొందామన్న కోరిక పసిపిల్లలకు పుడుతుంది. అంతేకాక ఆ పుస్తకాలలోని అందమైన బొమ్మలు చిన్న పిల్లల చిత్తములను ఆకర్షిస్తవి. బొమ్మలను సరిగా అర్థము చేసుకోవడంలో కొంతవిద్య అలవడుతుంది. రెండేండ్లు ఇటువంటి శిక్షణము పొందిన తర్వాత పిల్లలు తమ అయిదవయేట చదువుట వ్రాయుట ఎక్కువ సులువుగాను ఎక్కువ ఆసక్తితోను నేర్చుకోగలుగుతారు.

నలుబదియేండ్ల క్రిందట దేశమంతటాను, ఇప్పటికింకా అనేక స్థలాలలోను అకారాదిగా అ ఆ ఇ ఈ అని అక్షరాలున్ను కాకు దీర్ఘమిస్తే కా, కాకు నావడిస్తే కనా అని గుణింతమున్ను నేర్పుతున్నారు. ఇది సరియైన పద్ధతి కాదు. ఇదియొక రోకటి పాటవలె ఉంటుంది. అర్థముకాని గ్రుడ్డి వల్లన అవుతుంది ఇదంతా కొన్ని బడులలో ఒక సంవత్సరము పట్టే ప్రణాళికగా ఉండేది. ఈ పద్ధతిని గుణింతము నేర్చుకొన్న పిల్లలు కోడి అనే మాట చదువవలసి వచ్చినప్పుడు కాకు కొమ్మూ దీర్ఘమిస్తే కో డాకు గుడిస్తే డి కోడి అని గుణింతముతో కలిపి కోడి అని చదివేవారు. శిశుతరగతి, మొదటి తరగతిదాటి చదువు ప్రారంభించిన మూడవయేట రెండవ తరగతిలో చదువుతు ఉండే పిల్లలు కూడా రెండవ తరగతి వాచకమందలి పాఠము చదువుతూ రాష్ట్రమువంటి కష్టమైనపదము వచ్చినప్పుడు ఆగి రాకు దీర్ఘమిస్తే రా షాకింద ట పెడితే ఇష్ట; ఇష్టాకు కరారావడిస్తే ఇష్ట్రి రాష్ట్రి మాకు కొమ్మిస్తే ము రాష్ట్రము అని కూడ బలుకుకొని చదివేవారు. ఏమి చదివినా రోకటి పాటగా ఉండేది కథలో సంభాషణలు చదివినప్పుడు కూడా ఒకటే పాట ఒకటేయాస. పాత్రోచితముగా మాటలాడినట్లు చదువుటలేదు, సరిగదా వర్ణనలు, సంభాషణలు అన్నీ ఒక్కలాగుననే చదివేవారు. ఇటీవల చదువు నేర్పేపద్ధతి మారినది గాని ఇంకా తృప్తికరంగా లేదనే నా అభిప్రాయము బొమ్మలతో నిరూపింపదగిన 40 పదములను క్రమ క్రమముగా నేర్పి ఆ 40 పదములందలి అక్షరాలతోను వాక్యములు, చిన్న చిన్న పద్యాలు, చిన్న చిన్న కథలు రచించడానికి వీలుగా ఉండేటట్లు చేయవచ్చును, ఈ పద్ధతిన నలుగురు బాల బాలికలు శిక్షణపొంది పెద్దవారయినారు, ఇది ప్రచారములోనికి తెద్దామంటే ప్రభుత్వ విద్యాశాఖవారు శాసించిన ప్రణాళిక అడ్డమయినది. శిశుతరగతి పాఠ్యగ్రంథములలో 200 మాటలకంటె ఎక్కువ ఉండరాదన్నారు. మాపద్ధప్రకారము 2000 మాటలకు అవకాశమున్నది. ఇది పిల్లలకు కష్టమవుతుందని అనుకోవడము పొరపాటు. ఈ 2000 మాటలలో గల అక్షరాలు ఆ 200 మాటలలో ఉన్న అక్షరాలకంటె ఎక్కువకావు. ఉదాహరణము ఆవు, పాము, పలక అనే మూడుమాటలు నేర్పి అందులో గల అక్షరాలు విడదీసి గుర్తింపజేసిన తరువాత అందులో గల ఆ 7 అక్షరాలతోనే కల, పాక, పాప, కలము, కలప, పకపక, ఆలపాక, ఆవులపాక. ఆ

ఆవు, ఆపాము, ఆపలక, మొదలయిన మాటలు చదివించగలము, వ్రాయించగలము. ఒక్కొక్క క్రొత్త మాట నేర్పుతూ అందులోగల అక్షరాలును అది వరకు నేర్పిన మాటలలోని అక్షరాలున్ను చేర్చి పదిపదిహేను క్రొత్తమాటలు నేర్పవచ్చును. ఈపద్ధతి వలన వందలకొలదిగా మాటలు నేర్పగలము. వాటిలోనున్న అక్షరాలు పరిమితి సంఖ్యగల మూలపదములలోని అక్షరాలే కనుక పిల్లలకు ఆ అక్షరములను నేర్చేశక్తి మరింత దిట్టపడుతుందే కాని శ్రమపెట్టదు.

ఇప్పుడమలులోనున్న పద్ధతి తృప్తికరమయినది కాకపోయినా కూడబలుకుకొని చదువనక్కరలేకుండా ధారాళముగా చదువుకొనుటకు కొంతవరకు అనుకూలమైనదే. ఒక్క సంవత్సరము చదువు పూర్తియయిన తర్వాత పిల్లలకు సులువుగా బోధపడే మాటలతో పద్యాలు, పాటలు, కథలు, ముచ్చటలు, చిన్నచిన్న వ్యాసాలు, ప్రసంగాలు అన్నివిధములయిన రచనలు సాగించి పిల్లలకు నేర్పవచ్చును.

బాలవాఙ్మయాభివృద్ధికి బడులలో నిర్బంధముగా పెట్టి బోధించిన వాచకములకంటె పిల్లలకోసము ఇప్పుడిప్పుడు 'బాలానందం' అనే శీర్షికలతో వెల్వడుతూ ఉన్న పద్యాలు, పాటలు, కథలు, ప్రసంగాలు మొదలయినవి ఎక్కువగా తోడ్పడుతున్నవని చెప్పక తప్పదు. పిల్లలకోసం బాల అనే మాసపత్రిక వెల్వడిన తర్వాత ఒకరిని చూచి ఒకరు అనేకంగా మాసపత్రికలు కేవలం బాలబాలికలకోసం ప్రకటిస్తున్నారు. అయితే ఇందులో 12 ఏండ్లపిల్లలకయినా బోధపడని కఠినపదములు, విషయములు, ప్రసంగములు, క్లిష్టాన్వయములుగల పద్యములు కనబడుచున్నవి. లండనులో బాలవాఙ్మయము పేరుగల ఒక పెద్ద పుస్తకాల అంగడికి పోయి రెండు గంటలు నిలిచి పరీక్షించాను, పుస్తకాలన్నీ వాటినిచదివే బాలబాలికల వయస్సును బట్టి వర్గీకరణముచేసి వరుసలు తీర్చి ప్రదర్శించారు, మూడేండ్లపిల్లలకు, నాలుగేండ్లపిల్లలకు అని ఈరీతిగా 12 ఏండ్ల పిల్లలకు అనే వరుసవరకున్ను 10 వరుసలలో పుస్తకాలు పేర్చిపెట్టారు. మూడేండ్లపిల్లలకోసము ఉద్దేశించిన పుస్తకాలు ముప్పదికిపైగా ఉండెను. ప్రతి పుస్తకములోను బొమ్మలు నిండుగా ఉన్నవి. అందులో కొన్ని రంగులతో ఉన్నవి. వాటిపేర్లుమాత్రమే బొమ్మలక్రిందనో ప్రక్కనో ముద్రితములయినవి. నాలుగేండ్ల పిల్లలకోసము ఉద్దేశించిన పుస్తకాలు 50 కి పైగా ఉన్నవి. అందులో బొమ్మలతో పాటు చిన్నచిన్న మాటలు, వాక్యాలు ఉన్నవి. ఈవిధముగా వయస్సుకు అనుకూలమైన భాషలో రచన సాగినది; ఆ అంగడిలోగల బాలవాఙ్మయగ్రంథములన్నీ ఒకొక్క ప్రతి చొప్పననే లెక్కించి చూడగా వేయిపుస్తకములకుపైగా ఉండెను. ఇట్టి భాగ్యం మన తెనుగుభాషలో బాలవాఙ్మయమునకు ఎప్పుడు కలుగునా అని నిరీక్షిస్తున్నాను. పెద్దలకోసము జిగిబిగి గల భాషలో వ్యాసములు వ్రాయుటకంటెను చిన్నపిల్లలకోసము కథలు, పద్యాలు, పాటలు, ప్రసంగాలు రచించడము ఎక్కువ కష్టమైనపని. చిన్నపిల్లల చిత్తప్రవృత్తులు, భావనలు ఊహలు, చిన్నపిల్లల వ్యవహారములో ఉండే పదజాలము లెస్సగా తెలుసుకొన్నవారికిగాని ఇతరులకు బాలవాఙ్మయ రచనసాగించే నేర్పు అలవడదు. కనుక, ఈ ఉద్యమమునకు పూనుకొన్న పెద్దలకు ఒక మనవి చేసి నాప్రసంగము ముగిస్తున్నాను. తలిదండ్రులు, ఉపాధ్యాయులు, రచయితలు, ప్రభుత్వవిద్యాశాఖవారు అందరున్ను బాలవిజ్ఞానము నవీన మనశ్శాస్త్ర సమ్మతమైన పద్ధతులలో నేర్పించవలసియున్నది. చిన్నపిల్లల విద్యావిషయములో ఎంతధనము వెచ్చించినా, ఎంతశ్రమ తీసుకొన్నా ఫలిస్తుంది. నేటిచిన్నపిల్లలే రాగల కాలములో దేశమును పాలించు పెద్దలు కాగలవారు. పునాదుల దిట్టతనమునుబట్టి భవనముల గట్టితనముండు నన్నట్లే బాలవిజ్ఞాన ప్రవృద్ధినిబట్టి ప్రౌఢవిజ్ఞాన సౌధము నిలబడగలదని చెప్పవలెను. కనుక చిన్నపిల్లల చదువులు చిన్నచూపుతో చూడక దేశసౌభాగ్యమునకు, సంస్కృతి వికాసమునకు ప్రధానమైనదిగా పెద్దలందరూ భావింతురుగాక అని విన్నవిస్తూ నా ప్రారంభోపన్యాసము ముగిస్తున్నాను.

# పిల్లల చదువు



## శ్రీ సురవరం ప్రతాపరెడ్డి



నేడు అన్ని దేశములలో బాలవాఙ్మయమునకు ప్రాధాన్యమియ్యబడుతున్నది. బాలవాఙ్మయమే దేశాభివృద్ధికి పునాది అని గ్రహించినారు. కొన్ని దేశములీ విషయమున చాలా వెనకబడియున్నవి. అట్టి దేశాలలో మన ఇండియా చేరినదన వలెను.

ప్రాచీనకాలములో హిందువులు బౌద్ధులు బాలవాఙ్మయముపై కృషి బాగా చేసినట్లు కానవస్తున్నది. పిల్లలకు ముఖ్యమైనవి కథలు బొమ్మలు. బొమ్మలతో కథలు చూపించి నిరూపించుట అత్యంత శ్రేష్ఠమగు పెద్దది. మన ప్రాచీనశిల్పము లన్నియు ఈ విధానమునకు తోడ్పడు చుండిన ప్రతిదేవతాస్థానములో స్తంభముల మీద, గోడలమీద, కప్పుపైన, గోపురములలోన పౌరాణిక కథలు బొమ్మలుగా చెక్కబడుచుండెను. కొన్ని తావులలో రంగులతో చిత్రింపబడుచుండిన చదువురాని వారు సహితము ఆ బొమ్మలనుచూచి ఇవి భాగవతకథలు, ఇవి కృష్ణలీలలు, ఇవి పాండవుల కథలు, ఇవి రామాయణ ఘట్టములు అని ఒకరికొకరు చూపుకొని చెప్పుకొని ఆనందించెడివారు. బౌద్ధమతవ్యాప్తి కాలములో బౌద్ధ జాతకకథలలో శిల్పములలో నిరూపించిరి. అజంతా, ఎల్లోరా, అమరావతి, మధురా, తంజావూరు, లేపాక్షి, శుచీంద్రమువంటి నూర్లకొలది దేవస్థానములలో పౌరాణిక గాథలను శిలలపై చెక్కిరి, గచ్చుతో చేసిరి, చిత్రించిరి.

ఆంధ్ర కర్ణాటదేశాలలో "తోలుబొమ్మలాటలు" అనునవి ఇంచుమించు ౧౦౦౦ సంవత్సరములనుండి ప్రచారములో నుండినట్లు మన కాధారములు కానవస్తున్నవి. అంతకన్న పూర్వమెప్పుడు ప్రారంభమయ్యెనో తెలియదు. తోలుబొమ్మల మూలానకూడ

చదువురానివారు కథలను చక్కగా గ్రహించుచుండిరి.

మన పురాణాలలో జంతువుల కథలు, బాలుర కథలు, బహుసుందరముగా వ్రాయబడినవి. (ధ్రువచరిత్ర, ప్రహ్లాద చరిత్ర, చిరకారిచరిత్ర, మొదలైనవానిని మనబాలురెరుగుదురు. జంతువులు మాట్లాడినట్లు, మనుష్యులవలె వర్తించునట్లు నీతికథలువ్రాయుటకు ప్రారంభించినవారుహిందువులేఅని పాశ్చాత్య పరిశోధకు లంగీకరిస్తూన్నారు. అట్టికథలలో పంచతంత్రము జగద్విఖ్యాతిగాంచినది, దానిని ఇంచుమించు ప్రాశ్చాత్యభాష లన్నిటిలో అనువదించినారు. క్రీస్తుశకము ఆరవశతకమందే దానిని పార్శీలోనికి "అన్వారసుహేలీ" అను పేరుతో తర్జుమా చేసిరి. మన కరటకదమనకులే పార్శీలోని కలీలా దమాగ్‌లు. హితోపదేశము, బేతాళ పంచవింశతి కథాసరిత్ సాగరము, దశకుమారచరిత్ర, సాలభంజికకథలు, ఇట్టివి కొల్లలుగా మనదేశమందు రచించిరి. ప్రజలలో ఉండిపోయినకథలు వేలో లక్షలో చెప్పజాలము. పిట్టమ్మా కాకమ్మాకథలు, అవ్వకథలు, విశేషమయ్యెను. అనగనగా ఒకఊరు, ఒకరాజు, అని ప్రారంభించి కథకంచికి మనమింటికి అని ముగించుట దాక్షిణాత్యుల పరిపాటి.

"పిల్లలపాటలు" అను విభాగముకూడ మనలో సమృద్ధిగానుండెను. ఆ పాటలలో పెద్దలుకూడ పేర్కొనదగిన విశేషములిమిడియుండెను. ఏమో అర్థముకాని ప్రాసల మాటలనుకొనునట్టివాటిలో మంచి యర్థమే కానవస్తున్నది.

"కొంగరాజా—కాలువిరిగే.
దానికేమిమందు—
వెల్లుల్లిగడ్డ నూనెమ్మబొడ్డు
నూటొక్కధర

అనుదానిలో కాలుచేతులు విరిగినప్పుడు చేయవలసిన చికిత్సకలదు.

చెమ్మచెక్క—చారడేసిబొక్క

అనుపాటలో మాచకమ్మలకు తగినమందు తెలపబడినది. ఇటులే చాలాపాటలలో వైద్యపు చిట్కాలిమిడియున్నవి. ఈ వాఙ్మయభాగము అనాదృతమై విస్మృతమై పోయినది. పునరుద్ధరణము జరుగుతున్నది.

ప్రాశ్చాత్యదేశములలో గ్రిమ్సుఫెయరీ కథలు, ఆండర్సన్‌కథలు. ప్రసిద్ధములు. ఇంగ్లీషులో ఛార్లస్ డిక్కన్స్ అనునతడు పిల్లలకథలను రమ్యముగా వ్రాసినవారిలో ప్రథముడు.

అచ్చుయంత్రములభివృద్ధియై, ఫోటోబ్లాకులుచేయుట వృద్ధియైనతర్వాత పాశ్చాత్య దేశములలో పిల్లలవాఙ్మయము అపారముగా వృద్ధియయ్యెను. సచిత్రమైన చరిత్రలు భూగోళములు, కథలు, పాటలు. విశేషములు, విచిత్రములు, మున్నగు విషయములు అతిసుందరముగా ఆకర్షణీయముగా అతి సులభభాషలో, అర్థమగునట్లు విజ్ఞానమును ప్రసాదించునట్లు రచించి ముద్రించిన గ్రంథములు వేలకొలదిగా పెరిగిపోయినవి. యూరపు అమెరికా

బాలురీవిషయములలో ధన్యులైనారు. అందు పెద్ద నగరాలలో ప్రత్యేకముగా బాలుర గ్రంథాలయములు, బాలురపత్రికలు కలవు. అనేక గ్రంథప్రకాశక సంస్థలుబయలుదేరి బాలురకు చరిత్ర, భూగోళము, ఖగోళము, సైన్సులు, పరిశ్రమలు దేశదేశ జనులు, వారి యాచారవ్యవహార విశేషములు, మున్నగు సహస్రవిషయములను తెలుపు ముచ్చటగు గ్రంథములను ప్రచురించారు.

మనపిల్లలకు చరిత్ర భూగోళ ఖగోళములన్న తలనొప్పికాని ఆ దేశాలలోని గ్రంథములను చూచినవాట్పై అత్యంత ఆసక్తి ఆనందము జనించును. చరిత్ర తేదీలపంచాంగము కాదనియు భూగోళము పేరుల వరుసకాదనియు, స్పష్టమగును.

పట్టు. ప్రత్తి, మున్నగునవి ఆదిలో ఏ దేశమువారు కనిపెట్టిరి, అవెట్లు సంఘమునకు పరికరించునట్లుచేసిరి అన్న విషయాలు బొమ్మలతో చిన్నచిన్న గ్రంధాలు రచించినారు, మన పట్టుభద్రులు ముప్పాతిక మందికి తెలియని విషయాలుకూడ ఆ చిట్టిపొత్తములలో గోచరించును. మన దేశములో సాధారణమైనట్టి బత్తాయ పప్పాయ సపోటావంటి ఫలములు, వేరుశెనగవంటి నూనెగింజలు, మిరపవంటి ఘాటైనవి, పొగాకువంటి విషవస్తువులు, మనదేశములోనివికావనియు అవి అమెరికావంటి దేశాలనుండి మనదేశములో 300 ఏండ్లనుండి ప్రవేశపెట్టబడినవని ఎందరెరుగుదురు. అట్టి సహస్రాధిక విషయాలను తెలుపు సచిత్ర గ్రంథములనుండి పాశ్చాత్య బాలురు గ్రహించ గలుగుచున్నారు.

దీనినిబట్టి తేలిన విషయమేమనగా మనము ఆదిలో బాలవాఙ్మయానికి ప్రపంచానికి దారి చూపినవారము. తుదిలో పాశ్చాత్యులనుండి మరల నూతనముగా గుణపాఠము నేర్చుకొనవలసిన వారమైనాము. పాశ్చాత్యదేశములలోనూటికించుమించు నూరుమంది చదువుకొన్నవారు. మనము నూటికి 15మందియే చదువుకొన్నవారము. కావున మన మొదటిపని నూటికి నూరుమంది విద్యావంతులగునట్లు కృషి చేయుట పాశ్చాత్యదేశాలలో ధనికులు తమద్రవ్యమును విద్యాభివృద్ధికి వినియోగింతురు. అమెరికాలో ఒక్క హెన్రీకార్నేజీ అను కోటీశ్వరుడు 5000 గ్రంధాలయములకు భవనములు నిర్మించి వాటినిండుగా గ్రంథములుంచిఅవి చక్కగా నిరంతరాయముగా సాగు నేర్పాట్లుచేసెను. అతడొక గ్రంధాలయమునకు మాత్రమే ఇంచుమించు ఏడుకోట్ల రూపాయిలిచ్చెను. మన దేశములో ధనికులీ విధముగా సహాయము చేయుటకానరాదు.అందందుకొందరుకొన్ని లక్షలిచ్చినది అతిస్వల్పమగు సేవయే. మూడవది మన జనులలోని భావములు, రుచులు మారవలెను. మంచిదేది చెడ్డదేది గ్రహింపవలెను, ఈనాడు చెత్త పత్రికలకెక్కువ ప్రచారమున్నది. మంచి పత్రికలు బిచ్చమెత్తుకొనుచున్నవి. సినిమాతారల మూడురంగుల బొమ్మలు

( ప్రక్కపుటలో )

# ఆధునిక బాలవాఙ్మయము



## శ్రీ ఏడిద కామేశ్వరరావు

పాపాయిముద్దు । రూపాయిముద్దు।
పాపాయిపలుకులు । పాటలుముద్దు॥

పాపాయిని చూచినా, రూపాయిని చూచినా ముద్దులూరుతవి. అంటే, పాపాయిఅనే సంపద, రూపాయిఅనే సిరి, రెండున్నూ హృదయానందాన్ని కలిగిస్తాయి. ఈ సిరిసంపదలను మించిన సంతోషాన్ని కలిగించేవి పాపాయి పలుకులు, పాటలూను. పాపాయి లేగులాటి పెదవులనుండి జాలువారే తేనెసోనలు, ఆ చిలుకపలుకలే, ఆ పలుకుపాటలే, మన బాల వాఙ్మయానికి బీజాక్షరములు.

'బీజాక్షరాలు' అనేవి, సాధారణంగా ఎంత గంభీరమైనవో అంత ధ్వని ప్రధానమైనవి. ఎంత సున్నితమైనవో, అంత నిండైనవి. అట్లే బాల వాఙ్మయంకూడా చాలా సూక్ష్మమైనది. సున్నితమైనది, గంభీరమైనది. ధ్వని ప్రధానమైన దీని లేత్రాయపు పూమొగ్గకు రక్షకపత్రాలవలె, పూపప్రాయపు పాపాయిని, మన ఇళ్లల్లో పదిమందీ వేయి కళ్లతో కనిపెట్టుకుచూస్తూ వుంటారు. ఇదేవిధంగా సున్నితమైన బాలవాఙ్మయాన్నికూడా శతవిధాలా కనిపెట్టుకుని కాపాడుకొనవలసివుంది. అట్టి శ్రద్ధాసక్తులు మన పూర్వులకు చాలావున్నట్లు కనపడుతుంది.

సాధారణంగా 18 ఏళ్లలోపు పిల్లలనే మనం 'బాలలు' అని పిలవవలసివుంటుంది. ఈ కనిష్ఠ

---

( 158-వ పుట తరువాయి )

చూచి తబ్బిబ్బై ఆనందసాగరములో మునిగి ఉక్కిరిబిక్కిరియై ఆ చెత్తనుకొనువారే బహుళము. వెర్రిమొర్రి కథలు, దొంగ కథలువ్రాస్తే వాటికి ప్రచారమెక్కువ.

మన తెలుగులో ఈనాడు బాల, చందమామవంటి పత్రికలున్నవి. వాటి అనుకరణలు బయలుదేరి అపచారమే చేయుచున్నవి. పై రెండు పత్రికలలోకూడా విజ్ఞాన ప్రదమైన విషయాలు తక్కువగా కానవస్తున్నవి.

విద్యాశాఖ వారు బాలవాఙ్మయను సిద్ధముచేయించి సచిత్రముగా ప్రచురించుటకు కొంతధనము ప్రత్యేకించి దారిచూపవలెను. మన కేంద్రప్రభుత్వ మీ విషయమున శ్రద్ధకనబరుచుచున్నది. కాని ద్రవ్యము మాత్రము ప్రత్యేకించినట్లు కానరాదు. హైదరాబాదు ప్రభుత్వముకూడ కేంద్రప్రభుత్వా దేశముపై బాలవాఙ్మయ సమితి నేర్పాటు చేసినది, కాని యింత వరకావాఙ్మయమునకై ఏమియు ద్రవ్యమును ప్రత్యేకించలేదు.

ఈ అనాదృతవాఙ్మయముపై విద్యావంతుల దృష్టి కేంద్రీకృతము కావలెను.

ప్రమాణాన్నిబట్టి, ఈ వయస్సులోపు పిల్లలకు కొన్నిదశలను ఏర్పరచుకోవాలి. ఐదుసంవత్సరాలవరకు ఒక దశ; పదిసంవత్సరాలవరకు ఒకదశ; పద్దెనిమిది ఏళ్లవరకు మరొకదశ! ఇట్లు సుమారుగా బాలల్లో మూడుదశలను నిర్ణయించుకోవచ్చును.

ఇట్లు బాలునికి సుమారైన మూడు దశలను నిర్ణయించు కొన్నట్లయితే, బాలసాహిత్య వేత్తల రచనలకుకూడా ఒక అధికార తారతమ్యం ఏర్పడుతుంది, అంతట వారి రచనలుకూడా మూడు విధాలైన దశలకు అనుబంధితాలవుతాయి.—

అసలు-సాహిత్య వేత్త రచనలకు అధికార తారతమ్యం ఎట్టిదిగావుండాలి! అనే విషయానికి, సిద్ధాంత భాగానికి సంబంధించినంత వరకు ఉత్తమమైన ఒక సూచన ఇది :—

ఇక, బాలుని మూడు దశలకు సరిపోవునట్లుగా మనమిచ్చే సాహిత్యంలోకూడా 'మూడు విధాలున్నవి. శ్రవ్యసాహిత్యం, పఠన సాహిత్యం దృశ్య సాహిత్యం :

ఐదుఏళ్లు అంతకులోపు, ఐదుపదిఏళ్లకు మధ్యలోగల రెండు దశలకు శ్రవ్యసాహిత్యం రెండవది గాను, పఠన సాహిత్యం మూడవదిగానూ వుండాలి. పదిఏళ్లు, అంతకులోపు, పది, పద్ధెనిమిది ఏళ్లవరకు గల దశలకు దృశ్యసాహిత్యం రెండవదిగాను, పఠన సాహిత్యాలు ప్రధానము లైనవిగావుండాలి. పద్ధెనిమిది ఏళ్లులోపువారలకు, అనగా, మూడవదశలో పఠన సాహిత్యం ప్రధానమైనదిగాను, శ్రవ్య, సాహిత్యాలు ద్వితీయస్థానంలోనూ వుండాలి-బాలలను ఇట్లు మూడు తరగతులుగా విభజించు కొన్నట్లయితే రచయితకు కొన్ని ప్రమాణాలు ఏర్పడతాయి. ఆయాప్రయాణాలకు తగినభాష, భావాలను రచనలో పొదగవలెననే బాధ్యతకూడా వెంటనే కలుగుతుంది. ఇట్లు బాధ్యతతోకూడి చేసిన రచనకు ఒక అధికార నిర్ణయం ఏర్పడివుంటుంది కనుక, ఆ రచన ఏ దశలోని బాలులకు ఉద్దేశింపబడి రచితమైనదో, ఆ బాలులకు అది అన్ని విధాలా ఉపకరిస్తుంది. కనుకనే, అధికార తారతమ్యంగల రచన సార్థకతను పొందుతుంది.—

ఇక బాలసాహిత్యంలో ముఖ్యాంగాలైన శ్రవ్య, దృశ్య, పఠనసాహిత్యాలను గూర్చి కొంచెం పర్యాలోకన చేసుకుందాం:

శ్రవ్య, దృశ్య, పఠనసాహిత్యాలు మూడింటిలోన్నూ-బాలలకు బాగా ప్రీతినిచ్చేది శ్రవ్య సాహిత్యం.

భాష, భావాలు అంటే ఏమిటో ఎరుగని పసిప్రాయంనుండీకూడా, బాలులను ఈ సాహిత్యం చాలా ఆకర్షిస్తుంది.—

శ్రవ్య సాహిత్యం పూర్తిగా ధ్వనిప్రధానమైనది. పిల్లలకు సంబంధించినంత వరకు ఈ సాహిత్యంలో-బరువైనభాష, బిగువైన భావంవుందా, లేదా అనే దానితో నిమిత్తంలేదు. అది భాషో, భావమో, శ్రవణ పేయంగావుండడమే ముఖ్యం.

శ్రవణపేయంగా వుండాలంటే, సంగీతాన్ని ఏ మాత్రమో ఆశ్రయించక తప్పదు. కొద్దిపాటి సంగీతము, చిన్న చిన్న పదాలతో ఏ కల్లబొల్లి పాట పాడినా, బాలలు కళ్లు వప్పగించి చూస్తారు. ఏదో అనిర్వచనీయమైన ఆశ్చర్యం, ఆనందం, ఆశాభావం వారి కళ్లల్లో మనకు అప్పుడు గోచరిస్తాయి—వారి ఆనందాశ్చర్యాలను తృప్తిపరచాలంటే మనం అందుకు అనుగుణమైన శ్రవ్యసాహిత్యాన్ని ప్రయోగించాలి.—

సమయాన్నిబట్టి సందర్భాన్నిబట్టి ఆ సాహిత్యం రూపొందుతుంది: మచ్చుకు: పిల్లవాడు ఏడుస్తుంటే, ఏ చందమామనో చూపుతూ "చందమామ రావే, జాబిల్లిరావే" అని పాటపాడితే ఏడుపు మానెయ్యడమేగాక, చేతులు కాళ్ళూ ఆడిస్తూ ఆనందంతో చిరులాస్యం చేస్తాడు.—

ఇట్లే, నవ్వుతూవున్న పిల్లలదగ్గిర రావణాస్వరంతో, రాళ్లభాషతో ఒకపాటో, పద్యమో, పాడితే గుక్కపట్టి ఏడుపుప్రారంభించి, హడలిపోవడం కూడా మనకు అనుభవంలోవున్న విషయమే ! !

అసలు, ఈ శ్రవ్య సాహిత్యానికి బాలప్రపంచంలోవున్న స్థానం మరి దేనికీన్నీ లేదు. చిన్న చిన్న చిలుక పలుకులు, బుల్లి బుల్లి కథలు, తమాషాలు. నవ్వు పువ్వులు, గేయాలు, గీతాలు, మొదలైనవన్నీ ఈ సాహిత్యానికి పుష్టినించే అలంకారసామగ్రి. మన ఆంధ్రసాహిత్యంలో ఈసామగ్రికి కొదువలేదు. ప్రతి యింటా కుప్ప తెప్పలు ! ప్రతి అవ్వపుక్కిలిలోనూ బోలెడు. ఇది తామరతంపర వంటిది. తరుగు లేదు. ఎప్పుడూ అక్షయమే !

అయితే ఈ సాహిత్యాన్ని బాలలకు అందించే విషయంలోనే సాహిత్యవేత్తలు కొన్ని ముఖ్య విషయాలను గమనించవలసి వుంటుంది.

పాటలు, కథలు శ్రవ్యసాహిత్యంలో ముఖ్యమైనవి. కథలకంటె పాటలకు కొంత రచనాశిల్పం, కొన్ని నియమాలువున్నాయి. పాటకు తాళం కావాలి, దాని రచనకు అక్షరాలలెఖ్ఖ, యతిప్రాసలు అవసరం. ఇవన్నీ సరిగా పాటింపబడితేగాని పాటకు పూర్ణత్వంరాదు.___

అందుకే మన పూర్వులు వ్రాసిన పాటలలో ఈ విషయమైన శ్రద్ధ చాలా కనపడుతుంది. పాటల్లో యతిప్రాసలకు, లయకు ప్రాధాన్యంవుంటుంది. ఈ ఉత్తమ లక్షణాలను లక్షించే, వారు, కొన్ని పదాలకు అర్థాలున్నవా, లేవా అనే విషయాన్ని గూడా పట్టించుకోలేదు. అర్థసందర్భాలను ఆవల పెట్టి పాటనడకను, నాజూకుతనాన్ని ముఖ్యంగా గణించి, పాటలు వ్రాశారు.

ఇలా అని పూర్వపు పాటలకు అర్థంలేదని కాదు నా భావం. కొన్ని టికిరసవంతమైన భావాలు కూడా వున్నాయి. సాధారణంగా బాగా చదువుకొన్న వారికికూడా అర్థంకాని భావాలు ఆపాటల్లో వున్నాయనికూడా మనం గర్వించవచ్చు. బాలల పాటల్లో ఆయుర్వేదపు మందుల క్రియలు కొన్ని వున్నాయని కొందరు పెద్దలు, రామానుజస్వామి గారి వంటి వైద్యశ్రేష్ఠులు కొన్ని వ్యాఖ్యానాలు వెల్లడిచేశారు. ఇంతటినిగూఢార్థ ప్రతిపాదకాలు, భావస్ఫోరకాలు రసవంతాలు అయిన బాలగేయాలను, మనపూర్వులు రచించి, బాలసాహిత్యాన్ని అజరామరంగా నిల్పినందుకు మనజాతి ఎంతైనా ఋణపడివుంది.

ఇంతటి సున్నితమైన ఈ బాలగేయ సాహిత్య నిర్మాణంపట్ల బాలసాహిత్యవేత్తలు ఎంతో శ్రద్ధ వహించి, రచన సాగించవలసివుంది.___

ఈ శ్రవ్య సాహిత్యానికితోడు, దృశ్యసాహిత్యం మరొకటివున్నది. దృశ్యసాహిత్యంలో బొమ్మలు ముఖ్యమైనవి. రంగు రంగుల బొమ్మలతో కథలను చెబితే వారికి ఎంతో విజ్ఞానం కలుగుతుంది. రంగు రంగుల పువ్వులన్నా, బట్టలన్నా పిల్లలకు ఎంతో ప్రీతి. రంగు రంగుల ముగ్గులు పెట్టడం మన ఇళ్ళలో ఒక కళ. ఆడపిల్లలు సహజంగా ఇందులో సిద్ధహస్తులవుతూ వుంటారు. అయితే, ఈ రంగుల బొమ్మలతో సాహిత్యాన్ని అందజేయడం పాశ్చాత్యదేశాలలో పెంపొందినట్లుగా మన దేశంలో ఇంకా పెంపొందలేదు. ఈ రకపు సాహిత్యం బాలల కందియ్యాలేనంటె ఎంతో వ్యయం అవుతుంది. ఆ వ్యయాన్ని భరించి పుస్తకాలు అచ్చువేయాలంటే, భరించేవారులేరు: కొనేవారునూ లేదు. ఇందుకు మనదేశ ఆర్థకపరిస్థితే కారణం. అట్లాఅని మనం ఈ పనినుండి విరమించకూడదు. కొందరు వ్యక్తులలో సంస్థలలో ఈ పనికి పూనుకోవాలి. పూనుకుని, ప్రజలకు స్వల్పఖరీదులో అందివ్వాలి. అట్టి సంస్థలకు, వ్యక్తులకు ప్రభుత్వం ఆర్థిక సహాయం చేయాలి, అంతవరకూ ఈ విధమైన బాలదృశ్య సాహిత్యం మనదేశంలో అభివృద్ధికాదు.

ఇక పఠన సాహిత్యం : ఈ విషయమై విశేషంగా చెప్పుకోనవలసిన అవసరంలేదు. ఇప్పుడు పఠన సాహిత్యం కుప్పతెప్పలుగా వస్తూనేవుంది. కాని, ఈ సాహిత్యం పిల్లలకు ఎంత వరకు ఉపయోగపడుతున్నదనేదే అసలుసమస్య ! పిల్లలకు ఎట్టి విషయమైన సాహిత్యం అందివ్వాలి ? అనేది తేలితేనేగాని, ఈ సమస్య పరిష్కారంకాదు.

## సుజాత - విజయ, వైశాఖము

నీతిగాథలా ? జానపదగాథలా ! చమత్కార గాథలా ! లేక సమస్యాగాథలా ? ప్రేమగాథలనేవి పూర్తిగా నిషేధాలని చెప్పనక్కరలేదుకదా !

ఇక ఎట్టిగాథలు చెప్పాలి ! ఎట్టి సాహిత్యం సమకూర్చాలి ? అదే ప్రశ్నకు సమాధానంగా — ఈ వివిధగాథలన్నీ చెప్పవలసినదే! కాని, చెప్పే రీతిలోను, నీతిలోను తేడావుంది. ఏ విషయమైనా చెప్పినట్లయితే, అది పిల్లవాని మనస్సుపై శాసనంగా ప్రయోగింపబడకూడదు. అతని హృదయానికి సున్నితంగా హత్తుకొనే విధంగావుండాలి. అతిగావుండరాదు! మితంగావుండాలి. అసౌందర్యం చెప్పరాదు; సౌందర్యం మాత్రమేచెప్పాలి. లాలిత్యాన్ని మార్దవాన్ని సౌకుమార్యాన్ని పెంపొదింపజేయాలిగాని, తదన్యంగాదు — ఇట్టి సాహిత్యాన్ని మనం సృష్టించాలంటే-హాస్యరసం చాల ఉపకరిస్తుంది, ఈ రసపోషణలో అంతా వినోదమయం చేసి సాహితిని అందిచ్చవచ్చు. ఇంకా ముఖ్యమైనది- పిల్లలోగల సహజమానసిక ప్రవృత్తిని గిలిగింతలు పెట్టేదిగావుండాలి.

సాధారణంగా పిల్లలలో విచిత్రమైన కొన్ని మానసిక శక్తులువుంటాయి. కల్పనాశక్తి, ధారణాశక్తి, అనుకరణ శక్తి ఈ శక్తులను జాగరితంచేసే ఏ రచనయైనా బాలసాహిత్యంలో సార్థక్యం పొందుతుంది.

పిల్లలకు అనుకరణ శక్తి పుట్టుకతోవస్తుంది. ఎదుటివాళ్ళు ఏమిచేస్తే దానిని చెయ్యాలని పిల్లలు ప్రయత్నిస్తుంటారు. మాటలలోను, ఆట పాటలలోనూ వారిచేష్టలు మనకు ఆశ్చర్యాన్ని కొల్పుతూ వుంటాయి. ఈ అనుకరణ శక్తి చాలా అవసరం. పిల్లలకు జ్ఞానసాధంగా ఈ శక్తివి వినియోగపరచవలెనంటె వారు అనుకరించదగినవి, మాత్రమే వారికి చూపుతువుండాలి. చెప్పుతూవుండాలి; చేస్తూ వుండాలి.

ఇట్టేకల్పనాశక్తికూడాను. ఊహలఊయ్యాలలో వుంటుంది వారిహృదయం. ఊగుతూమబ్బుల్లోమేడలు కట్టుకుని మెల్లెక్కుతూవుంటుంది. పిల్లలకల్పనాశక్తి ఎంతోవినోదంగావుంటుంది: ఇంకెంతో విడ్డూరంగా వుంటుంది. ఈకల్పనాశక్తికి దోహదమియ్యడమంటే వారిలో స్వతంత్ర శక్తిని పూరించడమన్నమాట ! అట్టి శక్తిని పూరించడమన్నమాట ! అటి శక్తిని కలిగించటానికి ఎన్నో అవాస్తవిక విషయాలను గురించిన గాథలు వారికి చెప్పాలి. చెప్పి వారిబుద్ధికి పనికల్పించాలి. ఇందుకే జానపద సాహిత్యం అపారంగా పుట్టింది అయితే జానపద సాహిత్యమే ఇందుకు పరమావధి అని అనుకుంటేమాత్రం చాలా ప్రమాదం, అది ఎంతవరకు అవసరమో అంతవరకూ మాత్రమే సమకూర్చాలి.

ఈ సందర్భంలో బెర్ట్రాండ్ రస్సెల్ చెప్పిన మాట గమనీయం. "బాలసాహిత్యం కేవలం వాస్తవికమైనదిగా వుండాలనే వాదాన్ని నేను అంగీకరించను. పిల్లల కల్పనాశక్తిని అది పెంపొందించేటంతగా మరొకటి చేయలేదు. దానికి చిన్నప్పటి నుండీ దోహదమివ్వాలి."

అంటే, ఊహాతనల్లుకు పోయే బుద్ధి చైతన్యం వారికి కలిగించాలన్నమాట !—

నిజానికి పిల్లల బుద్ధికి వుండేవేగం ప్రపంచంలో దేనికీలేదు. ఆవేగాన్ని తగ్గించనూకూడదు. సమపాళ్ళన పోనిస్తూవుండాలి — ఏ విధంగా మితంతప్పినా అది జడమై వూరుకుంటుంది.

గాంధీజీ, పిల్లల మనఃప్రవృత్తిని గురించిచెబుతూ వారికిఐదవఏడువచ్చేసరికే కొన్నిబుద్ధులకుబీజాలుపడతాయని-వాటిలో మంచిగుణాలకు దోహదమిస్తూ, చెడువాటిని పెరగకుండా అణచివేయాలనీ-అందుకు తోడ్పడేదే విద్యావిధానమనీ అసందిగ్ధంగా చెప్పారు ఇది శుభసూచకమే !

పోతే, ధారణాశక్తి పెంపుచేసే విషయమై కూడా బాలసాహిత్యం బాగా ఉపకరిస్తుంది. ప్రతి చిన్న విషయాన్నీ కంఠతాపట్టించే విధానం వారి జ్ఞాపక శక్తిని పెంచుతుంది — దీనిని స్వయంగా మనం చూస్తూనేవున్నాం. ఆచరణలోకూడా అనుభవిస్తూనేవున్నాం —

( ప్రక్కపుటలో )

# బాలవాఙ్మయము



## శ్రీ కొండా శకుంతలాదేవి

'బాలవాఙ్మయం-అనేసరికి పిల్లలకు ఉద్దేశించబడిన సాహిత్యం ఉపయోగపడే సాహిత్యం అన్న విషయం స్ఫురిస్తుంది. గాలిలాగా తేలి ఆడుతుండే మన పిల్లలకు పనికివచ్చే పుస్తకాలు ఏమిటి ? అని ఆలోచించవలసివస్తుంది. ధ్రువోపాఖ్యానం. ప్రహ్లాద చరిత్ర, కుశలవ కథలు ఉన్నప్పటికీ మన పిల్లలకు చదివి వినిపించగానే వాటంతట అవి అర్థంకావు. పిల్లలపాత్రకు వన్నె దిద్దే ఆ కథలు-పిల్లలకు అందుబాటులో లేవు. పెద్దబాలశిక్ష, కుమారశతకము కుమారీ శతకము ఎన్నివున్నా వాటిని చదువుతున్నప్పుడు అధ్యాపకుల సహాయం లేకుండా అవి అర్థంకావు. కేవలం 'బాలసాహిత్యం' అని చెప్పడానికి వీలున్న రచనలు నవ్యసాహిత్యంలోనే ఉదయించినవని చెప్పవచ్చు.

బానిసభారతాన్ని ఒకరు స్వాతంత్ర్య సమరాంగణంలో బారులు తీరుస్తుంటే, ఒకరు తెగినతీగెలను సవరించారు, ఇంకొకరు మూగవోయిన తెలుగు గొంతుకవిప్పారు. కోట్లకోట్ల తెలుగు నాలుకలకు పలుకును ప్రసాదించాడు తపస్వి శ్రీ గిడుగురామ్మూర్తి పంతులు.

---

(162-వ పుట తరువాయి)

బాలసాహిత్యరంగంలో, గ్రంథాలవలెనే, రేడియోకూడా అమితంగా కృషిచేస్తూవుంది—

ఇదిగాక-సినీమాలలోకూడా ఇటీవలన చిన్న చిన్న పిల్లల ఘట్టాలు చిత్రించబడుతున్నాయి. కాని, ఇదిచాలదు. పాశ్చాత్యదేశాలలోవలెచిత్రాలునిర్మింపపబడాలి. అసలు, మన పంచతంత్రం, హితోపదేశంలోని కథలన్నీ కార్టూన్ చిత్రాలుగా వెలిసినట్లయితే, బ్రహ్మాండమైన బాలవాఙ్మయం పెరుగుతుంది. ఇందుకుచిత్రనిర్మాతలు పూనుకోవాలి.

అట్టల ఆటలు, రంగుల బొమ్మల ఆటలు-మొదలైన వాటి ప్రచురణకు బాలసాహిత్య ప్రచురణకర్తలు పూనుకోవాలి. వాటిని చక్కని ప్రచారంలోకి తేవాలి—జరుగవలసిన ఇటి కార్యక్రమం అపారంగావుంది.

పిల్లల మనస్సు సంపెంగవంటిది, మనం ఏ సువాసనను కోరితే వారి హృదయంలో అది గుబాళిస్తుంది. వారి మనస్సు తెల్లకాగితం వంటిది; మన మేదివ్రాస్తే దానిమీద ఆ ముద్రపడుతుంది. వారి ముఖం అద్దంవంటిది. మనం అందులో అచ్చంగా ప్రతిఫలిస్తాం. అట్టిస్ఫటిక స్నిగ్ధహృదయాలను విద్యావినోద, విజ్ఞాన ప్రఫుల్లంచేయడానికి మన అవిరళమైన కృషిచేసనినాడు బాలసమాజం నెమలిపింఛంలా కళాశోభితమై విప్పారుతుంది.

—స్వస్తి.

చాలవరకు పిల్లలకు పనికివచ్చే పుస్తకాలంటే ఇప్పటికీ 'కొట్లల్లో' వాచకాలు-'ఆంధ్రబోధిని' ఇంట్లాంటివే ఇస్తున్నారు, పాఠశాలల్లో 'టెక్స్టు బుక్'గా పెట్టించడానికి 'కమిటీ సభ్యుల' మనోభీష్టాలకు అందుబాటులో ఉండేటట్టు రాయబడిన పుస్తకాలు ఎక్కువగా ఉన్నాయి. వీటి మధ్యన కేవలం పిల్లలకోసమని రాయబడి, పిల్లల చేతుల లోకి సరాసరి పోగలిగిన పుస్తకాలు అడుగునపడి ఉన్నాయి. శ్రీ వెంకట పార్వతీశ్వరకవులు, శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగార్లు కథలు, బాలగీతాలు ఎన్నోవిరచించారు. ఈ సాహిత్యానికి ఒక కొత్త అధ్యాయాన్ని నిర్మించిపెట్టాలని శ్రీ గిడుగు సీతాపతిగారివంటి పెద్దలు ఎంతో ప్రయత్నించారు, శ్రీ సీతాపతిగారు 'రైలుబండి.' 'చిలుకమ్మ పాటలు' మొదలైనవి ఎంతో ఆకర్షణీయంగా వ్రాశారు. ఈ సాహిత్యానికి 'కట్టనికోటగా' 'వెన్నెలకోవగా' ఉన్నది శ్రీ చింతాదీక్షితులుగారి 'లక్కపిడతలు'. పిల్లలను ఎరిగినంత మాత్రాన పిల్లలకని అందరూ వ్రాయలేరు, ఆ రాయడంలోను 'లక్కపిడతలకు' వున్న ఆప్యాయత, మాటలలో పొదగడం అన్న దక్షత ఒక్క దీక్షితులుగారిదే ననిపిస్తుంది. వారి లంకాదహన ఘట్టాన్ని చిత్రించేపాట పాడుతుంటే పిల్లలకు పెద్ద పెద్ద తోకలువచ్చి, వాళ్లు వీరాంజనేయులవలె కుప్పిగంతులు వేస్తారు.

రామాయణ కథా ఘట్టాలు పిల్లలకు పరిచయమైతే, ఆ పరిచితి ఉత్తరోత్తరా వారికి ఉపయోగపడుతుంది. వీరిదే 'లీలాసుందరి' కథ పిల్లలకు చెబుతుంటే ఎంతో గోలచేసే పిల్లలయినప్పటికీ బొమ్మలయిపోయి, వినడానికి చెవిగోసుకుంటారు. పిల్లలకు ఉపయోగపడే పాటలు 'భారతి' పత్రిక ఎన్నో ప్రకటించింది. కల్పనాకథలు, పిట్టకథలు, ఇంతో అంతో పిల్లలను అకర్షించేవి ఎన్నో ఉన్నాయి. ప్రకృతికి అతీతంగా కనుపించే అంశాలతో వుండే కథలు ఎంతో పిల్లలకు ఉపయోగ పడగలవన లేము.

లేత్రప్రాయంలో మనస్సు కష్టపరంపరలతోటి, లౌకిక వాసనలతోటి కొన్ని 'గాళ్ళను' ఏర్పరచుకొనక, నిర్మలంగా పరవళ్లు త్రొక్కుతూ ప్రవహించే ప్రవాహంలా ఉంటుంది. ఏ విషయానికి అది అంటి పెట్టుకొని ఉండదు, ఎన్నింటినో తెలుసుకోవాలనే కోర్కె ప్రతిబిడ్డకూ సహజంగా ఉంటుంది. అట్లా తెలుసుకోవడానికి అనువయ్యే ప్రోత్సాహ పరివర్ధక వాతావరణాన్ని ప్రప్రథానంగాతలిదండ్రులు, పాఠశాలలు, తరువాత పిల్లలకని ఉద్దేశించబడిన పుస్తకాలు కథలే కానివ్వండి' పాటలే కానివ్వండి కల్పించవలసి ఉంటుంది.

పిల్లల దేహారోగ్యంపట్ల ఎంతటి శ్రద్ధాసక్తులు తీసుకోవడం అవసరమో-వారి మానసిక జగత్తుకు సంబంధించిన పరిపోషణపట్ల మనం అంతటి శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది. మంచిఆరోగ్యం, మంచి మనస్సు వకదాని నొకటి అంటిపెట్టుకొనివుంటాయి. ఒక చిన్న మొక్కను ఎంతశ్రద్ధగా 'వనమాలి' కాపాడుకుంటాడో అంతకంటే అధికంగా పిల్లలపట్ల శ్రద్ధవహించాలి. వారికి గలిగే భావాలు వాళ్ళను 'వెనుకముందులు' ఆలోచింప చెయ్యలేవు. క్షణికోద్రేకమే వాళ్ళను ఎక్కువకెక్కువ కార్యోన్ముఖులను చేస్తుంటుంది. పూర్వాపరాలను గుర్తింపజేసే 'అనుభవం'' అన్న 'దిక్సూచిని' వారు అమర్చుకోవలసి ఉంటుంది. ఎక్కువకెక్కువ పిల్లలమీద బహిఃపరిస్థితుల ప్రభావం, మనం నేర్పే, యిచ్చే శిక్షణల ప్రభావం పడడం సహజం. ఎంతోమంది తలిదండ్రుల మనుగడలోనుంచే తమనడవడికను దిద్దుతీర్చుకుంటారు. వీరికి నిదర్శనలు మనకు ఆదర్శప్రాయకంగా కనుపించే నాయకుల, పెద్దల జీవితాల నుంచి ఎన్నింటినో ఇవ్వవచ్చు. బాపూజీ మనస్సు మీద ప్రహ్లాదచరిత్ర ఎంతపనిచేసినది? తల్లి 'హవేలీ'కి వెళ్ళడం కూడా ఈయన కొక వినూత్నతను చూపించాయి. అందుచేత ముఖ్యంగా పిల్లలచుట్టూ నిర్మించే జీవితాన్ని వాళ్లు పాఠాలుగా తీసుకొని అనుకరిస్తుంటారు గనుక, వాళ్లు ఎట్లాపైకి రావాలని తల్లిదండ్రులు వాంఛిస్తారో అంతటి ఓర్పుతో వారికి చక్కని వాతావరణం సృష్టించాలి.

కాని ఈ నాడు ఆర్థిక నిమ్నోన్నతాలతో, దెబ్బతిని పోతున్న మన సమాజంలో అందరూ

పిల్లలని కనగలగడమేతప్ప, ఆదర్శప్రాయకంగా పెంచుకొన గలిగిన స్థితిలోలేరు. దీనికి హేతువు మన 'జీవిత ప్రమాణం' బహుస్వల్పంగా ఉండడమే మంచిచొక్కాలు, మంచిపుస్తకాలు తమ పిల్లలకు తెచ్చియివ్వాలని, ఉండనివాళ్లు ఎవరు? కాని సమకూర్చియివ్వలేని వారు అనేకులున్నారు. పదేళ్ళ కుర్రాడు గొడ్లు కాసుకొనవలసివసుంది, అదే బస్తీలో అయితే హోటల్లో కప్పులు కడగడం అవుతుంది. ఈ అవకాశాలు తక్కువగావున్న పిల్లలందరిని ఎక్కువగా సేవించే వాఙ్మయాన్ని మన రచయితలు సృష్టిసే - అది దేశానికి ఎంతోమేలవుతుంది. లిపి రాకపోయినా పిల్లలకు చదివి విన్పిసే, ఆపాట కంఠస్థమైపొయ్యేట్లుండాలి, ఆ కథనరీతి మరిలేతమనస్సులో ముద్రిత మవుతుండాలి, పిల్లలకని సృష్టించే సాహిత్యం పట్ల ఎంతో జాగరూకత ఉండాలి. రవీంద్ర కవీంద్రుని "మిని", "శుభా" వంటి పిల్లలు తలితండ్రుల తెలివి తేటలనే ప్రశ్నిస్తారు అందుచేత "కథకంచికిమనమింటికి", అన్నట్టుగాక పిల్లలకని ఉద్దేశించబడిన గ్రంథం-తన తరాన్ని దృష్టిలో ఉంచుకోవాలి.

పిల్లలకు,పిల్లల మనస్తత్వానికి సంబంధించిన సమస్యలు అన్నిదేశాలకూ ఉన్నాయి. నిరాశ నిస్పృహ సారహీనమైన మనస్థితిని సృష్టించె పరిసరాలు పిల్లల అభివృద్ధిని అవరోధ స్తాయని-అందరూ పిల్లలను అట్టి పరిస్థితులకు దూరంగా ఉంచాలనీ, 'నర్సరీలు' శిశుపోషణాలయాలలో పెంచడం ప్రారంభంచేశారు. కానీ ఈ కృషి పెద్దఎత్తున ప్రజలందరికీ దాని ఫలితాలందించగలిగేటట్టు సాగించడం దుర్లభం కాబట్టి పిల్లల మనస్సుకు హాయినీ హాయేకాదు సాహసం, త్యాగబుద్ధి, సమైక్యత కల్పించే వాతావరణంలో పెంచడమే మంచిదంటున్నారు. పిల్లల మనస్సుమీద సద్వర్తననే చిత్రితం చేసేఘట్టాలతో సృజనాత్మక శక్తిని వారిలో పెంపొందిచె విషయాలతో వారికి విద్యాబుద్ధులు గరపాలి. పిల్లలకిచ్చే పుస్తకం, పుస్తక విషయాన్ని చెప్పేపద్ధతి పిల్లల మన స్థాయిని దాటి ఉండరాదు. పిల్లలకని ఉద్దేశించి రాయబడినవి పెద్దలకూ ఆహ్లాదాన్ని యిస్తున్నట్టయితే అవి పిల్లల మనస్తత్వానికి తగినట్టులేవని మనం అనుకోవచ్చు. మనకు భవిష్యత్తును సంతరించి పెట్టేది ప్రాజక్టులూ, రాజకీయ ఆర్థిక వ్యవస్థలే కాదు-అన్నింటి చరమ శిఖరం పిల్లలను తీర్చిదిద్దేనఖరి. అందుచేత బహు స్వల్పంగావున్న ఈ మన 'బాలవాఙ్మయాన్ని'ఎంతో పెంపొందింప జెయ్యవలసిన భారం మన రచయితల మీద ఉన్నది. కన్నడ భాషలో 'పిల్లల సాహిత్యాన్ని' అపారంగా పెంపొందించుకొన్నారు. ఇంగ్లీషు మాట చెప్పవలసిన అవసరంలేదు-పిక్చర్ బుక్స్, షో బుక్స్, క్లాత్ బుక్స్, పీఠ్ బుక్స్, టాయ్ కార్డ్స్ ఎన్నో చిత్రచిత్రాలతో పిల్లల్ని ఆహ్వానించె పుస్తకాలున్నాయి. ఇటీవల శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ జీవితం-శ్రీమతి శకుంతలా మసానీ పిల్లలకనీ ఉద్దేశించి రాసినది ప్రకటితమైనది. అయితే పిల్లలకు ప్రియతముడైన ప్రధాని నెహ్రూ బొమ్మలు అందులో ఎక్కువగాలేవు, జపాన్ పిల్లలకు సైతం పరిచితుడైవున్న నెహ్రూ మన పల్లెపిల్లల దగ్గరకు రావద్దా?

పిల్లలకు విద్యాబోధ చేయడంలో ప్రపంచానికి అద్వితీయ పథాన్ని చూపిన డాక్టర్ మేరియామాన్టిసోరి (**Dr. Maria Montessori**) చెప్పినట్టు పిల్లలు నేర్చుకొనే పాఠశాలలో మొదటివిఅక్షరాలు, యినిరావడానికి వినేశక్తి, దర్శించేశక్తికి అవసరం, పాఠానికిముందు ఈ శక్తి కల్పిస్తేస్వయంశక్తి మీద పిల్లలు వివేకంతో చదువుకోగలుగుతారు-అమె చూపినవిద్యాపద్ధతులుమీకుకొత్తవికావు.కానిపిల్లలకై ప్రత్యేక పథాన్ని చూపించి ఆమాత మహోపకారం చేసినదని అట్లాగే ఈ పాఠం చెప్పేపద్ధతిలో నేలభ్యాలు అన్వేషించుకొన్నట్లు బాలవాఙ్మయ నిర్మాణంలోను అపూర్వ పద్ధతులను రానున్న తరాలకు పనికివచ్చేట్టు అపూర్వంగా సృష్టించుకోవలసి ఉన్నదని విజ్ఞప్తిచేస్తున్నాను,

# భారతవైజ్ఞానికాభివృద్ధి



శ్రీ వేమరాజు భానుమూర్తి



నేటి ప్రపంచములో అభ్యుదయానికీ, విజ్ఞానానికి అవినాభావసంబంధముంది. ఏదేశములోనైనా ఆకలి అవిద్య, అనారోగ్యము, దారిద్ర్యము. ఛాందసము, మూఢాచారాలు వీటన్నింటికీ సంబంధించిన అనేక సమస్యలను పరిష్కరించడానికి ఏకైక శరణ్యమైనది, విజ్ఞానముమాత్రమే. అలాంటప్పుడు ఈ అన్నిసమస్యలతోపాటు సహజసంపదలు పుష్కలంగా వున్నప్పటికీ తిండిలేక కోటానుకోట్ల ప్రజలు నిర్భర దారిద్ర్యముతో అల్లాడిపోయే మనదేశములో అడుగడుగుకు ఈ అన్నిసమస్యల పరిష్కారానికి మనము విజ్ఞానజననీ సహాయాన్ని అపేక్షించవలసింది భవిష్యత్తులో విజ్ఞానానిదే అగ్రస్థానము. విజ్ఞానులకే పెద్దపీట అని ప్రధాని శ్రీజవహరులాలు నెహ్రూ చెప్పినమాటలతో వైజ్ఞానికరంగములో భారతదేశము సాధించిన అభివృద్ధికి సంబంధించిన సమీక్షను మొదలు పెటుతాను.

ప్రాచీనకాలములో భారతదేశములో వైజ్ఞానిక వికాసము బహువిధాల సాగింది. మన ప్రాచీనులు గణితములో, ఖగోళములో, వైద్యములో ఎంతెంత అభివృద్ధిని సాధించింది పూర్వకాలపు సంస్కృతి గ్రంథాలలో బోలెడన్ని నిదర్శనాలున్నాయి. కాని మధ్యయుగాలు వచ్చేసరికి విజ్ఞానశాస్త్రసంబంధమైన కృషి అలక్ష్యముచేయబడింది. ప్రపంచజాతులలో ఇండియా వెనుకబడింది. కాలక్రమేణా విజ్ఞానరంగాలలో, సాంకేతికరంగములో అమోఘమైన అభివృద్ధిని సాధించిన పాశ్చాత్యదేశాలకు ఇండియా లొంగిపోయింది. అటుపిమ్మట బ్రిటిషువారి హయాములో వైజ్ఞానికకృషికి ఎట్టి ప్రోత్సాహము లభించలేదు. ఫలితముగా మనదేశము అనేక రంగాలలో వెనుకపడిపోయింది. చివరకు 1947-వ సంవత్సరము ఆగస్టులో దేశానికి స్వాతంత్ర్యము సిద్ధించేసరికి మన పరిస్థితి ఎంతహీనముగావుందో చూడండి. మనప్రజల సగటువయస్సు 26 సంవత్సరాలు. నూటికి 88 మంది నిరక్షరకుక్షులు. వ్యవసాయము నేటికీ ఇక్ష్వాకులనాటి పద్ధతిలోనే జరుగుచున్నది. మనపరిశ్రమలా సక్రమముగా వృద్ధిచెందలేదు.

ప్రభుత్వము ఈవిధముగా వైజ్ఞానిక కృషిపట్ల సవతితల్లి ప్రేమచూపిస్తున్నప్పటికీ ప్రజలలో విజ్ఞానజననిని ఆరాధించేవారు లేకపోలేదు. 1784వ సం

వత్సరములో కొంతమంది వుత్సాహులు చేరి "ఏషియాటిక్‌సొసైటీ ఆఫ్ బెంగాల్" అనేపేరుతో ఒక సంస్థనుస్థాపించి వైజ్ఞానిక అభివృద్ధికృషిని ప్రోత్సహించారు. అతరువాత 1912వ సంవత్సరములో "ఇండియన్ సైన్సుకాంగ్రెస్" సంస్థ ఏర్పాటైంది. భారతీయ వైజ్ఞానికులు ఆరోజులలో సరియైన భవనాలు, పరికరాలు, డబ్బు ఇవి ఏమీ లేకుండా కేవలము తమ వుత్సాహము పట్టుదల ప్రధానముగా ఎంతో కష్టపడి కృషిచేసి భారతదేశానికి వైజ్ఞానిక రంగములో విశేషమైన పేరుప్రతిష్ఠలు తీసుకొచ్చారు ఆరోజులలో అలాంటి పరిస్థితులలో వివిధవైజ్ఞానిక శాఖలలో కృషిచేసి గొప్పగొప్ప ఫలితాలను సాధించడముచూస్తే ఎవరికేనా ఎంతో ఆశ్చర్యము కలుగుతుంది.

ఆరోజులలో ప్రపంచపుగణితశాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడుగా మన్ననలందిన శ్రీశ్రీనివాసరామానుజం చిన్నగుమస్తాగా తనజీవితాన్ని ప్రారంభించాడు. పాపము ఆయన చిరుతవయస్సులోనే కర్కశమృత్యువువాతపడడముతో మనదేశము ఒకమహాప్రజ్ఞానిధిని గోల్పోయింది. భౌతికశాస్త్రములో, డాక్టర్ సి. వి. రామన్ తన అనుపమకృషిఫలితముగా "రామన్ ఎఫెక్టు"ను కనుగొని మనదేశానికి నోబెల్ సైన్సు బహుమానాన్ని సంపాదించారు. ఆతరువాత భౌతిక శాస్త్రపరిశోధనరంగములో శ్రీ హెచ్. జె. బాబా, స్వర్గీయ శ్రీ ప్రఫుల్ల చంద్రరాయ్ శ్రీజగదీశ చంద్ర, శ్రీ ఆర్. సి. చోప్రా ప్రభృతుల కృషి ఫలితముగా క్రొత్తశాఖలే ఆయా విజ్ఞానరంగాలలో తలయెత్తాయి. ఆయావ్యక్తుల శ్రద్ధాశక్తులుఉత్సాహ కారణముగా వైజ్ఞానిక పరిశోధనలు అభివృద్ధి చెందుతున్నప్పటికీ దేశాభ్యుదయ సాధనకు విజ్ఞానులకృషిని ఉపయోగించాలనే ఆలోచన 1929వ సంవత్సరము వరకు ప్రభుత్వానికి లేకనేపోయింది. అప్పుడు అన్నిటికంటె ముందుగా "ఇంపీరియల్ కౌన్సిలు ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చి"గా మార్చబడింది ఆతరువాత వైద్య ప్రజారోగ్యరంగాలలో పరిశోధన ప్రారంభమైంది. కాని బ్రిటను కేవలము స్వార్థదృష్టితో పారిశ్రామిక వైజ్ఞానికాభివృద్ధికి ఎట్టిప్రోత్సాహమూ ఇవ్వలేదు.

కాని రెండవ ప్రపంచయుద్ధసమయములో యుద్ధావసరాలదృష్ట్యా 1940వ సంవత్సరములో "వైజ్ఞానిక పారిశ్రామిక పరిశోధనబోర్డు" స్థాపించబడింది. ఆతరువాత విశేషాధికారాలతో 1942వ సంవత్సరము ఏప్రియలులో "కౌన్సిలు ఆఫ్ సైంటిఫిక్ అండు ఇండస్ట్రియల్ రిసెర్చి" సంస్థ ఏర్పాటుచేయబడింది. దేశానికి స్వాతంత్ర్యము సిద్ధించడముతో 1947-వ సంవత్సరములో స్వయముగా విజ్ఞాని, పండితుడు అయిన శ్రీ జవహరులాలు నాయకత్వాన భారత ప్రభుత్వము వైజ్ఞానిక కృషికి విశేషదోహదాన్ని చేకూర్చింది. ఆతరువాత స్వతంత్రభారతదేశములో దాని సమస్యల పరిష్కారములో "సైన్సు" ప్రాధాన్యాన్ని గుర్తిస్తూ పండిట్ శ్రీ నెహ్రూ నాయకత్వాన "సైంటిఫిక్ రిసర్చి డిపార్టుమెంటు" స్థాపించబడింది. 1951వ సంవత్సరములో ఇది మరింత విస్తృతమై "మినిస్ట్రి ఆఫ్ నేచురల్ రిసోర్సెస్ అండు సైంటిఫిక్ రిసెర్చి"గా అవతరించింది. అప్పటినుండి దేశములో వైజ్ఞానికులనందరినీ దేశాభ్యుదయ సాధన కృషిలో సమీకరించడానికి పెద్దపెట్టున ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. వైజ్ఞానిక పారిశ్రామిక రంగాలలోను, ఇంజనీరింగు శాఖలోను జరిగే కృషినిగురించి "కౌన్సిలు"కు సలహాయివ్వడానికి రెండుబోర్డులు ఏర్పాటుచేయబడ్డాయి. ఇందులో ఒక బోర్డులో 23 సభ్యులున్నారు. దీనికి కెమిస్ట్రి, మందులు, మలేరియా, ఫిజిక్స్, గాజు, బయోకెమిస్ట్రి, ప్లాస్టిక్స్, శాక తైలాలు, లోహాలు, రేడియోరిసెర్చి, ఇంటర్నల్ కూంబస్టన్ ఇంజన్లు, పెట్రోలు, ముఖ్యమైన నూనెలు, సెల్యులోజ్. స్టాటిస్టిక్స్, భవనాలు, చర్మపరిశ్రమ, వనస్పతి, ఉప్పు, పవర్ ఆల్కహాల్ సింథటిక్, పెట్రోలు, నేలబొగ్గు గనులు, స్వాదు యోగ్యములైన నూనెలు, ఇతర క్రొవ్వుపదార్థములు వగైరా విషయాలపై సలహాయివ్వడానికి 26 ఉపసంఘాలున్నాయి. వ్యవసాయము, పరిశ్రమలు, వరదల నివారణ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, ఇరిగేషను వగైరాలకు సంబంధించిన పరిశోధనలను ప్రోత్సహించే నిమిత్తము ఒక ఇంజనీరింగు బోర్డుకూడా ఏర్పాటుచేయబడినది. ఈకౌన్సిలు అధ్వర్యాన దేశ

ములో 'నేషనల్' లెబరేటరీలు నిర్మించబడ్డాయి. వైజ్ఞానికపరిశోధనలవల్ల తమకు చాలా మేలు చేకూర గలదని పారిశ్రామికవేత్తలు గుర్తించడానికి ఎంతో కృషిచేసింది. దేశములో వైజ్ఞానికుల జాబితాను తయారుచేసింది.

ఇది పరమాణుశక్తి యుగము. పరమాణు గర్భాన్ని భేదించడమువల్ల బ్రహ్మాండమైన శక్తి లభ్యమౌతుందని వైజ్ఞానికులు కనుగొన్నారు. భారతదేశములో పరమాణుశక్తిని ఉత్పన్నముచేయుటానికి కావలసిన ఖనిజాలు బోలెడన్నున్నాయి. అందుచేత ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని దేశములో పరమాణుశక్తి పరిశోధనల ప్రోత్సహించడానికి శాంతికాలపు ప్రయోజనాలకు పరమాణుశక్తిని వినియోగించడానికి ఇండియా ప్రభుత్వము డాక్టరు భాభా, డాక్టర్. భట్నాగర్, డాక్టర్. కె. యస్. కృష్ణన్ గార్లతో పరమాణుశక్తికమీషన్ను నియమించింది. తరువాత ఈకమిషను అధ్వర్యానయురేనియం థోరియం, బెరిలియం, మోనాజైట్ వంటి పరమాణుశక్తి ఉత్పత్తికి వినియోగించే పదార్థాలు, దేశములో ఎక్కడెక్కడదొరుకుతాయో కనిపెట్టడానికి కృషిజరుగుతోంది. తిరువాన్కూరు, కొచ్చిన్ తీర ప్రాంతపు ఇసుకలో థోరియం, యురేనియం ఉన్నట్టు కనుగొనబడింది. అందుకోసమని ఆల్వేలోఇండియన్ "రేర్ ఎర్త్స్" ఫ్యాక్టరీ ఏర్పాటుచేయబడింది. ఇది ఇలా ఉండగా కమిషన్ అధ్వర్యాన బొంబాయిలోని "తాతాఇన్స్టిట్యూటు అఫ్ ఫండమెంటల్ రిసెర్చి" కేంద్రములోను, ఇతర విశ్వవిద్యాలయాలలోను పరమాణుశక్తి పరిశోధనలు జరుగుతున్నాయి, ఇంతేకాక కాస్మిక్ కిరణాలు, ఎలక్ట్రానిక్స్, న్యూక్లియర్ ఫిజిక్స్ వగైరా అన్నిరంగాలలోకూడా కృషి జరుగుతోంది.

మొన్న మొన్నటివరకు వైజ్ఞానిక పారిశ్రామిక పరిశోధనలకు దేశములో ఎట్టిసౌకర్యాలుకాని, ఎట్టి ప్రోత్సాహముకాని ఉండేదికాదు. అయితే దేశానికి స్వాతంత్ర్యము సిద్ధించినతర్వాత ప్రజలు ప్రభుత్వముకూడా వైజ్ఞానికులకు సర్వసౌకర్యాలనూ కల్పించడానికి ఎంత డబ్బైనా లెక్కలేకుండా ఖర్చుచేస్తున్నారు. అన్ని సౌకర్యాలు కల్పించబడుతున్నాయి. ఇప్పుడు గడచిన అయిదు ఆరు సంవత్సరాలలోను జరిగిన కృషిని చూస్తే మనదేశానికి అనతికాలములోనే విజ్ఞానరంగములో సమున్నతస్థానము లభించగలదని చెప్పడానికి ఎవ్వరికీ ఎటువంటిసందేహము అక్కరలేదు.

---

(172 పుట తరువాయి)

పరిమాణం పెరుగుతునే ఉంది, నక్షత్రచలనాలలో క్రమముంది. విశ్వావయవాలు నియమబద్ధమైయున్నాయి. సూక్ష్మమైదృగ్గోచరమయే అవకాశమేలేని పరమాణుగర్భంలో బ్రంహ్మాండమైన శక్తి నిబిడీకృతమైయుంది, శక్తి సముచ్చయాలకూడిక ద్రవ్యంగా ఆవిర్భవిస్తూంది. ద్రవ్యం శక్తిగా పరిణామమొందుతుంది, శక్తి ద్రవ్యంగానూ రూపొందుతూంది. దేనికిని నాశనంలేదు. శక్తిలోపిస్తే ద్రవ్యం పెరుగుతుంది, ద్రవ్యం క్షీణిస్తే శక్తి హెచ్చవుతుంది.

ఇట్టివిశ్వం కేవలం యాదృచ్ఛికంగా ఎట్లుండగలదు. విశ్వరూపానికి ముగ్ధులైన వారిట్లుకాక ఏమనుకోగలరు ?

రచనలోకృతికర్త, చిత్రమునచిత్ర
కారుడును కానరారు నిక్కముగ, కాని,
నీవు సృజియించినట్టి విశ్వావయవము
లందుసర్వత్రనీవె ప్రత్యక్షమౌదు !

[అధ్యక్షోపన్యాసమునుంచి]

# విశ్వము



## శ్రీ వసంతరావు వెంకటరావు



మనం నివసిస్తూన్న భూమిని గ్రహమని విజ్ఞానులంటాను. సూర్యునిచుట్టు తిరుగుతున్న భూమి ఆ విధంగా ఎంతకాలమై ప్రదక్షిణాలు చేస్తూందో చెప్పలేము. భూమి, సూర్యుడు, ఇతరనక్షత్రాలు, నెబ్యులాలు, పాలపుంత మొదలగు నభోమూర్తులగురించి యోచించి, వాటిని పరిశీలించి, వాటి లక్షణస్వభావాదులను తెలిసికొనడానికై మానవుడు ఎంతోకాలంనుండి ప్రయత్నిస్తున్నాడు. కేవల భౌతిక విజ్ఞాన దృష్టితో విశ్వాన్ని చూచినప్పటికీ, ఆద్యంతరహితమైన విశ్వరూపాన్ని సందర్శించిన విజ్ఞానికి అప్రయత్నంగా దైవవిశ్వాసం కలుగుతుంది

రాత్రులందు అసంఖ్యాంగా అంబరవీధిని కనిపించునక్షత్రాలను చూచిన ఆదిమ మానవులు వాటి రహస్యాలను తెలిసికోవాలని కుతూహల పడ్డారు. యంత్రాలకంత ప్రాధాన్యంలేని ఆ కాలములో పంచేంద్రియలబ్ధ జ్ఞానంతో తృప్తినొందక, వారు అంతర్ముఖులై భావ ప్రపంచములో యథేచ్ఛగావిహరించేరు, సృష్టిక్రమాన్ని ఊహించేరు. ప్రకృతి నారాధించు ప్రకృతినర్థంచేసికొన్నారు. జడాత్మకమైన ప్రకృతికంటె జీవసమస్య మహత్తరమైనదని గ్రహించేరు. దానిని సాధించడానికై తత్వమార్గాన్ని అవలంబించేరు భౌతికం క్షణికమనీ, మానవుడు నిజంగా పొందతగిన మహత్తరమైన అవస్థవేరొకటి గలగనీ దానికై ప్రయత్నించడమే ధర్మమనీ బహు విధాల తెలిసికొన్నారు. ఆకారణంచేతనే ద్రవ్యమయ ప్రపంచ పరిశీలనార్థం వారుకాలాన్ని వెచ్చించలేదు ప్రకృతి శక్తులకు లొంగనట్టి మన స్థితిని పెంపొందించు కొన్నప్పటికి ఆశక్తులను స్వార్థానికై వినయోగించుకోవాలని వాంఛించలేదు.

కాని భౌతిక విజ్ఞానిదృక్పథమే వేరు' 16వ శతాబ్దంనుండీ పరిసరాలను పరిశోధిస్తూన్న విజ్ఞానులు, వాటినవగాహనచేసికోవడమేకాక, నిత్యజీవితంలో లాభకరంగా వాటినుపయోగించాలని వాంఛించేరు. ఆప్రయత్నంలో ఖగోళజ్ఞానం ఎక్కువగా తోడ్పడింది. ఈనాడు పరమాణు కేంద్రకాన్ని భగ్నంచేసి విపరీతపరిమాణాలలో శక్తిని విడుదలచేయడానికినక్షత్రగర్భాలలో జరుగుతూన్న పరిణామమే కీలకంగా పనిచేసింది. నక్షత్రకాంతిని యంత్రాలతో విశ్లేషించి ఆవర్ణపటాల ఛాయాచిత్రాలుతీసి నక్షత్రాల చరిత్ర నూహించడానికెంతో అవకాశం కలిగింది. అట్టి సూక్ష్మపరిశోధనలవల్ల విశ్వరూపం ఎట్లుంటుందో చిత్రించేరు విజ్ఞానులు. ఆచిత్రాన్ని స్థూలంగా గ్రహిద్దాము.

ఆకాశంలో అసంఖ్యాంగా కనిపించు నక్షత్రాలను లెక్కపెట్టితే నిజంగా సుమారు 6000 కంటె అధికముండవని జ్ఞానులు అంచనావేసేరు. అంటే ఒక స్థలంనుండి చూచిన వారికి ఆకాశంలో సగం భాగమందలి నక్షత్రాలే కనిపిస్తాయి కాబట్టి, వాటిసంఖ్య సుమారు 3000. అవి సామాన్య మానవనేత్రం, తనం

తటతను, అసహాయంగా చూడగల తారకలసంఖ్య. కాని దూరదర్శిని ఉపయోగిస్తే దృగ్గోచరమయే నక్షత్రాలసంఖ్య అధికం కామొదలుపెట్టుతుంది. దూరదర్శినియొక్క విసరణ సామర్థ్యం ఎక్కువైన కొద్దీ దానితో కనపడే నక్షత్రాలసంఖ్యకూడా పెరుగుతుంది. ఆవిధంగా దృగ్గోచరంగా వచ్చిన నక్షత్రాలనూహించి లెక్కకట్టిన శాస్త్రజ్ఞుని ప్రకారం మనకు కనిపించే ప్రతినక్షత్రానికి ఆకాశగర్భంలో మాటుమణిగి అగోచరంగా నున్నవి ఏనాలుగుకోట్లో ఉంటాయని అంటే కోట్లకొద్దీ నక్షత్రాలన్న మాట వాస్తవం.

నక్షత్రాలలో అనేకరకాలున్నాయి. మనసూర్యుడు సామాన్యమైన నక్షత్రమని చెప్పవచ్చును. చిరువులో సూర్యునికి పదిరెట్లకంటె అధికంగానున్న తారకలట్టేలేవు. అట్లే పదియవ వంతుకన్న తక్కువగానున్నవి అట్టేలేవు. కాని పరిమాణంలో వేలకొలది రెట్లున్న నక్షత్రాలెన్నో ఉన్నాయి. నక్షత్రాలన్నీ మండుతున్న ద్రవ్యగోళాలు వాటితాపక్రమం మిక్కుటంగా నుండుటచేత వాటిలో పదార్థాలు, పైభాగంలో వాయురూపంలోనే ఉంటాయి. సూర్యుని ఛాయాచిత్రం పరిశోధనాగారాలలో ప్రత్యేకపు ఏర్పాటులతో తీసినది చూస్తె ఆగోళంనుండి పైకెగసే మంటలు స్పష్టంగా కనిపిస్తాయి. ఆమంటలలోనున్న పదార్థం సూర్యునికి మనకి మధ్యనున్న సుమారు 9¼ కోట్లమైళ్ళ అంతరాళాన్నిదాటి, మన వాతావరణంలో ప్రవేశించడంకద్దు. అట్టిసమయాలలో రేడియో ప్రసారం తాత్కాలికంగా ఆగిపోతుంది. సూర్యగోళాన్ని పరీక్షించేప్రత్యేకవేధశాలలలో విజ్ఞానులు అవిచ్ఛిన్న పరిశీలనలు చేస్తూ సౌరద్రవ్యం వల్ల మన భూగోళంలో కలగ గలమార్పులను ముందుగా సూచిస్తూంటారు.

జీవానికి ఆటపట్టుగ్రహాలు ఒక నక్షత్రంచుట్టూ నిరంతరం పరిభ్రమించే దాన్ని గ్రహమంటారు. మన సూర్యునిచుట్టూ నిత్యప్రదక్షిణాలు చేస్తూన్నతొమ్మిది గ్రహాలున్నాయి. అవి సూర్యునినుండి లెక్కిస్తె క్రమంగా బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యురేనసు, నెప్ట్యూను, ప్లూటో, ఈ గ్రహాలు దీప్తిమంతమైనవికావు. అవిప్రకాశిస్తున్నాయి. కాని వాటి సహజకాంతితో కాదు; కేవలం వాటిపైపడే సూర్యరశ్మిని పరావర్తించడంచేతనే వాటికాదీప్తిలభించింది. గ్రహంచుటూ తిరిగేది ఉపగ్రహం. మన చంద్రుడొక ఉపగ్రహం భూమికి ఒక్క ఉపగ్రహమే ఉంటే గురునికి, 11 శనికి 10 ఉపగ్రహాలున్నాయి. చంద్రకళలలో వృద్ధిక్షయాలు కనిపించడానికి కారణం చంద్రగోళం స్వయంప్రకాశమానమైనదికాకపోవడమే. ఒకభాగం ఎల్లప్పుడూ సూర్యరశ్మిపడి భాసిస్తుంది. రెండవ సగం కాంతిహీనంగా ఉంటుంది. భాసమాన గోళార్థంలో మనకెంత కనిపిస్తే అదివెన్నెల వెదజల్లుతు ది. దూరదర్శినితో చూస్తె ఇప్పుడు (1953 మార్చి మొదటివారం) ఏసప్తమి చంద్రునివలెనో శుక్రగ్రహం కనిపిస్తుంది.

ఈ గ్రహాలన్నీ సూర్యునిలోనుండి జన్మించేయని ఒక వాదముంది; సూర్యునితోపాటు ఒకేసారి కొంత ద్రవ్యంనుండి జన్మించాయనువాదంకూడా ఉంది. ఏమైనప్పటికి గ్రహాలన్నీ సూర్యునిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాయి. అవి వివిధ దూరాలలోనున్నాయి. అందుచేత ఒకగ్రహం పైబడే సూర్యరశ్మి దాని దూరాన్నిబట్టి ఉంటుంది. దగ్గరగానున్న గ్రహాలపై ఎక్కువ సూర్యరశ్మి. దూరంగానున్న వాటిపై తక్కువ రశ్మి పడుతుంది. ఒకప్పుడు గ్రహాలు కూడా మహోజ్జ్వలగోళాలైనప్పటికి క్రమంగా, అవి చల్లారి వేడిని కోల్పోయేయి. మనకు తెలిసినంత వరకు, భూమిపైనున్న జీవంవంటి జీవం మరే గ్రహంలోనులేదు. జీవోద్భవాభ్యుదయాలకి భూగోళభౌతిక పరిస్థితులనుకూలంగా నుండడమే దానికి కారణమని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. భూమికంటె సూర్యునికి దూరంగానున్న కుజగ్రహంలో మనకంటె ముందుగా జీవం జనిస్తె జనించియుండవచ్చుననీ, కుజుని అంతరుష్ణంక్షీణించడంతో వాటిల్లిన భౌతిక విపర్యయాలకు తట్టుకోలేక అచ్చటి జీవం నశిస్తె నశించియుండ వచ్చుననీ అనుకోడాని కాధారాలున్నాయి భూమికంటె సూర్యునికి దగ్గరగానున్న శుక్రగ్రహంలోముందుముందు జీవం జనించే అవకాశలుండ వచ్చును. చంద్రగోళంలో జీవముండే అవకాశాలే

కనిపించవు. ఏమంటే అక్కడ గాలిలేదు. నీరులేదు. వృక్షసంతతిలేదు. అదొక మృత గోళం. ఇదిమన సౌర కుటుంబ చరిత్ర.

ఇట్టిగ్రహ సముదాయాలు అనేక నక్షత్రాలకుండవచ్చును. ఉంటే ఆగ్రహాలలో జీవముందో లేదో చెప్పడానికవకాశంలేదు. కాని నక్షత్రాలు మాత్రం పరస్పరంగా చాలాదూరాలలోనున్నాయి. నక్షత్ర దూరాలను కొలవడానికి మైళ్ళుపనికిరావు. అందుచేత వాటికి 'కాంతిసంవత్సరా'మనే కొలబద్దను నిర్ణయించేరు. సెకనుకి 1,86,000 మైళ్లవేగంతో కాంతిప్రయాణం చేస్తుంది. ఆ విధంగా యాత్ర చేసినపుడు ఒక సంవత్సరంలో 186000 × 60 × 60 × 24 × 365.3 అనగా సుమారు 6 లక్షల కోట్లమైళ్లకు సమానం. ఆమానంపై, మన కతిసమీపంగానున్న నక్షత్రపుదూరం $4\frac{1}{4}$ కాంతి సంవత్సరాలు; అంటే, 25 లక్షలకోట్లమైళ్ళు. సూర్యుని కేంద్రంగా చేసికొని 25 లక్షలకోట్లమైళ్ళ వ్యాసార్థంతో ఒకగోళాన్ని చుట్టినట్లూహిస్తే, ఆగోళంలో సూర్యుడు-గ్రహసముదాయంతోసహా తప్ప వేరొక నక్షత్రంలేదు.

ఆకాశంలో మిణుకు-మిణుకుమని కనిపించే నక్షత్రాలు మనకు పదుల, వందలు, వేల, లక్షల కాంతి సంవత్సరాల దూరాన్న ఉన్నాయి. మృగవ్యాధ కూటంలోనున్న ఎర్రటి ఆర్ద్ర నక్షత్రంయొక్క దూరం 300 కాంతి సంవత్సరాలు. సింహరాశిలో నిమఖానక్షత్రదూరం 70 కాంతి సంవత్సరాలు. ధ్రువనక్షత్ర దూరం 1085 కాంతి సంవత్సరాలు. వృశ్చికరాశిలోని జేష్ఠా నక్షత్రదూరం 170 కాంతి సంవత్సరాలు.

నక్షత్రాలు కూటాలుగా ఏర్పడడమేకాక, కొన్నికోట్లు గెలాక్సీగా ఏర్పడ్డాయి. అదికాక సర్పిల నెబ్యులాలున్నాయి. 800,000 కాంతి సంవత్సరాల దూరంలోనుండి ఏంద్రో మెడా నెబ్యులాయొక్క ఛాయాచిత్రం చూస్తే ఎంతో ద్రవ్యం నక్షత్రగోళాలుగా ఏర్పడక విరళంగానున్నట్లు కనిపిస్తుంది. ఈ నెబ్యులాలు గెలాక్సీలు పరస్పరం దూరంగాపోతున్నట్లు వాటికాంతి పరిశీలనవల్ల తెలియవచ్చింది. అంటే విశ్వంవ్యాకోచిస్తూందని చెప్పాలి.

విశ్వంలో ఇంత మిక్కుటంగా ద్రవ్యగోళాలున్నప్పటికి ఆకాశవ్యాప్తితో పోల్చిచూచినప్పుడు ద్రవ్యపరిమాణం అత్యల్పమని విజ్ఞానులు భావిస్తున్నారు.

ఇట్టిబృహద్విశ్వంలో మానవుని పరిమాణమెంత అత్యల్పమో తెలియజేసే కథ ఒకటుంది. భూగోళశాస్త్రజ్ఞుడొకనాడు విశ్వచిత్రాన్ని స్కేలుగీసి దానిలో మానవునిస్థానం నిర్ణయించడానికి ప్రయత్నించేడు. టేబిలుపైనున్న కాగితం విశ్వాన్ని నిరూపిస్తే అందులో ఒక చుక్క మన గెలాక్సీనీ, ఆ చుక్కలో చిన్నభాగం మనసూర్యుడినీ, చుక్కభాగంలో ఇంకా చిన్నభాగం మన భూమినీ నిరూపిస్తాయి. భూమిని నిరూపించేచుక్క సెట్లో ఊహించుకో కలిగేడు. భూమిలో తన ఇల్లు, ఇంట్లో తన కుమారుడు అనేసరికి కుమారుని పరిమాణమూ మించడానికి సాధ్యంకానంత సూక్ష్మాతి సూక్ష్మమయేసరికి తన విశ్వచిత్రంలో కొడుకుకి స్థానంలేదని భోరు భోరున ఏడుపు ప్రారంభించేడు. అదివిన్న అతని భార్య ఎంతచెప్పినా కుమారుని మనుగడ విషయం ఆశాస్త్రజ్ఞునకి నమ్మకం లేకపోయింది. అప్పుడామె కుమారుని తీసికొనివచ్చి భర్త ఒడిలో కూర్చోపెట్టినంతవరకు శాస్త్రజ్ఞుడు శాంతింపలేదు. అంటే, విశ్వంలో అల్పత్వాన్ని సూచించడాని కుపయోగపడుతుందీ కథ.

జగత్కాల సందర్భంలోసైతం మానవజీవిత పరిమాణం క్షుద్రమని గ్రహించవచ్చు. సూర్యుడు, ఇతర నక్షత్రాలు జనించి సుమారు 300కోట్ల సంవత్సరాలయినట్లు విజ్ఞానులు భావిస్తున్నారు. పుట్టిన తరువాత భూగోళం చల్లారడానికే సగంకాలం పట్టింది. మరికొన్నికోట్ల యేండ్లకుగాని వృక్ష సంతతి జనించలేదు. మానవుడుదయించి కొన్నిలక్షల యేండ్లకంటే అధికంకాదు. వందలకొలది యేండ్లు జీవించే చెట్లున్నాయి, మృగాలున్నాయి. కాని, మానవుని సగటుజీవితకాలం డెబ్బదియేండ్లుమాత్రమే.

కాలభావం, యోచించినకొద్దీ తాత్త్వికపథాలలోనికి తీసికొనిపోతుంది. వ్యవహారంలో, కాలాన్ని భూతభవిష్యద్వర్తమానములుగా మూడు విభాగాలు చేసికొన్నాము. కాని. ఒకప్రదేశంలో సంబంధం లేనికాలాన్ని ఊహించలేము. వస్తుచలనంలేనిదే కాలభావమే లేదు. భూమితనలో తను బొంగరంవలె తిరుగకపోతే రాత్రింబవళ్ళు భూవాసులకుండవు. మనకు దినప్రమాణమే లేకపోను. సూర్యుని చుట్టూ భూమి ప్రదక్షిణం చేయకపోతే ఋతువులు లేకపోను, సూర్యోదయాస్తమయాలులేని భూగోళంలో ఒక అర్ధభాగం సూర్యరశ్మికి గురియై అట్లుడికినట్లుడికిపోతుండగా, రెండవ అర్ధగోళం కాంతివిహీనమై నిరంతర అంధకారంలో మునిగియుండవలసినదే. చంద్రగమనంలేకపోతే మాసభావం కలగకపోను, చైత్రాదిఫాల్గుణ పర్యంతం మాసాలే లేకపోను, మనలోకంలోనున్న దిన-మాస-సంవత్సర సంబంధం ఇతరలోకాలలో వర్తించదు. బుధలోకంలో రోజులులేవు. శుక్రలోకంలో సంవత్సరానికి సుమారు 110 రోజులు; నెలలు లేనేలేవు. గురులోకంలో సంవత్సరానికి 11000 రోజులు. ఈ విధంగా కాలప్రమాణాలు లోకలోకానికి మారిపోతాయి; ఏలోకానికాలోకపు కాలమానం ప్రత్యేకమైనదని గమనించాలి.

అట్లే-భూతభవిష్యద్వర్తమానాలుకూడా ప్రతిలోకానికి ప్రత్యేకమైనవే. ఉదాహరణకి, ఆర్ద్రానక్షత్ర విషయంయోచిస్తే, మనకది 300 కాంతి సంవత్సరాల దూరంలోనుండుటచేత, ఆనక్షత్రం 1653లో ఎట్లుండో ఆ విధంగా మనకిప్పుడు కనిపిస్తూంది. ఆర్ద్రాలోబుద్ధిమంతులైన జీవులుండి, సూక్ష్మేక్షకగణాలతో వారు నభోమార్గులను పరిశీలిస్తున్న సమయంలో వారిదృక్పథంలో మన భూగోళం పడినట్లయితే వారికిప్పుడు కనిపించే భూలోక దృశ్యాలు ఇప్పటివికావు; 1653 సంవత్సరంలో జరిగి, మనకు భూతకాలంలో కలిసిపోయిన ఘట్టాలు వారికి గోచరిస్తుంటాయి. ఈ 300 ఏండ్లలోను 1653 నాటి కాంతి కిరణాలు ఆకాశయానంచేసి ఇప్పుడే వారి యంత్రాలలో ప్రవేశిస్తాయి. దీనిపర్యవసానమేమంటే, మనకు భూతకాల సంఘటన ఆర్ద్రాలోకవాసులకు వర్తమానంకాగా, 300 ఏండ్ల క్రిందటి సంఘటనలను ఈ క్షణంవారుచూచి ఆనందిస్తారు. ఆనాటిజీవులలో చరిత్రకందని హీనులెందరో ఉండవచ్చు. వారి భౌతిక శరీరాలు శిథిలమై కొన్నిశతాబ్దాలకాలం గడిచింది. ఐనప్పటికి ఆర్ద్రాలోకవాసులదృష్టిలో వారు సజీవులే; యథోచితంగా పాత్రలను పోషించుకొంటూన్న భూలోకవాసులనువారు కళ్ళారా చూస్తూంటారు. అందుచేత మనకు భూతకాలమైనది ఆర్ద్రాలోక జీవులకి వర్తమానంకాగా, ధ్రువలోక వాసులకి భవిష్యత్తవుతుంది. ఆదేసంఘటనను ధ్రువలోకజీవులు 785 సంవత్సరాలు పోతేకాని చూడలేరు. అనగా ఒకే, సంఘటన, విశ్వంలో ఒకప్రదేశానికి భూతకాలంలోది. మరొక ప్రదేశానికి వర్తమానంలోది. వేరొక ప్రదేశానికి భవిష్యత్తులోది అవుతుంది. నిరపేక్షమైన కాలవిభాగాలకి అర్థంలేదు; కాలం సాపేక్షం. అంతేకాదు; కాలగర్భంలో నశించడమనే భావమే తప్పు. ఒకక్రియ దేశకాలా విరతికంలో శాశ్వతంగానుంటుంది. అయిదేళ్లక్రితం జరిగిన గాంధీమహాత్ముని హత్యవిషయమే యోచిద్దాము. ఆ క్రూరకార్యాన్ని ఒక సంవత్సరం క్రిందటే ఆల్ఫాసెంటారిలోకవాసులు చూచిఉంటారు; మరి మూడేండ్లలో సిరియన్ లోక జీవులుచూస్తారు; నేటికొకదేండ్ల తరువాత ప్రొకియాన్ నక్షత్రంలోని జీవులూ, పదమూడేండ్లు పోయిన తరువాత శ్రవణ నక్షత్ర జీవులూచూస్తారు. ఈ విధంగా అనంతకాలాకాశంలో ఆ ఘాతుకకృత్యం ప్రతిక్షణంలోనూ ఏదోప్రదేశంలో ఉండనే ఉంటుంది. ఈ భావం మానవునిలో నైతిక ప్రవర్తనను పెంపొందించడాని కుపయోగపడుతుంది.

విశ్వం ఆద్యంతరహితం; విశ్వానికిహద్దులు కనుగొనే ప్రయత్నం ఎప్పుడూ ఫలించదని తెలియవస్తూంది. ఆకాశాని కంతంలేదు; అందు కనిపించే ద్రవ్యానికి అవధిలేదు. ఆకాశగర్భంలోనికి పంపే చూపును నిశితంచేసినకొద్దీ ఆకాశసీమ పెరుగుతునే ఉంది; అందులో గోచరించు జాజ్వల్యమాన ద్రవ్య

168వ పుటలో

Edited and Published by Gadiyaram Ramakrishna Sarma, Ramakoti.
Printed at Neta Printing Press, Hydrabad.